ప్రవా॰ ప్రచురణ : 16

ఓమ్

యత్సంధ్యాముపాసతే బ్రహ్మైవ తదుపాసతే

ఇతి శ్రుతిః

# సంధ్యాతత్త్వసుబోధిని

పూర్ణాభిధాంధ్రవ్యాఖ్యాసముపేతము


విద్వచ్ఛిరోమణి సాహిత్యవిశారద

సోమయాజుల వేంకటాచలశాస్త్రి

ప్రణీతము


సంపాదకుడు :

వడ్డాది కాళిదాసు


ప్రకాశకులు :

ఆంధ్ర విజ్ఞాన సమితి

జంషెడ్పూరము.

1978

కా॰ ప్రతి : భాగవతుల ఉమామహేశ్వరశర్మ

*First Edition* · 1000 Copies
1978



*Prise* Rs : 15/-

*For Copiee :*
S. VENKATACHALA SASTRI
17, K. D. Flates, Kadma.
JAMSHEDPUR-5.
(Bihar)

OR

ANDHRA VIGNANASAMITHI
Modal Press
137, Sakchi Market
Jamshedpur (Bihar)-831 001

*Printed at :*
KRANTI PRESS, Madras-600 001.



పరమహంస పరివ్రాజకాచార్యవర్య
శ్రీ కాంచీకామకోటిపీఠాధిప-జగద్గురు
శ్రీశ్రీశ్రీ జయేంద్రసరస్వతీస్వామిపాదులవారు

శ్రీః

| శ్రీ చంద్ర<br>మౌళీశ్వరా |
|---|

శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యవర్య
శ్రీమచ్ఛంకరభగవత్పాదప్రతిష్ఠాపిత
శ్రీకాంచీకామకోటిపీఠాధిప జగద్గురు
శ్రీమచ్చంద్రశేఖరేంద్రసరస్వతీశ్రీపాదాదేశానుసారేణ.

## శ్రీ మజ్జయేంద్రసరస్వతీశ్రీపాదైః

సోమయాజులోపనామక వేంకటాచలశాస్త్రిణే
క్రియతే నారాయణస్మృతిః

భవతా స్వనిబద్ధః సంధ్యాతత్త్వసుబోధినీనామకః శ్లోకరూపో గ్రంథః స్వకృతయా తాత్పర్యబోధిన్యాఖ్యయా సంస్కృతవ్యాఖ్యయా సాకం, పూర్వం ప్రకాశితః బహూపకారకో విద్యతే.

అధునా తద్గ్రంథప్రతిపాద్యవిషయాన్ ఆంధ్రభాషాజ్ఞనికటే ప్రచారయితుం భవాన్ తం సంధ్యాతత్త్వసుబోధినీగ్రంథం స్వకృతపూర్ణాభిధాంధ్రభాషావ్యాఖ్యయా సహ ప్రకాశయతీతి విదిత్వా మోదామహే.

ఆంధ్రభాషాజ్ఞాః అధికారసంపదుపేతాః ఏతద్గ్రంథపఠనేన తత్తన్మంత్రార్థమవగత్య సంధ్యానుష్ఠానతత్పరాః చిచ్ఛక్త్యాత్మకసంధ్యానుగ్రహేణ సర్వమంగళభాజనతామవాప్నుయురిత్యాశాస్మహే.

కాంచీక్షేత్రమ్. కాలయుక్త-భాద్రపదబహుళైకాదశీ.

నారాయణస్మృతిః.

శ్రీశివాయ గురవే నమః

శ్రీగాయత్రీపరదేవతాయై నమః

# ఉపోద్ఘాతము

ఆస్తికద్విజమహాశయులారా! "న గాయత్ర్యాః పరో మన్త్రః, న మాతుః పరదేవతా" "అహరహస్సన్ధ్యాముపాసీత" యను వాక్యములు భారతదేశములో సర్వజ్ఞాలుగను ప్రసిద్ధ ప్రాయములే.

ఆస్తికమహాశయులు ముఖ్యముగా గ్రహించవలసిన విషయము, మానవజీవితములో క్షణభంగురమగు ఐహికమును గాక ఆముష్మికమును విశేషముగా దృష్టిపథమున నుంచుకొనవలసిన విషయము. అట్టి ఆముష్మికసద్గతి, జీవులకు కలుగవలెనన్న సకల బ్రహ్మాండములకు కారణభూతమగు శ్రీ పరదేవతానుగ్రహమును సంపాదించుటయే ప్రధానకర్తవ్యము. అట్టి పరదేవతానుగ్రహము ఈశ్వరశాసనరూపమగు వేదశాస్త్రములచేత ప్రతిపాదింపబడిన కర్మోపాసనాదిసాధనములకంటె వేరు విధముగా సిద్ధింపదు. ఈ విషయములో "స్వే స్వే కర్మణ్యభిరతః సంసిద్ధిం లభతే నరః." "స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః" ఇత్యాది వచనములు పరమప్రమాణముగా గ్రహింపవలసియున్నవి. సర్వజ్ఞులగు వారి వారి యధికారానుసారముగ శాస్త్రము ఐహికాముష్మిక ఫలసాధనములను ఉపదేశించియున్నారు. వారు [illegible]. వారున్న దేశముకూడ, సర్వోత్కృష్ట[illegible]ముగా [illegible] "సంధ్యోపాసన" అనగా పరదేవతోపాసన. ఈశ్వరాజ్ఞారూపమగు వేదముచేత విధింపబడినది. "సన్ధ్యాహీనోఽశుచిర్నిత్యమనర్హః సర్వకర్మసు। యదన్యత్కురుతే కర్మ న తస్య ఫలభాగ్భవేత్" సంధ్యావందనమును చేయకుండ ఏ యితర ధర్మకార్యములు చేసి

నను ఆకర్మలవలన, ఆయాకర్మలకు జెప్పబడిన ఫలములను పొంద జాలడనియును, సంధ్యావందనము చేయని వానికి శాస్త్రీయసర్వ కర్మలను చేయ నర్హత లేదనియును ప్రమాణవచనములు చెప్పు చున్నవి. ''సంధ్యాముపాసతే యే తు సతతం సంశితవ్రతాః। విధూత పాపాస్తే యాంతి బ్రహ్మలోకమనామయమ్'' అనగా ఏ ద్విజులు శాస్త్రీయనియమములతో సంధ్యావందనమును చేయుదురో వారు సర్వపాపరహితులై నిరుపద్రవమగు బ్రహ్మలోకమును పొందుదు రని ప్రమాణవచనము చెప్పుచున్నది. ''సంధ్య'' యను శబ్దమునకు అర్థమును తెలిసికొనుట చాలముఖ్యము. ''సంధ్య''యను శబ్దమునకు యోగశక్తిచేత ఒక అర్థము వచ్చుచున్నది. ''ఉషాస్తే సంధివేళా యాం నిశాయా దినస్య చ। తామేవ సంధ్యాం తస్మాత్తు ప్రవదంతి మనీషిణః'' అను వచనానుసారము, రాత్రింబగళ్ల సంధి (మధ్య) కాలమందు ప్రాతస్సాయంకాలములందు ఉపాసింపబడు దేవతయే ''సంధ్య''యనంబడును. అందువలననే''సంధ్యాం మనసా ధ్యాయేత్'' అను ఐతరేయోపనిషత్ప్రమాణవచనమందలి ''సంధ్యా'' శబ్ద మునకు సంధ్యాదేవతయే యర్థమని భాష్యరత్నప్రభాకారులు వివరించిరి. మరియు ''యా సంధ్యా సా జగత్సూతిః మాయాతీతా తు నిష్కళా। ఈశ్వరీ కేవలా శక్తిః తత్త్వత్రయసముద్భవా'' యను వసిష్ఠవచనానుసారము సంధ్యాకాలమునందు ఉపాసింపబడు నాకారా త్మైక దేవతాచిచ్ఛక్తియే ''సంధ్య'' యని యనబడును. ఇది యోగ రూఢశక్తిచే లభించిన యర్థము. మరియు ''సంధ్యాస్నానం జపో హోమః దేవతానాంచ పూజనం। ఆతిథ్యం వైశ్వదేవంచ షట్కర్మాణి దినే దినే'' అను వచనమందలి సంధ్యాశబ్దమునకు నిత్యకర్మానుష్ఠాన ప్రస్తావమగుచుండుటచేత సంధ్యోపాసనరూపకర్మ యనియే యర్థము. ఈ విషయమును అనేకశాస్త్రపారంగతులైన సర్వగ్రంథవిమర్శకు లైన ఋషితుల్యార్యాభిజ్ఞులగు బ్రహ్మశ్రీ సోమయాజుల వేంకటా చలశాస్త్రిగారిచే ఈ తెనుగు గ్రంథమునకు పూర్వమున రచింప

బడిన సంస్కృతభాషామయసంధ్యాతత్త్వసుబోధినిగ్రంథమునందు 38, 39 పుటలందు అత్యంతప్రౌఢమగు శాస్త్రవాక్యములో [illegible] బడినది. అదే మూలగ్రంథమందు 42వ పుటలోని "[illegible] కాలీనే గాయత్రీ హ్యాభిమానినీ। చిచ్ఛక్తిరూపసంధ్యాయా [illegible] వేతి నిర్ణయః" అను స్వరచితశ్లోకము ద్వారా శ్రీ శాస్త్రిగారు స్థూలసమష్ట్యభిమానిచైతన్యరూపిణీ, గాయత్రీదేవతయనియు, ఆ గాయత్రీదేవత చిచ్ఛక్తిరూపసంధ్యాదేవతకంటె [illegible] అపూర్వవిషయములు వేదాంతశాస్త్రానుసారముగ [illegible] యుక్తులతో ప్రతిపాదించి మోక్షప్రదమగు సంధ్యోపాసనకు [illegible] పాసనారూపమగు గాయత్ర్యుపాసన అనుబంధమని [illegible] ప్రతిపాదించి ఆంధ్రభాషామయమైన "సంధ్యా [illegible]" యను భాగమునందు సంస్కృతభాషానభిజ్ఞులు [illegible] లకముగ తెలియునట్లు ప్రతిపాదించిరి.

ఈ విషయములో ముఖ్యముగ [illegible] విషయము. వేదాంతవేద్యమగు అద్వితీయబ్రహ్మస్వరూపము [illegible] చైతన్యము. అది స్థూలసూక్ష్మాది — [illegible] చేత, [illegible], గాయత్రీదేవతయని, మరియొకచోట సంధ్యాదేవతయనియు చెప్ప బడినను, తత్త్వమందు ఐక్యము నిర్వివాదముగనుక, సంధ్యోపాసన [illegible] కాలమందు గాయత్రీ, సంధ్యా యని భేదముచేత ఉపాసించినను, [illegible] పరదేవతోపాసనయే గాని వేరు కాదు. బ్రహ్మవిష్ణుమహేశ్వరు లనియు, మహాలక్ష్మి మహాకాళీ మహాసరస్వతులనియు భేదము ఉపాస్య భేదముచేతనే ఏర్పడినది.

శ్రీగాయత్రీదేవతామహిమను గూర్చి, [illegible] మను, ఆర్షగ్రంథమున మిక్కిలి మిన్నగ [illegible] కథ వర్ణింపబడినది. కావున సంధ్యోపాసనము (గాయత్ర్యుపాసనము) పరదేవతోపాసనయే యని యనుటలో ఎంతమాత్రమును సందే హము లేదు. ఇట్టి రహస్యోపాసనతత్త్వమును శ్రీ శాస్త్రిగారు అత్యంతనైపుణ్యముగా నిరూపించిరి.

ఈ గ్రంథకర్తలగు శ్రీ వేంకటాచలశాస్త్రిగారు సంధ్యా
తత్త్వకోవిదులు. వారి సంస్కృతసంధ్యాతత్త్వసుబోధినియందు
42, 43 వ పుటలలో—"కిం బహునా—నామరూపాత్మకం సర్వం
జగత్, విరాడాత్మికాయాః తస్యా మూర్తేః అవయవత్వేన కల్పయతీ
త్యాదినా" అని ఆరంభించి, "అతః చిచ్ఛక్తిరూపసంధ్యాయాః
తదభిమానవిషయమాయాకార్యైకదేశవిరాడభిమానిత్వాత్
గాయత్రీ అంగం భవతి. అని అతిరహస్యవిషయములను ప్రతిపా
దించిరి. అనగా-సంధ్యోపాసన అంగి అని, మూలభూతచిచ్ఛక్తి
రూపానుసంధానద్వారా నిర్గుణసాక్షాత్కారమును పొంది కృత
కృత్యులు కాగలరని, స్పష్టమగుచున్నది. ఇట్టి అమూల్యతరోపాయ
విషయములను, ప్రతిపాదించిన శ్రీ శాస్త్రిగారికి, ఆస్తికులెల్లరును
ఋణపడి యుందురని, చెప్పుట అతిశయోక్తికాదని, నా యభి
ప్రాయము. మరియు, బ్రహ్మోపాసకుడు బ్రహ్మోపాసకుడే. విష్ణూపాస
కుడు విష్ణూపాసకుడే. రుద్రోపాసకుడు రుద్రోపాసకుడే. దేవీఉపాస
కుడు దేవీఉపాసకుడే. సంధ్యోపాసకుడు మాత్రము పరబ్రహ్మోపాసకు
డనుటలో సంశయములేదని స్పష్టముగ, గ్రహింపవచ్చును. మరియు,
సంధ్యోపాసనము అహంగ్రహోపాసనమని చెప్పవలెను. "అసావా
దిత్యో బ్రహ్మేతి, బ్రహ్మైవ సన్, బ్రహ్మాప్యేతి య ఏవం వేద" అను
వచనము ననుసరించి, ఆదిత్యుని (సంధ్య) యందు బ్రహ్మబుద్ధితో,
అనగా-బ్రహ్మానన్యత్వబుద్ధితో, తనయందు బ్రహ్మాభేదభావన
చేయువారలు, బ్రహ్మానుభూతి కలిగి, బ్రహ్మైవసన్, బ్రహ్మాప్యేతి,
అనగా-తాను బ్రహ్మ అయియుండి, అజ్ఞానమువలన కలిగిన,
అబ్రహ్మ (జీవ) త్వభ్రాంతిని, వదలునని తాత్పర్యము.

ప్రతీకోపాసన-సంపదుపాసన - తాటస్థ్యోపాసన - అంగావబద్ధో
పాసనలలో అహంగ్రహోపాసన చాల శ్రేష్ఠము. ఇతరోపాసనలవలన
సాలోక్య, సామీప్య, సారూప్యముక్తులు లభించెను, అహంగ్రహో
పాసనవలన సాయుజ్యముక్తి లభించునని చెప్పవచ్చును. దహరో
పాసనవలన బ్రహ్మలోకమును పొంది, పునరావృత్తిని పొందక

అచటనే, బ్రహ్మసాక్షాత్కారమును పొంది, కార్యబ్రహ్మతో సహా, నిర్గుణబ్రహ్మభావమనే పరమముక్తిని పొందునట్లు, "విధూతపాపాస్తే యాంతి బ్రహ్మలోకమనామయం" అను వచనమును బట్టియు, మరికొన్ని ప్రమాణములను బట్టియు. సంధ్యాఽహంగ్రహోపాసకుడు గూడ, బ్రహ్మలోకమును పొంది, పరమముక్తిని, పొందునని, శ్రీశాస్త్రులవారి ప్రతిపాదనవలన, ప్రమాణముగ తేలుచున్నది.

సంస్కృతగ్రంథమందు 45 వ పుటలో శ్రీ శాస్త్రిగారు, "అహంగ్రహః ప్రతీకశ్చోపాసనం ద్వివిధం స్మృతం। ప్రకృతే త్వాదిమో పాస్యా త్వధికారానుసారతః" అను స్వరచితమూల శ్లోకముచే వారి వారి యధికారానుసారముగ ప్రతీకోపాసనమునుగాని, అహంగ్రహోపాసనమునుగాని చేయవచ్చునని. ప్రతీకోపాసన మనగ, ఆలంబనమందు, ఆరోప్యదేవతాభావన. అంతకన్న ఉత్తమాధికారి. తన యందు, పరిచ్ఛిన్నజీవభావమును వదలి, "యోఽసౌ సోఽహమస్మి" అనగా-చిచ్ఛక్తిరూపిణియగు ఏ సంధ్యాదేవత కలదో, ఆ సంధ్యాదేవత నేను. అని ఉపాసించుట, అహంగ్రహోపాసన యనబడును. ఈ విషయములో శ్రీ వేంకటాచలశాస్త్రిగారు, బ్రహ్మసూత్రములను, శ్రుతివచనములను, సూతసంహితావచనములను, ఉదహరించి, తదర్థములను చర్చించి, సిద్ధాంతమును ప్రతిపాదించి, విద్వాంసులకు గూడ పరమానందప్రదముగా, నవనీతపిండమును చేతికందించినట్లు స్పష్టపరచిరి.

ప్రథమమున సంధ్యాతత్త్వసుబోధినియను పేరుతో సంస్కృతమునందు, అతికఠినవిషయములనుగూడ అత్యంతసుబోధకములగా నుండునటుల, పూర్వోత్తరమీమాంసాశాస్త్రపద్ధతి ననుసరించి, కృష్ణపండితీయ విద్యారణ్య భాష్యాదులను, సూతసంహిత ఉపనిష ద్భాష్యాదులను సావధానముగ పరిశీలించి, క్షీరసముద్రమును మథించి, అమృతకలశము నుద్ధరించినట్లు, గ్రంథవిస్తరము కాకుండ, అనేక అపూర్వార్థములను ప్రతిపాదించుచు, అన్యూనానతిరిక్తముగ

గ్రంథమును రచించిరి. ఈ గ్రంథము విద్వాంసులకే గ్రాహ్యము కాని, శాస్త్రజ్ఞానము లేనివారికి దురవగాహముగ నున్నదిగనుకను, ద్విజులందరికిని, అత్యావశ్యకమగుటచేతను, ఆస్తికులు కొంతమంది, అందరకును సులభముగ తెలియునటుల, ఆంధ్రభాషలో వ్రాయవలసినదని అభ్యర్థించుటచేతను, స్వయముగకూడ ఆంధ్రభాషలో వివరించుట అత్యావసరమని తలంచి, అదే "సంధ్యాతత్త్వసుబోధిని" యను పేరుతోనే "పూర్ణ"యను తెలుగు వ్యాఖ్యానమును చేర్చి, అతివిశదముగ వ్రాసిరి. సంధ్యాతత్త్వసుబోధినీగ్రంథమందలి విషయములు సర్వోపకారముగ నుండునటుల, అనేక నూతనవిషయములను పూరణ చేయుటచేత పూర్ణాఖ్య సార్థకముగ నున్నది.

"జ్ఞాత్వా జ్ఞాత్వాచ కర్మాణి జనో యో యోఽనువర్తతే।
విదుషః కర్మసిద్ధిఃస్యాత్, తథా నాఽవిదుషో భవేత్" అని 260 వ పుటలో అర్థజ్ఞానముయొక్క ప్రాధాన్యమును బహుప్రమాణములతో స్పష్టముగ ప్రతిపాదించిరి. కనుక శ్రీ శాస్త్రిగారు హృదయంగమముగ వ్రాసిన సంధ్యామంత్రార్థబోధినియను భాగమును వ్యాఖ్యానములో చదివిన, సంధ్యావందనమంత్రార్థజ్ఞానము బాగుగ కలుగును. అట్టి జ్ఞానము కలిగి, సంధ్యావందనమును చేసినయెడల సంపూర్ణఫలమును పొంది, యితరశాస్త్రీయకర్మోపాసనల ఫలమును కూడ పొందును. మరియు ముఖ్యవిషయము. ధర్మార్థకామమోక్ష పురుషార్థములలో మోక్షపురుషార్థము నిత్యము. మిగిలిన మూడును నశించును. ముక్తి నిత్యమగు ఆత్మస్వరూపము. అది నిత్యసిద్ధమై యున్నను, అజ్ఞానముచే సిద్ధించనట్లు, బాధము ప్రాప్తించినట్లును గోచరించుచున్నది. కాని, అజ్ఞానకృతమగు బంధమును పోగొట్టుటకేగాని, సిద్ధమగు ముక్తిని పొందుటకుగాని ఆత్మజ్ఞానమే సాధనము. వేరుసాధనము లేదు. ఎన్ని పర్యాయములు తత్త్వమును చెప్పినను, ఆత్మజ్ఞానము కలుగకపోవుటకు దుస్సంస్కారములు పాపకర్మలే కారణము. అట్టి దుస్సంస్కారములు, పాపములు పోవుటకు సంధ్యో

పాసనము ప్రధానకారణము. 290 వ పుటలోని గాయత్రీహ్వాన యములోని "యదహ్నాత్కురుతే పాపం తదహ్నాత్ ప్రతిముచ్యతే" ఇత్యాదివచనముల యర్థమును చదువునది. సాక్షాత్తు జ్ఞానమును పొందుటకు అసమర్థులైన మందాధికారులకొరకు జ్ఞానసాధనముగ ఉపనిషత్తులందు అనేక ఉపాసనలు చెప్పబడినవి. అవియన్నియు చాలభాగము సగుణోపాసనలని గ్రహింపవలెను. నిర్గుణమునకు ఉపాసనము లేదని "నేదం యదిదముపాసతే" ఇత్యాదివచనములబట్టి కొందరు చెప్పుచున్నారు. కాని, "అన్యదేవ తద్విదితాదథో అవిదితాదధి" అను వచనమునుబట్టి నిర్గుణము జ్ఞేయముకూడ కాకపోవలసి వచ్చును. నిర్గుణము జ్ఞేయమైనప్పుడు ఉపాస్యముకూడ కావచ్చును. గాన నిర్గుణోపాసనమువలన శ్రవణాదివిచారము లేకపోయినను నిర్గుణసాక్షాత్కారమును పొందవచ్చునని విద్యారణ్యులవారు ధ్యానదీపప్రకరణమునందు స్పష్టముగ వివరించిరి. అట్లనే, శ్రీ శాస్త్రిగారు 287 వ పుటలో "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ" యను వాక్యార్థమును వివరించుచు ఓంకారమంత్రమునకు ఋషిచ్ఛందో దేవతావినియోగములను బోధించు అగ్న్యాదిపదములను నిర్గుణబ్రహ్మపరముగనే యర్థమును వివరించి, ఓంకారము నిర్గుణబ్రహ్మప్రతిపాదకమని నిరూపించి అట్టి ఓంకారముతో నిర్గుణబ్రహ్మోపాసనయే చేయవలెనని స్పష్టపరచిరి. అట్టి నిర్గుణోపాసనవలన బ్రహ్మసాక్షాత్కారమునని సిద్ధాంతీకరించిరి. ఇది మిక్కిలి హృదయంగమముగ నున్నది.

శ్రీ శాస్త్రిగారు 166–167 పుటలలో ప్రాణాయామస్వరూపమును, ప్రాణాయామముచేయు విధానమును, ప్రాణాయామకాలమందు అధికశక్తి లేనివారు వారివారి శక్తిననుసరించి [illegible] చిన్నచిన్న మంత్రములను, చేయదగిన అర్థభావనలను సువిశదముగ వివరించిరి. సంధ్యావందనమంత్రములకన్నిటికిని ప్రతిపదార్థతాత్పర్యముల, ఉపనిషద్వాక్యములతో నేకవాక్యతను ప్రతిపాదించుచు బహుప్రమాణవచనములను అపూర్వముగ నుదహరించి విశేషార్థములను వివరించిరి.

శ్రీ శాస్త్రిగారు రచించిన ఈ సంధ్యాతత్త్వసుబోధినిని, సంధ్యామంత్రార్థబోధినితో సహా పూర్ణాభిధాంధ్రవ్యాఖ్యానముతో, భక్తిశ్రద్ధలతో, విమర్శదృష్టితో కొన్ని పర్యాయములు చదివిన యెడల సంధ్యావందనానుష్ఠాన, సంధ్యోపాసనల విషయము మాత్రమే తెలియుటకాక. అనేకధర్మశాస్త్రవిషయములు, మంత్రశాస్త్రసంప్రదాయములు, వేదాంతశాస్త్ర విషయములును, తెలియుననుటలో సంశయ మెంతమాత్రము లేదు.

శ్రీ శాస్త్రిగారు శాస్త్రములందు నిష్ణాతులగుటచేతను. ఈశ్వరానుగ్రహము గుర్వనుగ్రహము సంపూర్ణముగనుండుటచేతను ఇట్లు వ్రాయగలిగిరి. గాని యవి లేకున్నచో ఇంత ఏకవాక్యతగా ఇన్ని విషయములను ప్రతిపాదించుట అశక్యమని నాకు తోచుచున్నది.

మరియు కలికాలప్రభావముచే సత్సంప్రదాయములు తరణోపాయసాధనములు శాస్త్రీయమార్గములును లుప్తప్రాయములై యుండగా, శ్రీపరదేవత, శ్రీ శాస్త్రిగారి హృదయపుండరీకమందు అధిష్ఠించి శ్రీ శ్రీ శ్రీ జగద్గురువులు కామకోటిపీఠాధిపతులు శ్రీ శ్రీ జయేంద్రసరస్వతీస్వామిపాదుల ఆజ్ఞారూపముతో లోకోపకారకమగు ఈ గ్రంథరచనమను మహాకార్యమందు, ద్విజులందరును శాస్త్రజ్ఞులు విద్వాంసులు ఇతరులుకూడ ఏ సాధనములును లేకపోయినను ఈ సంధ్యోపాసనచేతనే తరించుటకు శ్రీ శాస్త్రిగారిని ప్రబోధన చేసినదని నా తాత్పర్యము.

ఇంకనూ శ్రీ శాస్త్రిగారు వ్రాసిన విషయములలో సారాంశమును మాత్రము ప్రతిపాదించినను ఈ యుపోద్ఘాతము బహువిస్తారమగునని సంక్షేపముగా ప్రతిపాదించితిని. కనుక ఆస్తికద్విజవర్యులెల్లరును శ్రీ శాస్త్రిగారు రచించిన పూర్ణాభిధాంధ్రవ్యాఖ్యానము సహితమగు ఈ సంధ్యాతత్త్వసుబోధినీగ్రంథమును తెప్పించుకొని, చదివి తమ ద్విజత్వమును సార్థకము చేసికొని చిచ్ఛక్తిరూపిణియగు సంధ్యాదేవతానుగ్రహమును బొంది కృతకృత్యులు కాగలరనియు

అనేకద్విజపుంగవులకు ఈ గ్రంథమును చదువవలయునని ప్రబోధన చేయగలరనియును ఆశించుచున్నాను. ఇట్టి గ్రంథమును రచించిన శ్రీ వేదమూర్తులగు బ్రహ్మశ్రీ సోమయాజుల వేంకటాచలశాస్త్రి గారు ఆస్తికజనులందరికిని అభినందనీయులని నస్తుష్టితోని సూచించు చున్నాను.

ఓం తత్ సత్

ఇట్లు

**మద్దులపల్లి మాణిక్యశాస్త్రి**

కాళయుక్తి ఆశ్వయుజ కృష్ణద్వితీయా

సౌమ్యవాసరము

18-10-1978



గ్రంథకర్త

బ్రహ్మశ్రీ సోమయాజుల వేంకటాచలశాస్త్రిగారు

ఓమ్

# తొలిపలుకు

భారతీయులకు, విజ్ఞానపుగనులైన వేదములే, పరమప్రమాణ ములు. ఆ వేదములు భారతీయులకు ఇహపరసాధకములైన, అనేక ధర్మములను బోధించుచున్నవి. ఆ ధర్మములయొక్క సారమే ధర్మార్థకామమోక్షములను నాలుగు పురుషార్థములు. ఈ నాలు గింటిని సాధించిన మానవుడే, కృతకృత్యుడు, ధన్యుడు నగును. ఉత్తమోత్తమనాగరికత ఈ నాలుగింటియందే ఉన్నది. ఎట్లన— ఈ నాలుగింటియందును మధ్యనున్న అర్థకామములు (ధన - భోగ ములు) రెండును ఇహమునకు సంబంధించినవి. మొదటిదగు ధర్మము ఇహపరములకు రెండింటికి సాధనమై, తన తర్వాతనున్న అర్థకామ ములలోకూడ, వాటిని కూడ ధర్మయుక్తములుగా చేయుచున్నది. ధనార్జనము, ధనవ్యయములు రెండును ధర్మయుక్తములుగా నుండ వలెను. అట్లే భోగములుకూడ ధర్మయుక్తములుగా నుండవలెను. ఇక, అధర్మమునకు చోటెక్కడ? ఇట్టి ఈ మూడింటిచేతనే ఉత్త మోత్తమనాగరికత వెలయుచున్నది. కనుకనే, ప్రపంచమంత యును భారతీయనాగరికతను ఆశ్చర్యముతో వేయినోళ్లతో పొగడుచున్నది. ఇక పరమనగ, స్వర్గము. నాలుగవదగు మోక్షము ఈ రెండింటినిగూడ మించినదై పునర్జన్మరహితమైన జీవబ్రహ్మైక్యరూప మోక్షమే. ఇదియే సర్వమానవులకును పరమగమ్యము.

ఇట్టి మోక్షమును సాధించుటకు ఒక జన్మము చాలదు. రెండు జన్మలు చాలవు. అనేకజన్మము లెత్తవలయును. "బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే॥ అని భగవద్గీతలో శ్రీకృష్ణపరమాత్మయే చెప్పెను. ఐనను గూడ మిక్కిలి కష్ట సాధ్యము

ఇట్టి మోక్షమును సాధించుటకు పరమసులభమైన యుపాయ మును వేదమే ద్విజులకు, తప్పక చేయవగు నిత్యకర్మరూపముగ అందించినది. "అహరహః సంధ్యాముపాసీత" ప్రతిదినమును (మూడు వేళలందును) సంధ్యోపాసనమును చేయవలెనని.

ఈ సంధ్యోపాసనము పునర్జన్మరహితమైన మోక్షము నిచ్చు నది. సంధ్యోపాసనమే సంధ్యావందన మనబడుచున్నది. దీనిని భార తీయద్విజులందరును ననాదిగ నాచరించుచున్నారు.

ఇట్లు మోక్షమును సంపాదించునట్టి సంధ్యోపాసన (సంధ్యా వందన) మననేమి? దీని నెట్లు చేయవలెను? దీనికి ఫలమేమి? అను ప్రశ్నలు కలుగుట సహజమే కదా! బదులు చెప్పబడుచున్నది.

తైత్తరీయబ్రాహ్మణశ్రుతి ఇట్లు చెప్పుచున్నది.

"ఉద్యంతమస్తంయంతమాదిత్యమభిధ్యాయన్, కుర్వన్ బ్రాహ్మణో విద్వాన్ సకలం భద్రమశ్నుతే ఉసావాదిత్యో బ్రహ్మేతి బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి య ఏవం వేద" అని.

అనగా—విద్వాన్ బ్రాహ్మణః =

సంధ్యావందనముచేయు పద్ధతిని తెలిసిన బ్రాహ్మణుడు, సూర్యోదయమునకు ముందును, సూర్యాస్తమయమునకు ముందును, ఆదిత్యమండలమునందు బ్రహ్మచైతన్యస్వరూపిణియగు సంధ్యా దేవతను "అసావాదిత్యో బ్రహ్మ. సా ఉహమస్మి" యను మంత్ర ముతో అభేదబుద్ధితో (ఆ సంధ్యాదేవియును తాను నొక్కటియే యని) ధ్యానముచేయవలెను. ఇదియే సంధ్యావందనము. (అనగా తాను, పరబ్రహ్మస్వరూపుడే యని గుర్తించి ధ్యానించుట సంధ్యా వందనమని భావము) ఇట్లు ధ్యానముచేయు నాతడు "తాను స్వతః కే, నిజముగ పరబ్రహ్మస్వరూపుడేయై యుండికూడ, అజ్ఞానముచేత, తాను జీవుడనని భ్రాంతిపొందినవాడై, ఇట్టి సంధ్యోపాసన చేత, ఆ యజ్ఞానము పటాపంచలై పోగా, పరిశుద్ధమైన యంతఃకరణముగల

వాడై, పరబ్రహ్మసాక్షాత్కారమునుపొంది, పరబ్రహ్మైక్యమును పొందును. అని యర్థము. ఈ శ్రుతివచనము సంధ్యావందనమన నేమియో, దాని నెప్పుడు చేయవలెనో, దాని నెట్లు చేయవలెనో దానికి ఫలమేమియో, యను విషయములను, అతిస్పష్టముగ వివరించినది.

ఇట్టి సంధ్యోపాసనమును, సూర్యమండలమునందు గదా! చేయవలసియున్నది. కాని, అదే సంధ్యాసమయమున మందేహ రాక్షసులతోడి యుద్ధముచేత నామండలము యుద్ధోపద్రవములో మునిగియుండును. కాన సూర్యమండలమునకు స్వాస్థ్యము సంపాదించుటకుగాను, ఆమందేహరాక్షసనాశముకొరకు మూడర్ఘ్యముల నీయవలెను. ఇట్లు ఉపాసనకొరకుగాను అర్ఘ్యముల నిచ్చుటచేత- ఉపాసనము ప్రధానమగుచున్నది. అర్ఘ్యము దానికి పూర్వాంగ మగుచున్నది. ఇట్లే మార్జనము మొదలగునవి పూర్వాంగములుగను, గాయత్రీజపము, సూర్యోపస్థానము మొదలగునవి ఉత్తరాంగములుగను చేయబడుచున్నవి. వీటన్నిటికిని ప్రధానమై, అంగియైనది సంధ్యోపాసనము.

ఇట్లు శ్రుతిస్మృతులు చెప్పిన ప్రకారము సంధ్యావందనము నాచరించుచున్నను, దీర్ఘదీర్ఘకాలమునకు ఆచరణలో, నేవియో కొన్ని లోపములుకాని, వ్యత్యాసములుగాని అజ్ఞానమునలన కలుగుట సహజమే. కాని, అందులకుతోడు రెండువందల సంవత్సరములకుముందే, శ్రీకృష్ణపండితులవారు శ్రుతిస్మృతులకు విరుద్ధముగ, ప్రధానమగు సంధ్యోపాసనమును త్రోసిపుచ్చి, అంగమగు అర్ఘ్య ప్రదానమే ప్రధానమనియును, శ్రీచౌండపాచార్యులవారు అంగమగు గాయత్రీజపమే ప్రధానమనియును తాము వ్రాసిన సంధ్యా భాష్యములందు వ్రాసిరి. వారి వ్రాతలను జూచి చాలమంది పండితులును పామరులును, (ఏబది సంవత్సరములకు ముందు నేనును,) వెనుకముందులరయక, అదియే సరియైనది, ప్రామాణికమైన పద్ధతి

యనుకొని అట్లే, అంగములనే ప్రధానముగ నెంచి చేయ నారంభించినారు.

ఇది ఎట్లున్నదనగా— పెండ్లికుమారుడు లేకుండ పెండ్లిని జరుపుచున్నట్లున్నది. పెండ్లికుమారునకు గదా! పెండ్లిజరుపవలెను! కాని పెండ్లికుమారుడు లేకుండగనే పెండ్లి జరిగిపోవుచున్నది. ప్రస్తుతమున సంధ్యావందనానుష్ఠానమట్లున్నది.

ఎట్లనగా—అందరును ''ప్రాతస్సంధ్యాముపాసిష్యే'' ప్రాతస్సంధ్యాదేవతను ఉపాసించెదను.'' అని సంకల్పమును చేయుచున్నారు. కాని సంధ్యాదేవతయొక్క ఉపాసనమును మాత్రము చేయకుండ సంధ్యావందనమును జరుపుచున్నారు. పేరు సంధ్యావందనము, కాని సంధ్యాదేవతకు అచ్చట చోటు లేదు. పూర్వోత్తరాంగములను మాత్రము చేయుచున్నారు. ఎంత విచిత్రముగ నున్నది!

ఏది యంగి? ఏవి యంగములో చాలమందికి తెలియకపోవుట చేత ఇట్లు జరుగుచున్నది. ఇంకొక విశేషము. వేదములందును శాస్త్రములందును, పురాణములందును, ఇతిహాసములందును సర్వత్ర, మొత్తము సంధ్యాకర్మకు అంతకును ''సంధ్యోపాసనము'' అనియును, ''సంధ్యావందనము'' అనియును మాత్రమే వ్యవహారము ఉన్నది. అర్ఘ్యప్రదానమనిగాని, గాయత్రీజపమనిగాని వ్యవహారము మచ్చునకును లేదు.

తర్వాత మాయిలవేల్పగు శ్రీబాలాపరమేశ్వరీకటాక్షముచే ప్రేరితుడనై శ్రీలలితాసహస్రనామభాష్యమును వ్రాయుచుండగా అందు ఉత్తరపీఠికయందు చెప్పబడియున్న శ్లోక భాష్యమున సందర్భమును పురస్కరించుకొని సర్వతంత్రస్వతంత్రులగు శ్రీ భాస్కరరాయల వారు వ్రాసిన ఒక అపూర్వవిషయమును చదివితిని. అది యేమన— ''ఏవం సంధ్యావందనపదవాచ్యం ప్రధానం అసావాదిత్యో బ్రహ్మేతి

మన్త్రార్థానుసంధానం ఆదిత్యావచ్ఛిన్నచైతన్యస్య స్వావచ్ఛిన్న చైతన్యేన సహాఽభేదభావనారూపం" అని. అనగా — "అసా వాదిత్యో బ్రహ్మ" యను మంత్రముయొక్క అర్థమును, "ఆదిత్య మండలములోని బ్రహ్మచైతన్యము, తనలోని ప్రత్యక్చైతన్యము, ఈ రెండునూ ఒక్కటియే అని, ధ్యానించుటయే సంధ్యావందనమని యును. ఆధ్యానమే మొత్తము సంధ్యాకర్మయందు ప్రధానమని యును. అత్యంతస్పష్టముగ, సంధ్యావందనమనగ నేమియో, దాని నెట్లు చేయవలెనో మొత్తము సంధ్యాకర్మయందు దాని స్థాన మేదియో మొదలగు విషయములను, సందేహమునకు తావు లేకుండ వ్రాసినారు. దానిని చూచి ఆశ్చర్యమునను ఆనందమునను మునిగి పోయితిని. కృతకృత్యుడైతిని, ధన్యుడనైతి ననుకొంటిని.

ఆ మరునాడు మొదలుకొనియే రాజమహేంద్రవరమునందలి గౌతమీగ్రంథాలయమునందును, మద్రాసునందలి అడయారులోని గ్రంథాలయమునందును, సుమారైదు సంవత్సరములు వేదము లందలి బ్రాహ్మణభాగములను (బ్రాహ్మణభాగములందే సంధ్యా వందనమును గూర్చి కొన్ని విధానములు దొరికినవి) ఉపనిషత్తుల నున్నూ, ధర్మశాస్త్రగ్రంథములను, కొన్ని పురాణములను, కొన్ని సంధ్యావందనపద్ధతిగ్రంథములనున్ను యథానుశక్తిగ అతిజాగ్రత్తగ పరిశీలించితిని. అట్లు పరిశీలించగ, శ్రీకృష్ణపండితులవారి మత ములకు విరుద్ధములైనవి యనేకవిషయములు లభించినవి. ఆ విషయ ములను సేకరించి, తెలిసికొని, తెలిసికొనిన సత్యవిషయములను ప్రజాలోకమునకు వివరముగ తెలుపుటకొఱకు, ప్రకటించ, నుత్సా హము కలవాడనై "సంధ్యాతత్త్వసుబోధిని" యను పేరుతో తొలుత సంగ్రహముగ సంస్కృతభాషయందు నలుబది శ్లోకము లలో ఆ విషయములను వ్రాసితిని. తర్వాత ఆ శ్లోకములకు "తాత్పర్య బోధిని" యను పేరుతో విపులమగు వ్యాఖ్యానమును, అంగాం గనిరూపణము శ్రీకృష్ణపండితుల వారి యొక్కయు, శ్రీ చౌండపా

చార్యులవారియొక్కయు మతనిరాసనము మొదలగు నానావిషయ
ములతో వ్రాసితిని. అప్పటికి నాయభీష్టము కొంతవరకు తీరినది.

తర్వాత ఆ గ్రంథమును జూచి, పెద్దలు హర్షించవలెనుగదా!
అందువలన 1955వ సంవత్సరమున మరల శ్రీ దేవీప్రేరితుడనై నేను
శ్రీ శ్రీ శ్రీ కంచి కామకోటిపీఠాధిపతులును, జగద్గురువులునగు
శ్రీమచ్చంద్రశేఖరేంద్రసరస్వతీస్వాములవారి దర్శనముకొరకు
కాంచీనగరమునకు వెళ్ళి శ్రీవారి దివ్యదర్శనమును తీసికొని. ఈ
గ్రంథమును గూర్చి విన్నవించితిని. అందులకు శ్రీవారు "కంచిలో"
ఇరువది దినములుండి, యీ గ్రంథమును తమకు పూర్తిగ వినిపింప
వలసినదిగ ఆజ్ఞ యిచ్చిరి. నేనట్లే ప్రతిదినమునను సాయంకాలములందు
కొంచె కొంచెముగా గ్రంథమునంతను వినిపించితిని. చివరకిట్లను
శ్రీవారిట్లనిరి. "అపూర్వోఽయం గ్రంథః" అని, నానిని వారే విన
రించిరి. "ఇంతవరకెందరో సంధ్యావందనమును గూర్చి గ్రంథములు
వ్రాసిరి. ఉపన్యాసముల నిచ్చిరి. ఎవ్వరును ఇంతటి క్రొత్త (ప్రాచీనే,
క్రొత్తవిధమైనవి) విషయములను వివరించనైరి. ఎవ్వరును ఈ
తత్త్వమును గుర్తించలేదు. ఇదియే, సరియగు సత్యమైన తత్త్వము.
మిక్కిలి ప్రామాణికమైనది. సందేహము లేదు. అని మెచ్చుచూ
ప్రశంసించిరి.

తర్వాత మరలనిట్లనుగ్రహించిరి. "ఈ గ్రంథమును అచ్చు
వేయించుటకు నా వద్దర ధనములేదనినీ, కావున ఇదియెట్లు అచ్చగు
నని" నీ విచారించకుము. ఇంత ప్రశస్తమైన గ్రంథము అచ్చు
వేయించు బాధ్యతను నేను వహించుచున్నాను. అచ్చువేయుటకు
వీలుగ వ్రాసి, రెండుమాసములలో ఇచ్చుటకు మరల తీసికొనిరమ్ము"
అని యాజ్ఞాపించిరి. నేనట్లే చేసి, మరల కంచికి వెళ్ళితిని. ఆనాడే
ననే శ్రీవారి దర్శనము కొరకు మద్రాసునుండి శ్రీ వి. త్యాగరాజన్
అనువారు, (రాజన్ ప్రెస్సునకు ప్రొప్రైటరు) వచ్చి శ్రీవారి దర్శన
మును చేసికొనిరి. శ్రీవారు ఆయనతో ఇట్లనిరి. "ఈయన సంస్కృత

భాషలో వ్రాసిన అపూర్వమగు ఈ సంధ్యాతత్త్వసుబోధినీగ్రంథ మునకు వేయిప్రతులు అచ్చువేయించి యీయవలసిన'' దని. ఆ మహాభక్తుడు, ''మహాప్రసాద''మని, వారియాజ్ఞను శిరసావహించి వేయిప్రతుల నచ్చువేయించి నాకు ఇచ్చినారు. అందులో శ్రీవారి శ్రీముఖము గూడ విరాజిల్లు చున్నది. తర్వాత దేశములోని పలువురు పండితవర్యులకు ఆ గ్రంథములను ఉచితముగ సమర్పించు కొంటిని. దానిని పరిశీలించిన పండితవర్యులందరును, ఆ గ్రంథము నందలి యపూర్వ విషయములను మిక్కిలి ప్రశంసించి, నాపరిశ్రమను మెచ్చుకొనిరి.

ఈవిధముగ ఈ గ్రంథమచ్చయి, పలువురకు సంధ్యాతత్త్వము తెలియుటకు, ధర్మరక్షకులగు శ్రీశ్రీశ్రీ కంచి కామకోటిపీఠాధిపతులే కారణభూతులు. వారికి పండితలోకము కాదు, కాదు. ఆస్తికలోకమంతయును మిక్కిలి కృతజ్ఞముగ నుండును. నావిషయమును నేను ప్రత్యేకముగ చెప్ప నక్కరయే లేదుగదా!

తర్వాత, పలువురాంధ్రమహాజనులు ఈగ్రంథమును తెలుగు భాషలో వ్రాసినయెడల తెలుగు వారందరకును సులభముగ సంధ్యావందనతత్త్వము బోధపడునని ప్రేరేపింపగ ఈ గ్రంథమును తెనుగు భాషలో అనేక క్రొత్త విశేషములతోను, సంధ్యామంత్రార్థతాత్పర్యములతోను విపులముగను, విశదముగను వ్రాసినాడను. ఇది ఈ గ్రంథోత్పత్తిచరిత్రము.

అందువలన—1. సంధ్యావందనమనగ నేమి? 2. దాని నెందులకు చేయవలెను? 3. దాని నెట్లు చేయవలెను' 4. ఏదియంగి? 5. ఏవి యంగములు? ఈ మొదలగు అంశములను చాల చాల వివరముగను విశదముగను ఈ గ్రంథమున వ్రాయుట యైనది.

ప్రస్తుతమున సంధ్యావందనప్రయోగమునందు సంధ్యోపాసనము మాత్రముననే కాదు. ఇంక ననేకవిషయములందు చాల లోపములును వ్యత్యాసములును కనబడుచున్నవి.

ఎట్లనగా—తొలుదొలుత 1. ఆచమనము చేయుటయందే కొన్ని లోపములున్నవి. తర్వాత ప్రాణాయామము, సంకల్పము మార్జనము, పాపపురుషదహనము, అర్ఘ్యప్రదానములలో నుండి కొన్ని లోపములు కనబడుచున్నవి. అర్ఘ్యము తర్వాత అర్ఘ్యప్రదక్షిణమును ఆచమనమును ఎవ్వరును చేయుచుండుట లేదు. తర్వాత సగుణ-నిర్గుణా-న్యతర-సంధ్యోపాసనమును గాని, ఓంకారముచేత నిర్గుణోపాసనమును గాని ఎవ్వరును చేయుటయే లేదు. "ఓం మిత్యేకాక్షరం బ్రహ్మ" అనువాకమును గాయత్ర్యావాహనములో చేర్చి వేయుచున్నారు. అది తప్పు, గాయత్రీజపము చేయుటలో కొన్ని లోపములున్నవి. అక్కరలేనివి చేయుచున్నారు. కావలసిన వానిని విడిచి పెట్టుచున్నారు, గాయత్ర్యుద్వాసనమును యెక్కడనో చేయుచున్నారు. ఉపస్థానము, దిఙ్నమస్కారములు సరిగా నున్నవి. తర్వాత భూమ్యాకాశవందనము నెవ్వరును చేయుట లేదు. ఈ కారణముచేత సంధ్యావందనమున నున్న యంగముల అనుష్ఠాన ప్రకారమును, అంగియొక్క అనుష్ఠానప్రకారమును పూర్తిగ శాస్త్రము ననుసరించి వివరించుట యైనది.

ఇచ్చట నొక ముఖ్యమగు విషయమును నవధరింప ప్రార్థన.

ఈ నా గ్రంథమున శ్రీకృష్ణపండిత శ్రీ చౌండపాచార్యుల వారి మతములు ఖండింప బడినవనగా - అర్ఘ్యప్రక్షేప గాయత్రీజపములు సంధ్యాకర్మయందు ప్రధానములు కావని నాగ్రంథమే నిరూపింపబడినది. అంతియే. కాని అనుష్ఠానమున, ఆ దేవతను, అంగియగు సంధ్యోపాసనమునకు అత్యంతముఖ్యమగు పూర్వోత్తరాంగములుగ అనుష్ఠింపబడును. అనుష్ఠానమునుండి గొప్పదైయున్న ప్రధానమగు (అంగి) సంధ్యాదేవతోపాసన మొక్కటియే క్రొత్తగ ఉద్ధరింపబడినది. కావున అనుష్ఠానంబున నెచ్చటను తికమకలు లేవు. "అసావాదిత్యో బ్రహ్మ" మంత్రముతో నీటిని చేతితో తనచుట్టును త్రిప్పుటకాక - "అసావాదిత్యో బ్రహ్మ+సోఽహమస్మి" అను మంత్రముతో ప్రధాన

మగు సంధ్యాదేవతోపాసనమును చేయవలెనను నది మాత్రమే క్రొత్త విషయము అని నా మనవి.

ద్విజవర్యుల మోదముకొరకు పలు శ్రమలకోర్చి అనేక గ్రంథములను పరిశీలించి ఈ సంధ్యాతత్త్వసుబోధినీగ్రంథమును వ్రాసినాడను. కావున ద్విజవర్యులందరును దీనిని శ్రద్ధతో జదివి, సంధ్యాతత్త్వమును చక్కగ తెలిసికొని, శాస్త్రానుసారముగ శ్రద్ధాభక్తులతో, త్రిసంధ్యలందును సంధ్యోపాసనమును ఆచరించుచు తాముధన్యులై నన్ను గూడ ధన్యునొనర్చుదురు గాక!

ఓమ్ తత్ సత్

శివమ్.

ఇట్లు,

గ్రంథకర్త.

# ఆ ము ఖ ము

కుల మత తత్వాలకు పూర్వమైనది, అతీతమైనది వేదకాలము. అప్పుడు విజ్ఞానం వెల్లివిరిసింది; సంప్రదాయ పేరిట శాస్త్రీయ సిద్ధాంతాలను ప్రజానీకంలోకి ప్రసరింపజేసిన ఒక విచిత్రమైన ఉద్యమం కూడా అప్పుడు ప్రభవించింది. దానిఫలితమే సంధ్యా వందనప్రక్రియకూడ.

ఆర్ష సంప్రదాయాలు నాగరకతామకుటాలు. అవి సర్వులూ ఆచరింప దగినవి. నియమబద్ధమైన జీవితం కావలసిన వారెవరైనా అవి పాటించవచ్చు. నియమాలు "మూఢసంప్రదాయాలు" అని వెక్కిరించడం విజ్ఞానవంతుల లక్షణం కాదు.

సంధ్యలు రెండు—తొలి సంజ ఉదయ సంధ్య; మలి సంజ సాయం సంధ్య. ఒకటి కాంతి ద్వారము కాగా రెండవది నిద్రా ముద్రకు తరుణారుణమార్గము. ఒకటి మానవకార్యాచరణకు ప్రారంభగీత మాలపించును. మరొకటి అలసిన జనయనములకు విశ్రాంతివింజామరముల వీచును.

సంధ్యలు రెంటిలో అజరామరమైన అమృత సందేశమున్నది. భౌతిక జీవిత పరమార్థప్రబోధమున్నది.

అందువల్ల సంధ్య వందనీయము. సంధ్యావందనము కేవల కార్మికానుష్ఠానముగా పరిగణింపబడుట శోచనీయము. ఆత్మతత్వ జ్ఞానమునకు, పరమాత్మప్రభావైక్యావగాహనకు మూలసూత్రమది.

సంధ్యావందనప్రక్రియలో పరమేశ్వరప్రార్థన మున్నది; గాయత్రీమంత్రజపమున్నది; శాంతిసందేశమున్నది; లోకకల్యాణ ప్రదమైన ఆకాంక్షయున్నది; ఆశీస్సున్నది.

అట్టి సంధ్యాతత్వము సుబోధకముగా శ్రీ సోమయాజుల వేంకటాచలశాస్త్రిగారు ఆంధ్రలోకమునకు అందించుచున్నారు.

ఈ ''సంధ్యాతత్వసుబోధిని''ని పూర్వము శ్రీ శాస్త్రిగారు సంస్కృతములో వ్రాసినారు. దానిని కంచి కామకోటి పీఠాధిపతులు వేవిధముల కొనియాడి ఉన్నారు.

ఇప్పుడు తెలుగులో తేటతెల్లముగా ''సంధ్యాతత్వసుబోధిని'' వెలువడుట ఆంధ్రుల అదృష్టముగా భావింతుము.

''సంధ్యాతత్త్వసుబోధిని''ని మా ప్రచురణగా వెలువరింప జేస్తున్న శ్రీ సోమయాజుల వేంకటాచలశాస్త్రిగారికి కృతజ్ఞులం.

ఈ గ్రంథం భావుకుల మన్ననలందుకో గలదని ఆశ.

—ఆంధ్ర విజ్ఞాన సమితి

ఓమ్

శ్రీమహాగణపతయే నమః

"యత్సంధ్యాముపాసతే బ్రహ్మైవ తదుపాసతే"

ఇతి శ్రుతిః

సంధ్యోపాసనశబ్దముయొక్క-

# అర్థవిచారము

పరబ్రహ్మచైతన్యమును కాని, చైతన్యరూపుడైన దేవునిగాని, జీవబ్రహ్మైక్యరూపమోక్షమునుగాని అంగీకరించని కొందరు, సంధ్యోపాసనశబ్దమునకు ఈ క్రిందివిధముగ అర్థమును వర్ణించెదరు.

సంధ్య యనగా సంధ్యాకర్మయందు తొలుదొలుత చేయు ఆచమనము మొదలు, చివర జేయు అభివాదనమువరకు గల కర్మల సమూహము అర్థము. ఉపాసన అనగా అనుష్ఠానము. అనగా ఆకర్మలను ఆచరించుట అర్థము. అనగా—ఆచమనము మొదలు అభివాదనము వరకు గల కర్మల నన్నింటిని చేయుటయే సంధ్యోపాసనశబ్దమున కర్థము. అని అభిప్రాయము. వారు ఇట్లు అర్థమును చెప్పుటలో ప్రమాణవచనములు కనబడవు. వారు ఏవియో కొన్ని యుక్తులను మాత్రము కనబరచెదరు.

ఇక-సర్వతంత్రస్వతంత్రులును వేదభాష్యకర్తలును సర్వజ్ఞులు నగు శ్రీమాధవాచార్యులవారు సంధ్య అనగా ఆ వేళగల దేవత అనియును ఉపాసనమనగ అభిధ్యానము (మహాగ్రహముతో ధ్యానము) అర్థమనియును చెప్పిరి.

ఎట్లనగా—

శ్రీమాధవాచార్యులవారు తాము రచించిన పరాశరమాధ

పీయమున (పరాశరస్మృతివ్యాఖ్యానము) సంధ్యావందనప్రకరణమున ఇట్లు వ్రాసిరి. "సంధ్యాముపాసీతేత్యత్ర ఉపాసనమభిధ్యానం. అత ఏవ తైత్తరీయబ్రాహ్మణం= "ఉద్యంతమస్తంయంతమాదిత్యమభిధ్యాయన్ కుర్వన్ బ్రాహ్మణో విద్వాన్ సకలం భద్రమశ్నుతే ఽసావాదిత్యో బ్రహ్మేతి బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి య ఏవం వేద." ఇతి. అని.

అనగా— "అహరహః సంధ్యాముపాసీత" ప్రతిదినమునను సంధ్యనుపాసింపవలెను. అనే వేదవాక్యము విధించుచున్న ఉపాసన అనగా అభిధ్యానము అర్థమని చెప్పిరి. అట్టి అర్థమును తాము చెప్పుటకు తైత్తరీయబ్రాహ్మణశ్రుతివచనమునే ప్రమాణముగ నిచ్చిరి. అనగా— ఉపాసనశబ్దమునకు అభిధ్యానమర్థమని వేదమే చెప్పుట వలన ఎవరో కొందరు చెప్పునట్లు అనుష్ఠానము అర్థము కాదు. అని భావము. ఇంకనూ పై తైత్తరీయశ్రుతికి అర్థమును వ్రాయుచు అభిధ్యాయన్ పదమునకు వెనుకనున్న "ఆదిత్యం" అను పదమునకు సంధ్యాపదవాచ్యమాదిత్యం = సంధ్యాపదమునకు అర్థమైన సూర్యుని అని అర్థము వ్రాసిరి.

అననేమి? వివరింపబడుచున్నది.

బ్రహ్మసూత్రములను వ్రాసినట్టియు వేదవిభాగకర్తలైనట్టియు బ్రహ్మవిద్వరిష్ఠులునగు శ్రీ వ్యాసభట్టారకులు తాము వ్రాసిన స్మృతియందు సంధ్యాస్వరూపమును ఇట్లు నిరూపించిరి: "సంధ్యా హి సూర్యగం బ్రహ్మ" అని. దీనిని గురించి సంధ్యాప్రశంసయందు వివరముగ వ్రాయుట యైనది. ఐననిక్కడ అర్థము వ్రాయబడును. సూర్యగం=సూర్యమండలాంతర్యామియును, సూర్యజీవప్రేరకమైన, బ్రహ్మ=బ్రహ్మచైతన్యము, సంధ్యా=సంధ్యాదేవత. హి=ఈ విషయము సర్వవేదప్రసిద్ధము అని.

ఇంకనూ స్మృతిముక్తాఫలమునందు "అనుసంధ్యముపాసీత సంధ్యారూపం రవిం ద్విజః" మూడు సంధ్యలందును సంధ్యారూపు

డైన రవిని, అనగా సూర్యుని ఉపాసింపవలెను. అని యర్థము. వ్యాస స్మృతి ఆదిత్యమండలాంతర్యామియగు బ్రహ్మచైతన్యము సంధ్యయని చెప్పెను. అట్టి సంధ్యారూపుడగు సూర్యుని ఉపాసింపవలెనని స్మృతి ముక్తాఫలము చెప్పుచున్నది. సంధ్యారూపుడగు సూర్యుడనగా నేమి యర్థము? వివరింపబడుచున్నది. సంధ్య యనఁ సూర్యమండలాంతర్యామి యగు బ్రహ్మచైతన్యమని శ్రీ వ్యాసులు చెప్పుటవలన అట్టి సంధ్యారూపుడగు రవి అనగా, పై శ్రుతియందలి ఆదిత్యపదమునకు ఆదిత్యమండలముగాని ఆదిత్యమండలాభిమానియగు సూర్యజీవుడు గాని అర్థము కాదు. మరేమి? ఆ సూర్యమండలాంతర్యామియగు బ్రహ్మచైతన్యము భాగలక్షణ (జహదజహల్లక్షణ) చేత అర్థముగా చెప్పవలెను. ఆ బ్రహ్మచైతన్యమే సంధ్యాదేవత. కాగా ఆదిత్య శబ్దమునకు బ్రహ్మచైతన్యమర్థమనినప్పుడు అర్థాత్ ఆదిత్యశబ్దమునకు బ్రహ్మచైతన్యస్వరూపిణి యగు సంధ్యాదేవతయే అర్థమగును. ఎట్లు?

ఆదిత్యశబ్దమునకు, (1) ఆదిత్యమండలము (2) ఆ మండలాభిమానియగు సూర్యజీవుడు (3) ఆ సూర్యజీవప్రేరకమగు బ్రహ్మచైతన్యము అను ఈ మూడును అర్థమగును. కాని ఇచ్చట బ్రహ్మచైతన్యమే సంధ్యయని చెప్పుటచేత తొలి రెండర్థములను విడిచిపెట్టి మూడవ అర్థమును మాత్రము జహదజహల్లక్షణచేత చెప్పవలెను. అది సంధ్య కావున ఆదిత్యశబ్దమునకు సంధ్య అర్థమయ్యెను.

కావున, ఆదిత్యమభిధ్యాయన్ అనగా- సంధ్యామభిధ్యాయన్ అని యర్థమగుచున్నది. కాన శ్రీసర్వజ్ఞ మాధవాచార్యులవారు ఈ శ్రుతిని "సంధ్యాముపాసీత అనుదానికి ఆదిత్యమభిధ్యాయన్" అని ఉదాహరణముగా నిచ్చుట యుక్తిసహముగను మిక్కిలి సముచితముగను ఉన్నది. పై వ్యాసస్మృతిముక్తాఫలవచనముల అర్థమును మనసులోనుంచుకొనియే శ్రీ సర్వజ్ఞ మాధవాచార్యులవారు "ఆదిత్యం" అను పదమునకు "సంధ్యాపదవాచ్యమాదిత్యం" అని వ్యాఖ్యానించుటయును వారి సర్వజ్ఞత్వమునకు ఎంతయో సముచితముగనున్నది.

వారియొక్క వేదశాస్త్రతత్త్వపరిశీలనమహిమయును తెలియు చున్నది. ఇంకనూ ఆదిత్యమండలమునందు బ్రహ్మచైతన్యమున్నదని శ్రీ వ్యాసులవారే, తమ బ్రహ్మసూత్రములందు "అంతస్తద్ధర్మోపదేశాత్" "భేదవ్యపదేశాచ్చ" అను సూత్రములచేత స్థాపించినారు. ఇట్లు బ్రహ్మతత్త్వవిదగ్రగణ్యులగు శ్రీవ్యాసభట్టారకులు చెప్పినదానిని కాదని చెప్పగలవారెవరున్నారు? ఇట్లు శ్రీసర్వజ్ఞ మాధవాచార్యులవారు సంధ్యాపదమునకు, దేవత యర్థమనియును ఉపాసనాపదమునకు అభిధ్యానమర్థమనియును శ్రుతిస్మృతిప్రమాణ వచనములతో నిరూపించి, స్థాపించిరి.

తొలుత చెప్పిన కొందరిమతమునకు ఇట్లు శ్రుతిస్మృతిప్రమాణ వచనములు లేవు. కాన శ్రుతిస్మృతివచనసహకారము లేని ఆకొందరి మతము యుక్తిసహము కాని, ప్రమాణము కాని కానేరదు. అందువలన ఆమతమును ఒకప్రక్కనుంచి, శ్రీసర్వజ్ఞమాధవాచార్యుల మతమునకు ఇంకనూ శ్రుతిస్మృతివచనసహకారబలమెంతవరకున్నదో పరీక్షింతము.

పైన వివరించిన ప్రకారము ప్రమాణరాజమగు తైత్తరీయ బ్రాహ్మణవచనము మాత్రమే గాక ఐతరేయబ్రాహ్మణమున గూడ "సంధ్యాం మనసా ధ్యాయేత్" సంధ్యాదేవతను మనసుచేత ధ్యానింపవలెను. అని, సంధ్యాశబ్దమునకు దేవతార్థమును ఉపాసన శబ్దమునకు ధ్యానమర్థమనియును అత్యంతస్పష్టముగ చెప్పబడెను. ఈ ఐతరేయబ్రాహ్మణవచనము బ్రహ్మసూత్రభాష్యమున "తత్తు సమన్వయాత్" అను సూత్రభాష్యమున ఆదిశంకరభగవత్పాదుల వారు ఉదహరించిరి.

ఇంకనూ =

"యత్సంధ్యాముపాసతే బ్రహ్మైవ తదుపాసతే" అని సంధ్యోపాసనము బ్రహ్మోపాసనమే, యని వైష్ణవస్మృతిముక్తావళియందు ఒక శ్రుతివచనము చెప్పుచున్నది. ఇట్లు శ్రీసర్వజ్ఞమాధవాచార్యుల వారిమతమును మూడు ప్రత్యక్షశ్రుతివచనములు బలపరచుచున్నవి.

ఇక స్మృతులను పరీక్షింతము.

1. విష్ణుస్మృతి.

“కాలద్వయేఽపి సంధ్యాఖ్యాం దేవతాయా ఉపాసనం।

కుర్వన్ దిశో నమస్కుర్యాద్దిగీశాంశ్చ పృథక్ పృథక్” అని.
ప్రాతస్సాయముభయకాలములందును ‘సంధ్య’ యను పేరుగల దేవత నుపాసించుచున్న ద్విజుడు ఆయుపాసనాంగముగ దిక్కులను దిక్పాలు లను వేర్వేరుగ నమస్కరింపవలెను. అని. ఇచ్చట సంధ్యాశబ్దమునకు దేవత అర్థమని స్మృతియే అత్యంతస్పష్టముగ చెప్పినది.

2. ఆశ్వలాయనగృహ్యపరిశిష్టమునందు.

“అథ సంధ్యాముపాసీతేత్యాచార్యాః। యానక్తాహోరాత్రయోః సంధీ, యశ్చ పూర్వాహ్ణాపరాహ్ణయోః, తత్కాలాధిష్ఠానా దేవతా సంధ్యా. తాముపాసీతేతి.”

సంధ్యనుపాసింపవలెనని యాచార్యులుపదేశించుచున్నారు. మూడు సంధికాలములందును ఉపాసకులుధ్యానించుటకొరకు నాదిత్య మండలమునందు సంనిహితమైయున్న దేవత సంధ్యాదేవత. ఆ సంధ్యాదేవతను ధ్యానింపవలెను. అని. యత్యంతస్పష్టముగ చెప్ప బడెను.

3. యోగియాజ్ఞవల్క్యులు.

“బ్రహ్మణోపాస్యతే సంధ్యా విష్ణునా శంకరేణ చ।

కస్మాన్నోపాసయేద్దేవీం, శ్రేయస్కామో ద్విజోత్తమః”

ఇచ్చట సంధ్యాశబ్దమునకు దేవతయే అర్థమని స్పష్టముగ చెప్పబడినది.

4. వసిష్ఠస్మృతి.

“యా సంధ్యా సా జగత్సూతిః మాయాతీతా హి నిష్కలా।

ఈశ్వరీ కేవలా శక్తిస్తత్త్వత్రయసముద్భవా”

ఇచ్చట గూడ సంధ్య యన చిచ్ఛక్తి దేవత యని స్పష్టముగ చెప్పబడినది.

ఇట్లు సంధ్యాశబ్దమునకు దేవతయే యర్థమని చాలస్మృతులు

ఎలుగెత్తి చెప్పుచున్నవి. ఉపాసనశబ్దమునకు ధ్యానమర్థమని కూడ స్మృతులు చెప్పుచున్నవి.

ఎట్లనగా——

5. గౌతమస్మృతి.

ప్రాణాయామత్రియం కృత్వా ధ్యాయేత్సంధ్యామితి శ్రుతిః॥

మూడు ప్రాణాయామములను చేసిన పిమ్మటను సంధ్యా దేవతను ధ్యానింపవలెనని శ్రుతి చెప్పుచున్నదని గౌతములవారు చెప్పినారు.

6. వ్యాసస్మృతి.

"ప్రణవవ్యాహృతిభిశ్చైవ కృత్వాత్మానం ప్రదక్షిణం,
ఆచమేత తతస్తిష్ఠన్ ధ్యాయేత్సంధ్యాం సమాహితః."

ఇచట సంధ్యాదేవతను ధ్యానింపవలెనని వ్యాసులవారు ఉపాసనమనగ ధ్యానమని స్పష్టముగ చెప్పిరి.

7. శంఖస్మృతిలోగూడ పై శ్లోకము వంటి శ్లోకమును వ్రాసి సంధ్యాదేవతను ధ్యానింపవలెనని ఉపాసనశబ్దమునకు ధ్యానార్థమును స్పష్టముగ వ్రాసిరి.

8. వ్యాసులవారు తమ స్మృతిలో సంధ్యానుష్ఠానపద్ధతిని నిరూపించు సందర్భమున.

"ప్రాక్కూలేషు తతఃస్థిత్వా, దర్భేషు సుసమాహితః।
ప్రాణాయామత్రియం కృత్వా ధ్యాయేత్సంధ్యామితి శ్రుతిః"

తూర్పుకొనలు గల దర్భలమీద నిలబడి మూడు ప్రాణాయామములను చేసి సంధ్యాదేవతను ధ్యానింపవలెనని శ్రుతి చెప్పుచున్నదని ఉపాసనశబ్దమునకు ధ్యానార్థమును శ్రుతియే చెప్పుచున్నదని చెప్పినారు.

9. కూర్మపురాణమున.

"ప్రాణాయామత్రయం కృత్వా ధ్యాయేత్సంధ్యామితి శ్రుతిః"

అని, అర్ఘ్యప్రక్షేపణప్రదక్షిణాచమనానంతరమున నిలబడి మూడు ప్రాణాయామములను చేసి సంధ్యాదేవతను ధ్యానింపవలెను.

అని శ్రుతి చెప్పుచున్నదని చెప్పబడినది. ఇట్టి శ్రుతిభాగములు కైవ వశమున ఖిలమై యుండవలెను. ఆ శ్రుతిద్రష్టలగు మహర్షులు మనకు తమ స్మృతుల ద్వారా ఆ యర్థమును దెల్పిరి.

ఇట్లు శ్రుతులును స్మృతులును సంధ్యాశబ్దమునకు సంధ్యా దేవతార్థమును ఉపాసనశబ్దమునకు ధ్యానార్థమును గ్రహించి చెప్పు చుండగ సంధ్యోపాసనశబ్దమునకు కర్మకలాపానుష్ఠానము అనుట ప్రమాణవచనాధారము లేకుండ వచ్చినట్టు సముదాయము [illegible] తోచుచున్నది.

ద్రావిడదేశీయులు (అరవవారు) అర్ఘ్యప్రక్షేపణ ప్రదక్షిణా చమనానంతరమున, సంధ్యోపాసనము నిట్లు చేయుచున్నారు. కాని వారికిది సంధ్యోపాసనమని తెలియదు. "అసావాదిత్యో బ్రహ్మ, బ్రహ్మైవాహమస్మి" అని. ఇంతతో తీరుకొనక "య ఏషో౽న్తరాదిత్యే హిరణ్మయః పురుషః, స ఏవాఽహమస్మి" అనియును చెప్పుచున్నారు. కాని చదువుకొన్నవారు ఏకొంచెము మందియో ఇట్లు చేయు చున్నారు. శాస్త్రజ్ఞానములేనివారు "అసావాదిత్యో బ్రహ్మ, బ్రహ్మైవాఽహమస్మి." అని మాత్రమే చాలమంది చేయుచున్నారు. నేను చదువుకొన్నవారిని చదువుకొననివారిని గూడ వారలనడి యడుగగా "సంప్రదాయమిట్లున్నది. ఇట్లు చెప్పుచున్నాము. ఇది మొదలకో తెలియదు. అని యనుచున్నారు. ఇది సంధ్యోపాసన మని వారికి తెలియదు. కాని సంప్రదాయానుసారముగ చేయును చున్నారు. ఇందుచేత తెలియుచున్న దేమనగా ద్రావిడదేశము నందు సంధ్యోపాసనసంప్రదాయము పూర్తిగా నశించలేదని. వారికి అంగాంగిభావము తెలియదు.

ఈ యుపాసనవాక్యమున "అసావాదిత్యో బ్రహ్మ" యనియు "బ్రహ్మైవాహమస్మి" యని చెప్పుచున్నారు. కదా! దీనికి ప్రమాణ మేమి? యని చాలగ్రంథములను పరిశీలించితిని. ఎచ్చటను [illegible] వచనము కనబడలేదు. కాని వ్యాసస్మృతియందు మాత్రము "బ్రహ్మైవాహ మస్మీత్యుపాసీత విధినా యేన కేనచిత్" అని యున్నది. శ్రీవ్యాసుల

వారు సంధ్యా స్వరూపమును చెప్పు సందర్భమున తమ స్మృతిలో "సంధ్యా హి సూర్యగం బ్రహ్మ సంధ్యానాదవిభాగతః" అని ఉపాసకుడు సంధ్యాదేవతను అభేదబుద్ధితో ధ్యానింపవలెనని చెప్పిరి. కాని, ఆ యభేదధ్యానాకారము ఎట్లుండునో అచ్చట చెప్పలేదు. కాని ఆ యుపాసనాకారమును మరియొక చోటున చెప్పిరి. "సాఽహమస్మీత్యుపాసీత" యని. ఈ వచనమును చూచిన తర్వాతనే నా మనసు కుదుటపడినది. అందువలన సంస్కృతగ్రంథమున "అసావాదిత్యో బ్రహ్మ" తర్వాత చేర్పబడిన "బ్రహ్మైవాఽహమస్మి" అను దానికి ప్రమాణవచనము దొరకకపోవుటవలన ఆ వాక్యమును తొలగించి, వ్యాసులవారే స్వయముగ తమ స్మృతియందు చెప్పిన "సాఽహమస్మి" యను వాక్యమును చేర్చితిని. కాగా "అసావాదిత్యో బ్రహ్మ. సాఽహమస్మి" యనునదియే సంపూర్ణమైన ఉపాసన వాక్యము. అందువలన ఈ "సాఽహమస్మి" యనునది క్రొత్తగా వచ్చినదే! యని సందేహపడనక్కరలేదు. అని మనవి చేయుచున్నాను.

ఇంకనూ — బ్రహ్మైవాఽహమస్మి" అను వాక్యమునందలి "బ్రహ్మ" పదమునకు "పరబ్రహ్మముగా (పరబ్రహ్మత్వేన) భావింపబడిన ఆ "సంధ్యాదేవత" యని కొంచెము శ్రమతో అర్థమును చెప్పుకొనవలసియున్నది. "సాఽహమస్మి" యను పాఠమునందు తచ్ఛబ్దము పూర్వమువచ్చిన దానిని యర్థముగా చెప్పునది గాన "సాఽహమస్మి" యను వాక్యమునందలి "సా" యను పదముచేత శ్రమలేకుండగనే "ఆ సంధ్యాదేవత" అను అర్థము సులభముగ తోచును. కావున పాఠకమహాశయులు ఈ "సాఽహమస్మి" యను పాఠము ఏమో క్రొత్తగ నున్నదే యని సందేహపడ నక్కరలేదు. ఈ "సాఽహమస్మి" యను నదియే ప్రామాణికపాఠమని తెలియగోరుచున్నాను. కావున సంధ్యాశబ్దమునకు సంధ్యయను పేరుగల దేవతయే యర్థము. ఉపాసనశబ్దమునకు ధ్యానమే యర్థము. అని సిద్ధాంతము.

పూర్వమీమాంసకులు కర్మమార్గశత్రువులను ఖండించి మన వైదికమతమును, కర్మమార్గమును సుస్థాపించిరి. వారి న్యాయములు అమూల్యమైనవి. చాలబలమైనవి. వారి న్యాయములు అనుసరించియే వ్యాకరణశాస్త్రము వేదాంతశాస్త్రము కూడ నడుస్తున్నవి. వీరు నాకు పరమపూజ్యులు. సంధ్యావందనము అగ్నిహోత్రాదులు - ఉపాసనామార్గమునకు చెందినవి. పూర్వమీమాంసకులు ఉపాసనము నంగీకరింపరు. కావున ఉపాసనామార్గమునకును పూర్వమీమాంసామతమునకును కొన్ని భేదములున్నవి. అట్టి భేదములు మాత్రమే ఈ గ్రంథమున అచ్చటచ్చట ఉదహరింపబడినవి. అంత మాత్రముచేత నీ గ్రంథకర్తకు పూర్వమీమాంసామతమునందు ద్వేషము నారోపింపవలదని మనవి చేయబడుచున్నది.

ఓమ్ తత్ సత్

శివమ్

ఇట్లు

గ్రంథకర్త.

ఓమ్

# "సంధ్యావందనావశ్యకత"

ద్విజుడు సంధ్యావందనము నవశ్యమాచరింపవలెను. ఏల? సంధ్యావందనము నాచరించుటవలననే, ద్విజుడు కృతార్థుడగుచున్నాడు. ధన్యుడగుచున్నాడు, సార్థకజన్ముడగుచున్నాడు.

ఉపనిషత్తిట్లు చెప్పుచున్నది.

"ఇహచేదవేదీదథ సత్యమస్తి న చేదిహావేదీన్మహతీ వినష్టిః"

అని. అనగా—మానవుడు ఆ జన్మలోనే 'తాను పరబ్రహ్మ స్వరూపుడ''నని తెలిసికొనిన యెడలనే తనకు సత్యపదార్థమైన బ్రహ్మము లభ్యమగును. అనగా తాను బ్రహ్మసాక్షాత్కారమును పొంది బ్రహ్మైక్యమును పొందగలడు. తన ద్విజజన్మము సార్థకమగును. ఈ జన్మమున బ్రహ్మజ్ఞానము కలుగని యెడల (తాను బ్రహ్మ స్వరూపుడనని తెలిసికొనుటకు ప్రయత్నించని యెడల) తనకు గొప్ప నష్టము వచ్చును. అని తాత్పర్యము, తనకు గొప్ప నష్టము వచ్చునని యుపనిషత్తు చెప్పుచున్నదే, ఏమా గొప్ప నష్టము? చెప్పెదను. మన వేదము ప్రకారము మానవునకు బ్రాహ్మణజన్మ యనునది చాల దుర్లభము, ఏల? పూర్వజన్మములందెంతయో పుణ్యము చేసిగాని బ్రాహ్మణజన్మము దొరకదు. అనగా పూర్వజన్మములందు చేసిన యనేకపుణ్యములనిచ్చి ఈ బ్రాహ్మణజన్మమును కొనుచున్నామన్నమాట. ఎందులకు? ఈ బ్రాహ్మణజన్మముననే బ్రహ్మసాక్షాత్కారము నొంది. పునర్జన్మరహిత జీవబ్రహ్మైక్యమును పొందవలెను.

కాన నీ బ్రాహ్మణజన్మమున బ్రహ్మసాక్షాత్కారము, కాని యెడల, ఈ బ్రాహ్మణజన్మముకొరకు మనము వెనుకటి జన్మము

లందు జేసిన పుణ్యము లన్నియును దండుగే కదా! ఇది వ్యర్థ నష్టము కదా! కావున నీ జన్మములోనే బ్రహ్మసాక్షాత్కారము కలిగిన యెడల నష్టమేమియు నుండదు. సరికదా — పూర్వజన్మ పుణ్యములకు బ్రహ్మసాక్షాత్కారరూపమైన పెద్ద లాభముకూడ నుండును. బ్రాహ్మణజన్మము సార్థకమగును. ద్విజుడు కృతార్థుడు ధన్యుడునగును.

ఇంతియే కాదు. దీర్ఘాయురారోగ్యములు, మనశ్శాంతి, తాను జేసిన పాపము లన్నియును నశించుట. అంతఃకరణము శుద్ధమగుట, ముఖ్యముగ తానెవరో గుర్తించగలుగుట, మొదలగు మహాఫలము లెన్నో కలుగును. ఈ ఫలములనే గదా! మానవుడు ముఖ్యముగ కోరవలసినది!

శంక = సంధ్యావందనము జేసిన బ్రహ్మజ్ఞానము కలుగునా? సమాధానము, సంధ్యావందనమును గూర్చి చెప్పుచున్న తైత్తిరీయ బ్రాహ్మణమను వేదభాగమిట్లు చెప్పుచున్నది.

“ఉద్యంతమస్తంయంతమాదిత్యమభిధ్యాయన్, కుర్వన్ బ్రాహ్మణో విద్వాన్ సకలం భద్రమశ్నుతేఽసావాదిత్యో బ్రహ్మేతి, బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి య ఏవం వేద” అని.

ఈ మంత్రముయొక్క తాత్పర్యము.

ప్రొద్దున సూర్యుడుదయించుటకు ముందును, సాయంకాలమున సూర్యుడస్తమించుటకు ముందును, సూర్యమండలమునందు బ్రహ్మరుద్ర విష్ణురూపములతో (త్రిఅకారములతో) వెలయుచున్న పరబ్రహ్మచైతన్యస్వరూపిణియగు సంధ్యాదేవతను బ్రాహ్మణుడు “అసావాదిత్యో బ్రహ్మ+సోఽహమస్మి” యను మంత్రముతో “ఆ సంధ్యాదేవత నేనే”యనుకొనుచు ధ్యానింపవలెను. ఆ ధ్యానము చేయుటకుముందు ఆ మంత్రములయొక్క అర్థమును చక్కగా విశదముగ తెలిసికొనవలయును. తెలిసికొని సంధ్యాదేవతను ధ్యానించునప్పుడు ఆ మంత్రార్థమును భావింపవలెను. మంత్రార్థమును భావించకుండ, కండ్లుమూసికొని, యా మంత్రమును పదిసారులు

కాదుగదా నూరుసారులుచ్చరించినను ప్రయోజనము లేదు. మంత్రార్థమును భావించుచు సంధ్యాదేవతాధ్యానమును చేసినయెడల బ్రాహ్మణుడు బ్రహ్మజ్ఞానమును తప్పక పొందును.

శంక = ఎట్లు పొందును?

సమాధానము. పై మంత్రములోనే బదులున్నది. "బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి" యని. అనగా— మానవుడు వాస్తవములో తాను పరబ్రహ్మయే యైయున్నను అజ్ఞానము (మాయ) చేత తాను జీవుడనని దృఢమైన భ్రాంతిని పొందియున్నాడు. కాని సంధ్యాధ్యానమంత్రముయొక్క అర్థమును చక్కగ తెలిసికొనగనే, ముందుగ నా యజ్ఞానము సగము పోవును. ఆ అర్థమును భావించుచు ధ్యానము చేయగ, చేయగ, ఆ దృఢమైన భ్రాంతిపోయి, వెనుకటి యజ్ఞానము పోయి, తాను పరబ్రహ్మస్వరూపుడే యను దృఢమగు జ్ఞానము కలుగును. ఆ దృఢమగు జ్ఞానముతో నింకను తీవ్రముగ సంధ్యాదేవతాధ్యానమును చేయగా చేయగా, పరిశుద్ధమైన యంతఃకరణమునందు ఏదో యొకనాడు పూర్వపుణ్యపరిపాకముచేత హఠాత్తుగ బ్రహ్మసాక్షాత్కారము కలుగును. ఆ బ్రహ్మసాక్షాత్కారమే, జీవబ్రహ్మైక్యము, ఈ జీవబ్రహ్మైక్యమునే మరుజన్మములేని మోక్షమందురు. బ్రతికియుండగనే జీవబ్రహ్మైక్యము కలిగినయెడల జీవన్ముక్తి యందురు. అతడీశరీరమును విడిచిపెట్టినతర్వాత "విదేహకైవల్యము"ను పొందును. అంతతో జన్మరాహిత్యము కలుగును. శ్రద్ధతోను భక్తితోను సంధ్యావందనము నాచరించుటవలన నిట్లు బ్రహ్మజ్ఞానము, జీవబ్రహ్మైక్యము, జన్మరాహిత్యము అను మహాఫలములు కలుగును.

పై తైత్తిరీయమంత్రమునందున్న "బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి" అను పదములు చాలచాల ముఖ్యములు. అవియే మానవునకు బ్రహ్మజ్ఞానమెట్లు కలుగునో పైన వ్రాసిన విధముగ చెప్పుచున్నవి. శ్రీశంకరులు, సూత్రభాష్యమున "బ్రహ్మైవసన్ బ్రహ్మాఽప్యేతి" అను వాక్యమును చాలచాలసారులు వాడినారు.

అల్లే—"అసావాదిత్యో బ్రహ్మ. సోఽహమస్మి" యను మంత్రములోని "అసౌ+ఆదిత్యః, బ్రహ్మ, సః+అహం+అస్మి" అను నాలు పదములయొక్క అర్థమును చక్కగా తెలిసికొనినంతమాత్రము చేతనే సగము అజ్ఞానము పోవును. సందియము లేదు. ఆయర్థమును తెలిసికొని ఆయర్థమును భావించుచు సంధ్యాదేవతాధ్యానమును స్వేచ్ఛతో (సంశితవ్రతముతో) చేయగా, మిగిలిన సగమజ్ఞానము కూడ పోవును. కాని, మనయంతఃకరణము అనేకానేకపూర్వజన్మలలో చేసిన, లోతుగ వేళ్లుతన్నిన అనేకపాపములతో నిండియున్నది. ఈ పాపములు మంచి తలంపులను పుట్టనీయవు. మంచిపనులను చేయనీయవు. ఆ పాపములన్నియును పోయి అంతఃకరణము శుద్ధమైన గాని బ్రహ్మజ్ఞానము పుట్టదు. ఏదైన పుణ్యావకాశమున ఒకానొక పుణ్యతలంపు పుట్టినను అది స్థిరముగ నుండదు. అందువలన అంతఃకరణములోని పాపములు పోవుటకొరకు ఈ సంధ్యాదేవతాధ్యానమునకు ముందునూ, తర్వాతనూ కొన్ని వేరే అంగకర్మలు చేయవలెను. కాబట్టియే మొదటి సంకల్పములో "మమోపాత్తదురితక్షయద్వారా"=నేను పూర్వజన్మలలో చేసిన పాపములను నశింపజేయుటద్వారాగా—నా యంతఃకరణము శుద్ధమగుటకొరకు అని చెప్పుచున్నాము.

కాగా — సాంగోపాంగసంధ్యావందనమును చేయుటవలన సమస్తపాపములును నశించి యంతఃకరణము శుద్ధమగును. తర్వాత బ్రహ్మసాక్షాత్కారమగును. సంధ్యాదేవతాధ్యానము బ్రహ్మధ్యానము కాబట్టి అది ముఖ్యము, అని యర్థము. అదియే మొత్తము సంధ్యాకర్మయందు అంగి. ప్రధానము.

ఈ సంధ్యోపాసనమునకు ముందు వెనుకల చేయబడు కర్మలు అంగము లనబడును. అందు ముందు జేయబడునవి పూర్వాంగములు, తర్వాత చేయబడునవి ఉత్తరాంగము లనబడును. అందు పూర్వాంగములైదు. అవి ఏవనగా 1. ప్రథమమార్జనము, 2. అభ్యుక్షణము, 3. ద్వితీయ (పునర్) మార్జనము, 4. పాపపురుషదహ

సము, 5. అర్ఘ్యప్రక్షేపము. ఈ యైదింటిలో చాల పాపములు నాశమైపోవును. ఎట్లు? ప్రథమమార్జనము. మార్జనమనగా "ఆపో హిష్ఠాది మంత్రములు చెప్పుచు తలమీద నీళ్ళు చల్లుకొనుట. ఈ మార్జనము వలన రజస్తమోగుణములచేత చేసిన పాపములు చాలమట్టుకు పోవును. తర్వాత మంత్రాచమనము. (అబ్భక్షణము) "సూర్యశ్చ మామన్యుశ్చ" ఇత్యాది మంత్రములచే అభిమంత్రించిన జలమును త్రాగుటవలన లోపలి సూక్ష్మశరీరము చేత చేసిన పాపములు నాశమగును.

3. ద్వితీయమార్జనము. ఈ రెండవసారి చేయు పెద్ద మార్జనముచేత (వెలుపలి శరీరము పూర్తిగ శుద్ధమగును, 4. పాప పురుష దహనము. లోపలి సూక్ష్మశరీరము నందలి పాపములను ఒక పురుషాకృతితో వెలుపలకు తెచ్చి ఆ పాపపురుషుని దహించివేయుట. దీనిచేత లోపలి పాపములు నశించిపోవును. ఈ విధముగ వెలుపలను లోపలను పూర్తిగ శుద్ధుడై మందేహరాక్షసులతో సూర్యునకు కలిగిన యుద్ధోపద్రవమును పోగొట్టుటకొఱకు మూడు అర్ఘ్యములను చిమ్మవలెను. గాయత్రీమంత్రముచేత అభిమంత్రించుటచేత బ్రహ్మాస్త్రముతో సమానమైన ఆయర్ఘ్యములచేత నారాక్షసనాశము కాగా—సూర్యుని యుపద్రవము తీరి, సూర్యుడు స్వస్థుడగును. తర్వాత ప్రదక్షిణాచమనములను, జేసి, అట్లు స్వస్థమైన యా సూర్యమండలము లోపల, ప్రొద్దున, హంసవాహన బ్రహ్మరూపముతోను, మధ్యాహ్నమున వృషభవాహన రుద్రరూపముతోను, సాయంకాలమున గరుడ వాహన విష్ణురూపముతోను, స్త్రీయాకారముతో, వెలయుచున్న బ్రహ్మచైతన్యస్వరూపిణియగు సంధ్యాదేవతను "అసావాదిత్యో బ్రహ్మ. నా౽హమస్మి" అను మంత్రములతో మంత్రార్థమును బాగుగ భావనచేయుచు, ధ్యానము చేయవలెను. ఈ ధ్యానమునే, యుపాసనమందురు. సంధ్యాదేవత పరబ్రహ్మస్వరూపిణి గాన ఈ ధ్యానము బ్రహ్మధ్యానమగును. ఇది బ్రహ్మధ్యానము గావు

అనే ఈ ధ్యానమువలన బ్రహ్మజ్ఞానము కలిగి పరబ్రహ్మసాక్షాత్కారమగును.

ఈ సంధ్యాధ్యానమైన తర్వాత పాపనివృత్తికొరకును, దేవతల యనుగ్రహముకొరకు ఉత్తరాంగములను ఆచరింపవలెను. ఆ యుత్తరాంగములునైదు. ఏవనగా 1. గాయత్రీజపము, 2. సూర్యోపస్థానము, 3. దిఙ్నమస్కారము, 4. భూమ్యాకాశవందనము, 5. అభివాదనము. అని, 1. గాయత్రీమంత్రజపము "న గాయత్ర్యాః పరో మంత్రః" యని మనువు చెప్పుటవలన గాయత్రీ మంత్రము కంటె గొప్ప మంత్రము, జపము లేదు. గాయత్రీ జపముచేత పంచమహాపాతకములు కూడ పోవునని శాస్త్రము చెప్పుచున్నది. అట్టి గాయత్రీజపము చేసిన యెడల బ్రహ్మహత్యాది పాపములు పోవును. గాయత్రీజపముచేత పగటి పాపము పగలే పోవును. రాత్రిపాపము రాత్రియే పోవును. అని గాయత్రీహృదయము చెప్పుచున్నది. ఇంకనూ, సంధ్యాదేవత చక్రవర్తిని. గాయత్రీ దేవత ఆమెకు ప్రధానమంత్రిణి వంటిది. జపముచేత గాయత్రీదేవి ప్రసన్నురాలైన యెడల, ఆమె ద్వారా సంధ్యాదేవత శీఘ్రముగ ప్రసన్నురాలగును. గాయత్రీజప మిక్కిలి రెండు విధముల చాల ముఖ్యమైన అంతరంగమైన యంగము. తర్వాత, 2. సూర్యోపస్థానము. ఇది సూర్యదేవుని స్తుతి. ఈ యుపస్థానమంత్రములలో సూర్యుని మహిమ అపారముగ వర్ణింపబడినది. సూర్యమండలమున సంధ్యాదేవత ఉపాసింపబడుచున్నది గదా! సూర్యుని యనుగ్రహము వలన సంధ్యాదేవతానుగ్రహము గలుగును. సూర్యుడు ప్రత్యక్ష దైవము. కర్మసాక్షి. ఈ యుపస్థానమువలన ఆరోగ్యము, ఆయుష్యము, పాపనాశము, అంతఃకరణశుద్ధి, మొదలగు నుత్తమఫలములు లభించును.

మంత్రార్థప్రకరణమున ఈమంత్రములకు అర్థతాత్పర్యములు విశదముగ వ్రాయబడినవి. మంత్రార్థము చాల గంభీరముగనుండును. తర్వాత, 3. దిఙ్నమస్కారము. దిగ్దేవతలకును, దిక్పతులకును

భక్తిశ్రద్ధలతో నమస్కరించుటవలనవారు మిక్కిలి యనుగ్రహింతురు. ఇంద్రుడు, యముడు, వరుణుడు మొదలగు దిక్పతులు గొప్ప బ్రహ్మ వేత్తలు. వీరి యనుగ్రహమువలన అంతఃకరణము శుద్ధమై శీఘ్రముగ బ్రహ్మజ్ఞానము కలుగును. తర్వాత, 4. భూమ్యాకాశవందనము. సర్వప్రాణులకును భూమ్యాకాశములు తలిదండ్రులు. వీరి యనుగ్ర హమువలన సుఖజీవనము గలుగును, సుఖజీవనమున్న యెడలనే మన మీసంధ్యోపాసనాదికర్మలను శాంతమైన మనసుతో చేయగలిగె దము గదా! 5. ఐదవది, చివరదియును అభివాదనము. ఇందు తొలుత సమస్తమైన వారియొక్కయును క్షేమమునుకోరుదుము. ''సర్వే జనా సుఖినో భవంతు'' జనులందరును సుఖవంతులగుదురుగాక! అను నదియేకదా! మన భారతీయసత్సంప్రదాయము. ఆ సమయమున మన గోత్రమును ప్రవర్తింపజేసిన (స్థాపించిన) మహర్షులను, మన వేదమును, వేదశాఖను, మన సూత్రకర్తయగు మహర్షిని, వీరంద రిని భక్తిశ్రద్ధలతో తలంతుము. మనది ఎంత సత్సంప్రదాయమో మనకు జ్ఞానకమునకు వచ్చును. మనకెంతో యుత్సాహము కల్గును. చిట్టచివరను ''ఆ బ్రహ్మలోకాదా శేషాత్'' అను శ్లోకమును పఠిం తుము. అందు ఈ పదునాల్గు భువనములందున్న దేవతలకు బ్రాహ్మ ణులకును, అర్థాత్ మహర్షులకును, నమస్కరింతుము. ఆ సమయ మున నెంతో యానందముగనుండును.

పూర్వాంగములలో రెండవదియగు మంత్రాచమనము ఎంతో మహిమగలది. సర్వపాపహరము. ఆ మంత్రమునకు గొప్ప విశే షార్థము విశదముగ వ్రాయబడినది.

ఇట్లు సంధ్యావందనము (సంధ్యాదేవతోపాసనము) సమస్త పాపనాశకము, అంతఃకరణశుద్ధికరము. ఆయురారోగ్యప్రదము. బ్రహ్మజ్ఞానప్రదము, జీవబ్రహ్మైక్యకరము, మోక్షప్రదమున్నూ. కావుననే మార్కండేయపురాణమున సంధ్యావందనమహిమమిట్లు వర్ణింపబడినది.

"అశ్వమేధసహస్రాణి వాజపేయశతాని చ।
నైవాప్నువంతి తులనాం సంధ్యోపాస్తేస్తు ద్విజోత్తమా॥"

నూరుకాదు, వేయి కాదు, వేలకొలది యశ్వమేధయాగములు చేసినవాని పుణ్యముగాని, అట్లే-నూర్లకొలది వాజపేయ యాగములు చేసినవాని పుణ్యముగాని, ఈ రెంటింటి మొత్తము పుణ్యము గాని, భక్తిశ్రద్ధలతోను, అర్థజ్ఞానముతోను చేసిన సంధ్యావందనఫలమునకీడుకావు.

ఏలననగా—ఇన్ని యశ్వమేధయాగములు చేసిన వాడు ఏ లోకములకు బోవునో, ఆ పుణ్యలోకములకు, సంధ్యోపాసన సిద్ధినొందక మునుపే, చనిపోయిన బ్రాహ్మణుడు వెళ్లునని శాస్త్రము, శ్రుతిస్మృతయును జెప్పుచున్నవి. ఇట్లుగాక, సంధ్యోపాసన సిద్ధించిన బ్రాహ్మణుడు బ్రహ్మలోకమునకు బోయి, యచ్చట నుండి, పునర్జన్మము లేని మోక్షమునే బొందునని శాస్త్రము చెప్పుచున్నది. లేక—యీ మానవ లోకముననే బ్రహ్మసాక్షాత్కారమును పొంది జీవన్ముక్తినే పొందినను పొందవచ్చును. ఇక నశ్వమేధయాగములు చేసిన వానికి బ్రహ్మలోకమునకుబోవు నవకాశ మెప్పుడైన లభించినను, అచటనుండి మరల భూలోకమునకు వచ్చి జన్మించును. జన్మ తప్పదు. సంధ్యోపాసకునకు జన్మ లేదు. కావుననే వేలకొలది యశ్వమేధయాగములుకూడ సంధ్యావందనమున కీడుగావని మార్కండేయపురాణము వర్ణించినది. బ్రహ్మవేత్తలలో నగ్రగణ్యుడగు శ్రీయాజ్ఞ వల్క్యమహర్షి యిట్లు వర్ణించినారు.

"బ్రహ్మణోపాస్యతే సంధ్యా, విష్ణునా శంకరేణ చ।
కస్మాన్నోపాసయేద్దేవీం శ్రేయస్కామో ద్విజోత్తమః॥"

ఆదిశక్తి పరాశక్తి స్వరూపిణియగు సంధ్యాదేవతయే బ్రహ్మ విష్ణుమహేశ్వరులను తన నాశ్రయించిన మాయాద్వారా సృష్టించినది. కావున ప్రపంచముయొక్క సృష్టిస్థితిలయములకు కారకులైన త్రిమూర్తులుకూడ తమకు జనని యగు సంధ్యాదేవతను ఉపాసించుచున్నారు. అట్టి త్రిమూర్తులచేత సృష్టింపబడి రక్షింపబడుచున్న

మానవుడగు బ్రాహ్మణుడు మోక్షముకొరకు సంధ్యాదేవి నేల ధ్యానింపగూడదు? కైముత్తికన్యాయముచేత తప్పక ధ్యానింపవలెను. మోక్షమును పొందవలెను. శ్రీ మహావిష్ణువు తన యవతారములలోగూడ సంధ్యోపాసనను విడువలేదు. రామకృష్ణావ్యవతారములలో వారి సంధ్యోపాసన వర్ణింపబడినది. ఇవ్విధముగ నిహపరసాధకమగు సంధ్యావందనమును ద్విజులవశ్యము నాచరింతురుగాక! తత్ఫలమును బొందుదురు గాత!

చాల కాలమునుండి సంధ్యావందనమున నేది ప్రధానమో, యేది యంగమో యను జ్ఞానము లోపించుటచేత – అన్నింటికంటె ముఖ్యమగు సంధ్యోపాసనము, సంప్రదాయమునుండి తప్పిపోయినది. ఎల్లరును అంగములనే "యంగి"యనుకొని ఆచరించుచున్నారు. అంగిలేనిది, సంధ్యావందనమెట్లగును? అంగముల నాచరించుటచేత మోక్షము రాదు కదా! శ్రీ బాలాత్రిపురసుందరీ దేవ్యనుగ్రహము చేత – శ్రీలలితాసహస్రనామభాష్యమును పఠించి, పరిశీలించి, యందుత్తరఖండమునందు సంధ్యావందనమున సంధ్యాదేవతోపాసనమే ప్రధానమని శ్రీభాస్కరరాయలువారు వ్రాసియుండుటను చూచి, పరమానందనిర్భరుడనై రాజమహేంద్రవరనగరమునను, మద్రాసునగరమునను ఐదుసంవత్సరముల నేక ధర్మశాస్త్ర గ్రంథములను, వేదాంతగ్రంథములను, సంధ్యావందనపద్ధతి గ్రంథములను యథామతి పరిశీలించి, సంధ్యాదేవతోపాసనమే "అంగి"యని నిర్ధారించి, యథాశాస్త్రముగ సంధ్యావందనపద్ధతిని "సంధ్యాతత్త్వసుబోధిని" యను పేరుతో గ్రంథరూపముగ భూసురోత్తముల సంమోదము కొరకు తొలుత సంస్కృతమున రచించితిని. దానిని శ్రీశ్రీశ్రీ కంచికామకోటి పీఠాధిపతులును, అనవరతబ్రహ్మనిష్ఠాగరిష్ఠులగు శ్రీ శ్రీ శ్రీ చంద్రశేఖరేంద్రసరస్వతీస్వాములవారు పూర్తిగవిని "ఇట్టిగ్రంథము నింతవరకెవ్వరును వ్రాయలేదు. సర్వబ్రాహ్మణోపకారకము, బ్రాహ్మణ్యరక్షకమునగు నీగ్రంథమును మేమే యచ్చువేయించెదమని యనుగ్రహించి, వి. త్యాగరాజన్ అను వారిద్వారా

వేయిప్రతుల నచ్చువేయించిరి. తర్వాత శ్రీశ్రీశ్రీశృంగేరీపీఠాధిపతులగు జగద్గురు శ్రీశ్రీ శ్రీమదభినవవిద్యాతీర్థ మహాస్వాములవారును 18 సంవత్సరములకు ముందు మద్రాసుమకాములో వేంచేసినప్పుడు అనుగ్రహముతో ఈగ్రంథమును పరిశీలించి "అంతయు నిర్దుష్టము ప్రామాణికముగనున్నదని యంగీకరించిరి. దీనిని తెలుగున వ్రాసిన ఎల్ల తెలుగు వారికిని మిక్కిలి సులభముగ బోధపడుననునాసతో రచించినాను. ఇందు సంధ్యావందనప్రయోగమును, సంధ్యామంత్రార్థ తాత్పర్యములను సంధ్యాకాలాదినిర్ణయమును ఇంకను ననేకములైన ఆవశ్యక విషయములను విశదముగ వివరించినాను.

సంధ్యావందనమునాచరించుటకు ముఖ్యముగ శ్రద్ధాభక్తులుండవలెను. అర్థభావనాపురస్సరముగ సాంగోపాంగసంధ్యావందనమును భక్తిశ్రద్ధలతో నాచరించి, తమజన్మమును సార్థకము జేసి, నన్ను ధన్యుని జేయుదురుగాక! యనియును, శ్రీపరాశక్తిస్వరూపిణియగు శ్రీసంధ్యాదేవ్యనుగ్రహభాజనులై ధన్యులగుదురుగాత! మనియును శ్రీసంధ్యాదేవిని ప్రార్థించుచున్నాను.

ఇట్లు,
ద్విజబృందవిధేయుడు
సోమయాజుల వేంకటాచలశాస్త్రి

# కృతజ్ఞత

జంషెడ్‌పూరు వాస్తవ్యులును, వైదికకర్మనిరతులును, భక్తాగ్రేసరులునగు దాతలును, మద్రాసువాస్తవ్యులును, భక్తాగ్రేసరులగు దాతలును, నాయందలి భక్త్యభిమానములచేతనేమి, గ్రంథమునందలి భక్తిచేతనేమి. నేను రచించిన సంధ్యాతత్త్వసుబోధినీగ్రంథమును, అచ్చువేయించుటకు, అగు, ధనవ్యయముయొక్క భారమును వహించి, గ్రంథము అచ్చగుటకు తోడ్పడిరి.

వారి భక్త్యుత్సాహములతోనే ఈ గ్రంథము ముద్రితమై, ఆంధ్రమహాజనుల కరకమలములను, అలంకరించబోవుచున్నది.

ఆ దానశూరులందరును, సర్వలోకజననియు, చిచ్ఛక్తిస్వరూపిణియు, అగు, శ్రీసంధ్యాదేవతయొక్క, అనుగ్రహముచేత, దీర్ఘాయుష్మంతులై, సంధ్యోపాసననిరతులై, ధనకనకవస్తువాహన సుఖసంపన్నులై, పుత్రపౌత్రులతో, వర్ధిల్లుదురు గాత!

జంషెడ్‌పూరువాస్తవ్యులును, ఉన్నతోద్యోగమును నిర్వహించినవారును, సుప్రసిద్ధచిత్రకళాకోవిదులగు, శ్రీ సి. పి. నాయరు గారు నేనడిగినదే తడవుగ, ఎన్నియో పనులున్నను, ఎట్లో తీరిక చేసికొని. శ్రమపడి, భక్తితో త్రికాలసంధ్యాదేవతల చిత్తరువులను, చాల రంగులతో, యథాశాస్త్రముగ లిఖించి యిచ్చినారు.

వారు, చిచ్ఛక్తిస్వరూపిణి, శ్రీసంధ్యాదేవతానుగ్రహపాత్రులై, దీర్ఘాయురారోగ్యైశ్వర్యసంపన్నులై, పుత్రపౌత్రులతో వర్ధిల్లుదురు గాక!

గ్రంథముద్రణవ్యవహారమున ఓనమాలు కూడ తెలియని నాకు, నా ప్రియతమశిష్యుడును,స్వయముగ ముద్రణాలయమును నిర్వహించుచున్నట్టియు, మద్రాసు, తిరువాన్మియూరువాస్తవ్యుడగు, చిరంజీవి సి. టి. నాచియప్పన్ చెట్టి (చెట్టినాడుకుచెందినయాతడు) నాయందు

తనకున్న అత్యధికభక్త్యభిమానములను పురస్కరించుకొని, నన్ను చాలసార్లు, తన మోటారుకారులో, ముద్రణాలయములకు తీసికొని వెళ్ళి అచ్చట సరసమైనధరలకు వ్యవహారమును నిర్ణయించి, మధ్య మధ్య తానువచ్చి, చూచుచు, నాకెన్నియో విధమైన శ్రమను కలిగించక, గ్రంథముద్రణభారమును వహించెను. ఈతనికి శ్రీసంధ్యాదేవ్యనుగ్రహముచేత, దీర్ఘాయురారోగ్యైశ్వర్యసంపదలు సుస్థిరముగ కల్గుగాత !

ఈ గ్రంథముద్రణకొరకు నేను, మద్రాసునందు తొమ్మిది మాసములు, ఉండవలసివచ్చెను. ఎనిమిదవపదిలోనున్న వృద్ధుడనగు నాకు, ఏ కొంచెము అనారోగ్యముకలుగకుండ, ఆయుర్వేదశిరోమణి పట్టభద్రుడను, సుప్రసిద్ధాయుర్వేదవైద్యుడను, మద్రాసు వెంకట్రమణ ఆయుర్వేదవైద్యాలయమునకు ప్రధానచికిత్సకుడను అగు, నా కనిష్ఠసోదరుడు, చిరంజీవి సోమయాజుల [illegible], కంటిని రెప్పవలె, నా ఆరోగ్యమును కాపాడుచుండెను, వ్రాతప్రతిని అచ్చునకు ఇచ్చుముందు వ్రాతప్రతిని పరిశీలించుటలో, పదవాక్యభావదోషములు లేకుండ, పరిష్కరించుటలోను, నేనెక్కడికి పోయిన అక్కడికి నీడవలె, నాతోకూడ నన్ను కాపాడుచు వచ్చుచుండెను. అచ్చైన ప్రూఫులను ఎట్టిదోషములు లేకుండ దిద్దియిచ్చుటలోను, నాకు ప్రేమభక్తులతో అమూల్యసాహాయ్యమును చేసినాడు. ఇట్టి నాకనిష్ఠసోదరుడు, శ్రీసంధ్యాదేవ్యనుగ్రహపాత్రుడై, దీర్ఘాయురారోగ్యైశ్వర్యసుఖసంపదలతో వర్ధిల్లుగాత!

ఈగ్రంథముద్రణకొరకు విరాళములిచ్చిన దాతలలో ఐదు వందలు మొదలు, ఐదువేలవరకును, విరాళములిచ్చిన వదాన్యులు, మహారాజపోషకులగుదురు. ఐదుపదులు మొదలు, ఐదువందలవరకును విరాళములిచ్చిన వదాన్యులు, రాజపోషకులగుదురు. ఐదుపదులకు తక్కువ విరాళములిచ్చినవారు పోషకులగుదురు.

ఈవదాన్యుల నామములు, పైన పేర్కొనిన క్రమములో నిచ్చట ముద్రింపబడుచున్నవి.

## సంధ్యాతత్త్వసుబోధినీ గ్రంథప్రచురణ పోషకుల పట్టిక

# మహారాజపోషకులు

1. చిరంజీవి A. N. రామచంద్రరావుగారు, B.E. శాస్త్రినగర్, మద్రాసు.
2. చిరంజీవులు నెమలి శ్రీవిద్యా విరల్‌మూర్తి దంపతులు, B.E. ప్రస్తుతము, ఇరాను.
3. చిరంజీలు వారణాసి సూర్యారావు, వేంకటనారాయణ సోదరులు, B.E. ప్రస్తుతము కెనడా, ఉత్తర కొరియా.
4. రాజా D. అప్పారావు బహదూరువారు, మద్రాసు.
5. చిరంజీవి సోమయాజుల దక్షిణామూర్తి, B.E. జంషెడ్‌పూరు.
6. చిరంజీవి Capt. సోమయాజుల చిన్న దక్షిణామూర్తి, B.E. అలహాబాదు.

కుమారి ముంగర ప్రమీల, M.D. అమెరికా.

శ్రీ C. S. ప్రకాశరావుగారు, అడ్వకేట్ టి.నగర్, మదరాస్.

# రాజపోషకులు

7. శ్రీ అడ్డాల వీరరాఘవలక్ష్మీనరసింహమూర్తిగారు, B.E. జంషెడ్‌పూరు.
8. శ్రీ K. వెంకటేశన్‌గారు, మద్రాసు.
9. శ్రీ R. K. సరప్‌గారు, శ్రీరామనగర్ శ్రీకాకుళం జిల్లా, ఆంధ్రప్రదేశ్.
10. శ్రీమతులు ముంగర శాంతమ్మ సేనుగారు, మద్రాసు.
11. శ్రీ G. కోటేశ్వరరావుగారు జంషెడ్‌పూరు
12. శ్రీ J. పాపారావుగారు, టెల్కో ,,
13. శ్రీ A. V. కృష్ణారావుగారు మద్రాసు
14. శ్రీ K. గంగాధరరావుగారు ,,
15. శ్రీ R. N. రావుగారు జంషెడ్‌పూరు
16. శ్రీ భమిడి జగన్నాథమూర్తిగారు ,,
17. శ్రీ భాగవతుల ఉమామహేశ్వర శర్మగారు ,,

18. శ్రీ A. S. రావుగారు ,,
19. శ్రీ సరిపల్లి కామేశ్వరరావుగారి కొఱకు, వారి సమూహము, జంషెడ్ పూరు.
20. చిరంజీవి D. V. J. విఠల్, మైలాపూరు, మద్రాసు.
21. శ్రీవేమల శాస్త్రిగారు, జంషెడ్ పూరు.
22. డాక్టరు K. N. A. సుబ్రహ్మణ్యముగారు, M.H. జంషెడ్ పూరు
23. శ్రీ వైద్యనాథన్ గారు ,,
24. శ్రీ ఓరుగంటి గోపాలముగారు ,,
25. శ్రీ ఉప్పులూరి సోమసుందరశాస్త్రిగారు ,,
26. చిరంజీవి నేతి సుబ్బరాయశాస్త్రి ,,
27. చిరంజీవి మండపాక కృష్ణమూర్తి ,,
28. శ్రీ నిష్ఠల సోమయాజులుగారు ,,
29. శ్రీ ఆంధ్ర నాటక సాహిత్య సంఘము ,,
30. శ్రీ భమిడిపాటి సత్యనారాయణశర్మగారు ,,
31. శ్రీ S. S. రావుగారు ,,
32. శ్రీ రావి వెంకటాచలంగారు ,,
33. చిరంజీవి నైషధం సూర్యకృష్ణ ,,
34. శ్రీ A. V. J. రావుగారు ,,
35. శ్రీ వేదనభట్ల సీతారామయ్యగారు ,,
36. శ్రీ వంకా రామారావుగారు ,,
37. శ్రీ మంత్రవాది రామయ్యగారు ,,
38. శ్రీ గొడవర్తి భాస్కర రామమూర్తిగారు ,,
39. శ్రీ K. రామారావుగారు ,,
40. శ్రీ కాశీభట్ల గంగాధరముగారు ,,
41. శ్రీ చెరువు వెంకట్రామశర్మగారు ,,
42. శ్రీ వేదుల రామారావుగారు ,,
43. శ్రీ చావలి సీతారామయ్యగారు ,,
44. శ్రీ చెన్నూరి నారాయణరావుగారు ,,

45. చిరంజీవి కన్నేపల్లి విజయరామమూర్తి, నాగపూరు.
46. (శ్రీ) K. V. రామమూర్తిగారు జంషెడ్ పూరు
47. (శ్రీ) వర్ఘుల కాళిదాసుగారు ,,
48. (శ్రీ) R. లక్ష్మణమూర్తిగారు ,,
49. (శ్రీ) కోట నరసయ్యగారు ,,
50. (శ్రీ) యడవిల్లి A. నరసింహముగారు ,,

## పోషకులు

51. (శ్రీ) నూతి సూర్యనారాయణగారు జంషెడ్ పూరు
52. (శ్రీ) K. R. ప్రసాద్ గారు టెల్కో ,,
53. (శ్రీ) నోరి లక్ష్మీనరసింహమూర్తిగారు ,,
54. (శ్రీ) కాశీభట్ల వెంకట్రావుగారు ,,
55. (శ్రీ) గౌతమరావుగారు ,,
56. (శ్రీ) బక్షి కృష్ణారావుగారు ,,
57. (శ్రీ) పప్పు వెంకట్రామయ్యగారు మద్రాసు
57. (శ్రీ) గంటి అప్పారావుగారు జంషెడ్ పూరు
58. (శ్రీ) ముదుగంటి నరసింహమూర్తిగారు ,,
59. (శ్రీ) రావి ధర్మారావుగారు ,,
60. (శ్రీ) పేరి ప్రభాకరముగారు ,,
61. (శ్రీ) వెంపరాల రామారావుగారు ,,
62. (శ్రీ) పారుపూడి బంగారుగారు ,,
63. చిరంజీవి ఉపాధ్యాయుల భుక్త ,,
64. (శ్రీ) పులికొలను రాఘవరావుగారు ,,
65. (శ్రీ) A. V. సుబ్రహ్మణ్యముగారు ,,
66. (శ్రీ) మరువాడ సుబ్రహ్మణ్యముగారు ,,
67. K. R. K. రావుగారు, N.M.L. ,,
68. (శ్రీ) A. పేరావధానులుగారు ,, ,,
69. (శ్రీ) T. లక్ష్మణరావుగారు ,, ,,
70. (శ్రీ) P. D. ప్రసాదరావుగారు ,, ,,

| | | | |
|---|---|---|---|
| 71. | (శ్రీ) S. రావుగారు అద్దంకి | | ,, |
| 72. | (శ్రీ) డాక్టరు చంద్రశేఖరుగారు | N.M.L. | జంషెడ్‌పూరు |
| 73. | (శ్రీ) డాక్టరు R. R. K. రావుగారు | ,, | ,, |
| 74. | (శ్రీ) D. S. మూర్తిగారు | ,, | ,, |
| 75. | (శ్రీ) P. R. శాస్త్రిగారు | ,, | ,, |
| 76. | (శ్రీ) T. V. సుబ్రహ్మణ్యముగారు | ,, | ,, |
| 77. | (శ్రీ) V. V. అప్పారావుగారు | ,, | ,, |
| 78. | (శ్రీ) N. సుబ్రహ్మణ్యముగారు | ,, | ,, |
| 79. | (శ్రీ) బక్షీ రామారావుగారు | | ,, |
| 80. | (శ్రీ) తాడేపల్లి సీతామోహన శర్మగారు | | ,, |
| 81. | (శ్రీ) ముక్కవిల్లి సన్యాసయ్యగారు, విజయనగరము. | | |

---

# పండితాభిప్రాయములు

## బ్రహ్మశ్రీ ఘండికోట సుబ్రహ్మణ్యశాస్త్రులవారు వ్రాసిన యభిప్రాయము

ఘనసారగౌరమూర్తిం, చండికయాలంకృతార్ధవామాంగం।
అతికోమలేందుచూడం, వందే నటరాజమీశ్వరం జగతామ్॥

అస్మిన్ సకలపాపాలవాలే కరాళే కలికాలే ప్రాయో న దృశ్యంతే శ్రుతిస్మృత్యుదితాని సత్కర్మాణి. విలుప్తాః సదాచారాః. ఆహారవిహారవ్యవహారవ్యాహారాదిషు ధర్మేతరపథముపగతాఃలోకస్య చిత్తవృత్తయః. నిరంకుశం విహరతి సస్రైణ్యస్తురీయో యుగపురుషః.

ద్వాపరాంతే దేవర్షిర్నారదః నిరీక్ష్య దివ్యదృష్ట్యా భావినీం లోకప్రవృత్తిం, పప్రచ్ఛ పితామహ మిత్థమ్॥

తపోభిః కర్మభిర్హీనే బ్రాహ్మణ్యం కేన వర్తతే।
వదస్వ తపతాం శ్రేష్ఠ! వాత్సల్యాన్మయి విశ్వధృక్॥

అస్య ప్రత్యుత్తరయతిస్మ ఏవం పితామహః.

తపః స్వాధ్యాయహీనోఽపి సర్వయజ్ఞవివర్జితః।
బ్రాహ్మణ్యం శ్రాద్ధసంధ్యాభ్యాం పరం ప్రాప్నోతి వై ద్విజః॥ఇతి

ఏతావన్మాత్రయోరప్యల్పాయాససాధ్యయోర్మహాఫలప్రదయోః శ్రాద్ధసంధ్యయో రనుష్ఠాతారః విరళవిరళా దృశ్యంతే। తేఽపి సంధ్యోపాసనాయామంగాంగిభావవిషయే, అంగానాం పౌర్వాపర్యవిషయే, ఉపాంగానామాచరణే, కుత్ర? కదా? కథ మిత్యాది విషయే చ, సంశయావిష్టమానసాః భవంతి. తాన్ సర్వానపి సంశయాన్ స్మృతీనామేకవాక్యతాసంపాదనేన, దేశాచారాణాం శాఖా వ్యవస్థయా చాపనేతుం,సోమయాజులోపనామకైః

శ్రీవేంకటాచలశాస్త్రివర్యైరేషా పూర్ణాఖ్యవ్యాఖ్యాసముపేతా సంధ్యాతత్త్వసుబోధినీ నిరమాయి.

ఏతే సకలశాస్త్రనిష్ణాతాః శిష్టాచారసంపన్నాః స[illegible]స్వినః యుక్తాః ఆయుక్తాః అలూతాసాః ధర్మకామాశ్చ. జనిరేషాం సోమయాజినామన్వయే. యదద్యాపి బిభ్రతి 'సోమయాజిన' ఇత్యుపాభిధానమ్. హేతుభిరేతైర్ధర్మాధర్మనిరూపణాయాం యదేభిః ప్రతిపాద్యతే, తదవశ్యమాదరణీయమాచరణీయం చ॥

తథాహి=అత్ర ''సంధ్యాకర్మణి సంధ్యాదేవతాభిధ్యానమేవ ప్రధానమంగీతి, అర్ఘ్యప్రక్షేపశ్చ నాంతరీయకావ్యవహితపూర్వాంగమితి, గాయత్రీజపశ్చ అంతరంగభూతావ్యవహితోత్తరాంగమితి, ఇతరాణి చ మార్జనాభ్యుక్షణపాపపురుషదహనసూర్యోపస్థాన[illegible]మస్కారాదీని యథాయథం పూర్వోత్తరాంగాణి భవంతీతి నాము దంగోపాంగాది బలిష్ఠశ్రుతిస్మృతిప్రమాణవచనప్రపంచ[illegible] సుసాధ్య నిర్ణీతం, యచ్చ ముఖ్యగౌణకాలాతిక్రమణప్రాయశ్చిత్తాంగాంగిప్రయోగప్రకారాదికం చ నిర్ణీతం తత్సర్వం సర్వథా ప్రామాణిక మిత్యత్ర న సంశయలేశోఽపి.

అద్య ప్రతిదివసముత్పద్యంతే నవీనాః పంచసహస్రశః గ్రంథాః నానాభాషాసు. తేషామవలోకనేన పఠనేనచ నైహికం నాముష్మికంచ సుఖమీషదపి. ప్రత్యుత లోకమపథే ప్రవర్తయితుమేవ పర్యాప్నువంతి. పశ్యామః ప్రతిగ్రామం ప్రతిపల్లి చ తాదృశానామనాచారాధర్మప్రబోధకానాం కల్పితకథానాం మహాకాయానాం గ్రంథానామాలయాన్. హంత! కలేర్మహిమా! క్వచిత్ క్వచిత్ సంస్కృతభాషాయామప్యావిర్భవంతి, తథాపి తే నాలమభ్యుదయాయ. నవా నిశ్శ్రేయసాయ. నతథా ప్రాచీనైర్మహర్షిభిర్విరచితాః. తే తావదాచంద్రార్కం లోకస్య సన్మార్గప్రదర్శకాః అభ్యుదయనిశ్శ్రేయసహేతవశ్చ. ఏవంజాతీయకః ప్రస్తుతోఽయం గ్రంథరాజః. ధన్యా అస్య రచయితారః. ద్రష్టారశ్చ ధన్యాః.

ఏవమేతే సుబ్రశవాంసః ధర్మబ్రహ్మప్రబోధకాన్ బహూన్
గ్రంథాన్నిర్మాయ లోకస్య క్షేమంకరా భూత్వా చిరం జీవంతు.

ఇత్యాశాస్తే
ఘుండికోటోపనామకః సుబ్రహ్మణ్యశాస్త్రీ
స్వస్త్యస్తు
తణుకు పశ్చిమగోదావరీమండలం
ఆంధ్రప్రదేశః

# పైదానికి తెనుగున అనువాదము

"ఘనసారగౌరమూర్తిం చండికయాఽలంకృతార్ధవామాంగం।
అతికోమలేందుచూడం వందే నటరాజమీశ్వరం జగతామ్॥

సకలపాపాలవాలమై భయంకరమగు నీ కలికాలమున శ్రుతిస్మృత్యుక్తములగు సత్కర్మలు తరచుగ కనబడకున్నవి. సదాచారములు లోపించినవి. ఆహారము, విహారము, వ్యవహారవ్యాహారములందు లోకుల చిత్తవృత్తులు అధర్మమార్గమున పడినవి. నాలుగవ యుగపురుషుడు తన సైన్యముతో అడ్డులేకుండ విహరించుచున్నాడు.

ద్వాపరయుగము చివర దేవర్షియగు నారదుడు దివ్యదృష్టిచేత రాబోవు లోకపురీతిని తెలిసికొని, తండ్రియగు బ్రహ్మ నిట్లు అడిగెను. "తపోవంతులలో శ్రేష్ఠుడవయినట్టియు, విశ్వమును రక్షించునో తండ్రీ! తపోహీనులై నట్టియు, కర్మహీనులైన బ్రాహ్మణులయందు బ్రాహ్మణ్యమెట్లు నిలుచునో, నాయందలి వాత్సల్యముచే చెప్పుము.

అందుకు బ్రహ్మ యిట్లు బదులిడెను.

"తపఃస్వాధ్యాయములు లేకపోయినను, యజ్ఞములను చేయనప్పటికిని, ద్విజుడు శ్రాద్ధము పెట్టుటచేతను, సంధ్యాదేవతను పాసించుటచేతనున్నూ తన బ్రాహ్మణ్యమును రక్షించుకొనగలడు.

అని. కాని అధికాయాసము లేకుండ నిర్వర్తించదగినవియు,

మహాఫలము నిచ్చునట్టి ఈ శ్రాద్ధసంధ్యోపాసనములనైనను అను
ష్ఠించువారు ఇప్పుడు చాల పలచనగ కనుబడుచున్నారు. అట్టి వారు
కూడ సంధ్యావందనమున ఏవి యంగములో ఏది యంగియో తెలియ
కను, ఏయంగములను ముందు చేయవలెనో, ఏయంగములను పిదప
చేయవలెనో తెలియక, ఉపాంగములను ఎక్కడ, ఎప్పుడు ఎట్లు
చేయవలెనో యను విషయమున సంశయగ్రస్తులై యున్నారు. అట్టి
సంశయముల నన్నింటిని, స్మృతులను ఏకవాక్యతను సంపాదించి
దేశాచారములను శాఖావ్యవస్థచేత సరిపరిచి నివర్తింపజేసి, బ్రహ్మ
శ్రీ సోమయాజుల వేంకటాచలశాస్త్రిగారు పూర్ణాఖ్యవ్యాఖ్యతో
కూడిన ఈ సంధ్యాతత్వసుబోధినీగ్రంథమును నిర్మించిరి.

వీరు సకలశాస్త్రనిష్ణాతులు, శిష్టాచారసంపన్నులు, సమద
ర్శులు. యుక్తులు, ఆయుక్తులు, [illegible], ధర్మైకాముకులును. సోమ
యాజులయొక్క వంశమున వీరి జన్మ. కావుననే వీరిప్పటికిని "సోమ
యాజి" యను నుపనామమును ధరించుచున్నారు.

ధర్మాధర్మనిరూపణయందు వీరు చెప్పిన దంతయును ఆచ
రింపతగినదియు, ఆచరింపతగినదియును అనుటకు [illegible]
చాలును.

ఎట్లనగా — సంధ్యాకర్మయందు సంధ్యాదేవతోపాసనమే
ప్రధానము, అంగి యనియు, అర్ఘ్యప్రక్షేపము, తప్పని సరియగు అవ్య
హితపూర్వాంగమనియు, గాయత్రీజపము అంతరంగమగు నుత్త
రాంగమనియు మిగిలిన మార్జనము, అభ్యుక్షణము పాపపురుషవహా
నము, సూర్యోపస్థానము, దిఙ్నమస్కారము మొదలగునవి యథా
యథముగ పూర్వోత్తరాంగములగుననియును, అంగోపాంగముల
నన్నింటిని శ్రుతిస్మృతిప్రమాణవచనములను ప్రదర్శించుచు సాధించి
నిర్ణయించిరి. ముఖ్యగౌణకాలాతిక్రమము తర్వాతనే ప్రాయశ్చిత్త
ప్రదానమనియును, ప్రమాణప్రదర్శనపురస్సరముగ నిర్ణయించిరి.

ఇది యంతయును అన్నివిధములుగను ప్రామాణికమే యనుటలో సంశయలేశము గూడ లేదు.

ప్రస్తుతసమయమున ప్రతిదినమునందును వేలకొలది నూతన గ్రంథములు నానాభాషలయందును పుట్టుచున్నవి. ఆ గ్రంథములను చూచుటచేతనుగాని చదువుటచేతనుగాని ఐహికసుఖలేశముగాని ఆముష్మికసుఖలేశముగాని కలుగదు. మీదు మిక్కిలి, లోకమును చెడుమార్గమున నడిపించుటకు మిక్కిలి యుపయోగపడుచున్నవి. అన్యాయమును, అనాచారమును అధర్మమును ప్రబోధించునట్టి, కల్పితకథలతోనిండిన బృహద్గ్రంథములయొక్క గ్రంథాలయములు ప్రతిపల్లెయందును, ప్రతిగ్రామమునందును విలసిల్లుచున్నవి. ఆహా! ఇది కలిపురుషునిమహిమ! అక్కడక్కడ సంస్కృతభాషయందుకూడ కొన్నిగ్రంథములు పుట్టుచున్నవి. కాని యవి అభ్యుదయమునకుగాని నిఃశ్రేయసమునకుగాని చాలవు.

మనప్రాచీను లిట్టిగ్రంథములను రచింపలేదు. వారు రచించిన గ్రంథములు ఆచంద్రార్కము లోకమునకు సన్మార్గప్రదర్శకములై అభ్యుదయ నిశ్శ్రేయసములకు కారణములగుచున్నవి. ఈ జాతికి చెందినదీ సంధ్యాతత్త్వసుబోధినీగ్రంథము. ఈ గ్రంథరచయితలు ధన్యులు. ఈ గ్రంథమును పరిశీలించువారును ధన్యులు.

ఇట్లు వీరు సుశ్రవాంసులై ధర్మమును బ్రహ్మమును ప్రబోధించునట్టి బహుగ్రంథముల నిర్మించి లోకక్షేమంకరులై చిరకాలము జీవింతురు గాత!

ఇట్లాశించుచున్నది
ఘండికోట సుబ్రహ్మణ్యశాస్త్రి,
స్వస్త్యస్తు.
తణుకు
పశ్చిమగోదావరీమండలం,
ఆంధ్రప్రదేశః.

## శ్రీ కుంభఘోణం అగ్నిహోత్రం రామానుజ తాతాచార్యులవారు వ్రాసిన యభిప్రాయము

బ్రహ్మశ్రీయుతైః సోమయాజులీయ వేంకటాచలశాస్త్రి మహోదయైః విరచితోఽయం సంధ్యోపాసనవిషయకః సంధ్యాతత్వసుబోధినీనామకో గ్రంథః ద్వితీయవారం సుముద్రాప్యతే ఉపకారాయ కల్పతే. అస్య గ్రంథస్య, ప్రధానస్యాంగినః సంధ్యాకర్మణః, అభిధ్యానరూపోపాసనాత్మకత్వనిరూపణే సంపూర్ణం నైర్భర్యం వర్తతే. యద్యపి తైత్తిరీయబ్రాహ్మణైతరేయబ్రాహ్మణ - షడ్వింశబ్రాహ్మణాదిషు ప్రధానస్య సంధ్యాకర్మణ ఉపాసనస్య కేవలం [illegible] ప్రతిపాదితాః, అథాపి అంగభూతాః కేచనాంశాః స్మృతిషు సవిస్తరతయా ఉపలభ్యంతే. తన్మూలభూతస్య శ్రుతి[illegible]।

సంధ్యోపాసనం సంధ్యాదేవతాభిధ్యానాత్మక[illegible] శ్రుతిస్మృతిప్రమాణవచనప్రదర్శనపురస్సరం సమ్యక్ప్రపంచ్య ఇతి శేషాం చార్ఘ్యప్రక్షేపగాయత్రీజపాదీనాం తదంగత్వంచ సమ్యక్ప్రదర్శితమేభిః।

ఇదానీం సంధ్యాకర్మ కుర్వాణాః సర్వేపి "ప్రాతస్సంధ్యాముపాసిష్యే" ఇతి సంకల్పం కుర్వంతి. కింతు సంధ్యాశబ్దేన కిముపాసతే ఇతి తు స్పష్టం న జ్ఞాయతే॥

అత్ర "అసావాదిత్యో బ్రహ్మ+సోఽహమస్మి" ఇతి బ్రహ్మోపాసనం క్రియతే, తద్బ్రహ్మోపాసనమేవేత్యనేన గ్రంథకర్త్రా "యత్సంధ్యాముపాసతే బ్రహ్మైవ తదుపాసతే" ఇతి వాచనః శ్రుతేరపి వైష్ణవస్మృతిముక్తావళేరుదాహృతా స్పృశ్యతే॥

అనేన గ్రంథకర్త్రా సంధ్యోపాసనస్వరూపనిరూపణార్థం యావంతో గ్రంథాః దృష్టాః, తావంతో గ్రంథాః ఏతావతా కాలేన న కేనాప్యన్యేన దృష్టా ఇతి సుధీరం వక్తుం శక్యతే।

అస్య గ్రంథస్య దర్శనేన బహవో విషయా ఇతః పూర్వం సర్వైరజ్ఞాతాః జ్ఞాతా భవంతి. అస్య గ్రంథస్య పఠనేన సర్వోఽపి సంధ్యాదేవతోపాసనస్వరూపం సమ్యక్ జ్ఞాస్యతీతి మమాభిప్రాయః.

అఖిలభారతదేశే సంధ్యావందనసంబంధిగ్రంథేషు అయమేవ శిరః స్థానీయో వర్తతే.

అతో దీర్ఘదీర్ఘతమకాలాత్ విచ్ఛిన్నసంప్రదాయకస్య సంధ్యాదేవతోపాసనస్య పునరుద్ధర్తుః ఏతాదృశగ్రంథకర్తుః శ్రీవేంకటాచలశాస్త్రిమహోదయస్య సర్వేఽపి భారతదేశీయాః ద్విజాః అధమర్ణతాం వహంతి.

ఇత్థమ్
అగ్నిహోత్రం రామానుజతాతాచార్యః
జంపేట్టపురం తాత్కాలికస్థానం
సాధారణ శ్రావణకృష్ణ ద్వాదశీ 29–7–1970

## పై దానికి తెనుగు అనువాదము

బ్రహ్మశ్రీయుతులైన సోమయాజుల వేంకటాచలశాస్త్రి మహోదయులచేత రచింపబడిన సంధ్యోపాసనవిషయకమగు నీ గ్రంథము ద్విజులకు మహోపకారము చేయునది. ప్రధానమైనదియు అంగమైన సంధ్యాకర్మ అభిధ్యానరూపమైన సంధ్యోపాసనమే యని నిరూపించుటయందే ఈ గ్రంథమునకు సంపూర్ణదృఢాభిప్రాయము. తైత్తిరీయబ్రాహ్మణము, ఐతరేయబ్రాహ్మణము షడ్వింశబ్రాహ్మణము మొదలగు వేదభాగములందు ప్రధానసంధ్యాకర్మయగు ఉపాసనను సంబంధించి కొన్ని ముఖ్యాంశములు చెప్పబడినవైనప్పటికిని అంగములగు కొన్ని యంశములు స్మృతులందే పూర్తిగ లభించుచున్నవి. ఏలనన — వాటికి మూలమైన వేదభాగము ఖిలమైనదగుటచేత.

సంధ్యోపాసనమనగ సంధ్యాదేవతాభిధ్యానరూపమని బలిష్ఠమగు శ్రుతిస్మృతి ప్రమాణవచనపుంజముగ బాగుగ నిరూపించి, ఇతరమైన అర్ఘ్యప్రక్షేపగాయత్రీజపాదులు ఉపాసనాంగములే యని వీరు సప్రమాణముగ చక్కగ నిస్సందిగ్ధముగ నిరూపించిరి.

ఇప్పుడు సంధ్యావందనమునాచరించువారందరును "ప్రాత స్సంధ్యాముపాసిష్యే" అని సంకల్పమును చేయుచున్నారు. కాని వారు సంధ్యనుగా దేనినుపాసించుచున్నారో స్పష్టముగ తెలియకున్నది.

సంధ్యావందనమున "అసావాదిత్యో బ్రహ్మ+సో౽హమస్మి" యని చేయబడుచున్న "సంధ్యోపాసనము బ్రహ్మోపాసనమే" యని "యత్సంధ్యాముపాసతే బ్రహ్మైవ తదుపాసతే" యను నొక శ్రుతి వచనమును మద్రాసు అడయారు గ్రంథాలయమందలి వైష్ణవస్మృతి ముక్తావళినుండి ఉదహరించిరి.

ఈ గ్రంథకర్త సంధ్యోపాసనస్వరూపనిరూపణముకొరకు ఎన్ని గ్రంథములను పరిశీలించిరో, అన్ని గ్రంథములను ఇంతవరకు నెవ్వరును చూచియుండరని ధైర్యముగ చెప్పగలను.

ఈ గ్రంథమును చూచినవారు ఇంతకుముందు ఎవరికిని తెలియని యనేకవిషయములను తెలిసికొనగలరు. ఈ గ్రంథమును పరిశీలించిన వారందరును సంధ్యా దేవతోపాసనస్వరూపమును చక్కగ తెలిసికొనగలరని నా యభిప్రాయము.

భారతదేశమునందలి సంధ్యావందనసంబంధిగ్రంథములలో ఇదియే శిరఃస్థానీయము అగుచున్నది. అందువలన దీర్ఘదీర్ఘతమ కాలమునుండి సంప్రదాయమునుండి విచ్ఛిన్నమై యనుష్ఠానమునుండి జారిపోయిన సంధ్యాదేవతోపాసనమును పునరుద్ధరించిన ఈ గ్రంథ కర్తలగు సోమయాజుల వేంకటాచలశాస్త్రివర్యులకు భారతదేశీయ బ్రాహ్మణులందరును ఋణపడియున్నారు.

ఇట్లు

అగ్నిహోత్రం రామానుజతాతాచార్యులు
జంపేడ్పురము తాత్కాలిక స్థానము
సాధారణశ్రావణకృష్ణద్వాదశీ 29-7-1970

# బ్రహ్మశ్రీ కె. బాలసుబ్రహ్మణ్య శాస్త్రిగారు వ్రాసిన అభిప్రాయము

శ్రీమద్భిః పండితతల్లజైః బహూనామధ్యాపనేన పరినిష్ఠిత జ్ఞానవైశద్యైః సదాచారతత్పరైః శివభాగవతైః సుగృహీతనామధేయైః అస్మాకం బహోః కాలాత్పరిచితైః శ్రీసోమయాజులోపనామక వేంకటాచలశాస్త్రిమహోదయైః ద్విజోపకారాయ మహతా పరిశ్రమేణ విరచితా సంధ్యాతత్త్వసుబోధినీనామ్నా సాంగ సంధ్యోపాసనపద్ధతిః విదుషామతీవ హృదయంగమా, రమణీయశైలీ చ అస్య జనస్య మానసమతీవ రంజయతి. అంగిభూతసంధ్యా దేవతోపాసనాపేక్షయా అర్ఘ్యప్రక్షేపస్య గాయత్రీజపస్య చ అంగతాయాః శ్రుతిస్మృతిప్రమాణవచనైః సిద్ధాంతితత్వాత్, శక్తౌ ప్రధాన భూతా ఉపాసనా అర్ఘ్యప్రక్షేపగాయత్రీజపాదిపూర్వోత్తరాంగ యుతా అనుష్ఠేయా. ధూమశకటాదిగమనసమయే కాలే సాంగ సంధ్యోపాసనస్య కర్తుమశక్యత్వాత్ "సర్వాఽశక్త్యధికరణ" న్యాయమనుసృత్య ప్రధానభూతా సంధ్యాదేవ్యాః మానసీ ఉపాసనా కేవలా అవశ్యం కర్తవ్యా. తేన చ ప్రాయశ్చిత్తీ న భవేత్. ఏవం కుర్వంతః సర్వే గృహస్థాః వటవశ్చ సుఖిన ఇష్టార్థలాభముదితాశ్చ భూయాసురితి బ్రహ్మవిష్ణుశంకరోపాసితాం సంధ్యాదేవీం సంప్రార్థయే. ఇతి శమ్.

ఇత్థమ్

సాహిత్యశిరోమణిః, పూర్వమీమాంసాశిరోమణిః,
వ్యాకరణశిరోమణిః, పండితరాజః,
మీమాంసాలంకారః, ఉభయమీమాంసానిపుణః,
మహోపదేశకః, కులపతిః, విద్యారత్నం
మీమాంసాకేసరీ
కై. బాలసుబ్రహ్మణ్యశాస్త్రీ
Retired principal. Madras Sanskrit College,
Mylapore, Madras. 10–4–1972

## పై దానికి తెలుగు అనువాదము

బ్రహ్మశ్రీయుతులు పండితతల్లజులు చాలమందికి చదువు చెప్పుటచేత పరినిష్ఠితవిశదజ్ఞానసంపన్నులు సదాచారసంపన్నులు శివభాగవతులు సుగృహీతనామధేయులు నాకు చాలకాలమునుండి సుపరిచితులునైన శ్రీ సోమయాజుల వెంకటాచలశాస్త్రిమహోదయులు ద్విజలోకోపకారముకొరకు మిక్కిలి పరిశ్రమ చేసి వ్రాసిన సంధ్యాతత్త్వసుబోధినీనామకమగు సాంగసంధ్యోపాసనపద్ధతిగ్రంథము విద్వాంసులకు అత్యంతహృదయంగమమైనదై రమణీయశైలిగలదై నాయొక్క మానసమును మిక్కిలి రంజింపజేయుచున్నది.

అంగియగు సంధ్యోపాసనకు అర్ఘ్యప్రక్షేపగాయత్రీజపములు అంగములే యని శ్రుతిస్మృతిప్రమాణవచనములచేత సిద్ధాంతము చేయబడుటవలన, శక్తియున్నప్పుడు ప్రధానాంగములతో సంధ్యాదేవతోపాసనమును అర్ఘ్యప్రక్షేపగాయత్రీజపాదిపూర్వోత్తరాంగములతో సంపూర్ణముగ అనుష్ఠింపవలెను. రైలు, విమానము మొదలగు వానియందు ప్రయాణము చేయునప్పుడు సకాలమున సాంగసంధ్యావందనమును చేయుటకు శక్యము కాదుగాన పూర్వమీమాంసా శాస్త్రమునందలి "సర్వశక్త్యధికరణ" న్యాయము ననుసరించి కేవలము ఒక్క మానసికమగు సంధ్యాదేవ్యుపాసనమును మాత్రము తప్పక చేయవలెను. అందుచేత ప్రాయశ్చిత్తి కాడు.

ఇట్లు ఆచరించుచు గృహస్థులును బ్రహ్మచారులును [illegible] సుఖవంతులు ఇష్టార్థలాభముచేత ముదితులు అగుదురుగాక! అని బ్రహ్మవిష్ణుశంకరులచేత ఉపాసింపబడు సంధ్యాదేవిని ప్రార్థించుచున్నాను. శమ్.

ఇట్లు

సాహిత్యశిరోమణి, పూర్వమీమాంసాశిరోమణి,
వ్యాకరణశిరోమణి, పండితరాజ, మీమాంసా[illegible].
ఉభయమీమాంసాప్రవీణ, మహోపదేశక, కులపతి,
విద్యారత్న, మీమాంసాకేసరి.
కై. బాలసుబ్రహ్మణ్యశిరోమణి
**Retired principal Madras sanskrit Collage**
**Mylapore, Madras. 10-4-1972**

# బ్రహ్మశ్రీ కొల్లూరు సోమశేఖరశాస్త్రిగారు వ్రాసిన యభిప్రాయము

బ్రహ్మశ్రీ సోమయాజుల వెంకటాచలశాస్త్రివర్యైర్విర చితా సంధ్యాతత్త్వసుబోధినీ మయా సావధానం, సవిమర్శంచ పరి శీలితా. అస్యాం, సంధ్యాదేవతోపాసనస్య ప్రాధాన్యమర్ఘ్యప్రక్షేప గాయత్రీజపాదీనామంగత్వం చ శ్రుతిస్మృతిప్రమాణవచనప్రవ ర్శనపురస్సరం సమ్యఙ్నిరూపితమ్. సంధ్యాదేవతాయాః గాయత్రీ దేవతాయాశ్చ స్వరూపభేదోఽపి సమ్యఙ్నిరూపితః, అయంచ పంథాః నవీనతయా భాసమానోఽపి శ్రుతిసమ్మతః, కాలప్రవాహే విచ్ఛిన్నః, "మహతా కాలేన వినష్టో యోగః భగవతా శ్రీకృష్ణేన పునర్యథా ప్రకాశితః, తథా మయా వేదశాస్త్రాణి పరిశీల్య, పునఃప్రకాశిత" ఇతి యదుక్తం శాస్త్రివర్యైస్తదతీవ సుశ్లిష్టం వచనమితి మే ప్రతి భాతి, తథైవాహం దృఢం విశ్వసిమి, ఇతి శమ్.

ఇత్థమ్

కొల్లూరు సోమశేఖరశాస్త్రీ

చతుస్తంత్రీ, దర్శన భూషణః,కులపతిః, రాష్ట్రపతి సంమానితః, బృందావనం, వైటుఫీల్డు. 4-5-'72.

## పై దానికి తెనుగు అనువాదము

బ్రహ్మశ్రీ సోమయాజుల వెంకటాచలశాస్త్రివర్యులు రచిం చిన సంధ్యాతత్త్వసుబోధినీగ్రంథమును నేను సావధానముగను సవి మర్శముగను పరిశీలించితిని. ఈ గ్రంథమున సంధ్యాదేవతోపాసనము ప్రధానమనియు, అర్ఘ్యప్రక్షేపము గాయత్రీజపము మొదలగునవి యంగములనియును శ్రుతిస్మృతిప్రమాణపురస్సరముగ చక్కగ నిరూపించిరి. సంధ్యాదేవతకును గాయత్రీదేవతకును స్వరూపభేద మునుగూడ చక్కగ నిరూపించిరి. ఈ మార్గము క్రొత్తగనున్నట్లు తోచినను, శ్రుతి స్మృతి సమ్మతమైనదై, కాలప్రవాహమున నష

మైన దీనిని "దీర్ఘకాలమున నష్టమైన యోగమును, భగవానుడగు శ్రీకృష్ణపరమాత్మ మరల ప్రకాశింపజేసినట్లు, నేను చాలకాలము శాస్త్రములను పరిశీలించి మరల ప్రకాశింపజేసితిని" అని శ్రీ శాస్త్రి గారు వ్రాసిన మాట చక్కగ, నతుకుకున్న మాటయని నాకు తోచుచున్నది. నేనట్లే దృఢముగ నమ్ముచున్నాను. శుభమస్తు.

ఇట్లు,
దర్శనభూషణ, కులపతి, రాష్ట్రపతిసమ్మానిత
చతుస్తంత్రీ, కొల్లూరు సోమశేఖరశాస్త్రి
బృందావనం, నైటుఫీల్డు 4-5-1972

ఓమ్
శ్రీరస్తు

## బ్రహ్మశ్రీ రాణీ నరసింహశాస్త్రిలవారి అభిప్రాయము

బ్రహ్మశ్రీ సోమయాజులోపనామక వేంకటాచలశాస్త్రిభిః సర్వవిద్భై రధికారిభిరవశ్యకర్తవ్యసంధ్యావందనవిషయే ప్రాచీనైస్సంధ్యాభాష్యకారైరస్పృష్టా బహవో విషయాః సుస్పష్టం సప్రమాణం చ నిరూపితాః. అయం చ సంధ్యాతత్త్వసుబోధినీవ్యాఖ్యాగ్రంథః ఆమూలచూడం మయా సమ్యగవలోకితః. ఉదయనాచార్య కృతన్యాయకుసుమాంజలివత్ అస్మిన్ ప్రామాణికే గ్రంథే స్వకృతానాం శ్లోకానాం తై రేవ సమీచీనం భాష్యమారచితం.

ఆచమనత్రైవిధ్యనిరూపణం, విభాగేన ముఖ్యగౌణకాలనిర్ణయః, "గౌణోఽప్యేతాదృశో మతః" ఇత్యభియుక్తోక్త్యా గౌణకాలాతిక్రమ ఏవ గౌణకాలాతిక్రమప్రాయశ్చిత్తనిర్ణయః, అంగానాం పృథక్ సంకల్పానావశ్యకతానిరూపణం, తాంత్రికసంప్రదాయసిద్ధన్యాసముద్రాశాపవిమోచనాదీనాం వైదికానామనావశ్యకతానిరూపణం, ఇత్యాదయో బహవో విషయాః బహుగ్రంథపర్యాలోకనేన సప్రమాణం సమ్యఙ్నిరూపితాః. అపిచ సంధ్యావందనే సంధ్యాదేవతోపాసనాయాః ప్రాధాన్యం, అర్ఘ్యప్రక్షేపగాయత్రీజపాదీనామంగత్వ

మిత్యంశః సప్రమాణం సమ్యక్ సిద్ధాంతితః. ఉపాసనాశక్తౌ కర్తవ్య నిర్ణయశ్చ సుమనోహరం సప్రమాణం నిరూపితః.

న కేవలం సంధ్యావందనసంప్రదాయ ఏవ, అపి తు ఆంధ్ర దేశీయపండితైరనుష్ఠీయమానార్ద్రవస్త్రధారణవిషయే సమీచీనో నిర్ణయః సప్రమాణం కృతః. కిం బహూక్త్యా? ఏతద్గ్రంథసమవలోక నేన మమ అమందానందః సంజాతః. అత ఏవేషామేతాదృశేన మహోపకారేణ పండితలోకః, న కేవలం పండితలోకః, ఆస్తికలోక స్సర్వోఽపి ఋణీ సంజాత ఇత్యత్ర న కోఽప్యతిశయః॥

ఇత్థమ్
రాణ్యుపనామక నరసింహశాస్త్రీ,
న్యాయాచార్యః, వేదాంతశిరోమణిః,
సంస్కృతకళాశాలాప్రధానాధ్యక్షః
మోడేకుర్రు, తూర్పు గోదావరిజిల్లా.

## పై దానికి తెనుగు అనువాదము

బ్రహ్మశ్రీ సోమయాజుల వేంకటాచలశాస్త్రిలవారు అన్ని విధములైన అధికారులచేతను తప్పక చేయదగు సంధ్యావందన విషయమున ప్రాచీనసంధ్యాభాష్యకారులు స్పృశించని అనేకవిషయ ములను స్పష్టముగను సప్రమాణముగను నిరూపించిరి. సంధ్యాతత్వ సుబోధినీగ్రంథమును తొలినుండి తుదవరకును పూర్తిగ నేను చక్కగ పరిశీలించితిని.

ఉదయనాచార్యులవారు తాము వ్రాసిన న్యాయకుసుమాంజ లికి తామే చక్కని భాష్యమును రచించినట్లు ఇట్టి ప్రామాణికగ్రంథ మునందు తాము రచించిన శ్లోకములకు తామే చక్కని భాష్యమును రచించినారు.

ఈ గ్రంథమున త్రివిధాచమననిరూపణము. ప్రత్యేకముగ ముఖ్యగౌణకాలనిర్ణయము, "గౌణోఽప్యేతాదృశో మతః" గౌణ కాలము కూడ ముఖ్యకాలతుల్యమే అనెడు అభియుక్తులవచనాను

సారముగ గౌణకాలాతిక్రమము తర్వాతనే కాలాతిక్రమప్రాయశ్చిత్తము చేయవలెనను నిర్ణయము, అంగములకు ప్రత్యేకముగ సంకల్పమనావశ్యకమని నిరూపించుట, తాంత్రికసంధ్యావందనమున చేయబడు న్యాసముద్రాశాపవిమోచనాదులు వైదికసంధ్యావందనమున అనావశ్యకమని నిరూపించుట, ఈ మొదలగు చాల విషయములు బహుగ్రంథపర్యాలోకనము చేసి సప్రమాణముగ నిరూపింపబడినవి.

ఇంతియే కాదు. సంధ్యావందనమున సంధ్యాదేవతోపాసనమే ప్రధానము అంగి. అర్ఘ్యప్రదానగాయత్రీజపాదులంగములు అను ముఖ్యవిషయము సప్రమాణముగ సిద్ధాంతీకరింపబడినది. ఉపాసన చేయ శక్తిలేనివారికి కర్తవ్యనిర్ణయము మిక్కిలి మనోహరముగను సప్రమాణముగను నిరూపింపబడినది.

కేవల సంధ్యావందన సంప్రదాయమునే గాక ఆంధ్రదేశమున శిష్టులు వైదికకర్మను అనుష్ఠించుకాలమున [illegible] [illegible] సంప్రదాయమును గూర్చిగూడ చక్కని నిర్ణయమును సప్రమాణముగ నిరూపించిరి. వేయిమాటలేల? ఈ గ్రంథమును పరిశీలించిన నాటనే నాకు అమందానందము కలిగినది. కావున ఇంతటి మహోపకారమును చేసిన వీరికి పండితలోకము, కాదు, కాదు. ఆస్తికలోకమంతయును ఋణపడి యున్నదనుట అతిశయోక్తి కాదు.

ఇట్లు

న్యాయాచార్య, వేదాంతశిరోమణి,
సంస్కృతకళాశాలా ప్రధానాధ్యక్ష,
రాణి నరసింహశాస్త్రి,
మోడేకుర్రు, తూర్పుగోదావరి జిల్లా.

## బ్రహ్మశ్రీ మద్దులపల్లి మాణిక్యశాస్త్రులవారి అభిప్రాయము

శ్రీమద్భిః సోమయాజులోపనామక వేంకటాచలశాస్త్రి మహాశయైః అత్యంతపరమార్థప్రధానసంధ్యావందనతత్త్వప్రతిపాద యుమయా విరచితమిదం, తాత్పర్యబోధినీవ్యాఖ్యాసమలంకృతం,

సంధ్యాతత్త్వసుబోధిన్యాఖ్యం గ్రంథరత్నం, ఏకాగ్రచేతసా గుణ దోషపరిశీలనపురస్సరం, తత్త్వజిజ్ఞాసునా మయా ఆమూలచూడ మవలోకితం.

అస్మిన్నల్పపరిమాణే శబ్దతః, అర్థతస్తు మహాగ్రంథే సంధ్యో పాసనోపయుక్తాః, అనుష్ఠాతృభిరపేక్షణీయాః వేద్యాశ్చ యావంతః స్పష్టముపలభ్యంత ఇతి పరమం ప్రమోదమనుభవామీత్యత్ర నాఽతి శయోక్తిలేశోఽపి.

శ్లో॥ "సంధ్యాముపాసతే యే తు సతతం సంశితవ్రతాః।
విధూతపాపాస్తే యాంతి బ్రహ్మలోకమనామయమ్॥

ఇత్యేతద్వచనముపలభ్యతే. తత్ర సంధ్యాస్వరూపం ఉపాసనా స్వరూపం తయోరైక్యలక్షణ్యం అనుష్ఠానరీతిం అన్యానపి విషయాన్ అజానంత ఏవ బహవః నిమీల్య అనుతిష్ఠంతీతి మమాశయః.

ఏవం స్థితే, శాస్త్రివర్యైః స్నానమారభ్య పురాణస్మృత్యా చమనాదిస్వరూపం బహుప్రమాణప్రదర్శనపూర్వకమపసిద్ధాంత విష యాన్ నిరస్య అపూర్వవిషయాః బహవః సంధ్యాభాష్యాద్యర్థజ్ఞానా నివర్త్యసంశయనివర్తకాః నివేశితాః అస్మిన్ గ్రంథే।

కిం బహునా? ఏతద్గ్రంథార్థపరిజ్ఞానేన సర్వమావశ్యకం పరి జ్ఞాతం భవతి. అనుష్ఠానోపయుక్తం సంధ్యోపాసనం నిర్గుణోపాసనం అహంగ్రహోపాసనంచేతి సమ్యక్ప్రత్యపాది. అతః సంధ్యానుష్ఠాతృభిః ఆస్తికైః సర్వైరపి కలికాలే ముముక్షుభిరిదం గ్రంథరత్నం అవశ్యం గ్రాహ్యమవలోకనీయం, తదర్థజాతమవశ్యం జ్ఞేయం, తదనుసారేణ అవశ్యమనుష్ఠేయం చేతి,

నివేదయితా
మద్దులపల్లి మాణిక్యశాస్త్రీ,
మద్దులపల్లివారివీధి, విజయవాడ. 25-1-1978

# దీనికి తెనుగు అనువాదము

బ్రహ్మశ్రీయుతులైన సోమయాజుల వేంకటాచలశాస్త్రి మహాశయులు అత్యంతపరమార్థప్రధానమైన సంధ్యావందనతత్త్వమును వివరింపదలచినవారై, తామే రచించిన తాత్పర్యబోధిని వ్యాఖ్యానముతో శ్లోకరూపమగు సంధ్యాతత్త్వసుబోధినీనామక గ్రంథరత్నమును విరచించిరి.

నేను ఏకాగ్రమగు మనస్సుతో గుణదోషపరిశీలనపూర్వముగ తత్త్వజిజ్ఞాసువనై ఈ గ్రంథరత్నమును ఆమూలచూడముగ పరిశీలించితిని.

శబ్దరూపమునందు [పుస్తక రూపములో] చిన్నదైనను అర్థరూపమున మహోత్కృష్టమగు ఈ గ్రంథమునందు సంధ్యోపాసనోపయుక్తములైనట్టియు అనుష్ఠాతలచేత అపేక్షింపదగినట్టియు నిక్క తెలిసికొనదగినట్టి విషయములన్నియును లభించుచున్నవి యనిన, నేను పరమప్రమోదము ననుభవించుచున్నా ననుటలో అతిశయోక్తిలేశము గూడ లేదు.

శ్లో॥ సంధ్యాముపాసతే యే తు సతతం సంశితవ్రతాః।
విధూతపాపాస్తే యాంతి బ్రహ్మలోకమనామయమ్॥

అను వచనము లభించుచున్నది. దీనియర్థము. ఎవరు తీవ్రతమమైన శ్రద్ధోత్సాహములతో సంధ్యోపాసనను చేయుదురో, వారు ఈ లోకముననే ఉపాసనమహిమచే నిరూఢబ్రహ్మజ్ఞానులై సమస్త పాపములను "అశ్వ ఇవ లోమాని విధూయ" అని శ్రుతి చెప్పినట్లు దులిపివేసికొని నిరామయమగు బ్రహ్మలోకమును పొందుదురు. అని. కాని, చాలమంది సంధ్యాస్వరూపమును గాని సంధ్యోపాసనస్వరూపమును గాని, దానిననుష్ఠించు రీతినిగాని ఇంకను ముఖ్యమగు అనేక విషయములను తెలిసికొనక కండ్లు మూసికొనియే ఆచరించుచున్నారని నా యాశయము.

ఇది ఇట్లుండగా, శాస్త్రివర్యులు స్నానమునుండి ఆరంభించి పురాణాచమన స్మృత్యాచమనాదుల స్వరూపమును బహుప్రమాణ

వచనములను కనబరచి తెలుపుచు అపసిద్ధాంతవిషయములను నిర సించుచు సంధ్యాభాష్యపఠనమువలనగూడ తీరని సంశయములను పోగొట్టునట్టి చాల చాల అపూర్వవిషయములను ఈ గ్రంథమున వ్రాసినారు.

పలు మాటలేల? ఈ గ్రంథమును చదివి అర్థమును తెలిసి కొనిన యెడల ఆవశ్యకమైన చాలవిషయములు పూర్తిగ తెలిసిన వగును. అనుష్ఠానమునకు ఉపయోగపడునట్టి సంధ్యోపాసనము నిర్గుణోపాసనము అహంగ్రహోపాసనము మొదలగునవి చక్కగ వివరింపబడినవి.

కావున ఆస్తికులగు అనుష్ఠాతలందరును ఈ కలికాలమున ముముక్షువులగువారు ఈ గ్రంథరత్నమును గ్రహించి శ్రద్ధతో చదివి అందలి విషయములనన్నింటిని చక్కగ తెలిసికొని గ్రంథ మున చెప్పినప్రకారముగ అనుష్ఠింతురుగాక! యని

మనవి చేయుచున్న

మద్దులపల్లి మాణిక్యశాస్త్రి,
మద్దులపల్లి వారివీధి, గవర్నరుపేట,
విజయవాడ–520002.
5–1–1978

## బ్రహ్మశ్రీయుత గోకర్ణం దైవరాతమహాశయులు వ్రాసిన యభిప్రాయము

ఈమ్ ఓమ్ శ్రీః

బ్రహ్మశ్రీ వేంకటాచలశాస్త్రిణాం సంధ్యాతత్త్వసుబోధినీ నామకోఽయం గ్రంథః సంధ్యావందనస్య పరమావశ్యకతాం సమ్యక్ సమర్థయతి.

సంధ్యాదేవతోపాసనాయాః తత్త్వం ప్రాధాన్యం చ యదిహ ప్రదర్శితం, న దేవేహ రహస్యతమమ్॥

తత్రభవద్భిః వేంకటాచలశాస్త్రిభిః అర్ఘ్యప్రక్షేపణ-గాయత్రీ జపాదీనాం ప్రాధాన్యవిషయే బహూనామాచార్యాణామతి సంగ్రహణేన శ్రుతిస్మృతిబలవత్ప్రమాణప్రదర్శనపురస్సరం తన్మన్థనేన చ మహతా పరిశ్రమేణ సంశోధనేన చ యోఽయం గ్రంథః ప్రణీతః, సోఽయం సమేషాం భారతీయద్విజానాం మహతే ఉపకారాయ ప్రభవతి. తస్మాదేతద్గ్రంథావలోకనేన సంధ్యాదేవ్యుపాసనయా చ యథోక్తం ఫలమనుభవితుమర్హన్తి సర్వే ద్విజన్మానః ఇతి విజ్ఞాపయితా.

మద్రపురమ్, 8-11-1966

భవదీయః
దైవరాతిః, గోకర్ణః.

## పై దానికి తెనుగు అనువాదము

ఓమ్ ఓమ్ శ్రీ

బ్రహ్మశ్రీ వేంకటాచలశాస్త్రులవారు వ్రాసిన సంధ్యా[illegible] సుబోధినీనామకగ్రంథము సంధ్యావందనమునకు, [illegible] కతను మిక్కిలి సమర్థించుచున్నది.

ఈ గ్రంథమునందలి [illegible] — ప్రమాణపురస్సరముగా మీరు నిరూపించిన సంధ్యాదేవ్యుపాసనయొక్క తత్త్వము, దాని ప్రాధాన్యమున్నూ.

పూజనీయులగు మీరు అర్ఘ్యప్రక్షేప గాయత్రీ జపములయొక్క ప్రాధాన్యవిషయమున చాలమంది యితర ఆచార్యులయొక్క నాని ములను వివరించి, బలిష్ఠమైన శ్రుతిస్మృతిప్రమాణవచనములచేత ఆమతములను మథించివేసి గొప్ప పరిశ్రమతో, చక్కగ శోధించి, వ్రాసిన యీ గ్రంథము సర్వభారతీయద్విజులకును మహోపకారమును చేయును. కావున ఈగ్రంథమును పఠించి, చక్కగ తెలిసికొని సంధ్యాదేవ్యుపాసనము చేయుటచే ద్విజులు యథోక్తఫలమును తప్పక పొందెదరు గాత!

మద్రాసు, 8-11-1966

ఇట్లు
భవదీయుడు, దైవరాతుడు, గోకర్ణము.

ఓమ్

# సంధ్యాతత్త్వసుబోధినీగ్రంథమున అధ్యాయక్రమమున

# పిండితార్థము

ప్రథమాధ్యాయము - ప్రథమభాగము

వివిధమంగళశ్లోకములు. సంధ్యాతత్త్వసుబోధినీగ్రంథకరణ ప్రతిజ్ఞ. స్వగ్రంథసర్వగ్రాహ్యత్వాశంసనము.

ప్రథమాధ్యాయము - ద్వితీయభాగము

సంధ్యోపాసనానుష్ఠానలోపకారణవివరణము. సంధ్యోపాసనాంగిత్వసాధనపూర్వకముగ స్వమతస్థాపనము.

ద్వితీయాధ్యాయము - ప్రథమభాగము

పరమతనిరాకరణము. సంధ్యోపాసనాంగిత్వాదరణీయత్వాశంసనము.

ద్వితీయాధ్యాయము - ద్వితీయభాగము

సంధ్యాపదత్రైవిధ్యము. సంధ్యాదేవతాస్వరూపనిరూపణము. సంధ్యాగాయత్రీస్వరూపభేదనిరూపణము.

తృతీయాధ్యాయము - ప్రథమభాగము

ఉపాసనత్రైవిధ్యము. సంధ్యాదేవతోపాసనస్వరూపనిరూపణము. అధికారిభేదముచేత ఉపాసనభేదము.

తృతీయాధ్యాయము - ద్వితీయభాగము

సంధ్యోపాసనపూర్వోత్తరాంగవివరణము. తర్పణన్యాసాదులకు సంధ్యోపాసనాంగత్వనిరాకరణము.

చతుర్థాధ్యాయము - ప్రథమభాగము

సంధ్యోపాసనపూర్వోత్తరాంగానుష్ఠానపద్ధతినిరూపణము.

చతుర్థాధ్యాయము - ద్వితీయభాగము

సంధ్యాముఖ్యకాలాదినిరూపణము.

ఓమ్ తత్ సత్

శివమ్

ఓమ్

# యత్సంధ్యాముపాసతే బ్రహ్మైవ తదుపాసతే

ఇతి శ్రుతిః

శ్లోకరూపః

# సంధ్యాతత్త్వసుబోధినీమూలగ్రంథః

## ప్రథమాధ్యాయే ప్రథమభాగః

### వివిధమంగళశ్లోకాః

వందే విశ్వనిదానం త
ద్దాడిమీసుమపాటలం।
ధాతృవిష్ణ్వీశహృద్ధ్యేయం
ద్విరదాస్యమహం మహః॥ 1

వరాభీతికరా బాలా
శ్రుతిపంజరశారికా।
అరుణా కరుణావార్ధి
ర్విభాతు హృది మే సదా॥ 2

చల్లాగోత్రోదధేశ్చంద్రం
సూర్యనారాయణాభిధం।
మాణిక్యాంబాసమేతం తం
వందే సర్వవిదం గురుమ్॥ 3

లలితా ఉపచితౌ సక్తౌ
మదభ్యుదయచింతకౌ।
సర్వాంబాదక్షిణామూర్తీ
పితరౌ మామకౌ భజే॥ 4

వసిష్ఠాదీనృషీన్ భక్త్యా
వందే స్మృతికృతస్సదా।
సంధ్యాయా యే వినిర్ణిన్యుః
స్వరూపోపాస్తి ముఖ్యకాన్॥ 5

సంధ్యాతత్త్వసుబోధినీగ్రంథకరణప్రతిజ్ఞా

ధర్మగ్రంథాంశ్చ సంశీల్య
చిరాయ వేంకటాచలః।
కుర్వేఽహం ద్విజమోదాయ
సంధ్యాతత్త్వసుబోధినీమ్॥ 6

స్వగ్రంథస్య సర్వగ్రాహ్యత్వాశంసనమ్

న కించిల్లిఖ్యతే యుక్త్యా
కింతు శ్రుతివచాంసి హి।
అతోఽయం నిఖిలైర్గ్రాహ్యః
కృత్యాఽకృత్యబుభుత్సుభిః॥ 7

ప్రథమాధ్యాయే ద్వితీయభాగః

సంధ్యాదేవతోపాసనానుష్ఠానలోపకారణవివరణమ్

అంగాంగిజ్ఞానలోపేన
లోపోఽభూదంగినశ్చిరాత్।
అతోఽహం వివృణోమ్యంగా
న్యంగి తచ్ఛాస్త్రయుక్తిభిః॥ 8

సర్వేఽంగాన్యేవ కుర్వంతి
న కశ్చిత్కురుతేఽంగి తత్।
ఋగ్యజుస్సంధ్యయోర్భాష్య
కారా చాప్యత్ర కారణమ్॥ 9

సంధ్యాదేవతోపాసనస్యాంగిత్వసాధనమ్

శ్రుతిస్మృతివిధానాచ్చ
మాధవానుమతత్వతః।

ప్రోక్తత్వావభియుక్తైశ్చ
సంధ్యాఽభిధ్యానమంగి తత్ ॥ 10

ద్వితీయాధ్యాయే ప్రథమభాగః

ఋగ్వేదసంధ్యాభాష్యకర్తృచౌంతపాచార్యమతఖండనమ్

సంధ్యోపాస్తిర్హి గాయత్రీ
మంత్రార్థోపాసనం మతం।
ఇత్యాహుశ్చౌంతపాచార్యా
స్తన్న శ్రుతివిరోధతః॥ 11

యజుర్వేదసంధ్యాభాష్యకర్తృ శ్రీకృష్ణపండితమతప్రదర్శనమ్

అర్ఘ్యం జపోపస్థానే చ
ప్రధానాని సము[illegible]వ్యహా।
ప్రథమం బలవత్తేషు
బ్రువతే కృష్ణపండితాః॥ 12

శ్రీకృష్ణపండితమతఖండనమ్

శ్రుతిస్మృతివిరుద్ధాని
యతస్తేషాం వచాంసి హి।
ప్రమాణం న భవేజ్జాతు
కథంచిదపి యుక్తితః॥ 13

సంధ్యోపాసనపారమ్యాదరణీయత్వాశంసనమ్

శ్రుత్యా కరుణయా ప్రోక్తా
సుస్పష్టం చ మహర్షిభిః।
సంధ్యాధ్యానాంగితా సర్వై
రాదర్తవ్యాఽఽస్తికైః॥ 14

ద్వితీయాధ్యాయే ద్వితీయభాగః
సంధ్యాపదస్య త్రివిధప్రయోగః

యౌగికం యోగరూఢం చ
తథా లాక్షణికం తతః।

సంధ్యాపదం హి త్రివిధం
శ్రుతిస్మృతిషు దృశ్యతే॥ 15

సంధ్యాదేవతాస్వరూపనిరూపణమ్

విధిస్థసంధ్యాశబ్దార్థః
పరా చిచ్ఛక్తిరేవ సా।
వసిష్ఠః ప్రాహ చిచ్ఛక్తిం
తాం హి బ్రహ్మవిదుత్తమః॥ 16

సంధ్యాగాయత్ర్యోర్భేదః

విరాజి సృష్టికాలీనే
గాయత్రీ హ్యభిమానినీ।
చిచ్ఛక్తిరూపసంధ్యాయాః
విభిన్నైవేతి నిర్ణయః॥ 17

తృతీయాధ్యాయే ప్రథమభాగః

ఉపాసనత్రైవిధ్యమ్

అహంగ్రహః ప్రతీకశ్చో
పాసనం ద్వివిధం మతం।
ప్రకృతే చ ద్విధోపాస్యా
త్వధికారానుసారతః॥ 18

సంధ్యోపాసనస్వరూపనిరూపణమ్

నామరూపైః కాలభిన్నై
ర్వ్యక్తా సంధ్యా త్రిధా మతా।
సంధ్యా హి తాదృశీ బ్రహ్మ
సాఽహమస్మీతి భావయేత్॥ 19

అధికారభేదేన ఉపాసనభేదః

ఉత్తమో నిర్గుణే కుర్యాత్
సగుణం ప్రతికం పరః।

ధ్యాయేన్మందః ప్రతీకో న్వా
బాలో వాక్యద్వయం వదేత్ ॥ 20

### నిరుపాధినిర్గుణోపాసనకథనమ్

నిరుపాధ్యప్యుపాస్యం స్యా
త్ప్రణవేనాధికారిణా।
ఓమిత్యేకాక్షరమితి
ఋష్యాదిప్రతిపాదకమ్॥ 21

### తృతీయాధ్యాయే ద్వితీయభాగః

### సంధ్యోపాసనపూర్వోత్తరాంగ వివరణమ్

యత్నేన మహతా హ్యంగి
సస్వరూపం సునాశినా।
వివృణోమి తదంగాని
పూర్వాణ్యన్యోత్తరాణి చ॥ 22

సాంగోపాంగప్రధానాంగే
చాఽఽచామః ప్రాణసంయమః।
బ్రాహ్మస్నానం తథా మంత్రాఽఽ
చమనోత్తరమార్జనే॥ 23

అఘదాహోఽర్ఘ్యవిక్షేపా
పూర్వాంగాణి ప్రచక్షతే।
శ్రీగాయత్రీజపః సూర్యో
పస్థానం దిఙ్నమస్కృతిః॥ 24

గోదోనమస్కృతిశ్చైవ
ప్రవరేణాఽభివాదనం।
పంచైతాన్యుత్తరాంగాణి
స్మృతికారాః ప్రచక్షతే॥ 25

వైదికసంధ్యావందనే తర్పణన్యాసాదీనామంగత్వనిరాసః

తర్పణన్యాసముద్రాస్తు
క్రియంతే తాంత్రికే బుధైః।
న తు వైదికసంధ్యాయాం
మానవాదిష్వనుక్తితః॥ 26

చతుర్థాధ్యాయే ప్రథమ భాగః
సంధ్యోపాసనకర్తుర్లక్షణాని

యథావిధి కృతస్నానః
విద్వాన్ బద్ధశిఖో ద్విజః
యజ్ఞోపవీత్యుపాసీత
సాంగాం సంధ్యాం బహిఃస్థలే॥ 27

సంధ్యోపాసనపూర్వాంగానుష్ఠానపద్ధతినిరూపణమ్

పురాణాచమనం కృత్వా
సపుండ్రశ్చ తతః స్మృతేః।
ఆచాంతిద్వయమాయమ్య
ప్రాణాన్ సంకల్ప్య మార్జయేత్॥ 28

అభ్యుక్షణం తతః కృత్వా
కుర్వీతాచమనద్వయం।
ద్వితీయం మార్జనం కృత్వా
ప్రదహేత్పాపపూరుషమ్॥ 29

విధూతపాపః శుద్ధస్సన్
స్వాస్థ్యాయాదిత్యమండలే।
ద్విజో మందేహారక్షోఘ్న
మర్ఘ్యత్రితయముత్క్షిపేత్॥ 30

ప్రదక్షిణం పరిక్రమ్య
పాప్మానమవధూయ చ।

ఉపవిశ్యాఽథ చాచమ్య
  శుద్ధో భవతి పాప్మనః॥ 31

### సంధ్యాదేవతోపాసనమ్

ఆదిత్యమండలే స్వస్థే
  ప్రాణాయామత్రయం చరేత్।
తతో యథాధికారం స
  సంధ్యాం ధ్యాయేత్సమాహితః॥ 32

### సంధ్యోపాసనేతరాంగానుష్ఠానపద్ధతినిరూపణమ్

గాయత్రీహృదయం ప్రోచ్య
  ప్రాణాయామత్రయం చరేత్।
యథాశక్తి జపేద్భక్త్యా
  గాయత్రీమార్కదర్శనాత్। 33

దేవీముద్వాస్య గాయత్రీ
  ముపతిష్ఠేత భాస్కరం।
దిశో నత్వా రోదసీ చ
  ప్రవరేణాఽభివాదయేత్॥ 34

### చతుర్థాధ్యాయే ద్వితీయభాగః
### సంధ్యోపాసనముఖ్యకాలనిరూపణమ్

రాత్ర్యంతిమయామనాడ్యౌ ద్వే
  చాఽహరాదిమనాడికా।
నాడికాత్రయమేతద్ధి
  ప్రాతస్సంధ్యాం జగౌ స్మృతిః॥ 35

అహరంతిమనాడ్యేకా
  ద్వే రాత్ర్యాదిమనాడికే।
నాడికాత్రయమేతద్ధి
  సాయంసంధ్యాం జగౌ స్మృతిః॥ 36

### సంధ్యోపాసనగౌణకాలనిర్ణయః

ప్రాతరాసంగవం గౌణః
ఆప్రదోషావసానకం।
సాయం, మాధ్యాహ్నికః కాలః
ఆసాయమితి నిర్ణయః॥ 37

### సంధ్యోపాసనకాలాతిక్రమణప్రాయశ్చిత్తమ్

గతే చ గౌణే కాలేఽపి
ప్రాయశ్చిత్తం చతుర్థకం।
అర్ఘ్యం దద్యాజ్జపేద్వాఽపి
దేవీమష్టోత్తరం శతమ్॥ 38

### ఆశౌచే సంధ్యోపాసనమ్

ఆశౌచయోరుపాస్త్యంతం
కార్యం మానసమంత్రకైః।
ఉచ్చార్యాఽర్ఘ్యం బహిర్మంత్రం
ప్రాణాయామస్త్వమంత్రకః॥ 39

### స్వగ్రంథస్య చిరస్థాయిత్వాశంసనమ్

యత్కృపాతః కృతో గ్రంథో
మయాఽయం ద్విజసంముదే।
శ్రీమాతుః కృపయా జీయా
త్తస్యా గ్రంథోఽయమాశ్రుతి॥ 40

చతుర్థాధ్యాయే ద్వితీయభాగః సమాప్తః

చతుర్థాధ్యాయః సమాప్తః

సంధ్యాతత్త్వసుబోధినీ

సమాప్తా

ఓమ్ తత్ సత్

శివమ్

# ప్రవాసి ప్రచురణలు

1. ఉన్మత్తుడు. శ్రీ భా. ఉ. మ. శర్మ
   నేటి ఆర్థిక వ్యవస్థ ప్రతిబింబించే సాంఘిక నాటకం 1-00
2. ఆంధ్ర మహావిష్ణువు: శ్రీ వఝ్ఝల కాళిదాసు
   ఆంధ్రుల ఆదిపురుషునిగాథ: మనోహర ద్విపద కావ్యం 1-25

*3. సంధ్యాగీతము: శ్రీ వఝ్ఝల వేంకటేశ్వర్లు
   రసవత్తర ఖండకావ్యం 3-50

4. పంటవలతి: శ్రీ వఝ్ఝల కాళిదాసు
   అధునాతన యక్షగాన నాటకం 1-25
5. కొన్ని వరహాలు. కీ. శే. మే. వరహాలు
   వ్యాస, గేయ సంకలనం 1-25
6. మాట తప్పకు: శ్రీ రావి వెంకటచలం
   అనేక బహుమతులందుకున్న సాంఘిక నాటకం 3-00
7. చక్కని చుక్కలు
   ప్రవాసాంధ్ర రచయితల కథా, వ్యాస, గేయ సంకలనం 1-50
8. ధర్మధ్వజము: శ్రీ భమిడి సత్యనారాయణశర్మ
   నవసమాజ నిర్మాణపథం చూపే పౌరాణిక నాటకం 2-00
9. సౌందర్య సోపానాలు: శ్రీ [illegible]. వి. [illegible]
   చక్కని ఊహల కథలు 2-50
10. జయ[illegible]
   ప్రవాసాంధ్రుల కలాలనుంచి వెలువడిన భావభరిత పద్య గేయ సంకలనం 2-00
11. శ్రీకృష్ణ సందేశము: శ్రీ భమిడి సత్యనారాయణశర్మ
   ఉద్ధవునకు శ్రీ కృష్ణుడు బోధించిన సందేశ గీత 6-00
12. దర్పణము: కీ. శే. బులుసు వేంకట[illegible]
   గీతార్థము అనుభవపూర్వకముగా తెల్పు రచన 2-50
13. ఇది నాటకం కాదు. శ్రీ రావి వెంకటచలం
   అపూర్వ ప్రయోగాత్మక నాటకం 3-50

14. శాతవాహన సంభవము: శ్రీ వఝ్ఝల కాళిదాసు
అపూర్వ రచనా విధానాల సృష్టించిన ప్రబంధం 2-75

15. భావనా తరంగాలు· శ్రీ భా. వ. నరసింహం
అభినవ భావనా భరితగేయ సంపుటి 3-25

*16. సంధ్యాతత్త్వసుబోధిని
పూర్ణాభిధాంధ్ర వ్యాఖ్యానముపేతము
సోమయాజుల వేంకటాచలశాస్త్రి ప్రణీతము 15-00

సంధ్యావందనముయొక్క తత్త్వమును, ఆవశ్యకతను
సులభముగ బోధించు మహోత్తమగ్రంథము.

గమనిక : 2, 4, 6, 9, 13 ప్రతులు లేవు.

* సంధ్యాగీతం ప్రతులకు :
శ్రీ వి. వేంకటేశ్వర్లు, 43-5-11/4
సుబ్బలక్ష్మినగర్, విశాఖపట్నం-4.

† భావనా తరంగాలు ప్రతులకు :
శ్రీ బి. వి. నరసింహం, ఎమ్. ఏ.
క్వార్టర్ నెం. 6-బి, స్ట్రీట్-4, సెక్టరు-10 భిలాయి,
(మధ్యప్రదేశ్).

వి. పి. పద్ధతి లేదు. రు. 8-00 లకు మించినవి తెప్పించుకుంటే పోస్టేజి ఉచితం. రిజిస్టర్డ్ పోస్టులో పంపమంటే రు. 2-00 అదనంగా పంపాలి. ఏజంట్లకు ధారాళమైన కమిషన్.

వివరములకు:

ఆంధ్ర విజ్ఞాన సమితి,
మోడల్ ప్రెస్,
137, సాక్చీ మార్కెట్,
(జమ్‌షెడ్‌పూర్, బీహార్ S. E. Rly.)
831001

48. పారిజాతము
49. పితామహస్మృతి
50. పులస్త్యస్మృతి
51. పైఠీనసిస్మృతి
52. ప్రజాపతిస్మృతి
53. ప్రయోగపారిజాతము
54. ప్రయోగసారము
55. ప్రశ్నోపనిషత్తు
56. బోధాయనస్మృతి
57. బ్రహ్మసూత్రభాష్యము
58. బ్రహ్మస్మృతి
59. భగవద్గీత
60. భగవద్గీతాభాష్యము
61. భట్టభాస్కరరాయలు
62. భవిష్యపురాణము
62. భారద్వాజస్మృతి
64. మధుసూదనసరస్వతులవారు
(గీతావ్యాఖ్యానము)
65. మనుస్మృతి
66. మహాభారతము
67. మరీచస్మృతి
68. మార్కండేయపురాణము
69. మిత్రమిశ్రులు
(వీరమిత్రోదయము)
70. ముండకోపనిషత్తు
71. యమస్మృతి
72. యోగియాజ్ఞవల్క్యస్మృతి
73. యోగేశ్వర స్మృతి
74. రమణమహర్షి
75. రేణుకాపురాణము
76. వసిష్ఠమహర్షి
77. వాల్మీకిరామాయణము
78. వాసుదేవసంహిత
79. విద్యారణ్యులవారు
80. విశ్వామిత్ర స్మృతి
81. విష్ణుస్మృతి
82. వీరమిత్రోదయము
83. వృద్ధమనువు
84. వేదాంతడిండిమము
85. వైద్యనాథదీక్షితీయము
86. వైష్ణవస్మృతిముక్తావళి
87. వ్యాసస్మృతి
88. శంఖస్మృతి
89. శాతాతపస్మృతి
90. శౌనకకారిక
91. శౌనకస్మృతి
92. శ్రీమద్భాగవతము
93. శ్రీరామపండితేంద్రులు
(వాల్మీకి రామాయణవ్యాఖ్యాకర్త)
94. శ్రీ లలితాసహస్రనామభాష్యము
95. శ్రీ శంకరభగవత్పాదులవారు
96. సంవర్తస్మృతి
97. సూతసంహిత
98. సూతసంహితాభాష్యము
99. స్కందస్మృతి
100. స్కాందపురాణము
101. స్మృతికిరణావళి
102. స్మృతిచంద్రిక
103. స్మృతితత్త్వదీపిక
104. స్మృతిముక్తాఫలము
105. స్మృతిముక్తావళి
106. స్మృతిరత్నమహోదధి
107. స్మృతిరత్నాకరము
108. స్మృతిసారసముచ్చయము
109. స్మృత్యంతరములు
110. హారీతస్మృతి

ఓమ్

# సంధ్యాతత్త్వసుబోధిని

## విషయానుక్రమము

### ప్రథమాధ్యాయము - ప్రథమభాగము

విషయసూచిక సమాప్తము.



# ఓమ్

"యత్సంధ్యాముపాసతే, బ్రహ్మైవ తదుపాసతే"

ఇతి శ్రుతిః

శ్రీమహాగణపతయే నమః
శ్రీబాలాత్రిపురసుందర్యై నమః
శ్రీగురుపరబ్రహ్మణే నమః

# సంధ్యాతత్త్వసుబోధిని

పూర్ణాభిధాంధ్రవ్యాఖ్యాసముపేతము
ప్రథమాధ్యాయము—ప్రథమభాగము

**వందే విశ్వవిదావం త**
**ద్దాడిమీసుమపాటలం।**
**ధాతృవిష్ణీశహృద్ధ్యేయం**
**ద్విరదాస్యమహం మహః॥** 1

పూర్ణాభిధవ్యాఖ్యారంభము

వ్యా॥ ఇంద్రగోపసమానాభమిందిరాశ్లిష్టవిగ్రహం।
ఇక్షుకోదండమీడేఽహమిందుచూడమిభాననమ్॥
సంధ్యాతత్త్వసుబోధిన్యా మత్కృతాయాః కరోమ్యహం।
సంపూర్ణవిషయైర్వ్యాఖ్యాం పూర్ణాఖ్యాం విప్రసంముదే॥
యయాఽన్నపూర్ణయా పత్న్యా పూర్ణోఽంశైరభవం సమైః।
తన్నామాంశేన పూర్ణాఖ్యామాంధ్రవ్యాఖ్యాం తనోమ్యహమ్॥

అవతారిక : తాను రచింపబోవు సంధ్యాతత్వసుబోధినీ గ్రంథము నిర్విఘ్నముగ పూర్తియగుటకొఱకు శ్రీమహాగణపతినమస్కారరూపమగు మంగళము గ్రంథకర్తచేత చేయబడుచున్నది.

శ్లోకభావము : మాయాద్వారా సమస్త జగదుత్పత్తికి కారణమైనట్టియు, దానిమ్మపూవురంగువలె నెఱ్ఱనిరంగు గలిగినట్టియు, బ్రహ్మవిష్ణుశంకరులచేతగూడ హృదయమున ధ్యానింపబడునట్టియు, ఏనుగుముఖముగల పరంజ్యోతిని నేను నమస్కరింపుచున్నాను.

అవతారిక : గ్రంథకర్తచేనుపాసింపబడు శ్రీబాలాత్రిపురసుందరీదేవతాధ్యానరూపమగు మంగళము చేయబడుచున్నది.

వరాభీతికరా బాలా
శ్రుతిపంజరశారికా ।
అరుణా కరుణావార్ధి
ర్విభాతు హృది మే సదా ॥ 2।

తాత్పర్యార్థము : తనభక్తులకు వరములనిచ్చుటయందును, అభయమునిచ్చుటయందును, నిపుణములైన హస్తములుకలదియు, వేదములనెడుపంజరమునందు గోరువంకపక్షివంటిదియు, అనగా సర్వవేదములచేతను వర్ణింపబడునదియును, ఎఱ్ఱనిరంగు గలదియును, దయకు సముద్రమువంటి శ్రీబాలాత్రిపురసుందరీదేవి నా హృదయమున నెల్లప్పుడును ప్రకాశించు గాత !

అవతారిక : సర్వవిద్యాగురునమస్కారరూపమగు మంగళము చేయబడుచున్నది.

చల్లాగోత్రోదధేశ్చంద్రం
సూర్యనారాయణాభిధం ॥
మాణిక్యాంబాసమేతం తం
వందే సర్వవిదం గురుమ్ ॥ 3।

తాత్పర్యార్థము : ఆంధ్రదేశమధ్యవిరాజమానగోదావరీమహానదీతీరస్థరాజమహేంద్రవనగరరాజమున సర్వశాస్త్రపారంగతులును,

వైదికతాంత్రికోభయకర్మనిష్ణాతులును, పూర్ణదీక్షాపరులును, శిష్య వత్సలురును శ్రీమహాలక్ష్మిసమానమాణిక్యాంబాభిధధర్మపత్నీ సమేతులును సుగృహీతనామధేయులు నగు బ్రహ్మశ్రీ విరాజమాన చల్లాసూర్యనారాయణశాస్త్రులవారిసన్నిధిని క్రీస్తుశకము 1923 వ సంవత్సరము మొదలు 1929 వ సంవత్సర పర్యంతము తర్క వేదాంతశాస్త్రముల నభ్యసించితిని. అట్టి విద్యాగురువర్యులకు నా వందనసహస్రములు.

అవతారిక: దేవగురువందనానంతరము స్వజన్మకారణ భూతులగు జననీజనకులు నమస్కరింపబడుచున్నారు.

> లలితాపచితౌ సక్తౌ
> మదభ్యుదయచింతకౌ।
> నర్సాంబాదక్షిణామూర్తీ
> పితరౌ మామకౌ భజే॥ 4।

తాత్పర్యార్థము: ఆంధ్రదేశోత్తరసీమసమీపమున శ్రీకాకుళ మండలమందున్న వంశధారామహానదీప్రాచ్యతీరమందున్న చొర్లంగి (స్వర్లంఘి) నామకాగ్రహారవాస్తవ్యులును, సదా శ్రీ లలితాంబా పరాభట్టారికాపూజాతత్పరులును అస్మజ్జననీజనకులగు శ్రీ నర్సాంబా దక్షిణామూర్తుల పాదపద్మములకు సదా మదీయవందన సహస్రంబు లర్పింపబడుచున్నవి.

అవతారిక: స్వగ్రంథమునకు ప్రమాణభూతములగు స్మృతు లను రచించిన స్మృతికర్తలగు వసిష్ఠాదిమహర్షులను గ్రంథకర్త నమస్కరింపుచున్నాడు.

> వసిష్ఠాదీ నృషీన్ భక్త్యా
> వందే స్మృతికృతస్సదా।
> సంధ్యాయా యే వివిర్ణిన్యు:
> స్వరూపోపాస్తిముఖ్యకాన్॥ 5।

ఏ మహర్షులు సంధ్యాదేవతయొక్క స్వరూపమును, ఉపా సనాస్వరూపమును, ఉపాస్యదేవతామూర్తులను, ముఖ్య, గౌణకాల

ములు మొదలగువానిని సందేహమునకు తావులేకుండ స్పష్టముగ నిర్ణయించిరో, ఖిలమైన వేదభాగములను తమ తపోమహిమవలన కలిగిన దివ్యదృష్టిచేత కనుగొని వానియర్థములను శ్లోకరూపమున స్మృతులను పేరిట లోకహితముకొఱకు రచించిరో, యట్టి వసిష్ఠాది మహర్షులకివే నా వందనసహస్రంబు లర్పింపబడుచున్నవి.

ముఖ్యులగు కొంతమంది మహర్షుల గురించి చెప్ప నుత్సహించుచున్నాను.

1) వసిష్ఠమహర్షి బ్రహ్మవేత్తలలో నగ్రగణ్యుడు. ఆ మహర్షి యత్యంతముఖ్యమగు సంధ్యాదేవతాస్వరూపమును విశదముగ నిరూపించెను.

2) అస్మద్గోత్ర ప్రవర్తకుడును బ్రహ్మవిద్వరేణ్యుడు నగు భరద్వాజమహర్షి కూడ సంధ్యాదేవతాస్వరూపమును విశదముగ నిరూపించెను.

3) వసిష్ఠులవారి మునిమనుమడగు శ్రీవేదవ్యాసమహర్షి సంధ్యాదేవతయొక్క స్వరూపమును, సంధ్యాపదముయొక్క అర్థమును, ధ్యానస్వరూపమును, సగుణ నిర్గుణోపాసనలను వాని స్వరూపములను విశదముగ నిరూపించెను.

4, 5) అత్రి గౌతమమహర్షులిద్దరును సంధ్యాదేవతయొక్క త్రివిధధ్యేయరూపములను విశదముగ నిరూపించిరి.

6, 7) విష్ణు-శాతాతప మహర్షు లిద్దరును సంధ్యోపాసనము నకంగిత్వసాధనమార్గదర్శకులైరి.

8) శ్రీయాజ్ఞవల్క్యులు సంధ్యోపాసనప్రకరణమున నిర్గుణోపాసన మున్నదని స్పష్టముగను దృఢముగను నిరూపించిరి. వీరందరిట్లు నిరూపింపనియెడల నీ గ్రంథమే యవతరింపదు. కావున ద్విజులకందరకును ప్రాతస్స్మరణీయులగు నీమహర్షివర్యులందరును నీ గ్రంథాదియందునవశ్యస్మరణీయులు

అవతారిక: గ్రంథనామము, గ్రంథరచనాకారణము వివరింపబడుచున్నవి.

ధర్మగ్రంథాంశ్చ సంశీల్య
చిరాయ వేంకటాచలః ।
కుర్వేఽహం ద్విజమోదాయ
సంధ్యాతత్త్వసుబోధినీమ్ ॥ 6।

బ్రాహ్మణులయొక్క బ్రాహ్మణ్యమును రక్షించునది సంధ్యోపాసనము. దీనినే సంధ్యావందన మనియు నందురు. ఇట్టి సంధ్యోపాసనముయొక్క తత్త్వజ్ఞానము దేశమున లుప్తప్రాయమై, సంధ్యావందనప్రయోగమున సంధ్యోపాసనము కనుబడుటలేదు. ఇట్టి సంధ్యోపాసనతత్త్వమును విశదముగ వివరించినయెడల ద్విజవరేణ్యులకత్యంత ప్రమోదము గల్గును. ద్విజులకు ప్రమోదమును కల్గించు కార్యముకంటె శ్రేయస్కరమైన కార్యమింకొకటి లేదు. అందువలన సోమయాజులోపనామక వేంకటాచలశాస్త్రి యను పేరు గల నేను ద్విజసంమోదమును కల్గించుటకొరకు నైదుసంవత్సరములు ధర్మశాస్త్ర గ్రంథములను, వేదాంతగ్రంథములను, పురాణములను, సంధ్యావందనపద్ధతిగ్రంథములను గురుదేవతానుగ్రహప్రేరితుడనై యథామతి పరిశీలించి సంధ్యాతత్త్వము సులభముగను సువిశదముగను బోధించు నీ గ్రంథమును గోదావరీ తీరస్థరాజమహేంద్రవరనగరమున శాస్త్రాధ్యయనము చేయుకాలముననే రచించుట కుపక్రమించితిని.

తొలుత సంధ్యాప్రశంసారూపమున బహుశ్రుతి, స్మృతి, పురాణ ప్రమాణవచనములచే సంధ్యోపాసనమెట్లు బ్రాహ్మణ్యరక్షక మగునో వివరింపబడుచున్నది.

## సంధ్యా ప్రశంస

శ్రీ షచ్ఛంకరభగవత్పాదులవారు వేదాంతడిండిమమున

1) ద్విజత్వం విధ్యనుష్ఠానాత్ విప్రత్వం వేదపాఠతః ।
బ్రాహ్మణ్యం బ్రహ్మవిజ్ఞానాదితి వేదాంతడిండిమః ॥

బ్రాహ్మణునకు ముందుగ గాయత్రీమంత్రోపదేశమువలన ద్విజత్వము వచ్చును. తర్వాత విప్రత్వము వచ్చును. తర్వాత బ్రాహ్మణ్యము వచ్చును. ఇది క్రమము. వైదికకర్మల ననుష్ఠించుట

చేత ద్విజత్వమును కాపాడుకోవలెను, వేదపాఠమువలన విప్రత్వ మును కాపాడుకొనవలెను. బ్రహ్మవిజ్ఞానమును సంపాదించుటవలన బ్రాహ్మణ్యమును కాపాడుకొనవలెను. అని శ్రీయాదిశంకరుల యుప దేశము. ఇందు బ్రాహ్మణ్యము బ్రహ్మవిజ్ఞానము వలన కలుగునని చెప్పిరి. అట్టి బ్రహ్మవిజ్ఞానమును సులభముగ కలిగించు ధర్మ మెద్ది? యను ప్రశ్నకు = 'సంధ్యోపాసనము' అని సమాధానము. ఆ విషయమున ప్రమాణము చూపబడుచున్నది.

2) తైత్తరీయబ్రాహ్మణము :

ఉద్యంతమస్తంయంతమాదిత్యమభిధ్యాయన్ కుర్వన్ బ్రాహ్మ ణో విద్వాన్ సకలం భద్రమ శ్నుతేఽసావాదిత్యో బ్రహ్మేతి, బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి య ఏవం వేద ॥

వేదభాష్యమును వ్రాసిన సర్వజ్ఞమాధవాచార్యులవారు పరా శరమాధవీయమున సంధ్యావందనప్రకరణమున దీనియర్థము నిట్లు వ్రాసినారు.

"సంధ్యోపాసనవిధానమును తెలిసికొనిన బ్రాహ్మణుడు ప్రాణాయామాదికర్మలను చేయుచు బ్రహ్మవిష్ణ్వాదిరూపములతో నున్న సంధ్యాశబ్దవాచ్యమగు నాదిత్యుని (అనగా—ఆదిత్యమండలము నందున్న బ్రహ్మచైతన్య స్వరూపిణియగు సంధ్యాదేవతను) శుద్ధపర బ్రహ్మముగ ధ్యానముచేయుచు శుద్ధమైన యంతఃకరణము గలవాడై బ్రహ్మసాక్షాత్కారమును బొందుచున్నాడు. ఎట్లనగా—అతడీధ్యానము చేయ నారంభించుటకు ముందే వాస్తవమున పరబ్రహ్మముగనే యుండుచు, అజ్ఞానముచేత తాను జీవుడననియే భ్రాంతిలో మునిగి యున్నవాడై పైన జెప్పిన సంధ్యాస్వరూప జ్ఞానధ్యానములచేత నాయ జ్ఞానము పోగా తన నిజమగు బ్రహ్మస్వరూపమును తెలిసికొను చున్నాడు. బ్రహ్మసాక్షాత్కారమునున్నూ పొందుచున్నాడు. పర బ్రహ్మమే యగుచున్నాడు; అని". ఇచ్చట సంధ్యోపాసనచేత బ్రహ్మ జ్ఞానము కలుగుననియును, అందుచేత తాను పరబ్రహ్మమగుచున్నా డనియు నతిస్పష్టముగ విశదీకరింపబడినది.

3) వైష్ణవ స్మృతిముక్తావళి (అడయార్ లైబ్రరీ.)

"యత్సంధ్యాముపాసతే-బ్రహ్మైవ తదుపాసతే" "సంధ్యోపాస నము బ్రహ్మోపాసనమే" యని యర్థము. బ్రహ్మోపాసనమువలన

బ్రహ్మజ్ఞానము కలుగును. కాన బ్రహ్మోపాసనమగు సంధ్యోపాసన వలన బ్రహ్మజ్ఞాన మవశ్యము కలుగునని భావము.

శంక : బ్రహ్మతత్త్వవిచారమువలన బ్రహ్మజ్ఞానము కలుగునని శాస్త్రము కాని ఉపాసనవలన బ్రహ్మజ్ఞానము కలుగుననుటలో ప్రమాణమేమి ? చెప్పబడుచున్నది.

4) శ్రీసర్వజ్ఞవిద్యారణ్యులవారు తమ వేదాంతపంచదశియందు ధ్యానదీపప్రకరణమున నిట్లు చెప్పిరి.

"బ్రహ్మజ్ఞానాయతే సాక్షాన్నిర్గుణోపాసనం శనైః" అని. నిర్గుణోపాసనము సమాధిక్రమముచేత చరమవృత్తి సాక్షాద్బ్రహ్మ జ్ఞానముగ మారిపోవును, అని.

5) స్మృతిరత్న మహోదధి =

"అసావాదిత్యోబ్రహ్మేతి యద్ధ్యానం క్రియతేఽన్వహం ।
తదేవ సాంధ్యమిత్యుక్తం కర్మ బ్రహ్మోపకారకమ్ ॥

ప్రతిదినము మూడు సంధ్యలయందును "అసావాదిత్యోబ్రహ్మ" యను మంత్రముతోనే ధ్యానము చేయబడుచున్నదో ఆ సంధ్యా దేవతాధ్యానమే బ్రహ్మజ్ఞానమును కలిగించి బ్రాహ్మణ్యమును రక్షించు "సంధ్యాకాలముఖ్యకర్మ" యని వేదశాస్త్రములందు చెప్పబడుచున్నది. అని స్మృతిరత్నమహోదధివచనము పూర్వోక్త శ్రుతివచనద్వయముయొక్క సారమునే యనువదించుచున్నది.

6) విష్ణుస్మృతి =

"శుచిర్వాప్యశుచిర్వా యః కాలే సంధ్యాం సదా ద్విజః ।
ఉపాస్తే బ్రహ్మభూయాయ, కల్పతే నాఽత్ర సంశయః ॥

శుచియైనను నశుచియైనను సరియే, సకాలమునందు ఏ ద్విజుడు సంధ్యాదేవతనుపాసించునో, యాతడు బ్రహ్మైక్యమును పొందును. ఇందు సందియములేదు. ఈ విష్ణుస్మృతివచనము పూర్వోక్తతైత్తరీయబ్రాహ్మణవచనార్థమును స్పష్టపరచుచు నెవరికైన సందేహముకలిగినయెడల నాసంధేహమును తీర్చుచున్నది "నాఽత్రసంశయః" అని.

7) గోభిలస్మృతి =

"సంధ్యాముపాసతే యే తు, సతతం సంశితవ్రతాః!
విధూతపాపాస్తే యాంతి, బ్రహ్మలోకం సనాతనమ్"॥

ఎవరు తీవ్రమైన నియమనిష్ఠతో సంతతము విడువకుండ సంధ్యోపాసనమును చేయుదురో (ఏయొకటి రెండుసారులు మాత్రమే తలంచుటగాదు) అట్టివారు సమస్తమైన సంచిత-అగామి పుణ్య పాపములను పూర్తిగ దులుపుకొన్నవారై శాశ్వతమగు బ్రహ్మలోకమును బొందెదరు.

శంక = విష్ణుస్మృతివచనము బ్రహ్మైక్యమును పొందుననుచున్నది. గోభిలస్మృతివచనము కార్యబ్రహ్మలోకమును పొందుననుచున్నది. ఈ రెండువచనములకును సమన్వయమెట్లు కుదురును? సమాధానము చెప్పబడుచున్నది.

బ్రహ్మసూత్రభాష్యమునందు చతుర్థాధ్యాయతృతీయపాదమునందు "అప్రతీకాలంబనాధికరణమున, సగుణ—అహంగ్రహోపాసకులకు కార్యబ్రహ్మలోకప్రాప్తియగునని నిర్ణయింపబడినది. ఇక నెవరు సగుణనిర్గుణోపాసనక్రమముచేత నిర్బీజ (నిర్వికల్ప) సమాధిని చేయుచు, బ్రహ్మతత్వ విచారమునుగూడ చేయుచు, నిహలోకముననే పురాకృతపుణ్యవిశేషపరిపాకముచేత బ్రహ్మసాక్షాత్కారమును పొందెదరో - అట్టివారిచ్చటనే బ్రహ్మైక్యమును బొందెదరు అనియు నిర్ణయింపబడినది కాగా-గోభిలస్మృతి వచనము సగుణ-అహంగ్రహోపాసకుల గూర్చి చెప్పుచున్నది. విష్ణుస్మృతివచనము బ్రహ్మతత్వవిచారముకూడ చేయుచు నిర్బీజ సమాధిద్వారా బ్రహ్మసాక్షాత్కారమును బ్రహ్మైక్యమును పొందినవారిని గూర్చి చెప్పుచున్నది: కావున విరోధము లేకుండ పై రెండు వచనములకును సమన్వయము కుదురును.

8) భవిష్యపురాణము =

విప్రో వృక్షస్తస్య మూలం హి సంధ్యా
వేదాశ్శాఖా ధర్మకర్మాణి పర్ణాః।
తస్మాన్మూలం యత్నతో రక్షణీయం
మూలేచ్ఛిన్నే నైవ శాఖా న పర్ణాః॥

బ్రాహ్మణుడు వృక్షము, దానికి కూకటివేరు సంధ్యోపాసనము. వేదములు కొమ్మలు. ధర్మకర్మలు ఆకులు కావుననిట్టి బ్రాహ్మణుడను చెట్టుయొక్క కూకటివేరును (సంధ్యావందనమును) మిక్కిలి ప్రయత్నముతో రక్షింపవలెను లేనియెడల కూకటివేరునే నఱకివేసినయెడల (సంధ్యావందనమును చేయనియెడల) చెట్టు చచ్చిపోవును. అనగా బ్రాహ్మణుని బ్రాహ్మణ్యము పోవును. కాగా-కొమ్మలగు వేదము లుండవు ఆకులగు ధర్మకార్యము లుండవు. అనగా- సంధ్యోపాసనను చేయనియెడల వాని బ్రాహ్మణ్యము పోయి వేదములు చదువుటకును, ధర్మకార్యములు చేయుటకును అర్హుడు కాడని భావము. అందువలన నెన్ని పనులున్నను, సంధ్యోపాసన చేయుటకొరకు మిక్కిలి ప్రయత్నముతో నెటులైనను సమయమును (ఇరువదియైదు లేక ఇరువది నిమిషములైనను) చేసికొని సంధ్యావందనమునకు లోపము కాకుండ కాపాడుకొనవలెనని భావము. బ్రాహ్మణుని బ్రాహ్మణ్యమునకును, వేదములకును, వైదికకర్మలకును సంధ్యోపాసనమే జీవనదాయియై యత్యంతముఖ్యమైనదని తేటతెల్లముగ జెప్పబడినది. ఆహా! ఎంత అమూల్యార్థము గల శ్లోకము!

9) యోగియాజ్ఞవల్క్యులు:

> ''బ్రహ్మణోపాస్యతే సంధ్యా విష్ణునా శంకరేణ చ।
> కస్మాన్నోపాసయేద్దేవీం శ్రేయస్కామో ద్విజోత్తమః'' ॥

ప్రపంచసృష్టి స్థితి లయములకు కారణభూతులైన బ్రహ్మవిష్ణు- శంకరులుగూడ పరాశక్తిరూపిణియగు సంధ్యాదేవతను ధ్యానించుచున్నారు. అట్టియెడ వారిచే సృష్టింపబడి రక్షింపబడునట్టి మానవమాత్రుడైన ద్విజోత్తముడు మోక్షకాముడై సంధ్యాదేవి నేల ధ్యానింపగూడదు? తప్పక ధ్యానింపవలెను. సంధ్యాదేవత "తత్వత్రయ సముద్భవ" అనగా బ్రహ్మవిష్ణుశివతత్వములు మూడును సంధ్యాదేవతవలన బుట్టినవి. కావున త్రిమూర్తులును బ్రహ్మైక్యమును గోరుచు తమ మాతను ధ్యానించుచున్నారు.

10) శ్రీ మహాభారతమున వ్యాసులవారు =

> "సంధ్యేతి సూర్యగం బ్రహ్మ సంధ్యానాదవిభాగతః।
> బ్రహ్మదైన్యైస్సకలై ర్ధ్యాతై స్తదంశైస్సచ్చిదాత్మనః ॥

చదువరులు ఈ శ్లోకార్థమును గ్రహించుటలో చాల యవధానమును కలిగి యుండవలెను.

ఈ శ్లోకము రెండవభాగమున "తదంశైః" అనుచోటున "తత్ + అంశైః" అనియు, "సచ్చిదాత్మనః" అనుచోటున "సచ్చిదా + ఆత్మనః" యనియును పదచ్ఛేదమును చేయవలెను.

శ్లోకార్థము :—సూర్యగం = సూర్యమండలమందున్న బ్రహ్మ = బ్రహ్మచైతన్యము, సంధ్యా = సంధ్యాదేవత. ఆ బ్రహ్మచైతన్యమునకు సంధ్యయను పేరు వచ్చుటకు కారణము చెప్పబడుచున్నది అంశైః = పరబ్రహ్మాంశభూతులైన, బ్రహ్మాద్యైః = బ్రహ్మ మొదలగు వారి చేతను, సకలైః భూతైః = సకలప్రాణులచేతను, తత్ = ఆ సూర్యమండలమందున్న బ్రహ్మచైతన్యమును సచ్చిదా = సచ్చాసౌ + చిచ్చ = సచ్చిత్ = తయా = సచ్చిదా, ఇచ్చట సత్‌చిత్ పదములు ఆనందమునకుగూడ సూచకములు, సహేతి శేషః = "సహ" అను పదమును కూడ చేర్చుకొనవలెను. కాగా-శుద్ధసచ్చిదానందరూపముగుపరబ్రహ్మముతో గూడ యని యర్థము. ఇచ్చట సహయుక్తేఽప్రధానే" యను సూత్రముచేత అప్రాధాన్యవివక్షయందు తృతీయ వచ్చుటచేత శుద్ధసచ్చిదానందపరబ్రహ్మకు నీయుపాసనమున అప్రాధాన్యము. ఏలననగా-ఇది సంధ్యోపాసనమగుటచేత సంధ్యాదేవతకే ప్రాధాన్యము, శుద్ధసచ్చిదానందపరబ్రహ్మము అప్రధానమగును. ఆత్మనః = తనకంటె, అవిభాగతః = విభాగమనగ, భేదము కాగా—భేదము లేకుండ, (అభేదబుద్ధితో) సంధ్యానాత్ = అవిచ్ఛిన్నముగ ధ్యానము చేయుట వలన, "సమ్యక్ ధ్యేయా = సంధ్యా = తనకును ఆచైతన్యమునకు భేదములేకుండ అవిచ్ఛిన్నముగ ధ్యానము చేయుటవలన "సంధ్య" యను పేరు వచ్చినది" అని చాలచక్కగ వివరించినారు. తాత్పర్యము: త్రిమూర్తులు, సకలప్రాణులును అపరబ్రహ్మయొక్క అంశములేకదా! "మమైవాంశో జీవలోకః" అని శ్రీకృష్ణపరమాత్మ గీతయందు చెప్పిరి గదా! పరబ్రహ్మాంశములగు సకలప్రాణులును ఆదిత్యమండలాంతర్గతమగు అపరబ్రహ్మచైతన్యమును, ముందుగ "అసావాదిత్యో బ్రహ్మ" యను మంత్రముతో శుద్ధసచ్చిదానంద (త్రిపాత్) పరబ్రహ్మచైతన్యముతో నభిన్నముగ ధ్యానము చేయవలెను. తర్వాత-అట్లు శుద్ధసచ్చిదానందరూపపరబ్రహ్మాఽభిన్నముగ ధ్యానము చేయబడిన సూర్యమండలాంతర్గతబ్రహ్మచైతన్యమును (అనగా సంధ్యాదేవతను) "సోఽహమస్మి" యనుచు, తనతో భేదములేకుండ అభేదబుద్ధితో

(అనగా-ఆబ్రహ్మచైతన్యరూపిణియగు సంధ్యాదేవత నేనే) యని యనుకొనుచు ధ్యానింపవలెను. ఈ వ్యాసులవారే మరియొకచోటున "సాఽహమస్మీత్యుపాసీత" యనిచెప్పిరి.

"అసావాదిత్యోబ్రహ్మ" + సాఽహమస్మి" యను నుపాసనమున ముందు ఆదిత్యమండలాంతర్యామి బ్రహ్మచైతన్యరూపిణియగు సంధ్యాదేవతను, మాయాసంబంధరహితశుద్ధత్రిపాత్పరబ్రహ్మచైతన్యముతో నభిన్నముగ ధ్యానించి, "సా" యను పదముచేత త్రిపాత్పర బ్రహ్మభిన్నముగ ధ్యానింపబడిన సంధ్యాదేవతను గ్రహించి, యట్టి త్రిపాత్పరబ్రహ్మభిన్న సంధ్యాఽహమస్మి" యను ధ్యానమువలన, త్రిపాత్పరబ్రహ్మము సంధ్యాదేవతయొక్క విశేషణకోటియందు పడుటవలన పరబ్రహ్మకు అప్రాధాన్యము. సంధ్యాదేవతకు ప్రాధాన్యమని తెలియునది. ఈ విషయము సంధ్యోపాసనయొక్క ఆకార నిరూపణసందర్భమున "నభిన్నాం ప్రతిపద్యేత===ఇత్యాదివ్యాస వచనమును వ్యాఖ్యానించునపుడు మరల విశదముగ వివరింపబడును.

ఈ శ్లోకమున వ్యాసులవారు "సంధ్య" యననేమి? ఆపేరేల వచ్చెను ? ఆధ్యానము నెట్లు చేయవలెను ? అను మూడు ప్రశ్నములకును సరియగు సమాధానమునిచ్చిరి. "అవిభాగతః" యను పదముచే, నిది యహంగ్రహోపాసనమనియును చెప్పినారు.

ఇచ్చట కొన్ని ముఖ్యవిషయములను తెలిసికొనవలసియున్నది. "పరబ్రహ్మము చైతన్యస్వరూపము, చైతన్యమనగ జ్ఞానము. "పాదోఽస్య - విశ్వా భూతాని, త్రిపాదస్యామృతం దివి। త్రిపాదూర్ధ్వముదైత్పురుషః, పాదోఽస్యేహాభవాత్పునః॥ అని పురుష సూక్తము దీని తాత్పర్యము. పరబ్రహ్మచైతన్యము అఖండమైనది. ఖండములు లేనిది. ఐనను-పామరమానవునిబుద్ధికి తెలియుటకొరకు ఖండములున్నట్లు కల్పించి చెప్పబడుచున్నది ఆ పరబ్రహ్మచైతన్యమున నాలుగు భాగములు కలవిగ వర్ణింపబడినది. అందులో మూడు భాగములు లేక పాదములు మాయాసంబంధము లేనివై, శుద్ధమైనవై అమృతమైనవి.(నాశములేనివి)మిగిలిన నొకపాదపరబ్రహ్మచైతన్యము, మాయాసంబంధము కలదై సమస్తలోకములరూపముతో విలసిల్లుచున్నదై ఉత్పత్తినాశములు కలదివలె కనబడుచున్నది. కాని వాస్తవమున ఈపాదచైతన్యమునకు ఉత్పత్తివినాశములు లేవు. మూడు

పాదముల బ్రహ్మచైతన్యమునకు "శుద్ధత్రిపాద్బ్రహ్మము" అని వ్యవహారము. ఒక పాదబ్రహ్మచైతన్యమునకు "ఏకపాద్బ్రహ్మము" అని వ్యవహారము.

త్రిపాద్బ్రహ్మమునకు మార్పు లేదు గాన దానిగురించి వివరణములక్కరలేదు. ఏకపాద్బ్రహ్మము గురించియే కొన్ని విషయములు తెలిసికొనవలెను.

ఏకపాద్బ్రహ్మమునకు సంబంధించిన మాయలో, సత్త్వరజస్తమస్సులను గుణములు మూడున్నవి. సత్త్వగుణము జ్ఞానమును కలిగించును. రజోగుణము (విక్షేపశక్తి) మనసును చెదరగొట్టును. జ్ఞానమును స్థిరముగ నుండనీయదు. ఇక, తమోగుణము (ఆవరణశక్తి) మనసును నావరించి మంచితలంపులను పుట్టనీయదు. సరికదా! ధర్మమునధర్మముగను, అధర్మమును ధర్మముగను తోపింపజేయును. ఉన్న జ్ఞానమును, (వివేకమును) అణచివేయును. ఇవి పై గుణముల లక్షణములు. ఈగుణములు ఒకదానితోనొకటి మిశ్రమమై యుండును లేక కలియక శుద్ధముగ కూడనుండును అట్లు రజస్తమోగుణములతో మిశ్రమమైన సత్త్వగుణము మలినమైపోవును బాగుగ ప్రకాశింపదు. మిశ్రమములేనిది శుద్ధముగనుండును అద్దమువలె ప్రకాశించును. ఇట్లు శుద్ధమైన సత్త్వగుణముకల మాయను "మాయ" యందురు. రజస్తమోగుణమిశ్రితమైనదై మలినమైన సత్త్వగుణము కల మాయకు "అవిద్య" యని పేరు. సత్త్వగుణము నిర్మలమైనదై యద్దమువలె నుండునదిగాన, అట్టి శుద్ధసత్త్వగుణము గల మాయయందు ఏకపాద్బ్రహ్మము ప్రతిబింబించును అట్లు మాయయందు ప్రతిబింబించిన ఏకపాద్బ్రహ్మచైతన్యమునకు ఈశ్వరుడని పేరు శివుడనియును. ఈయీశ్వరుడే చిచ్ఛక్తిరూపుడగును. చిచ్ఛక్తియే సంధ్యాదేవత. త్రిమూర్తులును మాయావశులే. అట్టి మాయ సంధ్యాదేవతావశమునందుండును.

ఇక నవిద్యయందు ప్రతిబింబించిన ఏకపాద్బ్రహ్మచైతన్యము జీవుడు. అవిద్యయందలి సత్త్వగుణము మిక్కలి మలినమైనదగుటచేత-జ్ఞానము, ఇంక నితరశక్తులు లేనివాడై జీవుడు నిర్వీర్యునివలె నుండును. మాయయందలి సత్త్వగుణము శుద్ధమైనదగుటచేత ఈశ్వరునకు అడ్డులేని నిరతిశయమైన జ్ఞానముండును. ఇంకను నితరమైన

మహాశక్తులు గలవాడై ప్రపంచముయొక్క సృష్టిస్థితిలయములను చేయుచున్నవాడు. కాన ఈయీశ్వరునికంటె వేరుకాని చిచ్ఛక్తిరూప సంధ్యాదేవత తన నాశ్రయించిన మాయాద్వారా త్రిమూర్తులను సృష్టించి, వారిద్వారా ప్రపంచముయొక్క సృష్టిస్థితిలయములను చేయించుచున్నది. సంధ్యాదేవత త్రిమూర్తులను సృష్టించినదగుట చేత త్రిమూర్తులు సహితము సంధ్యాదేవతను ధ్యానింపుచున్నారు. ఇక మనబోటివారికేమి లెక్క ?

సంధ్యాదేవతయును ఏకపాద్బ్రహ్మమే. జీవుడును ఏకపాద్బ్రహ్మమే కాని వారు ప్రతిబింబించిన ఆధారములు వేరువేరు. సంధ్యాదేవతాప్రతిబింబమునకాధారమైనది శుద్ధసత్వగుణముగల మాయ యగుటచేత-సంధ్యాదేవతకు అవ్యాహతమైన జ్ఞానశక్తి-ఇచ్ఛాశక్తి క్రియాశక్తులున్నవి. జీవుని ప్రతిబింబమున కాధారమైనది మలిన సత్వగుణముగల అవిద్య యగుటచేత-జీవునకు బలమైన జ్ఞానశక్తి గాని, ఇచ్ఛాశక్తి గాని, క్రియాశక్తి గాని లేకపోవుటవలన జీవుడు జ్ఞానములేనివాడై అన్నివిషయములలో చేతగానివాడై, తమోగుణము యొక్క అవరణచేత-తాను పరబ్రహ్మము కాడనిన్నీ, చేతకాని జీవుడ ననిన్నీ, సంధ్యాదేవత తనకంటె వేరైన దేవత యనియు, ఆమెయొక్క అనుగ్రహము తనకు కావలెననియు-ఈవిధముగ తలంచుచున్నాడు. అందువలననే వేదమాత, జీవుని ఉద్ధరించుటకొరకు, ధన్యుని జేయుటకొరకు-"సంధ్యోపాసనము"ను ద్విజునకు విధించినది, ద్విజుడీ పైవిషయములనన్నింటిని బాగుగ తెలిసికొని శ్రద్ధతో తీవ్రముగ సంధ్యోపాసనమును జేసినయెడల, వీనియొక్క అజ్ఞానము పోయి, అంతఃకరణము శుద్ధమై, బ్రహ్మసాక్షాత్కారమై మోక్షమునొందును. ధన్యుడగును,

సంధ్యాదేవతాప్రతిబింబమున కాధారమైన మాయ-సంధ్యాదేవతకు "ఉపాధి" యనంబడును జీవుని ప్రతిబింబమునకు ఆధారమైన "అవిద్య" జీవున "కుపాధి" యనంబడును. కాగా-మాయోపాధికము సంధ్యాదేవత. అవిద్యోపాధికుడు జీవుడు, ఏయుపాధియును లేనిదగుటచేత, త్రిపాద్బ్రహ్మచైతన్యము "నిరుపాధికము" అనంబడును. కాగా—జీవుడు అవిద్యోపాధికుడగుచున్నాడు. సంధ్యాదేవత మాయోపాధికమగుచున్నది త్రిపాద్బ్రహ్మము నిరుపాధికమగుచున్నది జీవుడును-సంధ్యాదేవతయును ఏకపాద్బ్రహ్మచైత

న్యములు, త్రిపాద్బ్రహ్మము శుద్ధబ్రహ్మచైతన్యము, ఇట్లీమూడును చైతన్యములే భేదము లేదు. సంధ్యాదేవత అపరిమిత జ్ఞానశక్తికలది గావున "తాను పరబ్రహ్మస్వరూపమే యని ఆమెకు తెలియును. జీవుడు అజ్ఞానముచేత నావరింపబడిన వాడగుటవలన-తన, నిజ స్వరూపము తెలియనివాడై జీవుడననియే, యనుకొనుచు సంసార సాగరమున నీదుచున్నాడు. ఇంకను-అనేకకోటిజన్మలనుండి జీవు నకీ యజ్ఞానముండినది. మానవుడీ పైవిషయములనన్నింటిని తెలి సికొని, శ్రద్ధాభక్తులతో సంధ్యోపాసనను-"సంధ్యయే (బ్రహ్మచైత న్యమే) నేను=అని తీవ్రమగు ధ్యానమును చేసినయెడలనే, ఆయజ్ఞా నము తొలగును అహా! వేదమాత యెంత కరుణాళువు! ఈ సంధ్యో పాసనము కొన్నివందల సంవత్సరములుగ-అనుష్ఠానమునుండి తప్పి పోయినది. మరల ఆదేవీకృపాకటాక్షముచేత నుద్ధరింపబడినది. పై మూడు చైతన్యములొక్కటియే, వేరువేరు కాదు. ఉపాధులు వేరగు టచేత వేరువేరు పేర్లతో వ్యవహరించుచున్నారు. అంతియే. మూడు నొక్కటియే. ఈవిషయమును దృఢముగ గుర్తించుటయే బ్రహ్మ జ్ఞానము. ఇదియే సంధ్యోపాసనము. సంధ్యోపాసనమువలన బ్రహ్మ జ్ఞానము కలుగునని సంధ్యాప్రశంసారంభమున చేసిన ప్రతిజ్ఞ యింతటితో తీరినది.

కాగా-సూర్యమండలములో నున్న మాయోపాధికబ్రహ్మ చైతన్యరూపిణియగు, సంధ్యాదేవత-నిరుపాధికమగు శుద్ధత్రిపా ద్బ్రహ్మచైతన్యమే"యని-"అసావాదిత్యో బ్రహ్మ" యను మంత్రముతో ఆ రెండు చైతన్యములకును ముందుగ నభేదమును ధ్యానింపవలెను. తర్వాత-అశుద్ధత్రిపాద్బ్రహ్మచైతన్యముతో అభిన్నముగ ధ్యానింప బడిన-సూర్యమండలములోని సంధ్యాదేవతయే-అవిద్యోపాధికబ్రహ్మ చైతన్యరూపుడగు తాను" అని సంధ్యాదేవతకును తనకును అభేద మును ధ్యానింపవలెను. ఈ ధ్యానమును "సోఽహమస్మి" అను వాక్యముచేత చేయవలెను. ఇట్లు ఆదిత్యమండలములోని బ్రహ్మ చైతన్యము, (సంధ్యాదేవత) స్వస్వరూపచైతన్యము ఒక్కటియే యని సం + చక్కగా — ధ్యా = ధ్యానముచెయబడును. అందువలన సం + ధ్యా = సంధ్యా" యను పేరుగలిగెనని వ్యాసులవారు చక్కగ వివరించిరి. ఈ శ్లోకార్థము చాలగంభీరమైనది సావధానముగ రెండుసారులు చదివిన యెడల బాగుగ బోధపడును. సంధ్యావందన మునకు సంబంధించిన చాల ముఖ్యవిషయము లిందున్నవి.

11) భారద్వాజస్మృతి =

"బ్రహ్మాద్యాకారభేదేన యా భిన్నా కర్మసాక్షిణీ।
భాస్వతీశ్వరశక్తిః సా, సంధ్యేత్యభిహితా బుధైః॥

భారద్వాజులవారీ శ్లోకమున సంధ్యాదేవతాస్వరూపమును వివరించుచు, సగుణసంధ్యోపాసనమునందు సంధ్యాదేవతయొక్క, సగుణమూర్తిని గూడ వివరించిరి.

ప్రతిపదార్థము

యా = ఏదేవత, బ్రహ్మాద్యాకారభేదేన = ప్రొద్దున, మధ్యాహ్నమున, సాయంకాలమునను క్రమముగా కల్పితములైన బ్రహ్మరూపముతోను, రుద్రరూపముతోను, విష్ణురూపముతోను, భిన్నా = వేరువేరుగ వ్యవహరింపబడునో, కర్మసాక్షిణీ = సూర్యమండలాంతర్గతమైనది గాన సర్వప్రాణికర్మసాక్షిణియై, భాస్వతీ = చైతన్యరూపిణిగాన స్వయంప్రకాశమానయై, ఈశ్వరీ శక్తిః = మాయోపాధికచైతన్యస్వరూపుడైన ఈశ్వరునికంటె వేరుకానిదై, ఆదిశక్తి, పరాశక్తిపదములచేత పిలువబడినదై వెలయుచున్నదో, సా = ఆమెయే, సంధ్యాఇతి = సంధ్యాదేవత యని, బుధైః = వేదాంతరహస్యవేత్తలచేత, అభిహితా = చెప్పబడినది. తాత్పర్యము సులభము.

ఇచ్చట సంధ్యాదేవతను త్రిసంధ్యలయందును వేరువేరుగ కల్పితమైన త్రిమూర్తులస్వరూపములతో ధ్యానింపవలెనని విశేషముగ చెప్పబడినది.

ఇచ్చట భారద్వాజులవారు వర్ణించినట్టియు, ఉత్తరత్ర వసిష్ఠులవారు వర్ణింపబోవునట్టియును సంధ్యాదేవతాస్వరూపము ఒకేవిధముగనున్నది, అట్లే శ్రీవ్యాసులవారు, శ్రీయోగియాజ్ఞవల్క్యులవారు, శ్రీమహాభారతమున్నూ వర్ణించిన సంధ్యోపాసనస్వరూపము గూడ నొకేవిధముగ నున్నది. ఇట్లు వేదాంతరహస్యవేత్తలగు మహర్షులందరును సంధ్యాదేవతను పరబ్రహ్మస్వరూపిణియగు చిచ్ఛక్తి, యాదిశక్తి పరాశక్తిగనే యైకకంఠ్యముగ వర్ణించిరి.

12) శ్రీలలితాసహస్రనామభాష్యము.

పరాశక్తి, చిచ్ఛక్తిరూపిణీ యగు శ్రీలలితాంబికయొక్క రహస్యనామసాహస్రమందు "ద్విజబృందనిషేవితా" యను నామరాజ

మొండు గలదు. దానికి భాష్యము వ్రాయుచు శ్రీభాస్కరరాయలు వారు ఇట్లు వర్ణించిరి. "శ్రీలలితాంబిక సంధ్యాదేవత యగుటచేత, ద్విజబృందములచేత నుపాసింపబడుచున్నది" యని, ఇట్లు భాస్కర రాయలువారును సంధ్యయనగ నొకదేవత యనియును, ఆమెను ధ్యానింపవలెననియును జెప్పిరి.

13) రేణుకాపురాణము.

> "సంధ్యైకా సర్వదా దేవైర్ద్విజైర్వంద్యా మహాత్మభిః।
> ఆసనే, శయనే, యానే, భోజనేచ====॥ఇతి

మహాత్ములగు దేవతలును ద్విజులును, ఆసనమున కూర్చొని యున్నప్పుడును, శయనమందు పండుకొని యున్నప్పుడును వాహన మున పోవునప్పుడును, చివరకు భోజనసమయమున గూడను సర్వదా, యొక్క సంధ్యాదేవతనే ధ్యానింపవలెనని యర్థము. ఇచ్చట మహాత్ములని యనుటచేత మనసును స్వాధీనమందుంచు కొనినవారే ఇతరమగు పనులు చేయుచున్నప్పుడును సంధ్యాదేవతా ధ్యానమును "సంధ్యాఽహమస్మి" సంధ్యాఽహమస్మి" యనుచు జేయగలుగుదురని భావము. "సంధ్యాదేవతను మాత్రమే" యనుట చేత "ఇతర దేవతల ధ్యానముచేత పరబ్రహ్మసాక్షాత్కారము కాద నెడు శాస్త్రసిద్ధాంతము జ్ఞాపకము చేయబడుచున్నది. ఈవిధముగ నెల్లవేళలందును సంధ్యాధ్యానమును చేయువారలకు ఫలము శీఘ్ర ముగ లభించుననుటలో సందేహములేదు.

వేదాంతరహస్యవేత్త లిట్లు చెప్పుచున్నారు =

> "యథైవ శైవలం నీరే వ్యాప్నోత్యపసృతం ముహుః।
> బ్రహ్మవృత్త్యా తథా మాయా వ్యాప్నోత్యపసృతా ముహుః॥
> తస్మాన్నిరంతరం ధ్యానం బ్రహ్మప్రత్యక్షమిచ్ఛతా।
> ఏదుషా సర్వదా కార్యమితి వేదాంతడిండిమః॥

ఒక మనుష్యుడు నాచుతో నిండిన చెరువునందు స్నానమునకు బోయి నాచును చేతులతో ప్రక్కలకు తొలగించి మూడు మునుగులు మునిగి లేచుసరికి మరల నాచు యథాపూర్వముగ వ్యాపించి నిండి యుండును. మరల ప్రక్కలకు త్రోసి మునక వేసి లేచు సరికి, మరల యథాపూర్వముగ వ్యాపించును. అది నాచుయొక్క స్వభావము,

అట్లే "సంధ్యాఽహమస్మి" "సంధ్యాఽహమస్మి" యనుచు ప్రత్యక్చైతన్యరూపుడైన తాను బ్రహ్మచైతన్యస్వరూపిణియైన సంధ్యాదేవతయే యనుచు నర్థమును భావించు క్షణమునందు, బాహ్యముఖము కాకుండ నంతర్ముఖమగునట్లు సంస్కరింపబడిన యంతర్ముఖమనసుతో అంతఃకరణమున కోటిసూర్యప్రకాశమానమైన తన ప్రత్యక్చైతన్యమును భావించుచు "తాను పరబ్రహ్మచైతన్యమే యని యనుకొనునప్పుడు-తన నావరించిన మాయ, ఆ క్షణమున నొక్కసారి నాచువలె తొలగిపోవును అంతర్ముఖమగు మనసుతో నంతఃకరణమున వెలుగుచున్న తన నిజరూపమగు ప్రత్యక్చైతన్యమును (మనోనేత్రముతో) చూచుకొనుచున్న క్షణమున. మాయ కచ్చట తావే లేదు గదా! మాయ తొలగిపోవును, కాని యా ధ్యానమాగినతోడనే ప్రక్కనే పొంచియున్న మాయ మరల నొక్కమారు ఆవరించివేయును. మరల ధ్యానము చేసిన, మాయ తొలగిపోవును ధ్యానమాగినతోడనే మరల మాయావరణము. ఇట్లు ధ్యానమాపిన వెంటనే మాయ యావరించుచుండును. అది మాయాస్వభావము.

కావున, బ్రహ్మసాక్షాత్కారము కోరు విద్వాంసుడు (అనగా-జీవబ్రహ్మల స్వరూపమును, ఇద్దరకు నభేదధ్యానపద్ధతిని తెలిసినవాడు) ఎల్లప్పుడు, నిరంతరము మధ్య మధ్య వ్యవధానము లేకుండ, "సంధ్యాఽహమస్మి" "సంధ్యాఽమస్మి" యనుచు నెడనెడ తెగకుండ ధ్యానము చేయవలెను. అట్లు చేసిన, ధ్యానము సుదృఢమై మాయను దరి జేరనీయదు. బ్రహ్మసాక్షాత్కారము నిర్విఘ్నముగ నగును. తాను, బ్రహ్మము, నేకమగుదురు. అదియే బ్రహ్మైక్యము. మోక్షము. కావుననే రేణుకాపురాణము ప్రయాణాసనశయనభోజనాది సర్వసమయములందును వ్యవధానము దొరకినపుడెల్ల "సంధ్యాఽహమస్మి" యనుచు కేవలవచనమును మాత్రమే పలుకక దాని యర్థమును గూడ తదేకనిష్ఠతో భావించుచు ధ్యానింపవలెనని చెప్పుచున్నది అహా! వేదాంతరహస్యవేత్త లెంత కరుణామయులు!

**14) స్మృత్యంతరమున =**

"సంధ్యా హి సూర్యగం బ్రహ్మ, వందనం తదుపాసనమ్"

సూర్యమండలాంతర్గతమగు బ్రహ్మచైతన్యమే సంధ్యాదేవత. వందనమనగ ఆ దేవతయొక్క ఉపాసనము. ధ్యానము. అని యర్థము నమస్కారము గాదు. గౌతమధర్మశాస్త్రమున షష్ఠాధ్యాయ

మున "తత్ర స్థలే వందనం తు తాం ధ్యాయేత్సుసమాహిత:॥ అచ్చట వందనమనగా – సుసమాహితుడై యా సంధ్యాదేవతను ధ్యానము చేయుట" యని స్పష్టముగ చెప్పబడెను.

15) గోభిలస్మృతి =

"సంధ్యా యేన న విజ్ఞాతా సంధ్యా యేనాఽనుపాసితా।
జీవమానో భవేచ్ఛూద్రో మృతశ్చ శ్వాఽభిజాయతే॥"

సంధ్యాస్వరూపమును తెలిసికొనని వాడును, సంధ్యాదేవతను ధ్యానింపని వాడును బ్రతికియున్నంతకాలము శూద్రసమానుఁడై చని పోయిన తర్వాత కుక్కయై పుట్టును. శూద్రసమానుడనగా–వైదిక కర్మలను చేయుట కనర్హుడగునని భావము. సంధ్యోపాసన చేయని ద్విజుడు మరుజన్మమున కుక్కయై పుట్టును ఎంత వ్యత్యాసము! సంధ్యోపాసనకొరకు నావశ్యకమగు సంధ్యాస్వరూపమును తెలిసి కొనినవాడు జీవబ్రహ్మల స్వరూపమును గూడ తెలిసికొనినవాడగును. ఇక సంధ్యోపాసన జేసిన యెడల జీవబ్రహ్మైక్యధ్యానము చేసినవాడ గును. అప్పుడు "ఇహ చేదవేదీదథ సత్యమస్తి" ఈ బ్రాహ్మణజన్మము నందే ఆత్మస్వరూపమును తెలిసినవాడైన యెడల ఈ జన్మ సార్థక మగును" అను నుపనిషద్వచనము సార్థకమగును. సంధ్యోపాసనను చేయని యెడల "న చేదిహావేదీన్మహతీ వినష్టిః" ఈ జన్మమున ఆత్మ స్వరూపమును తెలిసికొనని యెడల గొప్ప వినాశము = జననమరణ ప్రవాహరూపమగు సంసారము, తప్పదు" అను నుపనిషద్వచన మును సత్యము చేసినవాడై, ఆ పాపమునకు మరుజన్మమున కుక్కయై పుట్టును.

16) మరల గోభిలమహర్షివచనము =

"వైదికేషు చ సంధ్యాయాః ప్రాధాన్యం మునిసత్తమ।
ఏతత్సంధ్యాత్రయం ప్రోక్తం, బ్రాహ్మణ్యం యత్ర తిష్ఠతి॥"

సమస్తవైదికకర్మలయందును బ్రహ్మోపాసనమగు సంధ్యా వందనమే మిక్కలి ప్రధానమైనది. ఏలననగా–ఆ సమస్తవైదికకర్మ లును కాయికకర్మలు. కాయికకర్మలవలన సాక్షాత్తుగ మోక్షము ఫలము గాదు. ఇక సంధ్యోపాసనము మానసికకర్మ–మానసికకర్మ యగు నుపాసనమువలన గాని, జ్ఞానమువలన గాని మోక్షము సాక్షా

త్తుగ లభించును. ఇట్టి సంధ్యోపాసనము మూడు సంధ్యాకాలములందును చేయబడవలెను. ఏలననగా-బ్రాహ్మణ్యము ఈ సంధ్యోపాసనము మీదనే ఆధారపడి యున్నది. ఎనిమిదవ యుదాహరణమగు భవిష్యపురాణవచన మీయర్థమునే ప్రధానముగ జెప్పుచున్నది.

17) వ్యాసస్మృతివచనము =

"యః సంధ్యాం కాలతః ప్రాప్తామాలస్యాదతివర్తతే।
సూర్యహత్యామవాప్నోతి ఉలూకత్వమియాత్తతః॥"

సంధ్యావందనముయొక్క ముఖ్యకాలము వచ్చినప్పుడు తనకు తీరిక యున్నను, పాడు సోమరితనముచేత నెవడు సంధ్యనుపాసింపడో, యాతడు అర్ఘ్యప్రక్షేపమును గూడ నీయని వాడగుటవలన, మందేహరాక్షసోపద్రవమునుండి సూర్యుని కాపాడలేని వాడగుటవలన సూర్యహత్యాపాపమును పొంది, దానిచే మరు జన్మమున సూర్యుని గాని, సూర్యుని వెలుతురును గాని చూడశక్యము గాని గుడ్లగూబయై పుట్టును,

18) శ్రీతారానాథతర్కవాచస్పతికృతగాయత్రీవ్యాఖ్యానగ్రంథమునందు భరద్వాజులవారు.

"కర్మాణ్యన్యాని సంత్యజ్య సంధ్యాం యః కేవలాం ద్విజః।
ఉపాస్తే, సర్వకర్మాణి కృతవాన్ స భవేదలమ్॥
సంధ్యోపాస్తిం వినా విప్రః పుణ్యాన్యన్యాని చాచరేత్।
యస్తస్య తాని పాపాని భవంత్యేవ న సంశయః॥" అని.

ద్విజుడు సౌకర్యము లేక ఇతరకర్మలను విడిచిపెట్టినను విడిచి పెట్టవచ్చును. కాని బ్రహ్మోపాసనమగు సంధ్యోపాసనమును మాత్రము విడువకుండ చేసినయెడల నాతడన్ని కర్మలను చేసినవాడే యగును. ఎట్లు? బ్రహ్మోపాసన ఫలమునందు అశ్వమేధాది సకల కర్మల ఫల మిమిడి యున్నది. సందేహము లేదు. "సకలం భద్రమశ్నుతే" అని సంధ్యోపాసనశ్రుతియే చెప్పుచున్నవి. ఇక నే ద్విజుడు సంధ్యావందనమును చేయక ఇతరపుణ్యకర్మలను చేయునో యా పుణ్యకర్మలు పాపకర్మలే యగును. అందుకు సందేహము లేదు ఏలనన-సంధ్యావందనము చేయనివాడు శూద్రసమానుడై ఇతర వైదిక కర్మలను చేయుటకు అర్హుడుకాడుగదా! అనర్హుడు చేసిన కర్మలు

(శూద్రుడు చేసిన యాగాదికర్మల వలె) పాపకర్మలే యగుననుటలో సందేహమేమి? లేదు.

19) యోగియాజ్ఞవల్క్యమహర్షి =

యస్తు తాం కేవలాం సంధ్యాముపాసీత స పుణ్యభాక్ః
తాం పరిత్యజ్య కర్మాణి కుర్వన్నాప్నోతి కిల్బిషమ్॥"

ఏ ద్విజుడు సంధ్యోపాసనమును మాత్రము తప్పక చేయునో యాతడే సర్వపుణ్యశాలి యగును. సంధ్యోపాసనమును విడిచిపెట్టి యితర పుణ్యకర్మలు చేయునాతడు పాపమునే పొందును. అని. 18 వ శ్లోకార్థమే,

20) మరల యోగియాజ్ఞవల్క్యుల వారే =

కామాల్లోభాద్భయాన్మోహాత్సంధ్యాం నాతిక్రమేద్బుధః।
సంధ్యాతిక్రమణాద్విప్రో బ్రాహ్మణ్యాత్పతతే యతః॥

సంధ్యోపాసన చేయదగు ముఖ్యకాలము వచ్చిన తరి, కామాభిలాషియై కాని, లేక భూమిమీద పడిన గింజలను లోభముచేత, నేరుచు గాని, చలి మొదలగువానికి భయపడి గాని, లేక యజ్ఞానముచే గాని, సంధ్యోపాసనను చేయక కాలము గడపిన బ్రాహ్మణుని బ్రాహ్మణ్యము తగ్గిపోవును. సంధ్యోపాసన మెంత ముఖ్యాతిముఖ్యమో, సంధ్యోపాసనముఖ్యకాలము గూడ నంత ముఖ్యాతిముఖ్యమని యెరుంగవలెను.

21) శాతాతపమహర్షి వేరు విధముగ పై యర్థమునే చెప్పుచున్నారు.

"అనాదిత్యాం తు యః పూర్వాం, సాదిత్యాం చైవ పశ్చిమాం।
నోపాసీత ద్విజః సంధ్యాం స సర్వోఽబ్రాహ్మణః స్మృతః॥"

ఏద్విజుడు సూర్యోదయమునకు ముందే ప్రాతస్సంధ్యను, సూర్యాస్తమయమునకు ముందే సాయంసంధ్యను ఉపాసింపడో యాతని బ్రాహ్మణ్యము తగ్గిపోవును, అని. శాతాతపులు కొంచెము స్థూలముగ ముఖ్యకాలస్వరూపమును కూడ నెరిగించినారు మిగిలినది యిరువదియవ శ్లోకార్థమే. ఈ శ్లోకమున నున్న "అబ్రాహ్మణః" యను పదమునకు బ్రాహ్మణుడు కాని వాడు అని యర్థము కాదు,

పరి? తగ్గిపోయిన బ్రాహ్మణ్యము కలవాతని యర్థము, ఎట్లనగా-
"సంస్కృతమున "అనుదరా కన్యా" యని ప్రయోగము కలదు.
దానికి ఉదరము లేని కన్య" యని యర్థము కాదు ఉదరము లేని
కన్య యుండదు కదా! అల్పమైన యుదరము గల కన్య యని
యర్థము చెప్పవలెను. అట్లే-సంపూర్ణబ్రాహ్మణుడు కాడని యర్థము

22) మరల యోగియాజ్ఞవల్క్యమహర్షి=

"స హినస్తి సదా సూర్యం మోక్షద్వారమనుత్తమమ్
కథం మోక్షస్య సంప్రాప్తిర్భవేత్తస్య ద్విజన్మనః

"ఉద్యంతమస్తం యంతం = అను మంత్రము చే సంధ్యో
పాసనను చేయు వానికి మోక్షము ఫలము కలుగునని చెప్పుచున్నది.
ఆ మోక్షము రెండు విధములు (1) బ్రహ్మలోకప్రాప్తిద్వారా బ్రహ్మ
కైవల్యప్రాప్తి, (2) ఇహలోకముననే బ్రహ్మసాక్షాత్కారమై మరణా
నంతరము విదేహకైవల్యప్రాప్తి, అని అందు తొలి మోక్షమునకు
సూర్యుడే ముఖ్యద్వారమగుచున్నాడు. మరణానంతరమున, ఆ సూర్య
కిరణములే ఆ జీవుని అర్చిరాదిమార్గమునందు ప్రవేశపెట్టును. తర్వాత
నా మార్గమున సూర్యమండలము గూడ నొక మజిలీ యగుచున్నది
ఇట్లు సూర్యుడు మోక్షమునకు ముఖ్యమార్గమగుచున్నాడు. సకాల
మున సంధ్యోపాసనను జేయని ద్విజుడు సూర్యున కర్ఘ్యము నీయడు
గదా! అందుచేత సూర్యుడు మందేహరాక్షసులచేత హింసింపబడిన
వాడగును. అర్ఘ్యప్రక్షేపములచేత నా హింసను తప్పించవలసినవాడు
ద్విజుడే. కాని ముఖ్యకాలమున నర్ఘ్యప్రక్షేపము చేయకపోవుటవలన
ద్విజుడే, మందేహరాక్షసద్వారా సూర్యుని హింసించిన వాడగును.
ఇట్లు మోక్షద్వారమగు సూర్యుని హింసించు ద్విజునకు మోక్షమెట్లు
లభించును? కాన సకాలమున నర్ఘ్యముల నిచ్చి, సూర్యహింసను
పోగొట్టి, సంధ్యోపాసన చేయువాడు మోక్షము నందునని భావము.

23) మార్కండేయ పురాణము =

"అశ్వమేధసహస్రాణి, వాజపేయశతాని చ॥
నైవాప్నువంతి తులనాం, సంధ్యోపాస్తేర్ద్విజన్మనః॥

అశ్వమేధయాగము బ్రహ్మహత్యాపాపమును గూడ పోగొట్టునని
వేదమే చెప్పుచున్నది. బ్రహ్మలోకప్రాప్తిని గూడ కలిగించును.

కాని యా యాగమును చేయుటకు లక్షలు కోట్లు రూపాయలు ఖర్చగును. అట్లే, వాజపేయయాగమున్నూ, అట్టి అశ్వమేధయాగములు, పది గాదు, నూరు గాదు, వేయియును గాదు, వేలకొలది యశ్వమేధయాగములు చేయుటవలన కలుగు పుణ్యము గాని, అట్లే నూర్లకొలది వాజపేయయాగములు చేయుటవలన కలుగు పుణ్యము గాని, యా రెండు పుణ్యముల మొత్తము గాని, ఒక్క దమ్మిడి కూడ ఖర్చుచేయనక్కర లేకుండ చేయబడు సంధ్యోపాసనయొక్క పుణ్యమునకు ఈడు కావు అని భావము. ఎట్లనగా—ఏ యాగమువలన కలిగిన పుణ్యమైనను అనిత్యమే అది పునర్జన్మమునిచ్చును. కాని సంధ్యోపాసనమువలన పునర్జన్మము లేని మోక్షరూపఫలమే కలుగును.

ఒకానొక పూర్వమీమాంసకుడు ఈ మార్కండేయపురాణవచనమును అతిశయోక్తిగ గాని, అర్థవాదముగ గాని తలచవచ్చునని పలికెను కాని యట్లు త్రోసివేయరాదు. ఆతడు ఒక్క పూర్వమీమాంసనే చదివెను కాని ప్రస్థానత్రయమును పేరు గల ఉపనిషత్, గీతా-బ్రహ్మసూత్ర-భాష్యములను చదువలేదు. అందువలన నట్లనెను. ఆ మాట ప్రమాణము కాదు. ఏలననగా—భగవద్గీత యారవయధ్యాయమున నర్జునుడు శ్రీకృష్ణపరమాత్మ నిట్లు ప్రశ్నించెను. "అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి ?" కృష్ణా! ధ్యానయోగముయొక్క సిద్ధిని పొందకుండ మరణించినవాని గతి యేమి ? అని ప్రశ్నించెను.

దానికి కృష్ణపరమాత్మ యిట్లు సమాధానమిచ్చెను. "ప్రాప్య పుణ్యకృతాం లోకానుషిత్వా శాశ్వతీస్సమాః! శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే॥ ఇత్యాది॥

దీనికి ఆదిశంకరులు భాష్య మిట్లు వ్రాసిరి ధ్యానయోగభ్రష్టుడు అశ్వమేధాదిమహాయాగములు చేసినవారు పోవు పుణ్యలోకములకు పోయి, అనేకానేక సంవత్సరము లందుండి భోగముల ననుభవించి, మరల నుత్తమజన్మ నెత్తి, గతజన్మలో విడిచిన యోగమును మరల నారంభించి, సాధించి, మోక్షమునందును" అని. ఇందు ధ్యానయోగమున భ్రష్టుడైనవాడే యశ్వమేధయాజియొక్క పుణ్యలోకమునకు పోవుననిరి. ధ్యానయోగసిద్ధిని పొందినవాడో—మోక్షమునే పొందునని భావము. సంధ్యోపాసనము ధ్యానయోగము. కావున సంధ్యోపాసనము సిద్ధించినవాడు వేయి కాదు, లక్ష కాదు,

కోటియశ్వమేధయాగములు చేసినవాడు కూడ పొందనేరని మోక్షమునే పొందును. కావున నీ శ్లోక మతిశయోక్తికాదు. కేవలము స్వభావోక్తియే. "ఉద్యంతమస్తంయంత" మను తైత్తరీయబ్రాహ్మణ మంత్రమునకు శ్రీసర్వజ్ఞమాధవాచార్యులవారు సంధ్యోపాసనకు మోక్షమే ఫలమని దృఢముగ వ్రాసినారు.

24) ముండకోపనిషత్తు, ద్వితీయఖండము. దశమమంత్రము.

"ఇష్టాపూర్తం మన్యమానా వరిష్ఠం. నాన్యచ్ఛ్రేయో
వేదయంతే ప్రమూఢాః।
నాకస్య పృష్ఠే తే సుకృతేఽనుభూత్వా, ఇమం లోకం,
హీనతరం వా విశంతి"॥ అని

ఉపనిషద్విజ్ఞానము లేనివారును, ఉపాసనాతత్వము తెలియనివారును, కేవల భోగలాలసులైనవారు ఇచ్చట ప్రమూఢులని చెప్పబడుచున్నారు. అట్టివారు పరలోకమునందును, జన్మాంతరములందును, భోగములను కోరుచున్నవారై యట్టి భోగముల నిచ్చునట్టి "ఇష్టాపూర్తములే" మిక్కిలి శ్రేష్ఠము లైనవని తలంచుచున్నారు. ఇష్టాపూర్తములనగా—ఇష్టములు, పూర్తములు, ఇష్టములనగా—యజ్ఞయాగాది వేదోక్తకర్మలు, పూర్తము లనగా—నూతులు, బొడ్డన బావులు, చెరువులు, మొదలగువానిని ప్రజల మేలుకొరకు త్రవ్వించుట, తోటలు ప్రతిష్ఠచేయుట, గుళ్ళు గోపురములు క్రొత్తవి కట్టించుట, జీర్ణోద్ధారణము చేయుట, చలిపందిళ్ళు వేయించుట, సత్రములు వేయించుట, మొదలగు స్మార్త (స్మృతులందు చెప్పబడినవి) కర్మలు.

ఇవియే అన్ని ధర్మములకంటె నుత్తమమైనవని తలంచుచున్నవారై, వాని నాచరించినంతమాత్రాననే తాము ధన్యుల మైతిమని తలంచుచున్నవారై మోక్షదాయకములగు ఉపాసనాదులను గూర్చి తెలిసికొనుటకు గూడ ప్రయత్నించకున్నారు.

అట్టివారు తాము సంపాదించిన పుణ్యమును కాస్తా పుణ్యలోకమున కొంచెము కాల మనుభవించి, యది క్షీణించగనే, "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి"యనునట్లు, మరల భూలోకమున జన్మింతురు. లేక-ఇంతకు మునుపున్న సంచితకర్మానుసారముగ నింతకంటె హీనమైన తిర్యగ్జన్మము నైనను ఎత్తుదురు. అయ్యో! పాపము! ఎంత

మూఢులు! అని వారిని గూర్చి యౌపనిషదపురుషుడు జాలి పడు చున్నాడు

25) శ్రీమిత్రమిశ్రకృత వీరమిత్రోదయమున=

అహ్నికప్రకాశమున, 254 వ పుటలో=

॥సంధ్యోపాసనప్రశంస యందు॥

ముందుగ సంధ్యోపాసన శబ్దార్ధ విచారము చేయబడినది

"తథా హి=సంధ్యాశబ్దస్య కర్మకలాపపరత్వే అనుష్ఠానము పాసనం। దేవీపరత్వే తు ప్రాగుక్తరూపేణ తస్యాః ధ్యాన మేవోపాసనాశబ్దార్థః॥ "న భిన్నాం ప్రతిపద్యేత గా యత్రీం బ్రహ్మణా సహ। సాఽహమస్మీత్యుపాసీత వి ధినా యేన కేనచిత్" ఇతి వ్యాసవచనాత్తథైవ ప్రతీతేః॥ఇతి॥"

సంధ్యాశబ్దము యొక్కయు, ఉపాసనశబ్దము యొక్కయు అర్థము విచారింపబడినది.

ముందు ఈ సంధ్యోపాసనశబ్దార్థవిచారము యొక్క భావ మును తెలిసికొందము గాక!

ఇచ్చట రెండు పక్షములు గ్రహింపబడినవి. వానిలో మొద టిది పూర్వపక్షము గను, రెండవది సిద్ధాంతపక్షముగను వేదాంత శాస్త్రమున అధికరణరచనవలె నున్నది. ఏమనగా—ఆ వ్యాఖ్యాన స్వభావమును పరిశీలింపగా—నట్లు కనబడుచున్నది, శాస్త్రములందు నొక విషయమును విచారించి నిర్ధారించు పద్ధతియు నీరీతిగనె యుండును!

పూర్వమీమాంసకుల యభిప్రాయము ననుసరించి పూర్వ పక్షము చేయబడినది, ఏలననగా—పూర్వమీమాంసామతమున పర బ్రహ్మము లేదు. జీవబ్రహ్మైక్యరూపమైన మోక్షము గూడ లేదు. వారు ధ్యానము నంగీకరింతురు గాని—అభిధ్యానము సంగీకరింపరు అభి ధ్యాన మనగా ఉపాసనము. ఈ కారణములచేత సంధ్యోపాసన మను పదమునకు వారు వేరు విధముగ నర్థము చెప్పుదురు దానినే శ్రీ మిత్రమిశ్రులవారు పూర్వపక్షముగ చెప్పుచున్నారు. "తథాహి = సంధ్యాశబ్దస్య కర్మకలాపపరత్వే అనుష్ఠానముపాసనం॥ అని అనగా-

"సంధ్యా" శబ్దమునకు అచమనము మొదలు అభివాదనము పర్యంతము గల కర్మసమూహమర్థము. కాగా-ఉపాసనమనగ "అనుష్ఠానము" చేయుట అని యర్థము. అని పూర్వమీమాంసకులందురు. పూర్వమీమాంసకు లగు శ్రీ కృష్ణపండితులవారి యభిప్రాయముతోనే తాము రచించిన సంధ్యాభాష్యమునందు సంధ్యాదేవతా ధ్యానమునే యంగీకరింపక దాని యీాసునైన నైత్తిక అర్ఘ్యప్రక్షేపమునకే ప్రాధాన్యమిచ్చిరి. కాగా-"అహరహస్సంధ్యాముపాసీత" ఇత్యాది విధులందున్న సంధ్యోపాసనశబ్దమునకు "ఆచమనము మొదలు అభివాదనము వరకున్న కర్మలనన్నిటిని అనుష్ఠించుట (చేయుటయే) సంధ్యోపాసనమని" యర్థము అని యందురు

కాని సంధ్యాతత్వసుబోధినియందలి ఈ సంధ్యాప్రశంస యందలి వ్యాస, భరద్వాజ, యోగియాజ్ఞవల్క్యాదుల వచనానుసారముగను, దిఙ్నమస్కారవిధాయక విష్ణుస్మృతి వచనానుసారముగను, "సంధ్యాం మనసా ధ్యాయేత్" అను నైతరేయబ్రాహ్మణవచనానుసారముగను. "ఉద్యంతమస్తంయంతమిత్యాదితైత్తిరీయ బ్రాహ్మణమునకు శ్రీసర్వజ్ఞమాధవాచార్యులవారు వ్రాసిన వ్యాఖ్యానానుసారముగనున్నూ పూర్వమీమాంసామతమును పూర్వపక్షముగ జేసి శ్రుతిస్మృత్యనుమతమగు తమ సిద్ధాంతపక్షమును వ్రాయుచున్నారు = "దేవీపరత్వే తు==ఇత్యాదివచనముచేత॥ దేవీపరత్వే తు ప్రాగుక్తరూపేణ తస్యాః ధ్యానమేవోపాసనాశబ్దార్థః" అనగా-సంధ్యాశబ్దమునకు శ్రుతి స్మృతి పురాణవ్యాఖ్యానకర్తల యభిప్రాయానుసారముగ "దేవీ" యను నర్థమునే దృఢీకరించిన యెడల ఉపాసనాశబ్దమునకు స్వరసతః ధ్యానమే యర్థమగును. అందునను "ప్రాగుక్తరూపేణ" అని యనిరి. అనగా-ఆదిత్యమండలమున ప్రాతరాదిక్రమముగ-బ్రహ్మరుద్రవిష్ణురూపములతో ధ్యానము చేయుట" యని యర్థము. ఈ సిద్ధాంతవాక్యమునందు "దేవీపరత్వే తు" యని "తు"కారమును చేర్చిరి. దాని యర్థము పూర్వపక్షమును నిరాకరించుట. వ్యాసుల వారు వ్రాసిన బ్రహ్మసూత్రములలో పూర్వపక్షనిరాకరణముకొరకు సిద్ధాంతసూత్రమునందు "తు" కారము నుంచుదురు. శ్రీశంకరులా విధముగనే భాష్యమున వ్యాఖ్యానింతురు సంధ్యాశబ్దమునకు దేవతార్థము చెప్పుటలో ఆ వ్యాసులవచనమునే ప్రమాణముగ చూపుచున్నారు. "న భిన్నాం ప్రతిపద్యేత గాయత్రీం బ్రహ్మణా సహ।

సాఽహమస్మీత్యుపాసీత విధినా యేన కేనచిత్॥ ఇతి వ్యాసవచనాత్త థైవ ప్రతీతేః॥ అని."

ఈ శ్లోకార్థము. ప్రాతఃకాలమున సంధ్యాదేవతకు ఉపాసన యందు గాయత్రి యని పేరున్నట్లు అత్రిమహాముని చెప్పిరి. అట్టి గాయత్రి యను పేరుగల ప్రాతఃసంధ్యాదేవతను ముందుగా "అసావాదిత్యో బ్రహ్మ" యను మంత్రముచేత పరబ్రహ్మముతో అభిన్నముగ ధ్యానింపవలెను. అని శ్లోకపూర్వార్ధముయొక్క అర్థము. తర్వాత "సాఽహమస్మి" సా=పరబ్రహ్మభిన్నమగు ఆ సంధ్యాదేవత, అహమస్మి= నేనే" యని ధ్యానింపవలెను. ఆ ధ్యానము=విధినా యేన కేనచిత్=యేనకేనచిత్ విధినా=సగుణాఽహంగ్రహోపాసన విధానముచే గాని, లేక-నిర్గుణాఽహంగ్రహోపాసనవిధానముచే గాని, ఎవరి కే యుపాసనయందధికారము కలదో వారు ఆ విధానముచేత సగుణ విధానముచే గాని, నిర్గుణవిధానముచే గాని ధ్యానింపవలెను. అని యర్థము. ఇతి వ్యాసవచనాత్=ఈ వ్యాసమహర్షివచనముచేత. తథైవ=అట్లే, అనగా-సంధ్యాశబ్దమునకు దేవతయే యర్థమని, ప్రతీతేః = తోచుచుండుటవలన, సంధ్యాశబ్దమునకు దేవతయే యర్థము, ఉపాసనాశబ్దమునకు ధ్యానమే యర్థము. అని భావము. ఇచ్చట "ధ్యానమేవ" అనిన్నీ. "తథైవ" అనిన్నీ రెండు చోటులందు "ఏవ" పదమును ప్రయోగించుటచేత ధ్యానమే యర్థము కాని, అనుష్ఠానమను నర్థమెంతమాత్రము కాదు" అనిన్నీ, సంధ్యాశబ్దమునకు దేవతయే యర్థము కాని ఆచమనాద్యభివాదనాంత కర్మకలాప మర్థము కాదనిన్నీ తమ సిద్ధాంతమును చెప్పిరి.

ఇట్లు సంధ్యోపాసనశబ్దమునకు సంధ్యాదేవతాధ్యానమను నర్థమును స్థిరపరచి, సంధ్యోపాసనను ప్రశంసించుచు నొక శ్లోకమును కూడ నుదహరించిరి.

"సర్వావస్థోఽపి యో విప్రః సంధ్యోపాసనతత్పరః।
బ్రాహ్మణ్యాచ్చ న హీయేత అన్యజన్మగతోఽపి సన్॥"

దీనికి శ్రీమిత్రమిశ్రులవారే వ్రాసిన లఘువ్యాఖ్య-

సర్వావస్థోఽపి=నిందితసేవాదికర్మరతః, సమ్యక్ శౌచాద్య సమర్థోఽపీత్యర్థః అని.

శ్లోకార్థము వ్రాయబడుచున్నది.

యో విప్రః = ఏ ద్విజుడు, సర్వావస్థోఽపి = నిందితసేవాదికర్మ రతః = నిందించదగిన వారికి (మ్లేచ్ఛులు మొదలగువారికి) సేవ జేయుట, ఆది—అట్టివియే మరి యేవైన నీచకర్మలు చేయవలసి వచ్చిన, ఆ పనులయందును తత్పరుడై మునిగియుండుచు, సమ్యక్ శౌచాద్యసమర్థోఽపి = చక్కగ కాలుసేతులు కడుగుకొనుట మొదలగు శుద్ధిపనులను చేసికొనుటకు వీలు లేనివాడైనప్పటికిని, (ఎంత యశుచిగ నున్నవాడైనను" యని యర్థము ) సంధ్యోపాసనతత్పరః = "అసావాదిత్యో బ్రహ్మ + సొఽహమస్మి" అను నుపాసన మంత్రముల యర్థమును భావించుచు, సకాలమునందు సంధ్యాదేవతాధ్యానమును విడువకుండ చేయువాడైన యెడల, అన్యజన్మ = మరుజన్మమును. గతోఽపి = పొందిన వాడైనను, బ్రాహ్మణ్యాత్ — బ్రాహ్మణ జన్మముకంటె, న హీయేత = తక్కువకులమున బుట్టడు, అని యర్థము

తాత్పర్యము : తాను శ్రోత్రియబ్రాహ్మణుడైనను. ప్రారబ్ధ కర్మవశమున-ఏ యితరమైన, చేయదగిన పనులు దొరకక, చేయ రాని పనులే (అనగా-మ్లేచ్ఛులను సేవించుట. ఆసుపత్రులలో మాంసపుఖండములను పరీక్షించుట, ఆసుపత్రిలోనే మగనరసుగ కుదిరి అంటరాని వారిని గూడ నంటుట, ఈ మొదలగు నిందిత కర్మలు) చేయుచు, సంధ్యాముఖ్యకాలమున. తనను శుద్ధముచేసికొనుటకు గూడ తీరిక లేక—పనులలో మునిగి యున్నవాడైనను, సంధ్యాముఖ్యకాలము రాగనే "అపవిత్రః పవిత్రో వా = ఇత్యాది శ్లోకమును మనసులో పఠించుకొని లోపలను వెలుపలను పరిశుద్ధుడనైతినని యనుకొని, సంధ్యావందనసంకల్పమును మాత్రము ననుకొని, ఇతరమైన అంగకర్మలను చేయుటకు వీలు కాదు కాన, వాటినన్నింటిని విడచిపెట్టి, "అసావాదిత్యో బ్రహ్మ + సొఽహమస్మి" అను మంత్రమును అర్థభావన చేయుచు, వీలైనంతసేపు ధ్యానించిన చాలును, స్వగృహమున మిక్కిలి ఆచారముతో సంధ్యోపాసన చేసిన ఫలము పూర్తిగ దీనికి కలుగును. సందేహము లేదు. ఇవి మహర్షుల వచనములు.

ఇంతియే కాదు. ఈ జన్మమున కృతార్థు డగుట మాత్రమే కాదు. అన్యజన్మ గతోఽపి = మరు జన్మమును పొందినను బ్రాహ్మణ్యాత్ న హీయేత = బ్రాహ్మణ జన్మ కంటె తక్కువ జన్మ రాదు.

బ్రాహ్మణ జన్మమునే యెత్తును. అని భావము. ఆహా! సంధ్యోపాసన మహిమ! దీనిని తెలిసికొని, మనకును దెలిపిన మహర్షు లెంత దయామయులు!

ఇందువలన తెలియునదేమనగా—ప్రస్తుతకాలమున జీవనము కొరకు పలు విధములగు నిందితవృత్తుల నవలంబించువారు తమ వృత్తివశమున సకాలమున యథావిధిగ సంధ్యోపాసనమును చేయ వీలు లేని బ్రాహ్మణులు చాలమంది యున్నారు.

వారు గూడ సకాలమున పైన జెప్పిన విధముగ సంధ్యోపాసనను జేసినయెడల పైన జెప్పిన ఫలమును తప్పక పొందుదురు. ప్రాయశ్చిత్తము కూడ చేయ నవసర ముండదు. కాని సకాలమున నింటి యందు తీరికగ నున్న యాతడు మాత్రము యథావిధిగ సంధ్యోపాసనను తప్పక చేయవలెను. ఎగవేయగూడదు. చాల పాపము కలుగును. పైన చెప్పినది ఆపద్ధర్మము.

ఈ శ్లోకమున "బ్రాహ్మణ్యాచ్చ" అను చోట నొక చకారము, "అన్యజన్మగతోఽపి" యను చోట నొక "అపి"యు నున్నవి. ఆ రెండింటివలన ఎక్కువ విశేషార్థము లభించుచున్నది. ఎట్లనగా— "అపి" పదమువలన, ఆ విధముగ సంధ్యోపాసనతత్పరుడైనవానికి అధికమగు ధ్యానైకాగ్రత వలన సాధారణముగ మరుజన్మముండదు. బ్రహ్మైక్యము గాని, లేక బ్రహ్మలోకప్రాప్తి గాని ఫలమగును ఒక వేళ నుపాసనబలము చాలక, మరుజన్మము నెత్తవలసి వచ్చినను, బ్రాహ్మణజన్మమే లభించునని భావము. ఇక చకారమువలన, బ్రాహ్మణజన్మము లభించుటమాత్రమే కాక పూర్వజన్మమునందు వదలిన సంధ్యోపాసనను మరుజన్మమున శీఘ్రముగనే యారంభించి తీవ్రవ్రతముతో చేసి, దాని పూర్ణఫలమును గూడ తప్పక పొందునని భావము.

అనగా-భగవద్గీత షష్ఠాధ్యాయమున శ్రీకృష్ణపరమాత్మ ధ్యానయోగభ్రష్టుని గురించి = "తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికం। యతతే చ తతో భూయః సంసిద్ధౌ కురునందన!" అని చెప్పినట్లు ఉపనయనమైనదే తడవుగ పూర్వజన్మమునందలి యుపాసనాభ్యాస సంస్కారము మనసులో మరల మేల్కొనగ, వెనుకటికంటె గూడ రెట్టింపు ఉత్సాహముతో బ్రహ్మజ్ఞాన సిద్ధికొరకు ప్రయత్నించి, తీవ్రతర-ఉపాసనవలన బ్రహ్మజ్ఞానమును పొంది,

మోక్షమును పొందును అని భావము. ఆహా! సంధ్యోపాసనమహిమ! కావున శ్రేయస్కాములగు ద్విజులు యథాశక్తిగ నితరధర్మకార్యములను చేసినను, చేయకపోయినను, సంధ్యోపాసనను మాత్రము తప్పక జేసి జ్ఞానసిద్ధిని బడయుదురు గాత!

ఇట్లనేకశ్రుతిస్మృతిపురాణవచనములచేత సకల వైదికకర్మలందును సంధ్యోపాసనమే ప్రధానమనియును, బ్రాహ్మణ్యరక్షకమనియును, మోక్షప్రదమనియును స్పష్టముగ నిర్ణయించుట యైనది.

అవతారిక : స్వగ్రంథమునకు ప్రామాణ్యమును సాధించుచు, అందరకు నది గ్రహింపదగినదని తెలుపబడుచున్నది.

**న కించిల్లిఖ్యతే యుక్త్యా**
**కింతు శ్రుతివచాంసి హి ।**
**అతోఽయం నిఖిలైర్గ్రాహ్యః**
**కృత్యాకృత్యబుభుత్సుభిః॥　　7।**

ఈ గ్రంథమున నేను నా స్వప్రతిభానుసారముగ స్వకపోల కల్పితమైన యుక్తులచేత నేమియును వ్రాయలేదు. అనార్షబుద్ధులమగు మనబోటివారము సర్వజ్ఞులము కాము గదా! గహనమగు వైదిక కర్మమార్గమున ననేక దోషములు కలుగవచ్చును కాన శ్రుతివచనములను, తదనుసారములగు స్మృతిపురాణవచనములను ప్రమాణముగ నిచ్చియే వ్రాయుచున్నాను. కావున కృత్యాఽకృత్యములను తెలిసికొనగోరు ద్విజవర్యులు ఈ గ్రంథమును ప్రమాణముగ గ్రహింతురు గాక!

ఇది

విద్వచ్ఛిరోమణి, సాహిత్యవిశారద, ద్విజబృందనిషేవి సోమయాజుల వేంకటాచలశాస్త్రిచే రచింపబడిన పూర్ణాభిధాంధ్రవ్యాఖ్యాసముపేతమగు సంధ్యాతత్త్వసుబోధినియందు ప్రథమాధ్యాయమున మంగళ-గ్రంథరచనాహేతుకథన — సంధ్యాప్రశంసాత్మకమగు ప్రథమ భాగము

సమాప్తము.

ఓమ్ తత్ సత్

శివమ్

## ఓమ్

"యత్సంధ్యాముపాసతే బ్రహ్మైవ తదుపాసతే।"

ఇతి శ్రుతిః।

# స ం ధ్యా త త్త్వ సు బో ధి ని

పూర్ణాభిధాంధ్రవ్యాఖ్యాసముపేతము

ప్రథమాధ్యాయము—ద్వితీయభాగము

సంధ్యోపాసనాంగిత్వసాధనము

అవతారిక · తనచే ముఖ్యముగ సాధింపదగిన యంగిని సాధించుటకొరకు ప్రతిజ్ఞ చేయబడుచున్నది.

**అంగాంగిజ్ఞానలోపేన**
**లోపోఽభూదంగినశ్చిరాత్।**
**అతోఽహం వివృణోమ్యంగా**
**వ్యంగి తచ్ఛాస్త్రయుక్తిభిః॥** 8।

సర్వశ్రౌత కర్మలయందును. సర్వస్మార్త కర్మలయందును అంగి యగు కర్మ యొకటి యుండును దానికి పూర్వాంగములని యును, ఉత్తరాంగములనియును కొన్ని కర్మలుండును. అందు వలన సంధ్యావందనమునందు గూడ అంగి (ముఖ్య) కర్మ యని యును, పూర్వోత్తరాంగము లనియును కలవు. కాని శ్రీభగవద్గీత

యందు "స కాలేనేహ మహతా యోగో నష్టః పరంతప!" ఓ యర్జునా! నాచేత పూర్వమున చెప్పబడిన యోగము ఈలోకమున దీర్ఘదీర్ఘమగు కాలమునందు అనగా కాలప్రవాహమునందు విచ్ఛిన్నసంప్రదాయము కలదైనది" అని శ్రీకృష్ణభగవానులు చెప్పినట్లు, దీర్ఘదీర్ఘ తరమగు కాలప్రవాహమునందు సరియగు నధికారులు విరళమగుటచేత పరంపరాగతమగు అంగాంగిజ్ఞానము లోపించినది. అంగాంగిజ్ఞానము లోపించుటచేత ఏది యంగియో, ఏవి యంగములో ఎవ్వరికిని తెలియకపోయినది. అందుచేత చాలకాలమునుండి అంగియొక్క అనుష్ఠానము లోపించినది. అంగిని విడిచిపెట్టి యంగములనే అంగి యను భ్రాంతితో నందరును చేయుచున్నారు. అందువలన అంగ్యనుష్ఠానము జరుగవలెననిన ముందు అంగాంగి జ్ఞానముండవలెను. కాన శాస్త్రానుసారముగను, శాస్త్రీయయుక్త్యనుసారముగను ఆయంగములు అంగియును విశదముగ వివరింపబడుచున్నవి.

అవ: ఆ యంగ్యనుష్ఠానలోపము వివరింపబడుచున్నది.

> సర్వేఽంగాన్యేవ కుర్వంతి
> 　　న కశ్చిత్కురుతేఽంగి తత్।
> ఋగ్యజుస్సంధ్యయోరత్ర
> 　　భాష్యకారౌ చ కారణమ్॥　　9।

పూర్వశ్లోకమున అంగ్యనుష్ఠానలోపమునకు దీర్ఘతమకాలము కారణమని తెలుపబడినది. కాని యది యొక్కటియే కారణము కాదు. ఇంకను వేరొక కారణము గలదు. ఏదనిన—ఋగ్వేద సంధ్యాభాష్యమును వ్రాసిన శ్రీచౌండపాచార్యులవారును, యజుర్వేద సంధ్యాభాష్యమును వ్రాసిన శ్రీకృష్ణపండితులవారును కూడ నీ విషయమున కారణములగుచున్నారు. వారు మాత్రమే కాక శ్లోకమున నున్న చకారమునకు శ్రీమద్వాల్మీకిరామాయణవ్యాఖ్యాతలగు శ్రీరామపండితేంద్రులును కొంత కారణమని యర్థము.

ఇది యభిప్రాయము. దీర్ఘకాలదోషముచేత నంగాంగిజ్ఞానము లోపింపగ—తర్వాత శ్రీచౌండపాచార్యులవారును, శ్రీకృష్ణపండితుల వారును తమతమ భాష్యములందు అంగములనె యంగిగ నిర్ణయించుటచేత "యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః। స యత్ప్రమాణం

కురుతే, లోకస్తదనువర్తతే॥" లోకమున శ్రేష్ఠుడు దేని నాచరించునో దేనిని ప్రమాణముగ గ్రహించునో యితర పామరజనులు కూడ దానినే యనుసరింతురు" అని భగవద్గీతయందు శ్రీకృష్ణపరమాత్మ చెప్పినట్లు, పామరులు పండితులు నందరును నట్లే యంగములనే యంగిగ నాచరించుచున్నారు. ఒక్కరును గూడ అంగిని ముఖ్య కర్మను) అచరింపకున్నారని భావము.

ఇట్లపమార్గమున పడి, తప్పించుకొనుటలో నేనే సరియగు నుదాహరణము. దానిని వివరించుచున్నాను.

సంధ్యావందనమును శ్రద్ధతో నాచరింపుచు, శాస్త్రమున నెట్లు వివరింపబడినదో తెలిసికొన జిజ్ఞాస గలవాడనై, ఆకాలమున 1924—1925 వ సంవత్సరములలో నాంధ్రదేశమున ప్రమాణముగ నంగీకరింపబడిన శ్రీకృష్ణపండితులవారి యజుర్వేదసంధ్యా భాష్యమును పూర్తిగ పరిశీలించితిని. అందు అర్ఘ్యప్రదానము, గాయత్రీజపము, సూర్యోపస్థానము నను మూడును సమప్రధానములనియును, అందునను అర్ఘ్యప్రదానము బలవత్ప్రధానమనియును చెప్పబడినది బలవత్ప్రధానమనగ "అంగి"-ముఖ్యము" అని యభిప్రాయము. నేను నట్లే శ్రద్ధతో నాచరించుచుంటిని

కొంతకాలమైన తర్వాత నా యిష్టదేవత యగు శ్రీలలితాంబికా పరదేవతయొక్క అనుగ్రహముచేత ప్రేరేపింపబడినవాడనై "సౌభాగ్య భాస్కర" మను శ్రీలలితాసహస్రనామభాష్యమును పఠించుచుండగ అందుత్తర పీఠికయందు డెబ్బదియవ శ్లోకము భాష్యమునందు సందర్భము ననుసరించి శ్రీభాస్కరరాయలవారు సంధ్యావందన విషయమున నిట్లు వ్రాసిరి. "ఏవం సంధ్యావందనపదవాచ్యం ప్రధానం "అసావాదిత్యో బ్రహ్మే"తి. మంత్రార్థానుసంధానం, ఆదిత్యావచ్ఛిన్న (బ్రహ్మ) చైతన్యస్య స్వాత్మచైతన్యేన సహ అభేదభావనా, రూపం. తచ్చ శిష్టానాం రహస్యాభిజ్ఞానామపి కాదాచిత్కమేవ,న సార్వదికమ్" అని.

అనగా-"ఆదిత్యమండలమునందున్న (బ్రహ్మ) చైతన్యము, తన యంతఃకరణములోనున్న (ప్రత్యక్) చైతన్యము ఈ రెండు నొక్కటియే అనునది "అసావాదిత్యో బ్రహ్మ" అను మంత్రమున కర్థము. ఈ యర్థమును (రెండు చైతన్యము లొక్కటియే యని) అను

సంధానము (ధ్యానము) చేయుటయే "సంధ్యావందన" పదమున కర్థము. సంధ్యావందనమనగా ఆ ధ్యానమే. ఆ ధ్యానమే ప్రధానమైనది. అంగి. అట్టి ధ్యానమును వేదాంతశాస్త్ర రహస్యమును తెలిసిన మహాపండితులు గూడ నెప్పుడో యొకప్పుడే సరిగ జేయగలరు. కాని ప్రతిదినము చేయలేరు. (ఏలననగా-కేవలనిర్గుణచైతన్యముల యొక్క అభేదభావన ఉత్తమాధికారులకే శక్యమగును కాన) అని వ్రాసిరి, ఆహా! అమూల్యములగు పదములు. అమృతాయమానములగు నక్షరములు,

ఆ రోజుననుండియే నా సంధ్యావందనపద్ధతిని మార్చగలిగిన యట్టి వ్రాతను చూడగనే, నే నానందనిర్భరుడనైతిని. నా బుద్ధి నేత్రము తెరచుకొనినది. నా జన్మము ధన్యమైనదనుకొంటిని. ఆహా! నా యానందమునకు మేరయే లేదు. ఏమి వర్ణింతును ?

నాటినుండి యైదు సంవత్సరములు బహుధర్మశాస్త్ర గ్రంథములను వేదాంతశాస్త్రగ్రంథములను, సంధ్యావందన పద్ధతిగ్రంథములను పురాణములనున్నూ శ్రద్ధతో పరిశీలించి, సంధ్యావందన విషయమున ఏవి యంగములో, యేది యంగియో చక్కగ తెలిసికొనగలిగితిని. అట్లు ధర్మశాస్త్రగ్రంథములను పరిశీలించి తెలిసికొనిన అంగాంగివివరములను ద్విజుల మోదముకొరకు విశదీకరింపబోవుచున్నాను.

అవ : సంధ్యాతత్త్వానుబోధినీగ్రంథము, శ్రుతిస్మృతి పురాణప్రమాణవచనముల నుదహరించుచు సంధ్యాతత్త్వము సులభముగ బోధపడుటకు గాను వ్రాయబడుచున్నది. ఐనను-శ్రుతిస్మృతి పురాణవిరుద్ధము లగునట్టియు, వాస్తవమైన సంధ్యాతత్త్వమునకు విరుద్ధములైన ఋగ్యజుస్సంధ్యావందనభాష్యాదిగ్రంథములను గూడ నిరాకరింపవలెను.

కాని-సంధ్యోపాసన శ్రద్ధాళువులగువారికి వాస్తవికసంధ్యాతత్త్వమును మాత్రము బోధించిన చాలదా? ఇతరమతముల నిరాకరించి, వారికి ద్వేషము కలిగింపనేల? యను ప్రశ్నము కలుగవచ్చును ప్రశ్నము మంచిదే కాని-ఇంతవరకు కొంతమంది మహాజనులననుసరించుచున్న ఋగ్యజుస్సంధ్యావందనభాష్యాదులను చూచి, మందబుద్ధులగువారు, పెద్దలు వ్రాసిన గ్రంథములు గదా! ప్రామాణికగ్రంథములే. మనము గూడ వీని ననుసరింపవచ్చును.

అని నిశ్చయించుకొనవచ్చును గదా! కావున-ఆ గ్రంథములు అసారములు, అసాధువులని నిరూపించుటకు గట్టి ప్రయత్నమునే తప్పక చేయవలయును.

అందు ఇతరమతనిరాకరణముకంటె-ముందు స్వమతస్థాపనము శ్రేష్ఠమని, ముందుగా స్వమతస్థాపనముకొరకు ప్రయత్నము చేయబడుచున్నది.

సంధ్యోపాసనమునకు అంగిత్వము సాధింపబడుచున్నది.

**శ్రుతిస్మృతివిధానాచ్చ**
**మాధవానుమతత్వతః ।**
**ప్రోక్తత్వాదభియుక్తైశ్చ**
**సంధ్యోపాసనమంగి తత్॥ 10।**

అర్థము = తత్ = "ఉద్యంతమస్తంయంతమాదిత్యం = ఇత్యాదితైత్తరీయబ్రాహ్మణశ్రుతియందు ప్రసిద్ధమైన, సంధ్యోపాసనం = "అసావాదిత్యో బ్రహ్మ" యను మంత్రముచేత చేయదగు సంధ్యాదేవతాధ్యానమే, అంగి = సంధ్యావందనకాలమున చేయబడు కర్మలన్నింటిలో ముఖ్యమైనది. అందుకు మూడు కారణములు చెప్పబడుచున్నవి.

అందు తొలిది- (1) శ్రుతిస్మృతివిధానాత్ = శ్రుతిచేతను స్మృతిచేతను విధింపబడినదగుటవలన. అందు శ్రుతిప్రమాణము = "అహరహః సంధ్యాముపాసీత" ప్రతిదినమును (మూడువేళలయందును) సంధ్యాదేవతను ధ్యానింపవలెను. అను శ్రుతివచనము సంధ్యాదేవతయొక్క ధ్యానమును నిత్యకర్మగ విధించుచున్నది. అట్లే = "సంధ్యాం మనసా ధ్యాయేత్ = సంధ్యాదేవతను మనసుచేత ధ్యానింపవలెను. అను ఐతరేయబ్రాహ్మణవచనము (3-8-1) సంధ్యాదేవతాధ్యానమును విధించుచున్నది. స్మృతిప్రమాణవచనము "సంధౌ సంధ్యాముపాసీత, నాస్తగే నోద్గతే రవౌ" సాయంకాలమున సూర్యుడస్తమింపకమునుపును ప్రొద్దున సూర్యుడుదయింపకమునుపును, సంధ్యాకాలమున సంధ్యాదేవతను ధ్యానింపవలెను. అను యాజ్ఞవల్క్యస్మృతివచనము, సంధికాలమున సంధ్యాదేవతాధ్యానమును విధించుచున్నది. ఇంకను = తొలుత వ్రాయబడిన సంధ్యా

ప్రశంసయందలి కొన్ని వచనములచేత అన్వయముఖముగను, మరి కొన్ని వచనములచేత (15, 17, 20, 21 మొదలగు సంఖ్యలు గల వచనములచేత) వ్యతిరేకముఖముగను సంధ్యాదేవతాధ్యానమే అంగిగ విధింపబడుచున్నది.

ఇంకను— ఆశ్వలాయనగృహ్యపరిశిష్టద్వితీయఖండమున = "అథ సంధ్యాముపాసీతేత్యాచార్యాః యావహోరాత్రయోః సంధీ, యశ్చ పూర్వాపరాహ్ణయోః, తత్కాలభవా దేవతా సంధ్యా. తాముపాసీత." అని.

అర్థము. సంధ్యనుపాసింపవలెనని యాచార్యులవారు చెప్పుచున్నారు.

రాత్రింబవళ్లయొక్క సంధికాలములందును, పూర్వాహ్ణాఽపరాహ్ణములయొక్క సంధికాలమం (మధ్యాహ్నకాలమం)దును (ఉపాసకులుపాసించుటకొరకు ఆదిత్యమండలమునందు) సంనిహితమైన దేవతయే సంధ్యాదేవత ఆదేవతనుపాసింపవలెను. ధ్యానింపవలెను. అని.

ఇచ్చట (1) సంధ్యాశబ్దమునకు దేవతయే యర్థము. (2) ఆ దేవతనుపాసింపవలెను, ధ్యానింపవలెను. (3) ఆసంధ్యోపాసనము మూడుసంధికాలములందు చేయవలెను. అను మూడు ముఖ్యవిషయములు అతిస్పష్టముగ చెప్పబడినవి.

3) విష్ణుస్మృతి=

"కాలద్వయేఽపి సంధ్యాఖ్యదేవతాయా ఉపాసనం।
కుర్వన్ దిశో నమస్కుర్యాద్దిగీశాంశ్చ పృథక్ పృథక్॥"

ప్రాతస్సాయంసంధ్యలనెడు రెండుకాలములందును సంధ్యాదేవతను ధ్యానించునుపాసకుడు, సంధ్యోపాసనోత్తరాంగముగ, దిక్కులనున్ను, దిక్పతులనున్ను వేరువేరుగ నమస్కరింపవలెను. అని.

ఈ వచనము తొలుత ప్రధానముగ (అంగిగ) విధింపబడిన సంధ్యోపాసనమునను వదించుచు, దానికుత్తరాంగముగ దిఙ్నమస్కారమును విధించుచున్నది. ఇచ్చట "సంధ్యాఖ్యదేవతాయాః" "సంధ్యయను పేరుగల దేవతయొక్క" అనుచు సంధ్యాపదమునకు

సంధ్యాదేవతయే యర్థమనియును, సంధ్యోపాసనమే ప్రధానమని యును స్పష్టముగ చెప్పబడినది. ఇంతకంటె స్పష్టత మరెచ్చట నుండును? దీనిని కాదనువారెవరు? దీనికి పూర్వమీమాంసకు లేమనియెదరు?

4) స్మృతిముక్తాఫలము=

"సాయంసంధ్యాముపాసీత, ప్రోక్ష్య సూర్యస్య చాంజలిం।
దత్వా ప్రదక్షిణం కృత్వా, జలం స్పృష్ట్వా విశుద్ధ్యతి॥ అని"-

సాయంసంధ్యాదేవతనుపాసింపవలెను. ఎట్లు? ఈ క్రిందివిధ ముగ, తొలుత మార్జనము చేసికొని, (తర్వాత అబ్భక్షణపునర్మార్జన పాపపురుషదహనములను కూడ చేసి, తర్వాత) అర్ఘ్యప్రక్షేపములను చేసి, ప్రదక్షిణమును చేసి, ఆచమనమును చేసిన యెడల మందేహ రాక్షసుల జంపిన పాపమునుండి శుద్ధుడగును. తర్వాత సంధ్యాదేవత నుపాసింపవలెను. అని. ఇచ్చట తొలుత సంధ్యోపాసనమును ప్రధా నముగ విధించి—దానినెట్లు చేయవలెనను ప్రశ్న రాగా-క్త్వాంతపద ములచేత (తెనుగున అసమాపకక్రియలచేత) ఉపాసనాపూర్వాంగ ములు చెప్పబడినవి ఇట్లే స్మృతులందు ప్రధానమగు సంధ్యోపాస నమును ముందు విధించి, తర్వాత ప్రకరణానుసారముగ పూర్వాంగ ములో లేక ఉత్తరాంగములో లేక నేదైన యొక యంగమో విధింప బడుచుండును పూర్వోక్తవిష్ణుస్మృతియందు దిఙ్నమస్కారరూప మగు నొక్క ఉత్తరాంగమే విధింపబడినది.

ఇప్పుడే యుదహరింపబడబోవు స్మృతిచంద్రికావచనము= ప్రధానమగు సాయంసంధ్యోపాసనమును విధించి, ఉత్తరాంగమగు గాయత్రీజపము నొక్కదానినే విధించినది.

5) స్మృతిచంద్రిక=

"ఉపాస్య పశ్చిమాం సంధ్యాం సాదిత్యాం వై యథావిధి।
గాయత్రీమభ్యసేత్తావద్యావదృక్షాణి పశ్యతి॥"

సూర్యుడస్తమింపక మునుపే సాయంసంధ్యాదేవతను యథా విధిగ ధ్యానించి, తర్వాత నక్షత్రదర్శనపర్యంతము గాయత్రీమంత్ర మును జపింపవలెను. అని.

ఈ వచనము తొలుత, ప్రధానముగ విధింపబడిన సంధ్యోపాసనము ననువదించి, జపింపవలసిన కాలముతో కూడ, గాయత్రీజపమును సంధ్యోపాసనోత్తరాంగముగ విధించుచున్నది. ఇందువలన తెలియుచున్నదేమనగా —సంధ్యోపాసన వేరు. గాయత్రీజపము వేరు అని.

ఇట్టి ప్రమాణవచనములు శ్రీచౌండపాచార్యులవారికిని శ్రీకృష్ణ పండితులవారికిని, శ్రీరామపండితేంద్రులవారికిని ఏల కంట బడలేదో? తెలియకున్నది.

6) శాతాతపస్మృతి=

"సూర్యేఽస్తశిఖరం ప్రాప్తే పాదశౌచక్రియాన్వితః।
బహిఃసంధ్యాముపాసీత కుశతార్ణఃసమాహితః॥
ఆచమ్య సంధ్యాం సంకల్ప్య మార్జయిత్వా చ పూర్వవత్।
గాయత్ర్యాఽఽపస్త్రిరుత్క్షిప్య, ప్రదక్షిణమథాచరేత్॥
సంధ్యాం ధ్యాత్వోపవిష్టస్తు వాగ్యతః సుసమాహితః।
ప్రణవవ్యాహృతియుతాం గాయత్రీం పూర్వవజ్జపేత్॥
కృత్వా స్వశాఖావిహితమాదిత్యముపతిష్ఠతే।
వారుణీభిరుపస్థాయ దిశశ్చైవోపతిష్ఠతే॥" అని.

అనగా-సూర్యుడస్తమింపబోవుచుండగ - (సూర్యాస్తమయమునకు ఒక గడియ అనగ 24 నిమిషములు ముందు) సాయంసంధ్యోపాసనమును చేయవలెను. ముందుగ కాళ్ళను, చేతులను ముడుకులవరకును కడుగుకొనవలెను. ముఖమును కడుగుకొనవలెను. గ్రామమునకు వెలుపల గాని వీలు లేనియెడల గృహమునకు వెలుపల గాని, దర్భాసనమున కూర్చొని సంధ్యోపాసనమును చేయవలెను. తొలుత ఆచమనము చేసి, సంధ్యోపాసన సంకల్పమును చేసి, ప్రథమమార్జనమును ప్రాతఃకాలమందువలె చేయవలెను. గాయత్రీమంత్రముతో జలము నభిమంత్రించి. మూడర్ఘ్యములను చిమ్మవలెను తర్వాత ప్రదక్షిణాచమనములను చేయవలెను తర్వాత, కూర్చొని మూడు ప్రాణాయామములచేత, నెమ్మదియైన మనసు గలవాడై, మౌనియై, సంధ్యాదేవతను ధ్యానింపవలెను తర్వాత ప్రణవవ్యాహృతులతో కూడిన గాయత్రీమంత్రమును ప్రాతఃకాలమందు

వలెనే జపింపవలెను. తర్వాత తన వేదశాఖావిహిత వారుణమంత్ర ములతో సూర్యోపస్థానమును చేసి, దిఙ్నమస్కారమును చేయవలెను అని.

ఇచ్చట నాలుగు శ్లోకములచేత సాయంసంధ్యావందనము పూర్తిగ వర్ణింపబడినది. అందు వెనుక జెప్పినరీతిగ మొదటి శ్లోక ములో ప్రధానమగు సంధ్యోపాసన విధింపబడినది, తర్వాత సంధ్యో పాసన నెట్లు చేయవలెనను ఇతికర్తవ్యతాకాంక్ష రాగా-ఆచమనాది- దిఙ్నమస్కారము వరకు పూర్వోత్తరాంగములతో వర్ణింపబడినది.

అందునను-ఆచమనము మొదలు, అర్ఘ్యప్రక్షేపము ప్రదక్షిణం వరకును పూర్వాంగములను, గాయత్రీజపము మొదలు దిఙ్నమస్కా రమువరకు గల ఉత్తరాంగములనున్నూ "పూర్వవత్కృత్వా" ప్రాతఃకాలమునందు వలెనే చేయవలెనని చెప్పి-ప్రధానమగు సంధ్యో పాసనము మాత్రము "వాగ్యతః, ఉపవిష్టః, సుసమాహితః, సంధ్యాం ధ్యాత్వా" యని విశేషముగ వర్ణింపబడినది. "సంధ్యాం ధ్యాత్వా" యని = సంధ్యోపాసన యనగ—సంధ్యాదేవతాధ్యానమనియును, సుస్పష్టముగ చెప్పబడనది.

పై ముగ్గురును ఈ శాతాతపస్మృతివచనమును చూచి యుండరా ?

"శ్రుతిస్మృతి విధానాచ్చ" అనుచోట నధికముగనున్న "చకా రము" వలన మరియొక విశేషార్థము లభించుచున్నది. ఎట్లనగా= "ప్రధానం ఫలసంబంధి, తత్సంబంధ్యంగముచ్యతే" అని శ్రీ జైమి న్యాచార్యులవారు ప్రధానమునకును (అంగికిని) దాని యంగమున కును లక్షణములను జెప్పిరి. దానియర్థము=ఏకర్మ, ముఖ్యఫలము నిచ్చునో యది ప్రదానము, అట్టి ప్రధానకర్మతో సంబంధించి యుండు వేరొక కర్మ అంగకర్మ" అని.

ప్రకృతమున "ఉద్యంతమస్తంయంతమాదిత్యం = బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి య ఏవం వేద" అను తైత్తరీయబ్రాహ్మణవచనము చేతను, సంధ్యాప్రశంసయందలి 7, 8 సంఖ్యలు గల విష్ణుస్మృతి గోభిలవచనములచేతను సంధ్యోపాసనకు జీవబ్రహ్మైక్యము (బ్రహ్మ భావాపత్తి) గాని, చతుర్ముఖబ్రహ్మలోకావాప్తిగాని ఫలమని చెప్పబడి నది. దీని నెవ్వరు కాదనగలరు ? ఇంకను=సంధ్యోపాసనము మాన

సికము. మానసికమగుదానికే జీవబ్రహ్మైక్యము ఫలమగును. అర్ఘ్య ప్రక్షేప-గాయత్రీజప-సూర్యోపస్థానాదులు మానసికములు గావు. కాయికములు, వాచికములును· కాయికవాచికకర్మలకు బ్రహ్మైక్యము సాక్షాత్ఫలము కానేరదు. కాగా—మానసికమగు సంధ్యోపాసనకే జీవ బ్రహ్మైక్యమనెడు ముఖ్యఫలముతో సాక్షాత్సంబంధము గలదు. కావున జైమినిమునిమతప్రకారము గూడ సంధ్యోపాసనమే ప్రధానము, అంగి, యగుచున్నది. అర్ఘ్యప్రక్షేపాదులు సంధ్యోపాసనమునకు ఉప కారము చేయుచున్నవై సంధ్యోపాసనతో సంబంధించినవి. కావున నవి యంగములే యగును. అంగి ఎంతమాత్రము కానేరవు,

ఇక రెండవకారణము చెప్పబడుచున్నది.

"మాధవానుమతత్వతః" అని, అనగా వైదికశిరోమణులును, వేదభాష్యకర్తలును, సర్వతంత్రస్వతంత్రులును, తిరుగులేని ప్రామాణికాగ్రేసరులునగు,సర్వజ్ఞమాధవాచార్యులవారు తమ పరాశర మాధవీయమున (పరాశరస్మృతికి తాము వ్రాసిన వ్యాఖ్యానము నందు) సంధ్యావందన ప్రకరణమున సంధ్యోపాసనమునకే ప్రధాన ఫలముతో ప్రత్యక్షసంబంధమును వివరించుటచేత ప్రధానత్వరూప మగు అంగిత్వమును అంగీకరించిరని భావము. ఎట్లనగా=

పరాశరమాధవీయమున వారిట్లు వ్రాసిరి.

"సంధ్యాముపాసీతేత్యుపాసనమభిధ్యానమ్‌॥ అత ఏవ తైత్తిరీయబ్రాహ్మణం—"ఉద్యంతమస్తంయంతమాదిత్య మభిధ్యాయన్ కుర్వన్ బ్రాహ్మణో విద్వాన్ సకలం భద్రమశ్నుతేఽసావాదిత్యో బ్రహ్మేతి, బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి య ఏవం వేద ఇతి।

అయమర్థః=విద్వాన్ బ్రాహ్మణః వక్ష్యమాణప్రకారేణ ప్రాణాయామాదికం కర్మ కుర్వన్, యథోక్తనామాదిభిర్ధ్యేయం అదిత్యం సంధ్యాశబ్దవాచ్యం, బ్రహ్మేతి ధ్యాయన్ శుద్ధాంతఃకరణో భూత్వా బ్రహ్మ సాక్షాత్కురుతే, స పూర్వమపి బ్రహ్మైవ సన్, అజ్ఞానాత్ జీవత్వం ప్రాప్తః, యథోక్తజ్ఞానేన తదజ్ఞానాఽపగమే బ్రహ్మైవ ప్రాప్నోతి॥ఇతి॥

"పేదవానికి పెన్నిధి వలె" యను సామెత గలదు. సంధ్యా తత్వానుబోధముకొరకు, తహతహలాడుచున్న జ్ఞానదరిద్రుడనగు నాకు

పైన వ్రాసిన తైత్తరీయబ్రాహ్మణభాగము, దానికి శ్రీసర్వజ్ఞమాధవా చార్యులవారు వ్రాసిన వ్యాఖ్యయును పెన్నిధికి మించినదే. సర్వజ్ఞ మాధవాచార్యులవారికివే నా కోటికోటి సాష్టాంగ దండప్రణామములు.

తర్వాత=సంధ్యోపాసనస్వరూపమును అతి స్పష్టముగ తెలిపి, యదియే ప్రధానమని వ్రాసిన శ్రీభాస్కరరాయలవారికి, నివే నా కోటి కోటి సాష్టాంగదండప్రణామములు, పై బ్రాహ్మణభాగము, దాని వ్యాఖ్యయును, యావత్పండితకోటికని శిరోధార్యములే గదా!

పైదాని యర్థమిది=

సర్వతంత్రస్వతంత్రులును, సర్వజ్ఞులునగు శ్రీమాధవాచార్యు లవారు పూర్వోత్తరతంత్రములయొక్క సారము నెరుగనివారు కారు గదా! ఉభయతంత్రసారవిదగ్రగణ్యులు. జైమినీయన్యాయమాల యను పూర్వతంత్రసారప్రదర్శిని యగు గ్రంథరాజమును గూడ రచించినవారు.

ఇక=(1) పూర్వమీమాంసకులు పరబ్రహ్మము నంగీకరింపరు. (2) పూర్వమీమాంసకులు జీవబ్రహ్మైక్యరూపమోక్షపురుషార్థము నంగీకరింపరు. (3) వారి జీవుడు ఔపనిషదజీవుని వంటివాడు కాడు. (4) జగత్తు ప్రవాహనిత్యము. అని యందురు.

ఇన్ని తత్త్వములు తెలిసిన శ్రీమాధవాచార్యులవారు వ్యాఖ్యానా రంభముననే పూర్వమీమాంసామతఖండన మొనరించుచు నారంభిం చిరి. ఎట్లు? "అహరహః సంధ్యాముపాసీత" యను శ్రుతివాక్యము నకు పూర్వమీమాంసకులు శ్రుతిస్మృతులకు-విరుద్ధముగ అర్థమును చెప్పుదురు. "సంధ్యాం=ఆచమనము మొదలు చివరి యభివాద నమువరకు గల పదిపంద్రెండు కర్మల మొత్తమంతయును అర్థమట. అట్టి సంధ్యను, ఉపాసీత=అనుష్ఠింపవలెను.. అని యర్థమును చెప్పు దురు. సంధ్యాశబ్దమునకు ఈ కర్మకలాపమంతయు నర్థమైనయెడల =సంధ్యాదేవత యనునదే వారిమతమున నుండదు శ్రుతిస్మృతు లకు—పూర్వమీమాంసామతము ఈసంధ్యావందనవిషయమున నెట్లు విరుద్ధముగ నున్నదో వివరించెదను తొలుత నొకసారి వ్రాసితిని. కాని యిది ముఖ్యసందర్భము. ముందు శ్రుతివిరోధము="సంధ్యాం మనసా ధ్యాయేత్" ఐతరేయబ్రాహ్మణము. (3-8-1) సంధ్యాదేవ తను మనసున ధ్యానింపవలెను. స్మృతివిరోధము=సంధ్యాప్రశంస

లోని, 9 10, 11 సంఖ్యలు గల యోగియాజ్ఞవల్క్య, శ్రీమహాభారత, భరద్వాజస్మృతివచనములు, దిఙ్మమస్కారవిధాయక విష్ణుస్మృతివచనము, "సంధ్య" యన దేవత యనియును. ఉపాసన మనగ ధ్యానమనియును నతిస్పష్టముగ చెప్పుచున్నవి. కాన వానికి పూర్వమీమాంసామతము విరుద్ధము. కావున సర్వజ్ఞులగు శ్రీమాధవాచార్యులవారు ఆదిలోనే పూర్వమీమాంసామతమును ఖండించిరి. ఎట్లు? "సంధ్యాముపాసీతేత్యత్ర ఉపాసనమభిధ్యానం" అనగా= సంధ్యాముపాసీత యను విధివాక్యముసందలి "ఉపాసీత" పదమున కర్థమైన ఉపాసనమనగా=అభిధ్యానమే, కాని పూర్వమీమాంసకులు చెప్పినట్లు అనుష్ఠానమర్థము కాదు. అని, తామే స్వయముగ పరమ ప్రామాణికులైనను అన్నింటికంటె పెద్దప్రమాణమగు వేదమునే, యాయర్థమున ప్రమాణముగ నుదహరించిరి "అతఏవ తైత్తిరీయ బ్రాహ్మణం = "ఉద్యంతమస్తంయంతమాదిత్యమభిధ్యాయన్ = అనుచు=అభిధ్యాయన్ అని వేదమే చెప్పుచున్నది. కాన "అనుష్ఠాన" మను నర్థమును చెప్పకూడదనినారు ఇంకను-నిత్యకర్మలకు ఫలము లేదనియును, కావున నిత్యకర్మయగు సంధ్యావందనమునకు ఫలమే లేదనియును పూర్వమీమాంసకులు నిర్ణయించిరి ఆ నిర్ణయమును గూడ "బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి" యను వచనమున కర్థము వ్రాయుచు నీ తైత్తిరీయబ్రాహ్మణవచనముతోనే ఖండించిరి. అభిధ్యానపదమునకు పూర్తియగు నర్థము ఉత్తరత్ర, ప్రతీకోపాసన నిర్వచనసందర్భమున వివరింపబడును. ఐననంతవర కాగనేల. ఇప్పుడే తెలిసికొనుటుచితము ప్రశ్నోపనిషద్భాష్యమున శ్రీశంకరు లిట్లు వ్రాసిరి. "బాహ్యవిషయేభ్యః ఉపసంహృతకరణస్య సమాహితచిత్తస్య (సాధకస్య) బ్రహ్మణి విభిన్నజాతీయ ప్రత్యయాంతరాఽఖిలీకృతః నిర్వాతస్థదీపశిఖాసమః, ఆత్మప్రత్యయసంతానావిచ్ఛేదః అభిధ్యానశబ్దార్థః॥ అని ప్రస్తుత సందర్భముకొరకు-మూలావిరుద్ధముగ ఒకటిరెండుపదములలో కొంచెము మార్పు చేయబడినది పైదాని యర్థము=వెలుపలి విషయములనుండి అంతఃకరణమును పూర్తిగ వెనుకకు మరల్చుకొన్నట్టియు అందువలన నెమ్మదియైన మనసుగల సాధకునియొక్క, ఇతరమైన తలంపులు మధ్య మధ్య దూరకుండ మధ్యమధ్య తెగిపోకుండ తైలధారవలె అవిచ్ఛిన్నమైన "పరబ్రహ్మము నేనే" యనుచు చేయబడిన ఒకేవిధమగు ధ్యానప్రవాహము అభిధ్యానపదమున కర్థము అంతియే కాని ఏదోయొక విషయమును మనసులో నాలుగైదుసారులను కొనుట అభిధ్యానము

కాదు. ప్రకృతమునకు వ్యత్రము. శ్రీమాధవులవారివ్యాఖ్యానమున కర్థము.

విద్వాన్=సంధ్యోపాసనమంత్రార్థమును, సంధ్యోపాసనపద్ధతిని తెలిసికొనిన, బ్రాహ్మణః=ఏబ్రాహ్మణుడు, కుర్వన్=ఉత్తరత్ర చెప్ప బడబోవు ప్రాణాయామాదికర్మలను చేయుచున్నవాడై, యథోక్త నామాదిభిః ధ్యేయం=అత్రిమహాముని చెప్పిన నామరూపవర్ణాదులతో ధ్యానముచేయదగిన, సంధ్యాశబ్దవాచ్యం ఆదిత్యం=సూర్యమండ లమునందున్న బ్రహ్మచైతన్యస్వరూపిణియగు సంధ్యాదేవతను, బ్రహ్మేతి ధ్యాయన్=పరబ్రహ్మభిన్నముగ ధ్యానముచేయుచు, (తర్వాత "సోఽహమస్మి" యనుచు నా సంధ్యాదేవతను తనతో నభి న్నముగ ధ్యానమును కూడ చేయుచు) శుద్ధమైన యంతఃకరణము గలవాడై పరబ్రహ్మ సాక్షాత్కారమును పొందునో, యాతడు, ఈ ధ్యానము చేయుటకు ముందునుండియు కూడ, పరబ్రహ్మముగనే యుండుచున్నా, అజ్ఞానము (అవివేకము) చేత తాను జీవుడననియే, భ్రాంతిపడుచు, తొలుత జెప్పిన సంధ్యోపాసనమంత్రార్థజ్ఞానము చేతను, సంధ్యోపాసనపద్ధతి జ్ఞానముచేతనున్నా వెనుకటి యజ్ఞా నము పూర్తిగ పోగా=పరబ్రహ్మైక్యమునే పొందును" అని.

"అసావాదిత్యో బ్రహ్మ + సోఽహమస్మి" యను మంత్రముచేత సంధ్యాదేవతను సూర్యమండలమందు అభిధ్యానింపగ నభిధ్యానిం పగ ఉపాసకుని యంతఃకరణము శుద్ధమై బ్రహ్మసాక్షాత్కారమునకు యోగ్యమగును.

ఈ తైత్తిరీయబ్రాహ్మణభాగమునకు అర్థమును వ్రాయుచు శ్రీమాధవాచార్యులవారు "అసావాదిత్యో బ్రహ్మ + సోఽహమస్మి యను మంత్రార్థానుసంధానమునకు జీవబ్రహ్మైక్యరూపమోక్షమే ఫల మని చెప్పుచు మోక్షరూప ముఖ్యఫలముతో ప్రత్యక్షసంబంధమున్నది గాన ఈ సంధ్యోపాసనమే ప్రధానము, అంగి, యని కంఠోక్తిగ చెప్పి నట్లే వ్రాసిరి. ఇంకను "అభిధ్యాయన్" పదమునకు తర్వాతనున్నను "కుర్వన్" పదమును "ప్రాణాయామాదికం కర్మ కుర్వన్" అనుచు ముందుగా వ్యాఖ్యానము చేయుచు, ప్రాణాయామము మొదలు అభి వాదనము వరకుగల కర్మలనన్నింటిని ఉపాసనకు అంగములుగ చెప్పిరి.

శ్రీమాధవాచార్యులవారు పైవ్యాఖ్యానమునందు "అసావాదిత్యో బ్రహ్మ" యను నుపాసనమంత్రమునందలి "అసౌ + అదిత్యః + బ్రహ్మ" యను మూడు పదములలో చివరిదగు "బ్రహ్మ" పదమునకు "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" పరబ్రహ్మము సత్యమైనది జ్ఞాన (చైతన్య) రూపమైనది అనంతమైనది. యని తైత్తరీయోపనిషత్తే వ్యాఖ్యానించుటవలన, దానిని విడిచిపెట్టి, మిగిలిన "అసౌ, అదిత్యః" యను రెండుపదములకే యర్థమును వ్రాసిరి "అసౌ" = యథోక్తనామాదిభిః ధ్యేయం"-అనగా-అత్రిగౌతమమహర్షులచేత వర్ణింపబడిన వర్ణ (రంగు) రూప-నామ-వాహనాదులతో కూడియున్నట్లు ధ్యానింపదగినది యనియును, అదిత్యపదమునకు "సంధ్యాశబ్దవాచ్యం ఆదిత్యం" అనగా-"సంధ్యా హి సూర్యగం బ్రహ్మ" సూర్యమండలమందు సూర్యజీవప్రేరకమగు బ్రహ్మచైతన్యము "సంధ్య" యని వ్యాసులవారు చెప్పినట్లు, సంధ్యాశబ్దమునకర్థమైన ఆదిత్యుడని యర్థమును వ్రాసిరి. అనగా-ఆదిత్యపదమునకు ఆదిత్యమండలమును గాని, ఆదిత్యజీవుని గాని యర్థమును చెప్పక, ఆదిత్యజీవుని ప్రేరేపించు బ్రహ్మచైతన్యమునే లక్షణచేత అర్థము చెప్పవలెనని భావము.

ఇక మూడవ కారణము = "ప్రోక్తత్వాదభియుక్తైశ్చ" అని.

అభియుక్తులైనవారు గూడ "అసావాదిత్యో బ్రహ్మ" అను మంత్రముచే చేయబడు సంధ్యోపాసనమే "ప్రధానము, అంగి" యని స్పష్టముగ జెప్పిరి. అభియుక్తులనగా-పదవాక్యప్రమాణజ్ఞులును (తర్క వ్యాకరణమీమాంసాశాస్త్రజ్ఞులును) బహుశ్రుతులును, ప్రామాణికాగ్రేసరులు నగు మహాపండితులు.

ఉదాహరణము తీయబడుచున్నవి.

(1) వేదశాస్త్రపురాణాగమములు తెలిసినవారును, ప్రామాణికాగ్రేసరులునగు శ్రీభాస్కరరాయలువారు తాము రచించిన సౌభాగ్య భాస్కరమను శ్రీలలితాసహస్రనామభాష్యమునందు త్తరపీఠికయందు తృతీయాధ్యాయమున డెబ్బదియవ శ్లోకముయొక్క భాష్యమునందిట్లు వ్రాసినారు. "ఏవం సంధ్యావందనపదవాచ్యం ప్రధానం "అసావాదిత్యో బ్రహ్మే"తి మంత్రార్థానుసంధానం ఆదిత్యావచ్ఛిన్నచైతన్యస్య స్వాత్మచైతన్యేన సహాఽభేదభావనారూపం॥ అని.

అనగా-"అసావాదిత్యో బ్రహ్మ" (సోఽహమస్మి) యను మంత్రార్థానుసంధానము = "ఆదిత్యమండలములోపల అంతర్యామి (మిక్కిలి లోపలనున్నది) యైయున్న బ్రహ్మచైతన్యము, తన యంతఃకరణము లోపలనున్న ఆత్మచైతన్యము (బ్రహ్మచైతన్యమే-ప్రత్యక్చైతన్యమని పేరు) ఈ రెండు నొక్కటియే" యనుచు, చేయు, అనుసంధానము అనగా ధ్యానమే "సంధ్యావందన" పదమున కర్థము. ఈ ధ్యానమే (సంధ్యాదేవతోపాసనమే) మొత్తము సంధ్యావందనమునందు ప్రధానము. ముఖ్యము. అంగి. అని సుస్పష్టముగ వ్రాసిరి.

2) స్మృతిరత్నమహోదధి=

"అసావాదిత్యో బ్రహ్మేతి యద్ధ్యానం క్రియతేఽన్వహం।
తదేవ సాంధ్యమిత్యుక్తం కర్మ బ్రహ్మోపకారకమ్॥"

ఈ శ్లోకార్థము సంధ్యాప్రశంసయందు ఐదవయుదాహరణముగ పూర్తిగ వివరింపబడినది. ముఖ్యకాలమున సంధ్యోపాసన చేయని వాని బ్రాహ్మణ్యము తగ్గిపోవునని శాతాతపమహర్షివచనము చెప్పుచున్నది. కాన బ్రాహ్మణ్యమునకు మూలమగు సంధ్యోపాసనమును చేయదగుమంత్రము "అసావాదిత్యో బ్రహ్మ" యనునది యని ఈ స్మృతిరత్నమహోదధి తైత్తిరీయబ్రాహ్మణమునను వదించుచున్నది. ఇట్లు సంధ్యోపాసనమే బ్రహ్మజ్ఞాన సంపాదకమై బ్రాహ్మణ్యరక్షకమై సంధ్యావందనమున ప్రధాన (అంగి) కర్మ యని స్పష్టముగ చెప్పుచున్నది.

3) వైద్యనాథదీక్షితులవారు = స్మృతిముక్తాఫలగ్రంథకర్త.

తమ స్మృతిముక్తాఫలమున - సర్వజ్ఞమాధవాచార్యులవారు పరాశరమాధవీయమున వ్రాసినదానినే విశదముగ వివరించి దాని ఫలితాంశముగ "తేనాత్ర సంధ్యోపాసనమేవ ప్రధానం అన్యత్సర్వం మార్జనాది-అంగజాతమిత్యవదేయమ్" అని యనిరి.

అనగా-"శ్రీసర్వజ్ఞమాధవాచార్యులవారు చక్కగ వ్యాఖ్యానించినారు. కాన ఆచమనాద్యభివాదనము వరకుగల కర్మలలో సంధ్యోపాసనమే ప్రధానము. అంగి మిగిలిన మార్జనము మొదలు అభివాదనము వరకు గల కర్మలన్నియును అంగములే, యని జాగ్రత్తగ తెలిసికొనవలయును. అని అత్యంత స్పష్టముగ చెప్పినారు.

ఇంకను="సంధ్యాత్రయేఽపి కర్తవ్యం ప్రాణాయామత్రయం బుధైః॥ మూడుసంధ్యలందును తెలిసినవారు మూడేసిప్రాణాయామములను చేయవలెను". అనెడు దక్షస్మృతివచనము విధించిన మూడుప్రాణాయామముల నెచ్చట చేయవలెనను సందేహము కలుగగ-శ్రీ దీక్షితులవారు ఆప్రాణాయామములను "అసావాదిత్యో బ్రహ్మ" యను మంత్రముతో చేయబడు సంధ్యాధ్యానమునకు ముందు చేయవలెను" అని చెప్పిరి. కాగా దీక్షితులవారి మతమున సంధ్యోపాసనమ"నునది యొకటి యున్నట్లు నిర్ణయముగదా!

4) వైష్ణవస్మృతిముక్తావళి=(మద్రాసు అడయారు గ్రంథాలయమున)=ఇది అభియుక్తులలో చేరదు. శ్రుతివర్గముననే చేరును.

"యత్సంధ్యాముపాసతే, బ్రహ్మైవ తదుపాసతే" ఇతి శ్రుతేః॥ అని.

సంధ్యోపాసనము బ్రహ్మోపాసనమే" యని స్మృతిముక్తావళీకారు లిచ్చిన శ్రుతివచనము "సంధ్యోపాసనము బ్రహ్మోపాసనమే కావున జీవబ్రహ్మైక్యరూపఫలమునిచ్చుననియును, కావున ముఖ్యఫలము నిచ్చునదిగాన సంధ్యోపాసనమే "అంగి" యగునని స్పష్టముగ జెప్పినట్లే యగుచున్నది.

5) విష్ణుస్మృతి=

"శుచిర్వాప్యశుచిర్వా యః, కాలే సంధ్యాం సదా ద్విజః।
ఉపాస్తే బ్రహ్మభూయాయ, కల్పతే నాఽత్ర సంశయః॥"

ఈ శ్లోకము గూడ సంధ్యాప్రశంసయందు బాగుగ వివరింపబడినది. సంధ్యోపాసనయొక్క ఫలము జీవబ్రహ్మైక్యమే యని చెప్పుటచేత ప్రధానఫలముతో ప్రత్యక్షసంబంధముండుటచేత సంధ్యోపాసనమే "యంగి" యని స్పష్టముగ చెప్పుచున్నది.

ఇట్లు శ్రుతిస్మృతులచేతను, శ్రీసర్వజ్ఞమాధవాచార్యులవారిచేతను, శ్రీభాస్కరరాయలవారిచేతను, శ్రీవైద్యనాథదీక్షితులవారిచేతను స్మృతిరత్నమహోదధి, స్మృతిముక్తావళి మొదలగు నిబంధనగ్రంథకారులచేతనుస్నూ కంఠోక్తిగా అతి స్పష్టముగ "అసావాదిత్యో

బ్రహ్మ" యను మంత్రార్థానుసంధానరూపమైన సంధ్యోపాసనమే ప్రధానము. అంగి యని నిర్ణయింపబడినది.

ఇది

విద్వచ్ఛిరోమణి — సాహిత్యవిశారద — ద్విజబృందనిషేవి సోమయాజులోపనామక వేంకటాచలశాస్త్రిచేత రచింపబడిన పూర్ణాభిధాంధ్రవ్యాఖ్యాసముపేతమగు సంధ్యాతత్త్వానుబోధిని యందు ప్రథమాధ్యాయమున సంధ్యోపాసనాంగిత్వసాధన రూపస్వమత స్థాపనంబను ద్వితీయ భాగము

సమాప్తము.

ఓమ్ తత్ సత్

శివమ్

ఓమ్

"యత్సంధ్యాముపాసతే బ్రహ్మైవ తదుపాసతే।"

ఇతి శ్రుతిః।

# సంధ్యాతత్వసుబోధిని

పూర్ణాభిధాంధ్రవ్యాఖ్యాసముపేతము

ద్వితీయాధ్యాయము—ప్రథమభాగము

## పరమతనిరాకరణము

### శ్రీచౌండపాచార్యమతనిరాకరణము

అవ: సంధ్యావందనమునకు భాష్యములు వ్రాసినవారే అంగ్యనుష్ఠానలోపమునకు కారణమెట్లగుచున్నారు? అను ప్రశ్నకు సమాధానమీయబడుచున్నది. అందు ముందుగ శ్రీచౌండపాచార్యుల వారి మతము వివరించి నిరాకరింపబడుచున్నది.

సంధ్యోపాస్తిర్హి గాయత్రీ-
మంత్రార్కోపాసనం మతం।
ఇత్యాహుశ్చౌండపాచార్యా-
స్తన్న. శ్రుతివిరోధతః॥ 11।

శ్రీచౌండపాచార్యులవారు తాము రచించిన ఋగ్వేదసంధ్యా వందన భాష్యమున మహాప్రయత్నముతో ఏవియేవియో శాస్త్రార్థ

ములు చేయుచు నీవిధముగ పలికిరి. "పూర్వసంధ్యా తు గాయత్రీ" =ఇత్యాదినా గాయత్రీమంత్రకృత సూర్యోపాసనమేవ సంధ్యోపాసనం, తదేవ ప్రధానమ్. మార్జనాదికం సర్వమంగజాతమితి వివేకః. యత్తైశ్చిదుక్తం "అసావాదిత్యో బ్రహ్మేతిమంత్రకృత సూర్యోపాసనం సంధ్యోపాసనమితి తచ్చింత్యమితి" అని.

దీని తాత్పర్యమేమనగా—"పూర్వసంధ్యా తు గాయత్రీ = అను వచనప్రకారము గాయత్రీమంత్రముచేత చేయబడు సూర్యోపాసనమే సంధ్యోపాసనము. అదియే సంధ్యాకర్మయందు ప్రధానము. మార్జనము మొదలగు కర్మలన్నియును అంగములే. యని తెలియునది, కాని యెవరో కొంతమంది "అసావాదిత్యో బ్రహ్మ" యను మంత్రముచే చేయబడు సూర్యోపాసనము సంధ్యోపాసనమని యందురు. అది చింతనీయము. అని.

ఈ చిన్నిపూర్వపక్షమునకు బదులొకటి చెప్పవలెనా? యనునట్లు మిక్కిలి యనాదరముగ ఉపేక్షించిరి. పాపము! ఈ "అసావాదిత్య—పక్షము వెనుక నెంత దన్నున్నదియో తెలియదాయనకు, ఇచ్చట "దన్ను" శబ్దమాధారార్థమునందు వ్యావహారికము.

శ్రీచౌండపాచార్యులవారి యభిప్రాయమిది. సంధ్యావందనమున సంధ్యోపాసనమే ప్రధానము. అంగి. అసంధ్యోపాసనము గాయత్రీమంత్రముతో జేయు సూర్యోపాసనమే. కాని "అసావాదిత్యో బ్రహ్మ" మంత్రముతో చేయబడు ఉపాసనము మాత్రము కాదు. అని ఏల ననగా="పూర్వసంధ్యా తు గాయత్రీ" యను వచనమున సంధ్యా గాయత్రీపదములు రెండును ఒకే విభక్తియందుండుటచేత గాయత్రియే సంధ్య యని యర్థము చేసికొని, గాయత్రీమంత్రముతో చేయబడు సూర్యోపాసనమే సంధ్యోపాసనమని భ్రమపడిరి.

కాని శ్రుతివిరోధముండుటచేత అయనతలంపు సరికాదు. ఎట్లనగా—"అహరహస్సంధ్యాముపాసీత" యని శ్రుతిచేత నిత్యమగు సంధ్యోపాసనము విధింపబడగా—1) అయుపాసనమునెప్పుడు చేయవలయును? 2) ఎట్లు చేయవలెను? 3) దానికేమి ఫలము? అను మూడు ప్రశ్నలు కలుగగా—తైత్తరీయ బ్రాహ్మణశ్రుతియే వానికి బదులు చెప్పినది. ఆ మంత్రము సంధ్యాప్రశంసయందు "ఉద్యంతమస్తంయంతం=ఇత్యాదిగా "బ్రహ్మైవ్యేతి య ఏవం వేద" యని

యుదహరింపబడినది. అందు—1) సూర్యోదయ సూర్యాస్తమయ ములకు—ముందు ప్రాతస్సాయంసంధ్యోపాసనములను చేయవలెను, 2) "అసావాదిత్యో బ్రహ్మ" అను మంత్రముతో ఆదిత్యమండలము నందు సంధ్యాదేవతాధ్యానమును చేయవలెను. 3) దానికి ఫలము జీవబ్రహ్మైక్యమే. యని బదులుచెప్పబడినది. ఇట్లు శ్రుతియే "అసావాదిత్యమంత్రముతో చేయు నుపాసనమే సంధ్యోపాసనమని యత్యంత స్పష్టముగ చెప్పుచుండుటచేత, అది కాదని గాయత్రీ మంత్రకృతసూర్యోపాసనమే సంధ్యోపాసనమని చెప్పుట శ్రుతి విరోధమే".

ఇంతియే గాదు. స్మృతివిరోధము గూడ నున్నది. ఎట్లనగా = "అసావాదిత్యో బ్రహ్మేతి యద్ధ్యానం క్రియతేఽన్వహం। తదేవ సాంధ్యమిత్యుక్తం కర్మ బ్రహ్మోపకారకమ్" అను స్మృతిరత్న మహోదధివచనము (ఈశ్లోకార్థము సంధ్యాప్రశంసయందు స్పష్ట ముగ వివరింపబడినది.) కూడ అసావాదిత్యమంత్రముతో చేయబడు ఉపాసనమే సంధ్యోపాసనమని స్పష్టముగ చెప్పుచున్నది.

శ్రీభాస్కరరాయలువారు, శ్రీవైద్యనాథదీక్షితులవారు వ్రాసిన వ్రాతలకు కూడ నిది విరుద్ధమే. ఇట్లు ప్రత్యక్ష శ్రుతిస్మృతివచన విరోధమువలన శ్రీచౌండపాచార్యులవారిమతము అసంగతము.

ఇంతియే గాక స్మృతులన్నింటిచేతను సంధ్యావందనమున గాయత్రీమంత్రమునకు జపమే విధింపబడినది. కాని యుపాసన మెచ్చటను విధింపబడలేదు. కాన గాయత్రీమంత్రకృత సూర్యోపాస నమను మాటయే సంధ్యావందన విషయమున నర్థములేనిది.

గాయత్రీమంత్రకృతసూర్యోపాసనమను పదమునకు కొందరు "గాయత్రీజప"మని యర్థము చేయుచున్నారు, ఆవ్యాఖ్యానము గూడ సరియైనది గాదు. ఏలననగా=జపము-ఉపాసనము అను నీరెండును పరస్పరము చాల విభిన్నమైనవి. ఎట్లనగా—సూతసంహితయందు యజ్ఞవైభవఖండమున=

"యజ్ఞస్తు ద్వివిధః ప్రోక్తః స్థూలసూక్ష్మ విభేదతః।
స్థూలస్తు కర్మయజ్ఞః స్యాత్. త్రిప్రకారో వ్యవస్థితః॥
కాయికో వాచికశ్చైవ మానసశ్చేతి సువ్రతాః।
నిత్యనైమిత్తికాద్యస్తు కాయికః పరికీర్తితః॥

మంత్రాణాం జపయజ్ఞస్తు వాచికో వేదవిత్తమాః।
దేవతాధ్యానరూపస్తు మానసః పరికీర్తితః॥" అని.

శ్రీసర్వజ్ఞమాధవాచార్యులవారు దీని నిట్లు వివరించిరి=

యజ్ఞో ద్వివిధః. జ్ఞానయజ్ఞః, క్రియాయజ్ఞశ్చేతి జ్ఞానయజ్ఞః సూక్ష్మయజ్ఞః. తత్ర బ్రహ్మోఽపరోక్షజ్ఞానం జ్ఞానయజ్ఞః। క్రియాయజ్ఞః త్రివిధః. కాయికో వాచికో మానసికశ్చేతి। తత్ర అగ్నిహోత్రాద్యశ్వమేధాంతః కాయికక్రియాయజ్ఞః. జపో వాచికక్రియాయజ్ఞః. స చ నవవిధః. యథా స్మృత్యంతరే=

యజ్ఞము రెండు విధములు. (1) స్థూలయజ్ఞమనియు, (2) సూక్ష్మయజ్ఞమనియును దీనినే శ్రీసర్వజ్ఞమాధవాచార్యులవారు జ్ఞానయజ్ఞమనియు, క్రియాయజ్ఞమనియును వివరించినారు. ఏల ననగా=మూలముననే—స్థూలయజ్ఞమనగా క్రియాయజ్ఞమని స్పష్టముగనే యున్నది. ఇక క్రియకంటె సూక్ష్మమైనది జ్ఞానమే కావున సూక్ష్మయజ్ఞమును జ్ఞానయజ్ఞమనిరి, అందు పరబ్రహ్మసాక్షాత్కారము జ్ఞానయజ్ఞము. క్రియాయజ్ఞము మూడు విధములు (1) కాయికము (2) వాచికము (3) మానసికము. అని. (1) అందు అగ్నిహోత్రము మొదలు అశ్వమేధము వరకును కాయికక్రియాయజ్ఞములనబడును. ప్రాతఃసాయంకాలములందు గృహస్థు ఇంటియందు చేయఁనట్టి అగ్నిహోత్రహోమము మొట్టమొదటి కాయికక్రియాయజ్ఞము అన్ని యజ్ఞములలో మిక్కిలి పెద్దదగు అశ్వమేధయాగము చివరికాయిక క్రియాయజ్ఞము. ఇట్లు యజ్ఞము లన్నియును కాయిక క్రియాయజ్ఞములే. (2) మంత్రముల జపము వాచికక్రియాయజ్ఞము. ఆజపము తొమ్మిదివిధములు, స్మృత్యంతరమున నిట్లు వర్ణింపబడినది=

1) జపస్తు నవధా ప్రోక్త, శ్చాద్యో వాచికవాచికః।
ద్వితీయో వాచికోపాంశు స్తతో వాచికమానసః॥

2) ఉపాంశువాచికోపాంశూపాంశూ చ తుర్యపంచమౌ।
ఉపాంశుమానసష్షష్ట, స్తతో మానసవాచికః॥

3) అష్టమస్తు తథా మానసోపాంశుర్నవమ స్తతః।
మానసమానసశ్చైషాం, లక్షణాని నిబోధత॥

4) ఉచ్చైర్మంత్రోచ్చారణం తు, దూరస్థో యచ్ఛృణోత్యపి।
ఉదాత్తాదిస్వరైః స్పష్టం. జపో వాచికవాచికః॥

5) నీచైర్మంత్రోచ్చారణం తు, పార్శ్వస్థో నా శృణోతి యత్।
ఉదాత్తాదిస్వరైః స్పష్టం, వాచికోపాంశురీరితః॥

6) నీచైస్తమాముచ్చరణం, స్వయమేవ శృణోతి యత్।
ఉదాత్తాదియుతః ప్రోక్తో జపో వాచికమానసః॥

7) పఠనం త్వబహిశ్శబ్దం, ముదాత్తాదిస్వరైర్యుతం।
ఉపాంశువాచికః ప్రోక్తః, స్వయమేవ శృణోతి యత్॥

8) నిశ్శబ్దపఠనం యత్తు జిహ్వోష్ఠచలనైస్సహ।
ఉదాత్తాదిస్వరైర్యుక్త, ముపాంశూపాంశురీరితః॥

9) నిశ్శబ్దపఠనం యత్తు సంధిగ్ధోష్ఠాదిచాలనైః।
ఉదాత్తాదిస్వరైర్యుక్త, ముపాంశుమానసో జపః॥

10) ఓష్ఠజిహ్వాక్రియాశూన్యః, ఉదాత్తాదిస్వరాన్వితః।
అంతర్వాయుప్రేరణేన, జపో మానసవాచికః॥

11) ఓష్ఠజిహ్వాక్రియాశూన్య ఉదాత్తాదిస్వరాన్వితః।
అంతర్వాయుస్పందనేన, మానసోపాంశుకో జపః॥

12) క్రమేణ మంత్రవర్ణానాం, చింతనం పదవాక్యశః।
మంత్రార్థభావనాయుక్తం. జపో మానసమానసః॥

ఉపాసనం తు మానసికక్రియాయజ్ఞః ॥ఇతి॥

జపము సంగ్రహముగ మూడు విధములు, వాచికము, ఉపాంశువు, మానసికము అని. మంత్రమును పైకి వినబడునటుల నుచ్చరించుట వాచికము. తనకు మాత్రము వినబడునటుల నుచ్చరించుట, ఉపాంశుజపము. మనసున తలంచుట మానసికము. అని. మరల నొక్కొక్కటి మూడేసి విధములుగ జపము తొమ్మిది విధములు. ఎట్లనగా = (1) వాచికవాచికము (2) వాచికోపాంశు (3) వాచికమానసికము (4) ఉపాంశువాచికము (5) ఉపాంశూపాంశు (6) ఉపాంశుమానసికము (7) మానసవాచికము (8) మానసోపాంశు (9) మానసమానసికము॥ అని.

క్రమముగ వీని లక్షణములు

1) కొంచెము దూరమందున్నవానికి కూడ వినబడునట్లు ఉదాత్తానుదాత్తస్వరితస్వరములతో స్పష్టముగ మంత్రము నుచ్చరించుట వాచికవాచికమనబడును.

2) ప్రక్కనున్నవానికి కొంచెము వినబడునట్లు ఉదాత్తాది స్వరములతో స్పష్టముగ మెల్లగ మంత్రము నుచ్చరించుట వాచికో పాంశు అనబడును.

3) ఉదాత్తాదిస్వరములతో తనకు మాత్రము వినబడునట్లు అతిమెల్లగ మంత్రమునుచ్చరించుట వాచికమానసమనబడును.

4) వెలుపలకు శబ్దము రాకుండ తనకుమాత్రమే వినబడు నట్లు ఉదాత్తాదిస్వరములతో పఠించుట ఉపాంశువాచికమనబడును.

5) లోపల కూడ శబ్దము లేకుండ నాలుకను పెదవులను కదు పుచు ఉదాత్తాదిస్వరములతో పఠించుట ఉపాంశూపాంశువు.

6) పెదవుల కదలిక సందిగ్ధమగునట్లు కదల్చుచు, శబ్దము లేకుండ ఉదాత్తాదిస్వరములు తనకు తెలియునట్లు పఠించుట ఉపాంశుమానసమనబడును.

7) నాలుకను పెదవులను కదల్చకుండ లోపలి వాయుప్రేర ణమువలన ఉదాత్తాదిస్వరములు కలుగునటుల మంత్రమును మన సున పఠించుట మానసవాచికమగును.

8) నాలుకను పెదవులను కదల్చకుండ లోపలి వాయువు యొక్క సూక్ష్మస్పందవలన నుదాత్తాదిస్వరములు కలుగునటుల మనసున మంత్రపఠనము మానసోపాంశువు.

9) మనసున మనోనేత్రముతో మంత్రముయొక్క అక్షరము లను, పదములను, వాక్యములను చూచుచు మంత్రార్థమును భావిం చుచు మంత్రమును చింతించుట మానసమానసజపమగును.

ఉపాసనము (దేవతయొక్క రూపమును మనసున చూచుచు "ఆదేవత నేను" అనుకొనుచు ధ్యానించుట) మానసికక్రియాయజ్ఞము అని.

## ఇచ్చటి విశేషములను గ్రహింపవలెను

ఇచ్చట సర్వోత్తమమగు మానసికమానసికజపము కూడ వాచికక్రియాయజ్ఞమున చేర్చబడినది. కాయికక్రియాయజ్ఞముకంటె వాచికక్రియాయజ్ఞము శ్రేష్ఠము. వాచికక్రియాయజ్ఞముకంటె మానసికక్రియాయజ్ఞము అత్యంతశ్రేష్ఠము. ఇట్లు జపోపాసనలకు పూర్తిగ భేదము చెప్పబడెను. జపము వాచికము. ఉపాసనము మానసికము. కావున మానసికజపము కూడ ఉపాసన మెంతమాత్రము కానేరదు. ఏలననగా—అర్థభావనతో కూడిన మంత్రావృత్తి జపము. మానసజపమున గూడ అర్థభావనతో కూడిన మంత్రావృత్తి యుండును. ఉపాసనము తైలధారవలె ఎడనెడ తెగని దేవతారూప ధ్యానము. కావున మంత్రావృత్తిరూపమైన జపము దేవతాధ్యానరూపమైన ఉపాసన మెట్లగును ? ఎంతమాత్రము కానేరదు.

ఇంతియే గాదు. జపోపాసనలకు పైన జెప్పినట్లు స్వరూపమున భేదము మాత్రమే గాదు. కాలమున గూడ భేదము చెప్పబడినది. ఎట్లనగా—

స్మృతిచంద్రికయందు =

"ఉపాస్య పశ్చిమాం సంధ్యాం సాదిత్యాం వై యథావిధి।
గాయత్రీమభ్యసేత్తావ, ద్యావదృక్షాణి పశ్యతి॥" అని.

సాయంకాలమున సూర్యుడస్తమింపకమును పే ముందుగ సంధ్యోపాసనమును ముగించుకొనియే, తర్వాత గాయత్రీజపము నారంభించి, నక్షత్రదర్శనమగువరకును జపింపవలెను. అని. అభ్యాసమనగ—మంత్రమును వల్లె వేయుట. ఇచ్చట అంగి యగు సంధ్యోపాసనను అనువదించి సంధ్యోపాసనోత్తరాంగముగ నక్షత్రదర్శనకాల విశిష్ట గాయత్రీజపము విధింపబడినది. ధర్మశాస్త్రమునందు ముఖ్యమగు అంగికర్మ ముందుగ విధింపబడును. తర్వాత నాయంగి కర్మను అనువదించి పూర్వాంగములు ఉత్తరాంగములును విధింపబడును, అది సంప్రదాయము.

కావున సంధ్యాశబ్దమునకు పూర్వమీమాంసకులు చెప్పనట్లు ఆచమనాద్యభివాదనాంత కర్మకలాపము అర్థము కానేరాదు. కానేరదు.

స్మృత్యంతరమున =

"యత్ర సంధ్యాముపాసీత తత్రైవ జపమాచరేత్" అని

ఎచ్చట సంధ్యోపాసనము చెయబడునో యచ్చోటుననే గాయత్రీ జపమును చేయవలెను. అని. ఇచ్చట గాయత్రీజపము, సంధ్యోపాసనము వేరువేరని స్పష్టముగనే చెప్పబడినది.

ఇంకను—పరాశరమాధవీయమున శ్రీసర్వజ్ఞమాధవాచార్యుల వారు జపప్రకరణము నారంభించుచు ఇట్లవతారికను వ్రాసినారు. "అథ సంధ్యాంగ జపవిధిః" అని అనగా—"సంధ్యోపాసనకు అంగమగు గాయత్రీజపము విధింపబడుచున్నది" అని. కాన గాయత్రీ జపము అంగమే. కాని అంగి కాదు.

ఇంకను శ్రీతారానాథతర్కవాచస్పతి రచించిన గాయత్రీ వ్యాఖ్యానమను గ్రంథమున ఉదహరింపబడిన యోగేశ్వరస్మృతి యందిట్లున్నది =

"ప్రాతస్సంధ్యాంగభూతేన గాయత్ర్యాస్తు జపేన చ।
సహస్రశతసంఖ్యేన బ్రహ్మ మే ప్రీయతాం రవిః॥" అని.

ఇచ్చట గాయత్రీజపము సంధ్యోపాసనాంగమని అతి స్పష్టముగ జెప్పబడినది. ఇంకను నిత్యగాయత్రీజపసంఖ్య అష్టోత్తర శతమే యని కూడ చెప్పబడినది. కాన గాయత్రీజపము సంధ్యోపాసన మెన్నటికిని కానేరదు. దాని కంగిత్వము చెవులపిల్లి కొమ్ము వంటిదే.

కాని శ్రీచౌండపాచార్యులవారు కొంచెము ముందువెనుకల సందర్భములను విమర్శించి యున్నయెడల నిట్టి భ్రమకవకాశముండెడిది కాదు. ఎట్లనగా—పై శ్లోకము సంధ్యోపాసన ప్రకరణములో పఠింపబడినది. అందువలన గాయత్రీజపమే సంధ్యోపాసనమని తలంచినారు. కాని దాని యర్థము వేరొకవిధముగ నున్నది. ఏమన—సంధ్యాదేవతకు ప్రాతరాదిత్రిసంధ్యలయందును గాయత్రి, సావిత్రి, సరస్వతి యని మూడు పేరులున్నవని అత్రిమహర్షి చెప్పినారు. ప్రాతస్సంధ్యకు గాయత్రి యని పేరు. ఈ విషయమే "పూర్వసంధ్యా తు గాయత్రి = యని చెప్పబడినది. ఇచ్చట "పూర్వా" శబ్ద

మునకు "ప్రాతః" యని యర్థము. కాగా—ప్రాతస్సంధ్యాదేవతకు గాయత్రి యని పేరు" అని దాని యర్థము.

వాల్మీకిరామాయణమున "కౌసల్యాసుప్రజా రామ! పూర్వా సంధ్యా ప్రవర్తతే" అని "ప్రాతః" అను నర్థమున పూర్వపదము వాడబడినది. కాని శ్రీచౌండపాచార్యులవారికి గాయత్రీజపప్రాధాన్యశ్రద్ధ చేత గాబోలు ఈయర్థము స్ఫురింపనేలేదు. అసలీ "పూర్వ" పదము యొక్క అర్థమును గూర్చియే యాయన ఆలోచించినట్లు లేదు.

సంధ్యోపాసనమే ప్రధానము. అంగి. యని వాదించు మనకు, సంధ్యోపాసనమే ప్రధానమని వాదించు శ్రీచౌండపాచార్యులవారు కొంచెముపకారము చేసిరి. కాదు కాదు. గొప్ప యుపకారమునే చేసిరి. ఆవిషయమున మనకెంతో సంతోషము కలిగినది. కాని వారి యభిమతము సిద్ధింపలేదు.

శ్రీచౌండపాచార్యులవారి మతము సమంజసము కాదని నిర్ణయించుటచేత శ్రీమద్వాల్మీకిరామాయణ వ్యాఖ్యాతలగు శ్రీరామపండితేంద్రులవారి మతము గూడ అసమంజసమని చెప్పినట్లే యగుచున్నది ఎట్లనగా—వారు శ్రీమద్రామాయణమున ఉత్తరకాండమున ముప్పదినాల్గవ సర్గయందు వాలివృత్తాంతము వర్ణింపబడు సందర్భమున (1) ఆరవశ్లోకమునన్న "సంధ్యామన్వాస్య" అను పదమునకు "సమ్యగ్ధ్యేయదేవతాం బ్రహ్మరూపాం ధ్యాత్వా" యనగా "చక్కగ ధ్యానింపదగు పరబ్రహ్మస్వరూపిణి యైన దేవతను ధ్యానించి," యని యర్థము వ్రాసిరి. (2) మరల నట్లే పండ్రెండవ శ్లోకమునన్న "సంధ్యోపాసనతత్పరం" అను పదమునకు "సమ్యగ్ధ్యేయబ్రహ్మధ్యానతత్పరం" చక్కగ ధ్యానింపతగిన బ్రహ్మధ్యానతత్పరు" డని వ్యాఖ్యానించిరి. (3) మరల ఇరువదియేడవ శ్లోకమున నున్న "సంధ్యాకాలమవందత" అను పదమునకు "ప్రాతః సంధ్యాకాలధ్యేయదేవతారూపం బ్రహ్మ ధ్యాతవాన్" ప్రాతః సంధ్యాకాలమున ధ్యానింపతగిన దేవతారూపముననున్న బ్రహ్మను ధ్యానించెను. అని వ్యాఖ్యానించిరి (4) మరల ఇరువదితొమ్మిదవ శ్లోకమున నున్న "సంధ్యాముపాసిత్వా" యను పదములకు పెద్దవ్యాఖ్య చేసిరి ఎట్లన—"నాల్గుసముద్రములందును ఉదయాత్పూర్వము ఉదయానంతరమునను కలిపి (ఆయన మతమున) సంధ్యాకాలమగు నారుగడియల కాలమునందు నాల్గు సముద్రతీరములందును

కొంచెము కొంచెము కాలము ధ్యానింపదగిన బ్రహ్మయొక్క ధ్యాన నియమము, తత్ప్రతిపాదకమగు మంత్రస్మరణనియమమును వాలికి కలవని తోచుచున్నది." అని వ్రాసిరి. అంతటితో నూరకుండక "సంధ్యాకాలే గాయత్ర్యర్థం బ్రహ్మణో ధ్యానమేవ ప్రధానం। స ఏవ సంధ్యాపదార్థః। ఇతి స్పష్టం శ్రుతిస్మృతివిదామ్" అని పూర్తి చేసిరి. అనగా—"సంధ్యాకాలమున గాయత్రీమంత్రార్థమైన పరబ్రహ్మధ్యానమే ప్రధానము. ఆదియే సంధ్యాపదమున కర్థము. అనునీ విషయము శ్రుతిస్మృతివేత్తలకు స్పష్టముగనే తెలియును." అని తేల్చిరి.

తొలివ్యాఖ్యానములన్నింటిలోను "సంధ్యా హి సూర్యగం బ్రహ్మ సంధ్యానాదవిభాగతః।" అను భారత వచనానుసారముగ అస్మదభిమత సంధ్యాదేవతనే వ్యాఖ్యానించుచున్నట్లు వ్యాఖ్యానించిరి. దానిని చదువుచున్నంతసేపు అమితానందముగ నుండెను. మన పక్షమున మరియొకరున్నారు కదా! యని. తీరా-చివరి వ్యాఖ్యానమును చూతును గదా! తల తిరిగిపోయినది. హతాశుడనైతిని. ఇంతవరకు ఈవిధముగ వ్యాఖ్యానించుచున్నది గాయత్రీదేవిని గూర్చియా? యని యనుకొంటిని. ఈ చివరి వ్యాఖ్యానముచేత వీరి యభిప్రాయ మిట్టిదని తెలియుచున్నది. శ్రీచౌండపాచార్యులవారి మతమువలె సంధ్యాకాలమున చేయబడు కర్మకలాపమునందు గాయత్రీమంత్రజపమే ప్రధానమని స్పష్టముగ జెప్పివేసిరి. అదియే సంధ్యోపాసనమనిన్నీ, అదియే ప్రధానము. అంగి. యనిన్నీ స్పష్టముగ జెప్పిరి. వీరి వ్రాతలో సంధ్యోపాసనమే ప్రధానమను మాట యొక్కటియే సమంజసముగ నున్నది. ఆ సంధ్యోపాసనము గాయత్రీమంత్రజపమా? లేక "అసావాదిత్యమంత్రార్థానుసంధానమా? అనునది నా వ్రాతయందు నిర్ణయింపబడియే యున్నది. కాని-శ్రీచౌండపాచార్యులవారు పారపాటుగ నైనను ఒక ప్రమాణవాక్యమునైనను తన మతప్రోద్బలకముగ కనబరచిరి. కాని శ్రీరామపండితేంద్రులవారు ఒక్కగా నొక్క ప్రమాణవాక్యమునైన నుదహరింపలేదు. మీదుమిక్కిలి "శ్రుతిస్మృతివేత్తలకు తమ అభిప్రాయమే సరియైనదని తెలియునని వ్రాసిరి. మేము వ్యాఖ్యానించిన రీతిగ శ్రుతులును స్మృతులును వీరి అభిప్రాయమునకు విరుద్ధముగ, గాయత్రీదేవతకంటె భిన్నమైన సంధ్యాదేవతయొక్క ధ్యానమే ప్రధానిమని నిర్ణయించుట యైనది గదా!

సంధ్యావందనమున గాయత్రికి మంత్రజపమే విధింపబడినది. కాని ఉపాసనము విధింపబడలేదని యొకటి రెండు సారులు వ్రాయ బడినది శ్రుతిస్మృతులకు విరుద్ధమైన దగుటచేత వీరి మతము కూడ పరాహతమై పోయినది.

అవ ఇప్పుడు శ్రీకృష్ణపండితులవారి మతము వివరింపబడు చున్నది

**అర్ఘ్యం జపోపస్థానే చ**
**ప్రధానాని సమం త్విహ।**
**ప్రథమం బలవత్తేషు**
**బ్రువతే కృష్ణపండితాః॥　　12।**

శ్రీకృష్ణపండితులవారు తమ యజుర్వేదసంధ్యాభాష్యమున నిట్లు వ్రాసిరి. "సంధ్యాకర్మణి అర్ఘ్యప్రక్షేపణం గాయత్రీజపః సూర్యోపస్థానం చేతి త్రితయం సమప్రధానమ్. తత్రాప్యర్ఘ్యప్రక్షేపణం బలవత్ప్రధానమ్॥ ఇతి॥

సంధ్యాకర్మయందు అర్ఘ్యప్రక్షేపము గాయత్రీజపము, సూర్యో పస్థానము అను నీ మూడును సమప్రధానములు అందునను అర్ఘ్య ప్రక్షేపము బలవత్ప్రధానము" అని. బలవత్ప్రధానమనగా— "అంగి" ముఖ్యము అని అభిప్రాయము. ఇందు సంధ్యోపాసన మును తలచనైన తలచలేదు.

అవ ఇట్లు మతమును ఉపన్యసించి, గ్రంథకర్త దానిని నిరా కరించుచున్నాడు.

**శ్రుతిస్మృతివిరుద్ధాని**
**యతస్తేషాం వచాంసి హి।**
**ప్రమాణం న భవేజ్జాతు**
**కథంచిదపి యత్నతః॥　　13।**

శ్రీకృష్ణపండితులవారి వచనములు శ్రుతిస్మృతులకు విరు ద్ధములైనవి. కావున వారివచనములు సమర్థించుట కెంత ప్రయ త్నించినను ప్రమాణము కానేరవు.

శ్రుతివిరోధమునకు ఉదాహరణము =

"ప్రధానం ఫలసంబంధి తత్సంబంధ్యంగముచ్యతే"

ముఖ్యఫలమునిచ్చు కర్మ ప్రధానము. అంగి. యగును.

అట్టి అంగి కర్మకు సంబంధించిన యితరకర్మ యంగమన బడును. అని యొకసారి చెప్పబడినది.

"అహరహః సంధ్యాముపాసీత" యను శ్రుతి సంధ్యోపాసనమును నిత్యకర్మగ విధించగ-అ సంధ్య యననేమి? ఆ సంధ్యోపాసనమెప్పుడు చేయవలెను? ఎట్లు చేయవలెను? ఆ సంధ్యోపాసనకు ఫలమేమి? ఇత్యాదిప్రశ్నలు కలుగగా — "ఉద్యంతమస్తం యంతమాదిత్యం = బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి" అను తైత్తరీయ బ్రాహ్మణశ్రుతియే సమాధానము చెప్పినది. ఈ బ్రాహ్మణ శ్రుతి వ్యాఖ్యానమున సర్వజ్ఞమాధవాచార్యులవారు అంతను స్పష్టముగ వ్రాసిరి. పూర్వము దీనిని గురించి విపులముగ వ్రాయుట యైనది.

(1) "సంధ్య" యన ఆదిత్యమండలాంతర్యామియైన బ్రహ్మ చైతన్యము

(2) సూర్యోదయమునకు ముందు ప్రాతస్సంధ్యోపాసనమును, సూర్యాస్తమయమునకు ముందు సాయంసంధ్యోపాసనమును చేయవలెను.

(3) "అసావాదిత్యో బ్రహ్మ" యను మంత్రముతో ఉపాసింపవలెను.

(4) ఉపాసనమునకు జీవబ్రహ్మైక్యము ఫలము. అని సమాధానము.

కాగా—సంధ్యోపాసనకు జీవబ్రహ్మైక్యము ఫలమని శ్రుతియే చెప్పెను. "శుచిర్వాప్యశుచిర్వా యః" అను విష్ణుస్మృతి కూడ చెప్పెను. ఇట్టి ఫలమును అర్ఘ్యజపోపస్థానములు మూడును ప్రత్యేకముగ గాని, ఒకట్టిగ చేరి గాని యీయజాలవు. ఏలవనగా— అవి కేవల వాచికకాయికకర్మలే, కాయికవాచికకర్మలు సాక్షాత్తుగ (Directగా) మోక్షఫలము నీయజాలవని శాస్త్రసిద్ధాంతము. కావున

వీనికి ముఖ్యఫలముతో సాక్షాత్సంబంధము లేదు. కావున ఇవి ముఖ్యములు ప్రధానములు కానేరవు. అట్లుండగ—మూడింటిలో నొకటియగు "అర్ఘ్యప్రక్షేపము"నకు ప్రాధాన్యవార్తయే లేదు. కావున శ్రీకృష్ణపండితులవారి అర్ఘ్యప్రాధాన్యవచనము పైశ్రుతికి విరుద్ధము.

స్మృతివిరోధ మెట్లనగా =

"అసావాదిత్యో బ్రహ్మేతి యద్ధ్యానం క్రియతేఽన్వహం।
తదేవ సాంధ్యమిత్యుక్తం, కర్మ బ్రహ్మోపకారకమ్॥"

అని స్మృతిరత్నమహోదధివచనము. దీని యర్థము సంధ్యాప్రశంసయందు 5వ యుదాహరణమున వివరముగ వ్రాయబడినది. అర్ఘ్యజపోపస్థానాదికర్మలున్నను, వానిని చెప్పక అసావాదిత్యమంత్రకృతధ్యానమునే సాంధ్యకర్మ యని చెప్పుట, ఆ ధ్యానమే ముఖ్యకర్మ యగుటచేత, అర్ఘ్యాదులంగములగుటచేత అప్రధానములు. కాన వానిని పేర్కొనలేదు. ఇంతియే గాక ముందుదహరించిన శ్రీభాస్కరరాయ - శ్రీవైద్యనాథదీక్షిత—శాతాతపమహర్షిముఖ్యులగువారి వచనములు సంధ్యోపాసనప్రాధాన్యవిషయమున జాగరూకములై యుండనే యున్నవి.

ఇట్లు శ్రుతిస్మృతుల విరోధము ప్రబలమై యుండగ శ్రీకృష్ణపండితులవారి అర్ఘ్యప్రాధాన్యవచనము ప్రమాణ మెట్లగును ? ప్రమాణము కానేరదు.

అర్ఘ్యజపోపస్థానములు సమప్రధానములనుటయు అసంగతము ఏలననగా—సమప్రధానములనగ—మూడును చేరి గాని, లేక స్వతంత్రముగ గాని ఒక్క ఫలమును కలిగించుట. కాని యిచ్చట పైమూడును ఏవిధముగను ఒక్క ఫలమును కలిగించకున్నవి. మూడింటికిని వాని వాని ప్రత్యేక ఫలములే యున్నవి. (1) అర్ఘ్యమునకు మందేహరాక్షసనాశమే ఫలము. "మందేహానాం వినాశాయ ప్రక్షిపేత్తు జలాంజలీన్" అని శంఖస్మృతి చెప్పుచున్నది. గాయత్రీజపమునకు దినదినముచేయు పాపమును నాశము చేయుట, మొదలగు ననేకఫలములు గాయత్రీహృదయమంత్రమునను, గాయత్ర్యుద్వాసనమంత్రమునను చెప్పబడినవి. ఇక ఉపస్థానఫలము. సంధ్యోపాసనకాధారమైన సూర్యస్తుతియే యుపస్థానమగుటచేత సూర్యానుగ్రహమే ఫలము ఇట్లు మూడును తమతమ ప్రత్యేకఫల

ములనే కలిగించుచున్నవి. కాని మూడును చేరి ఏయొక్క ఫలమును కలిగించుట లేదు.

ఈ విషయమున శంఖమహర్షి చెప్పుచున్నారు =

"మందేహానాం వినాశాయ ప్రక్షిపేత్తు జలాంజలీన్।
ప్రణవవ్యాహృతిభిశ్చైవ కృత్వాత్మానం ప్రదక్షిణమ్॥
ఆచమేత తత స్తిష్ఠన్ ధ్యాయేత్సంధ్యాం సమాహితః॥ అని"

అనగా–మందేహ రాక్షసుల నాశముకొరకు అర్ఘ్యములను చిమ్మి, రాక్షసపీడవలన కలిగిన పాపనాశముకొరకు నిలబడి ప్రణవవ్యాహృతి త్రయమును ఓం భూర్భువస్సువః అని యుచ్చరించుచు ఒక యాత్మప్రదక్షిణమును చేసి, కూర్చొని ఆచమించి, మరల నిలబడి మూడు ప్రాణాయామములను చేసి, సమాహితుడై సంధ్యాదేవతను ధ్యానింపవలెను అని. కాని యాచారమున, మనవారు అర్ఘ్యానంతరము చేతిలోనికి నీళ్ళు తీసికొని, "అసావాదిత్యో బ్రహ్మ" యను మంత్రమును చెప్పుచు తన చుట్టును ఆచేతిని త్రిప్పుచున్నారు. ఒక్కరును ప్రదక్షిణమును కాని, సంధ్యాధ్యానమును గాని చేయుట లేదు. శ్రుతిస్మృతులొకవిధముగ చెప్పుట, ఆచారము మరియొక విధముగ జరుగుటగా నున్నది. ఇందులకు కారణము శ్రీకృష్ణపండితులవారి భ్రాంతలేఖనములే అని విమర్శకవర్యులగు పండితప్రకాండులకు విశదమే యగును.

బాలంభట్టీయ"మను ధర్మశాస్త్రనిబంధన గ్రంథమునందు బ్రహ్మచారిప్రకరణమునందు 87వ పుటయందు "సంగ్రహ"మను గ్రంథమునందు" ఏతచ్చార్ఘ్యప్రదానం ప్రధానమితి కేచిత్. అంగమితి బహవః" ఈ అర్ఘ్యప్రదానము ప్రధానమైనదని కొందరందురు. కాని యీయర్ఘ్యప్రదానము అంగమేఅని పలువురు చెప్పుచున్నారు" అని యర్థము.

ఇచ్చట "ప్రధానమని కొందరందురు" అని యనుటలో ఆ కొందరెవరనగా—ఒక్క మీమాంసాశాస్త్రమును మాత్రము చదివిన పండితులు ఏలననగా—వీరు పరబ్రహ్మమును గాని సంధ్యాదేవతోపాసనమును గాని సంధ్యోపాసనకు ఫలమైన జీవబ్రహ్మైక్యరూప మోక్షమును గాని యంగీకరింపరు. అందువలన అట్టియే కొంచెము మందియో అర్ఘ్యప్రక్షేపము ప్రధానమని యందురని భావము.

"కొందరు" యని యనుటవలన ఈ మతము అప్రామాణిక మని గ్రంథకర్తకు అస్వారస్యమున్నది. ఇది శాస్త్రసంప్రదాయము.

ఇక-"అర్ఘ్యప్రదానము అంగమని పలువురందురు" అనుట వలన పలువురనినదే ప్రమాణమని గ్రంథకర్త భావము.

ఈ పలువురెవరనగా — "పూర్వమీమాంస ఉత్తరమీమాంస (వేదాంతము) అను నుభయమీమాంసలను బ్రాహ్మణములను స్మృతులను సంపూర్ణముగ చదివిన పండితులని యర్థము.

ఏలననగా—వేదాంతమును చదివినవారు ఉపనిషత్తత్త్వమును తెలిసినవారు గావున, వీరు జీవబ్రహ్మైక్యరూపమోక్షదాయకమగు సంధ్యోపాసనమే శ్రుతిస్మృతులచేత ప్రధానమైనదిగ విధింపబడిన దని తెలిసికొనినవారై "సంధ్యోపాసనము ప్రధానమనియు అర్ఘ్యము దానికి నాంతరీయకమగు పూర్వాంగమనియును, నిర్ణయించిరి. వీరు పలువురు. "పలువురాడు మాట పాటియై ధర జెల్లు" అని తెలుగు సూక్తి యున్నది గదా! కావున గ్రంథకర్తకు ఈ పలువురు చెప్పు నట్టి యంగత్వమే ప్రామాణికమని యభిప్రాయము.

కావున బాలంభట్టీయగ్రంథము అర్ఘ్యప్రక్షేపమునకు అంగత్వ మును కంఠోక్తిగ స్పష్టముగ చెప్పుటచేత అర్ఘ్యమునకు అంగత్వమే యను మాట తిరుగులేని మాట.

ఇంకను—శ్రీకృష్ణపండితులవారు "గాయత్ర్యాఽభిమంత్రితా ఆప ఊర్ధ్వం విక్షిపంతీతి—తావన్మాత్రస్యైవ ప్రాధాన్యేన విధానాత్" =అనగా—గాయత్రీమంత్రముచేత అభిమంత్రించిన జలములను పైకి చిమ్ముచున్నారు" అని అర్ఘ్యమునుమాత్రమే శ్రుతి ప్రధానముగ విధించుచున్నది అందువలన సంధ్యాకర్మయందు అర్ఘ్యమే ప్రధా నమని నుడివినారు అది యసంగతము. ఏలననగా—అసలీవాక్యమే విధాయకవాక్యము కాదు క్రియాపదము వర్తమానకాలమున నుండుటచేత. లిఙ్, లోట్, తవ్య ప్రత్యయాంతపదములే విధాయక ములు. ఇచ్చట నున్న "విక్షిపంతి" యను క్రియాపదము వర్తమాన కాలమును చెప్పు లట్ లకారము. విధాయకము గాదు ఇచ్చట ఈ బ్రాహ్మణభాగము అర్ఘ్యముల నెందులకీయవలెనో యాకారణమును నొక కథగా చెప్పుచున్నది. కాని అర్ఘ్యమును విధించుటకొరకు ప్రవ ర్తించలేదు. కాని శ్రీకృష్ణపండితులవారు. అర్ఘ్యమును విధించు

శ్రుతివచనము వేరే లభించనందున ఈ వర్తమాన కాలక్రియనే లిజ్లకారముగ మార్చి విధివాక్యముగ చేసిరి. అట్లు మార్చినను ఆ వాక్యమందలి "హవై" పదము విధాయకత్వమునకు అడ్డుగనున్నది. అందువలన నిది యెన్నటికిని విధివాక్యము కానేరదు, అది అట్లుండ నిండు. ఈ ఖండిక అర్ఘ్యమును గురించి చెప్పినట్లే—అర్ఘ్యమున కంగమగు ప్రదక్షిణమును. తదనంతరమే జీవబ్రహ్మైక్యరూప మోక్షఫలమును కలిగించు సంధ్యోపాసనమును, అందుకు కావలసిన మంత్రమును, ఆసంధ్యోపాసనవలన కలుగు మోక్షఫలమును గూడ చెప్పినది. శ్రీకృష్ణపండితులవారు వీని యూసునైన నెత్తలేదు. ఈ సంధ్యోపాసనము "అసావాదిత్యో బ్రహ్మ" యను మంత్రముతో చేయవలెనని ఈ ఖండిక చెప్పుచున్నది ఇట్లు ఆ బ్రాహ్మణభాగము అర్ఘ్యమును, దానంగమగు ప్రదక్షిణమును, ఉపాసనమును ఈ మూడింటిని చెప్పుచుండగ "తావన్మాత్రస్యైవ ప్రాధాన్యేన విధానాత్" ఆ అర్ఘ్యమును మాత్రమే ప్రధానముగ విధించుచున్నది" యను మాట అర్థము లేని మాట యగును కదా!

ఇంకను వారిట్లనిరి=

"దైవాన్మానుషాద్వా కదాచిత్త్రితయానుష్ఠానాఽసంభవేఽపి, ఏకతమానుష్ఠానేనైవ సంధ్యోపాసనాఽపూర్వం సిద్ధ్యతి" ఇతి.

అనగా—దైవవశమువలన కాని, మనుష్యకృతకారణమువలన కాని, ఎప్పుడైన ఈ మూడింటిని చేయ శక్యము గానియెడల నీ మూడింటిలో నే యొక్కదానిని చేసినను గూడ పూర్ణసంధ్యోపాసన చేయుటవలన కలుగు అపూర్వము (ఫలము) సిద్ధించును." అని. కాని యిది యెట్లు కలుగునో వారికే తెలియవలెను. మరెవ్వరికిని బోధపడదు. ఎట్లనగా—ఎప్పుడైన అర్ఘ్యమిచ్చుటకు వీలు కలుగనియెడల, గాయత్రీజపము చేయుటచేతనే అర్ఘ్యప్రక్షేపఫలము పొంద వీలగునా? అట్లే సూర్యోపస్థానముచేత అర్ఘ్యజపముల ఫలము పొంద శక్యమగునా?

ఇట్టి వ్రాతలకు ప్రమాణమేమి? పండితవర్యులే విమర్శింతురు గాక! ఇంకను—వారు "గాయత్రీజపవిచారే—"సర్వే" గాయత్రీమితి జపమాత్రవిధానాత్ జప ఏవ ప్రధానమిత్యవగమ్యతే"

అనగా—ఋషులందరును వారివారి స్మృతులందు గాయత్రీ జప ప్రకరణమున "గాయత్రిని జపింపవలెను." "గాయత్రిని జపింపవలెను" అని చెప్పుచుండుటవలన గాయత్రీజపమే సంధ్యాకర్మ యందు ప్రధానమేమోయని తోచుచున్నది" యని అనిరి. ఋషులు గాయత్రీజపప్రకరణమున గాయత్రినే విధింతురు. కాని అర్ఘ్యమును గాని యుపస్థానమును గాని విధింతురా? అందువలన గాయత్రీ జపమే ప్రధానమని యెట్లు చెప్పనగును? అట్లే మార్జనప్రకరణ మున మార్జనమునే విధించుటచేత మార్జనమే ప్రధానముగునా' ఇట్లొ కప్పుడర్ఘ్యము ప్రధామనియు, మరియొకప్పుడు జపము ప్రధానమని యును మరియొకప్పుడుపస్థానము ప్రధానమనియును వ్రాయునట్టి శ్రీకృష్ణపండితులవారి పూర్వోత్తరవిరుద్ధములగు వచనములకు ప్రామాణ్యమెట్లుసంభవించునో నిష్పక్షపాతబుద్ధులగు పండితప్రకాం డులే విమర్శించి నిర్ణయింతురు గాక!

ఇంకను—"ఆశౌచమున ఇతరమంత్రములనన్నింటినీ మన సున చెప్పుకొనుచు, అర్ఘ్యమంత్రమును మాత్రము వెలుపలికి పలుక వలెనని విధించుటచేత—ఇంత యతిశయిముగల అర్ఘ్యప్రక్షేపమే సంధ్యాకర్మయందు ప్రధానమగునని శ్రీకృష్ణపండితులవారు తలంచు చున్నారు. కాని అది యసంగతము. ఎట్లనగా = వారిట్లు చెప్పుటకు ప్రమాణవచనమేదియును లేదు మీదుమిక్కలి శ్రుతిస్మృతులకు విరుద్ధమని నిరూపింపబడినదియును, ఐనను ఏటిలో కొట్టుకొనిపోవు వానికి ఒక గడ్డిపరక ఆధారముగా దొరకినట్లు ఒకానొక యుక్త్యాభాస మును కనబరచి ప్రాధాన్యమును సాధించుటకు ప్రయత్నించు చున్నారు అంతమాత్రముచేత అర్ఘ్యమునకు అతిశయవిశేషము కలుగదు. అందువలన నిట్టి అతిశయముచే ప్రాధాన్యము కలుగు నని చెప్పుట దుర్బలవచనము. ఒకవేళ ఆశౌచమున అర్ఘ్యమును విధించి, గాయత్రీజపాదులకువలె సంధ్యోపాసనను కూడ నిషేధించి యుండినయెడల అప్పుడర్ఘ్యమునకు ప్రాధాన్యము సంభవించెడిది

"తదభావాత్తదభావః" సంధ్యోపాసనకు నిషేధము లేకపోవుట వలన—అర్ఘ్యమునకు ప్రాధాన్యము లేదు. ఎట్లనగా=

(1) పైఠీనసిమహర్షి="సూతకే సావిత్ర్యాంజలీన్ ప్రక్షిప్య ప్రద క్షిణం కృత్వా సూర్యం ధ్యాయన్నమస్కుర్యాత్" అని.

(2, వ్యాసులవారు=ప్రక్షిపేత్సూతకే త్వర్ఘ్యం గాయత్రీం నమ్యగుచ్చరన్। తతః ప్రదక్షిణం కృత్వా సూర్యం ధ్యాయే త్తతో ద్విజః॥ అనియు, విధించిరి.

ఇచ్చట సూర్యపదమునకు "సూర్యమండలాంతర్యామి సంధ్యా దేవత" అని అర్థము.

ఏలనన స్మృత్యంతరమున- "అనుసంధ్యముపాసీత సంధ్యా రూపం రవిం ద్విజః" అనగా=త్రిసంధ్యలందును సంధ్యారూపుడైన రవిని, యనగా-సూర్యమండలము లోపలనున్న బ్రహ్మచైతన్యస్వరూపిణి యగు సంధ్యాదేవతను ధ్యానింపవలెనని యర్థము. వీని ననుసరించియే=శ్రీమాధవాచార్యులవారు అదిత్యశబ్దమునకు "సంధ్యాశబ్ద వాచ్యమాదిత్యం" అని వ్యాఖ్యానించిరి కావున పైనున్న పైఠీనసి-వ్యాసవచనములకు "గాయత్రిమంత్రమును వెలుపలకుచ్చరింపుచు అర్ఘ్యములను చిమ్మి, ప్రదక్షిణించి తర్వాత సూర్యమండలము స్వస్థము కాగా సూర్యమండలమునందు సంధ్యాదేవతను ధ్యానింప వలెనని అర్థమగును. కాన ఆశౌచమునందు సంధ్యోపాసనము కూడ విధింపబడుటవలన అర్ఘ్యప్రక్షేపమునకు ప్రాధాన్యము హుళక్కియే.

ఇంకను—విష్ణుస్మృతియందు =

"జలాభావే మహామార్గే బంధనే త్వశుచావపి।
ఉభయోస్సంధ్యయోః కాలే రజసా వార్ఘ్యముత్క్షిపేత్॥
తదభావే తు, సూర్యస్య ధ్యానమేవ సమాచరేత్" అని.

అనగా—అడవులు, ఎడారులు మొదలగు వానియందు మహాప్రయాణము చేయునప్పుడు సంధ్యాముఖ్యకాలమున నీరు దొరకని యెడల నచ్చట లభించు ధూళితోడనే, మంత్రమునుచ్చరించుచు అర్ఘ్యముల నెత్తవలెను. ఒకవేళ కారాగారమున చేతులకరదండ వేసి గదిలో పెట్టి తాళము వేసినప్పుడు ఆ ధూళి కూడ దొరకదు. కాన నర్ఘ్యము నెత్తశక్యము గాదు. కాన నప్పుడర్ఘ్యమును మాని వేసి, సూర్యమండలాంతర్గత సంధ్యాదేవతాధ్యానమును మాత్రమే చేయవలెను. ధ్యానమున కెట్టి అడ్డంకులుండవు గదా! ఒకప్పుడు కారాగారమున ధూళి లభించినయెడల నాధూళితోనే అర్ఘ్యమీయ వలయును. అట్లే యశుచిగా నున్నప్పుడు గూడ అర్ఘ్యమును ధూళి తోడనే చేసి, సంధ్యాధ్యానమును చేయవలెను, చూచితిరా! "ఈ

సంధ్యోపాసనవిషయముననందే" ధ్యానమేవ "ధ్యానమును మాత్రమే" యనుచు నిర్ణయము చేయబడినది. కాని యిట్లర్ఘ్యప్రక్షేపమున కెచ్చటను "ఏవ" పదముచేత నిర్ణయము చేయబడలేదు. సంధ్యోపాసన మనగ ఆత్మధ్యానము. ఆత్మధ్యానమున కెట్టి యాశౌచములు గాని, బంధములు గాని మరేవిధమైన యడ్డంకులు నుండవు కాన బంధనాదిస్థలములందు అర్ఘ్యమునకు తావులేక, యొక్క సంధ్యోపాసనమునకే యవకాశముండుటవలన ముఖ్యము ప్రధానమునగు సంధ్యోపాసనను మాత్రమే చేయవలెనని మహర్షులు విధించిరి. కావున నే విధముచేత పరీక్షించినను విమర్శించి చూచినను సంధ్యోపాసనమునకే ప్రాధాన్యము లభించుచున్నది. కాని అర్ఘ్యప్రక్షేపమునకు ప్రాధాన్యము లభింపలేదు

ఇచ్చట కొందరు కృష్ణపండితపక్షపాతులు పై విష్ణువచనమున నున్న "రజసా" పదమునకు బదులు "మనసా" యను పాఠాంతరమును కల్పించి ధూళి కూడ దొరకని బంధనాదులందు కూడ మానసికార్ఘ్య ప్రక్షేపమున కవకాశము కల్పించి, యెట్టి సందర్భములలో కూడ నర్ఘ్యప్రక్షేపమునకు లోపములేకుండుటను సమర్థించుచున్నారు. కాని యంతమాత్రముచేత నర్ఘ్యమునకు ప్రాధాన్యముండదు. పూర్వోక్త శ్రుతి-స్మృతి-అభియుక్త ప్రమాణవచనములచేత సంధ్యోపాసనకే ప్రాధాన్యము తప్పదు. కాని పాపము "భక్షితేఽపి లశునే న వ్యాధినివృత్తిః" కక్కురితిపడి నిషిద్ధమగు వెల్లుల్లిని తినినను, వ్యాధి నిమ్మళించలేదు" యను సామెతకు గురియగుచున్నారు వీరు. ఏలననగా- "సూర్యధ్యానమేవ సమాచరేత్" అను స్థలమున నున్న ఏవకారము ఇతరమైనదానిని నిషేధించునట్టిది గదా! కావున నది సూర్యధ్యానమునే చేయవలెను. ఇతరమును చేయవద్దు" అని యర్థము నిచ్చును. కాన నచ్చటి ఏవకారప్రయోగమే "మనసా" యను పాఠాంతరకల్పనను వ్యర్థము చేయుచున్నది. ఎట్లనగా—మానసికార్ఘ్య ప్రదానమున్నయెడల "ధ్యానమేవ" యని ఏవకారమును చెప్పనవసరముండదు కదా! కాన ఏవకారప్రయోగమువలన మానసికార్ఘ్యముండదని భావము, "తా ఆపో వజ్రీభూత్వా" ఆనీళ్ళు వజ్రాయుధములుగా మారి మందేహరాక్షసులను అరుణద్వీపమున పడవేసెను" అని యనుటవలన = అక్కడ వాస్తవికమైన యొక వస్తువున్నయెడలనే— ఆ మంత్రము దానిని వజ్రాయుధమునుగా మార్చును. వస్తువే లేని యెడల దేనిని వజ్రాయుధముగ జేయును? కావుననే, ధూళితో

నర్ఘ్యమెత్తవలెనని శాస్త్రము చెప్పినది. శ్రీరాముడు కాకాసురుని మీదకు, ఒక రెల్లుపుడకమీద బ్రహ్మాస్త్రమంత్రము నభిమంత్రించి, ఆవాహనచేసి గదా! ప్రయోగించెను. అందువలన మానసికార్ఘ్యమున వస్తువుండదు కాన, ప్రయోజనముండదు.

"మనసా" పాఠాంతరమున మరియొక చిక్కున్నది. తర్వాతి వాక్యమందలి "తదభావె" యను పదమునందలి "తత్" పదము ఆ మనస్సునే అర్థముగ చెప్పవలెను గదా! అప్పుడు, మనస్సు ఎప్పుడు నుండు వస్తువే కాన—దాని యభావము ఎప్పుడునుండదు. కాన "తదభావే" యను ప్రయోగమే తప్పగును. కాన "మనసా" పాఠాంతరము కల్పింప వీలులేదు. మరికొందరు యుక్తిపరులు "వాయునా" యను పాఠాంతరము కల్పించెదమనుచున్నారు. వారికి గూడ పైన చెప్పినదే సమాధానము,

ఇంక నొక్క యంశమును వ్రాసి యీవాదములను పూర్తి చెసెదను. శ్రీకృష్ణపండితులవారు "అసావాదిత్యమంత్రేణ సోదకేనైవ పాణినా! ప్రదక్షిణమనుప్రజ్య వాచయేత్సం ధ్యయోర్ద్వయోః" అను ప్రమాణవచనముచేత అర్ఘ్యప్రక్షేపానంతరము చేయుదగు ప్రదక్షిణకార్యమందు అసావాదిత్యమంత్రమునకు వినియోగమును చెప్పుచున్నారు. ఈ దెబ్బతో అసావాదిత్యమంత్రముతో సంధ్యోపాసనకు స్వస్తిచెప్పినట్లగునని వారి యాశయము.

కాని వారిచ్చిన ప్రమాణశ్లోకము అనన్వితార్థముగ నున్నది. అనగా—శ్లోకములోని పదములకు ఒకదానితో మరియొకదానికి సంబంధము సరిగ కుదురకున్నది. ఎట్లనగా—"అసావాదిత్యమంత్రేణ = అసావాదిత్యమంత్రముతో = అను తృతీయావిభక్తిపదమునకు ఏ పదముతో సంబంధము కుదురును? వాచయేత్ = చెప్పింపవలెను"- అను పదముతో నన్వయము=సంబంధము కుదురునందుమా? యనిన—చెప్పించువారెవరు? ఏమనగా—అనుష్ఠానమున చెప్పించువారు, చెప్పువారు అనునది యుండదు. ఒక్క చెప్పువాడే. కాన ఈశ్లోకమునకు "అనన్వితార్థత్వప్రయుక్త—అననుష్ఠాపకత్వము" అను దోషము పట్టినది. అనగా—శ్లోకములోని పదములొకదానితో నొకటి అన్వయింపక పోవుటవలన ఈ వచనము (శ్లోకము) కర్తచే ననుష్ఠానము చేయించలేనిది" అను దోషము పట్టినదని భావము. "అనుప్రజ్య"=ప్రదక్షిణము చేసి" యను పదముతో సంబంధము

కుదురుసందుమా ? యనిస" వాచయేత్=పదమునకు దేనితోను అన్వయము కుదురదు, కావున పైన చెప్పిన దోషము పట్టినది. అందువలన నీ శ్లోకము ప్రమాణవచనము కాదు.

"ఉద్యంతమస్తంయంతమాదిత్యమభిధ్యాయన్ = అనుచోట" అభిధ్యాయన్—ధ్యానించుచు, అను పదమునకు ఎట్లు ధ్యానించుచు? అను ప్రశ్న రాగా—శ్రీమాధవాచార్యులవారు "అసావాదిత్యో బ్రహ్మ" అను మంత్రముతో ధ్యానించుచు=అని యన్వయమును కనుబరచినారు. కాన—"అసావాదిత్యమంత్రమునకు అభిధ్యానమున వినియోగము" అను మాధవగ్రంథముతో శ్రీకృష్ణపండితులవారి వ్రాతకు విరోధము కలిగినది.

మనుపరాశరాదిమహాస్మృతినిబంధనములందు ఇట్టి వినియోగమెచ్చటను కనబడక పోవుటచేతను, స్మృతిరత్నమహోదధియందు అసావాదిత్యమంత్రమునకు అభిధ్యానమందు వినియోగము ప్రత్యక్షముగ కనబడుచుండుటచేత, తైత్తరీయబ్రాహ్మణశ్రుతి, స్మృతివిరోధము నుండుటచేతను "ప్రణవవ్యాహృతిభిశ్చైవ కృత్వాత్మానం ప్రదక్షిణం" అను శంఖస్మృతివచనము ప్రదక్షిణమునకు వినియుక్తమైన వేరొక మంత్రమును చెప్పుటచేతనున్నూ వీరి ప్రమాణవచనము నిర్మూలము (ఆధారములేనిది) అగుచున్నది ఇంతియే గాక— పూర్వోదాహృతమైన శ్రీభాస్కరరాయవచనముతోను విరోధమున్నది.

ఇట్లు బహుదోషగ్రస్తమగుటచేత శ్రీకృష్ణపండితులవారి వచనము ప్రమాణము కాదు.

"బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి" యను శ్రుతివచనముచేత, జీవబ్రహ్మైక్యమె ఫలముగాగల సంధ్యోపాసనమునకు ఆధారమైన ఆదిత్యమండలము మందేహరాక్షసకృతయుద్ధముచేత ఉపద్రవింపబడగా—ఆయుపద్రవమును పోగొట్టి—ఆదిత్యమండలమును స్వస్థముగా చేయుటకుగాను, అర్ఘ్యప్రక్షేపణము చేయుట=దేవపూజ కొరకు దేవమంటపమును శుద్ధిచేయుటతో సమానము. ఇచ్చట దేవపూజకంటె మంటపశుద్ధియే ప్రధానమని ప్రాజ్ఞుడైనవాడెవ్వడు ననడు గదా ! అట్లే ఆదిత్యమండలస్వాస్థ్యముకొరకు చేయు నర్ఘ్యప్రక్షేపమే, మోక్షప్రదమగు సంధ్యోపాసనముకంటె ప్రధానమని ప్రాజ్ఞుడైన వాడెవ్వడును అనడు. ఇట్లు శ్రుతిస్మృతివచన ప్రాబల్యముచేత సంధ్యో

పాసనమే ప్రధానమగును. కాని అర్ఘ్యప్రక్షేపము ప్రధానము కానేరదు.

శ్రీకృష్ణపండితమత నిరాకరణవాదము సమాప్తము.

## నిర్గుణోపాసన శ్రేష్ఠత్వము

సర్వజ్ఞులును బ్రహ్మవిద్వరేణ్యులును సర్వతంత్రస్వతంత్రులును వేదభాష్యకర్తలు నగు శ్రీవిద్యారణ్యస్వామిగురువర్యులు తమ వేదాంతపంచదశియందు ధ్యానదీపప్రకరణమున నిర్గుణోపాసన విచారసందర్భమున 130 వ శ్లోకముననిట్లు వ్రాసిరి

"ఉపేక్ష్య తత్తీర్థయాత్రాజపాదీనేవ కుర్వతాం।
పిండం సముత్సృజ్య, కరం లేఢీతి న్యాయ ఆపతేత్"॥ అని.

అనగా—పరమపురుషార్థమైన మోక్షమునిచ్చు నిర్గుణోపాసనను ఉపేక్షించి (విడిచిపెట్టి) తీర్థయాత్రలను, జపములను, ఉపవాసములను చేయునట్టి జనులు "చేతియందున్న అన్నపుముద్దను దూరముగ పారవేసి ఆ యుత్తచేతిని నాకుము" అన్న సామెతకు గురి అగుదురు" అని యర్థము. అహా! ఏమి శ్లోకము! తత్త్వసారమును తెలిపి కండ్లను తెరపినది. అమూల్యము.

ఈ వచనమువలన తెలియుచున్నదేమనగా=

"అర్ఘ్యప్రక్షేపమునకును మోక్షసాధననిర్గుణోపాసనరూప సంధ్యోపాసనమునకును, ఆవగింజకును మేరువర్వతమునకు నున్నంత వ్యత్యాసమున్నదని.

ఎప్పుడీవిధముగ — సంధ్యోపాసనమునకు ముఖ్యాంగములైన అర్ఘ్యజపములే ప్రధానములు కావని. నిరాకరింపబడినవో, అప్పుడు కేవల సూర్యస్తుతిరూపమైన యుపస్థానమునకు అంగిత్వము సుదూరాపాస్తమే యని, దానిని నిరాకరించుటకు ప్రత్యేకముగ ప్రయత్నము చేయ నవసరము లేదు.

అవ: పెద్ద ప్రయత్నముచేసి సాధింపబడిన సంధ్యోపాసనము యొక్క అంగిత్వము—అందరిచేత నాదరింపబడుగాక! యని ప్రార్థింపబడుచున్నది=

శక్త్యా కరుణయా ప్రోక్తా
　　సుస్పష్టం చ మహర్షి భిః।
సంధ్యోపాస్త్యంగితా సర్వై
　　రాదర్తవ్యా ఽఽస్తదర్పకైః॥　　14।

"అహరహస్సంధ్యాముపాసీత"　"ఉద్యంతమస్తంయంత మాదిత్యం= బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి" ఇత్యాదివచనములద్వారా శ్రుతిమాతచేతను, వ్యాసులు, భారద్వాజులు, వసిష్ఠలు, శాతాతపులు యోగియాజ్ఞవల్క్యులు, మొదలగు మహర్షులచేతను, చకారము వలన శ్రీమాధవాచార్య శ్రీభాస్కరరాయ శ్రీవైద్యనాథదీక్షితాదుల చేతను ద్విజులందలి యవ్యాజకరుణచేత, అతిస్పష్టముగ చెప్పబడిన సంధ్యోపాసనాంగిత్వమును, ద్విజవర్యులందరును అర్ఘ్యజపాదుల కంగిత్వమును సాధింపవలెనను ఆగ్రహమును పట్టుదలనువిడిచిపెట్టి సాదరముగ నంగీకరింతురు గాక!

ప్రస్తుత సందర్భమునకు ఉపోద్బలకముగ నుండునని తలచి మద్రచితసంధ్యోపాసనపారమ్యమను గ్రంథమునుండి కొన్ని శ్లోక ములను నుదహరించుచున్నాను

1) వార్యాదౌ సతి చార్ఘ్యం స్యాత్ తస్మిన్నాసతి నార్ఘ్యకం।
　సతి చాసతి వార్యాదౌ, వస్త్యేవోపాసనం సదా॥

నీరు గాని ధూళి గాని యున్నప్పుడే యర్ఘ్యప్రక్షేపము జరుగును. అవి లేనప్పుడు అర్ఘ్యముండదు. నీరు ధూళియు నున్నను, లేకున్నను, సదా సంధ్యోపాసనము మాత్రము నిర్విఘ్నముగ జరుగును.

2) సూతకే నైవ భవతో మృతకే భవతో న హి।
　దేవీజపోపస్థానే తు, సంధ్యోపాస్తిః సమస్తి హి॥

గాయత్రీజపసూర్యోపస్థానములను జాతాశౌచమృతాశౌచము లందు ననుష్ఠింపరాదు. కాని సంధ్యోపాసనము మాత్రము సర్వదా యనుష్ఠింపబడును.

3) సతః కదాచిదసతశ్చార్ఘ్యాదేః కథమంగితా।
అంగితోపాసనస్యానుష్ఠీయమానస్య సర్వదా॥

ఇట్లొకప్పుడుండి యొకప్పుడు లేని యర్ఘ్యజపసూర్యోపస్థాన ములకు అంగిత్వమెట్లు లభించును? లభించనేరదు. జలాదులు లేనప్పుడు గాని, ఆశౌచాదులు వచ్చినప్పుడు గాని లోపము లేకుండ అవ్యాహతముగ (అడ్డులేకుండ) అనుష్ఠింపబడుచున్న సంధ్యోపాసన మునకే ప్రాధాన్యము, అంగిత్వము ఉండును

4) తత్త్వమర్ఘ్యప్రదానాదేః సుబోధమిదమీదృశం।
న చింతయంతో నృత్యంతి. పండితా అర్ఘ్యవాదినః॥

అర్ఘ్యప్రక్షేపగాయత్రీజపసూర్యోపస్థానముల యొక్క ఇంత సులభమైన తత్త్వమును తెలిసికొనలేక అర్ఘ్యజపాదులకు అంగిత్వ మును వాదించు పండితులు గంతులు వేయుచున్నారు.

కావున నష్టసంప్రదాయమగు నీ సంధ్యోపాసనమును బహు శ్రమతో నుద్ధరింపబడినదానిని ప్రాజ్ఞులగు ద్విజవర్యులు [illegible]ప్ర దాయకమగు అంగాంగిభావమునున్నూ తెలిసికొని, విధ్యుక్తమగు సంధ్యోపాసనమును సాంగోపాంగముగ శ్రద్ధతో ననుష్ఠించి "బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి" యను తైత్తిరీయ బ్రాహ్మణోక్తమగు ఫలమును పొందెదరు గాత!

ఇట్లు బహుశ్రమతో పరమతనిరాకరణము చేసి, స్వాభిమత సంధ్యోపాసనాంగిత్వమును సాధించి నిర్ణయించుటయైనది.

ఇది

విద్వచ్ఛిరోమణి — సాహిత్యవిశారద — ద్విజబృందనిషేవి సోమయాజులోపనామక వేంకటాచలశాస్త్రిచేత రచింపబడిన పూర్ణాభిధాంధ్రవ్యాఖ్యానసమేతమగు సంధ్యాతత్త్వసుబోధిని యందు ద్వితీయాధ్యాయమున పరమతనిరాకరణంబను ప్రథమ భాగము

సమాప్తము.

ఓమ్ తత్ సత్

శివమ్

ఓమ్

"యత్సంధ్యాముపాసతే బ్రహ్మైవ తదుపాసతే।"

ఇతి శ్రుతిః।

# సంధ్యా తత్వ సుబోధిని

పూర్ణాభిధాంధ్రవ్యాఖ్యాసముపేతము

ద్వితీయాధ్యాయము—ద్వితీయభాగము

సంధ్యాదేవతాస్వరూపనిరూపణము

అవతారిక. ప్రథమాధ్యాయమున సంధ్యోపాసనమే యంగి యని దృఢముగ సాధింపబడినది. ఆ సందర్భమున "ఉపాసన" శబ్దముయొక్క అర్థము "ధ్యాయన్" అను పదముయొక్క వ్యాఖ్యానమున వివరింపబడినది ఇక సంధ్యాశబ్దమునకు "చిచ్ఛక్తి" అర్థమనియు త్తరత్ర చెప్పబోవుచు, అందులకు ఉపయోగకరముగ స్మృతులందు సంధ్యాశబ్దమునకు మూడు విధములైన ప్రయోగములు కనబరచబడుచున్నవి.

యౌగికం యోగరూఢం చ
తథా లాక్షణికం తతః ।
సంధ్యాపదం హి త్రివిధం
శ్రుతిస్మృతిషు దృశ్యతే॥ 15।

సంస్కృతవాఙ్మయమున పదములు యౌగికములనియు, రూఢములనియు, యోగరూఢములనియు, లాక్షణికములనియు, వ్యంజికములనియుసు పలువిధములుగ నున్నవి

ప్రస్తుతమున, సంధ్యాపదము శ్రుతిస్మృతులందు యౌగికము, యోగరూఢము, లాక్షణికము అని మూడు విధములుగ వాడబడినది.

1) అందు యోగమనగా—పదముయొక్క అవయవముల అర్థబోధకశక్తి. పదముయొక్క అవయవములకు అర్థమును చెప్పునట్టి శక్తి కలదు. ఆ శక్తికి "యోగ"మని పేరు. అట్టి యోగశక్తితో నర్థమును చెప్పు పదమునకు యౌగికమని పేరు.

2) ఒకానొక పదము అవయవార్థమును చెప్పకుండ వేరొక యర్థమును చెప్పుటలో ప్రసిద్ధి కలదిగ నుండును. అట్టి ప్రసిద్ధికి "రూఢి" యని పేరు. కేవలరూఢిశక్తితో నర్థమును చెప్పు పదమునకు "రూఢ" మని పేరు

3) యోగము, రూఢి ఈరెండింటిచేతను అర్థము చెప్పుపదము, "యోగ రూఢము" అనబడును.

4) ముఖ్యార్థముతో మరియొక వస్తువునకున్న "సంబంధము" "లక్షణ" యనబడును. అట్టి "లక్షణ" చేత అర్థమును చెప్పు పదమునకు "లాక్షణికము" అని పేరు.

క్రమముగ ఉదాహరణములు.

1) యౌగికమునకు ఉదాహరణము =

సంధౌ + ఉపాస్యా = సంధ్యా॥ సంధికాలమున ఉపాసింపదగినది. ఇచ్చట-"సంధి" శబ్దమునకు "యత్" ప్రత్యయము చేర్చగా-"సంధ్యా" యను పదమేర్పడినది. సంధి శబ్దమునకు రాత్రింబగళ్ళ సంధికాలమర్థము, "యత్" ప్రత్యయమునకు "ఉపాసింపదగినది" యని యర్థము కాగా—"సంధ్యా" యనగ—రాత్రింబగళ్ళ సంధి కాలమున ఉపాసింపదగిన యొకానొక దేవత" యని యర్థము. ఇచ్చట "సంధ్యా" శబ్దముయొక్క అవయవములైన "సంధి + యు" అను అవయవముల అర్థమే చెప్పబడినది. కాన నీ సంధ్యాశబ్దము యౌగికము. ఇందుకు ఉదాహరణము వ్యాసస్మృతి—

"ఉపాస్తే సంధివేళాయాం నిశాయా దివసస్య చ।
తామేవ సంధ్యాం తస్మాత్తు ప్రపదంతి మనీషిణః"॥ అని.

రాత్రింబగళ్ళ సంధికాలమున ఉపాసింపబడునది గాన "సంధ్య" యని పేరు" అని శ్లోకార్థము. ఇచ్చట సంధ్యాశబ్దము సంధికాలమున ఉపాసింపబడు దేవతల నందరిని చెప్పును.

2) యోగరూఢమునకు వసిష్ఠమహర్షి ఉదాహరణమిచ్చిరి.
యోగము + రూఢి, రెండింటి సహాయముతో అర్థమును చెప్పును.

"యా సంధ్యా సా జగత్సూతిః మాయాతీతా తు నిష్కలా।
ఈశ్వరీ కేవలా శక్తిస్తత్వత్రయ సముద్భవా॥" అని.

ఈ శ్లోకార్థము తర్వాతి రెండవపుటయందే వివరింపబడును. ఇచ్చట సంధ్యాశబ్దము ముందు యోగశక్తిచేత సంధికాలోపాసనీయు లగు శివుడు చిచ్ఛక్తి మొదలగు దేవతలనందరిని చెప్పుచుండగా— "యోగాద్రూఢిర్బలీయసీ" "యోగముకంటె రూఢికి బలమెక్కువ" యను న్యాయము ననుసరించి, రూఢిశక్తి వచ్చి ఆదేవతలందరిలో "చిచ్ఛక్తిని" మాత్రము సంధ్యాశబ్దమునకు అర్థముగా చెప్పును.

కాన ఈ సంధ్యాశబ్దము యోగరూఢము. ఈ యర్థమే సంధ్యా శబ్దమునకు ముఖ్యార్థము.

కొన్ని చోటులందు యోగార్థము ముఖ్యార్థమగును. కొన్నిచోటు లందు రూఢ్యర్థము ముఖ్యార్థమగును. చాల చోటులందు యోగ రూఢ్యర్థము ముఖ్యార్థమగును సంధ్యాశబ్దమునకు యోగరూఢ్యర్థము ముఖ్యార్థమగును. ముఖ్యార్థమును వాచ్యార్థమనియును అందురు.

3) పరాశరులు లాక్షణికమునకు ఉదాహరణమును చెప్పిరి=

"సంధ్యాస్నానం జపో హోమో, దేవతానాం చ పూజనం।
ఆతిథ్యం వైశ్వదేవం చ షట్కర్మాణి దినే దినే॥" అని.

ఇచ్చట, 1) సంధ్యా, 2) స్నానం, 3) జపః, 4) హోమః, 5) దేవతానాం పూజనం, 6) ఆతిథ్యం, 7) వైశ్వదేవం=అని ఏడు కర్మలగుచున్నవి శ్లోకమున ఆరుకర్మలని చెప్పబడినది. ఇది యెట్లు

పొసగును? అను ప్రశ్నకు సమాధానమిది="సంధ్యాస్నానం" అను పది యొక్క పదమని చెప్పవలెను. అదెట్లు? అనగా—సంధ్యకొరకు స్నానము "సంధ్యాస్నానము" అని తత్పురుష సమాసము, చేసిన పొసగును, అని

మొదటి రెండు పదములను చేర్చి యొక సమాసమును చేసిన యెడల అప్పుడారు కర్మలగును. అని భావము

ఇచ్చట సంధ్యాశబ్దమునకు ముఖ్యార్థమైన "చిచ్ఛక్తి" యను అర్థమును చెప్పినయెడల తర్వాతి స్నానశబ్దముతో అన్వయము (సంబంధము) కుదరదు "చిచ్ఛక్తికొరకు స్నానము" అనిన అర్థము సరిపడదు. చిచ్ఛక్తియొక్క స్నానమనినను కుదరదు. ప్రస్తుత సందర్భమున కా యర్థము సరిపడదు. అందువలన ఆ ముఖ్యార్థమును విడిచిపెట్టి మరియొక సరిపడునర్థమును చెప్పుకొనవలయును ఆ యర్థము ముఖ్యార్థమునకు సంబంధించినదై యుండవలెను. అప్పుడే "లక్షణ" యను శక్తి వచ్చును. ముందు ముఖ్యార్థమునకు అన్వయము కుదరక-బాధ వచ్చినప్పుడు లక్షణాశక్తిని లేపవలెను. లక్షణాశక్తి లేచి-ముఖ్యార్థమునకు సంబంధించిన యర్థమును చెప్పును. అప్పుడు అన్వయము కుదురును ప్రస్తుతమున ముఖ్యార్థమగు చిచ్ఛక్తికి సంబంధించిన యర్థము ఆమెయొక్క ఉపాసనము. అనగా సంధ్యోపాసనము.

ఇప్పుడు శ్లోకార్థము సరిపోవును. ఎట్లనగా—సంధ్యాస్నానమనగా—సంధ్యోపాసనకొరకు స్నానమని యర్థము. కాన అర్థము సరిపోయినది. కాగా—ఇచ్చట సంధ్యాశబ్దము, లక్షణచేత అర్థమును చెప్పుటచేత "లాక్షణిక" మనబడును. లక్షణచేతచెప్పబడిన అర్థము లక్ష్యార్థము అనబడును. ఇట్లు మూడు విధములైన శబ్దములు ఉదహరింపబడినవి. రూఢము, వ్యంజకము నగు సంధ్యాశబ్దములు శ్రుతి స్మృతులందు లేవు గనుక, నుదహరింపబడలేదు.

యోగశక్తి, రూఢిశక్తి, లక్షణాశక్తి, వ్యంజనాశక్తి అను భాషా వైచిత్ర్యములు భారతీయేతరభాషలందు లేవు. భారతీయభాషలలో గూడ సంస్కృతమునుండి యెరువు తెచ్చుకున్నవే. చాలమంది చదువరులకీ విషయములు క్రొత్తవి. వారికీవిషయములు భాషా వైచిత్ర్యములు తెలియుగాక। యని వివరించితిని.

ఇట్లే సంధ్యోపాసనకాలమును చెప్పు సంధ్యాశబ్దమొండు గలదు. సంధ్యోపాసనకాలము, ముఖ్యార్థమగు చిచ్ఛక్తికి సంబంధించినదే యగుటవలన-అదియును లాక్షణికమే యగును. ఇట్లు శ్లోకమున, నుదహరింపబడిన మూడు విధములైన సంధ్యాశబ్దములు వివరింపబడినవి.

అవ "అహరహస్సంధ్యాముపాసీత" యను విధివాక్యమందున్న సంధ్యాశబ్దము యోగరూఢమని పరోక్షముగ చెప్పబడుచున్నది.

విధిస్థసంధ్యాశబ్దార్థః
　　పరా చిచ్ఛక్తిరేవ సా।
వసిష్ఠః ప్రాహ చిచ్ఛక్తిం
　　తాం హి బ్రహ్మవిదుత్తమః॥　　16।

పరబ్రహ్మసాక్షాత్కారశాలురలో నుత్తముడగు వసిష్ఠమహర్షి సంధ్య యనగా సర్వవేదాంతప్రసిద్ధ యగు సర్వోత్కృష్టమగు "చిచ్ఛక్తి" యనియే చెప్పిరి. కాన "అహరహస్సంధ్యాముపాసీత" యను సంధ్యోపాసనవిధాయకశ్రుతివాక్యమందున్న "సంధ్యా" శబ్దము, "సంధౌ సంధ్యాముపాసీత నాస్తగే నోద్గతే రవౌ" యను యోగియాజ్ఞవల్క్యమహర్షివచనమందున్న సంధ్యాశబ్దము, "సంధ్యాం మనసా ధ్యాయేత్" అను సంధ్యోపాసన విధాయక-ఐతరేయబ్రాహ్మణవచనమందున్న సంధ్యాశబ్దమున్నూ చిచ్ఛక్తిప్రతిపాదకములగుటచేత యోగరూఢములే యగును.

## సంధ్యాదేవతాస్వరూపనిరూపణము

వసిష్ఠులిట్లు చెప్పిరి=

"యా సంధ్యా సా జగత్సూతిః మాయాతీతా తు నిష్కలా।
ఈశ్వరీ కేవలా శక్తిః తత్వత్రయసముద్భవా॥" అని.

దీని యర్థము. మాయాతీతా=మాయనతిక్రమంచినది. అనగ-మాయను తన యధీనమున నుంచుకొన్నది యని యర్థము. ఎట్లు ? ప్రళయకాలమున సమస్తజీవులకర్మలును మాయయందు వాసనా

రూపముగ లీనమై యుండును ఆ కర్మలు అపరిపక్వములుగ నున్నంతకాలము మాయ అస్వతంత్రముగనే యుండును అప్పుడు చిచ్ఛక్తియే స్వతంత్రురాలు మాయను తనయధీనమున నుంచు కొనును ఇక ఆ కర్మలు పరిపక్వము కాగనే, చిచ్ఛక్తి తన నాశ్రయించిన మాయకు స్వాతంత్ర్యమిచ్చి ఆ మాయాద్వారా ప్రపంచమును సృష్టింప నిచ్ఛగించును అప్పుడు మాయకు ప్రాధాన్యముండును సృష్టికి—ముందు చిచ్ఛక్తి స్వతంత్రురాలు. సృష్ట్యారంభమునుండి మాయ స్వతంత్రురాలు ప్రస్తుతమున సంధ్యాశబ్దార్థమైన చిచ్ఛక్తి స్వాధీనమాయు॥ నిష్కలా = నిర్వికారమైనది, ప్రళయకాలమున కర్మలు అపరిపక్వదశయందుండుటచేత మాయయందున్న సత్వరజస్తమోగుణములు పరస్పరము హెచ్చు తగ్గులు లేకుండ సమానావస్థయందుండును,

ఆసమయమున మాయను గురించి తెలిసికొను ప్రాణి యెవ్వరుండరు. కాబట్టి—మాయ అవ్యక్తముగ నుండును. అందువలన చిచ్ఛక్తి వికారములేనిదై యుండును కేవలా = ఈశ్వరునినుండి విడదీసి ఈశ్వరునికంటె వేరుగ తెలిసికొనుటకు వీలు లేనిది. ఈశ్వరీ = ఈశ్వరచైతన్యము, చిచ్ఛక్తిచైతన్యము ఒక్కటియే యగుటచేత జగత్కారణమగు నీశ్వరునికంటె భిన్నము కానిది. యని యర్థము. ఇద్దరి చైతన్యము లొక్కటియే యైనను వారి యుపాధులకు సూక్ష్మభేదముండుటచేత నా యుపాధిభేదము ననుసరించి శివుడనియును, శక్తి యనియును వేరుగ వ్యవహరించుట. తత్త్వత్రయసముద్భవా = బ్రహ్మవిష్ణురుద్రులనెడు మూడు తత్త్వములయొక్క ఉద్భవము, అనగ పుట్టుక (తనవలన) కలది. చిచ్ఛక్తియే తననాశ్రయించిన మాయాద్వారా తత్త్వత్రయమును సృజించును శక్తిః = చిద్రూపమై శక్తిపదముచే వ్యవహరింపబడునది. యా = ఏ దేవత కలదో, సా = ఆ చిచ్ఛక్తియే, జగత్స్యాతిస్తు - తు కారమునకు చేదర్థము. "ఎడల" అని అర్థము. కాగా-తన నాశ్రయించిన మాయాద్వారా జగత్సృష్టికొరకు ఉపక్రమించినదైన యెడల, చిచ్ఛక్తి "సంధ్యా" సంధ్యాశబ్దముచేత చెప్పబడును. ఇవి వసిష్ఠులు నిరూపించిన శక్తిస్వరూపము.

ఇక సర్వజ్ఞమాధవాచార్యులవారు సూతసంహితాభాష్యమున నిరూపించిన శక్తిస్వరూపము వివరింపబడును ఇవి చదువరులకు కొంచెము దుర్బోధముగ నున్నవని వ్రాయుచున్నాను. ఒకటి రెండు

సారులు చదివిన సుబోధమగును. మనము చిచ్ఛక్తిస్వరూపులమే. కాన మనస్వరూపము బోధపడుటకు పదిసారులైనను చదువవలెను.

"పూర్వకల్పే పరిపక్వసకలప్రాణికర్మసు ఉపభోగేన నష్టేషు అపరిపక్వవాసనారూపకర్మాశ్రయః యా మాయా, శక్యప్రతియోగ్యధీననిరూపణవిషయ-తదవచ్ఛిన్నం చైతన్యం=చిచ్ఛక్తిః, పరాశక్తిశ్చ. శక్యప్రతియోగ్యనధీననిరూపణ విషయ తదవచ్ఛిన్నం చైతన్యం శివః. మాయాసంబంధవినిర్ముక్తం శుద్ధం చైతన్యం పరం బ్రహ్మ" ఇతి. అని.

దీని యర్థము. కల్పమనగ సృష్టికాలము. పూర్వకల్పే = ప్రస్తుతసృష్టికాలముకంటె ముందున్న సృష్టికాలమందలి సమస్త ప్రాణులయొక్క పరిపక్వమైన సకలకర్మలును ప్రాణులు అనుభవించుటచేత నశించిపోగా, ఆ సృష్టి పూర్తి యైపోవును. వెంటనే ప్రళయ మారంభమగును. సకల ప్రాణులును నశించును, మాయ యొక్కటియే నిలుచును. అప్పుడు ఆ ప్రాణుల తాలూకు అపరిపక్వమైన (పండని) కర్మలు వాసనారూపముతో మాయను ఆశ్రయించి యుండును,

ఆ ప్రళయకాలము మూడు వంతులు గడవగానే అంతవరకు పరిపక్వము కాకుండ వాసనారూపముగ మాయయందున్న ప్రాణి కర్మలు పరిపాకము పొంద నారంభించుటకు ఉన్ముఖముగ (సిద్ధముగ) నగును. అప్పుడు కర్మలు కొంచెముబ్బుట కారంభించును. అట్లు ఉబ్బుట ఆరంభించగనే, ఆ కర్మలయందు అతి సూక్ష్మమగు స్పందము (చలనము) కలుగును. నీటిలోని చేపల కదలికవలన నీటికి కూడ కదలిక కలుగునట్లు, ఆ కర్మల స్పందనము ననుసరించి వానికాశ్రయమైన మాయయందు కూడ నతిసూక్ష్మమగు స్పంద కలుగును అట్టి స్పందకల మాయతో కూడిన బ్రహ్మచైతన్యమునకు 1) చిచ్ఛక్తి యనియును, పరాశక్తి యనియును పేరులు. కర్మలు పరిపాకోన్ముఖములు కాకుండ అపరిపక్వములుగనె యున్నప్పుడు, కర్మలయందు గాని, మాయయందు గాని సుసూక్ష్మమైన స్పంద కూడ కలుగదు. అప్పుడు మాయకు "అవ్యక్త" మని పేరు. ఆ యవ్యక్తమాయతో కూడిన బ్రహ్మచైతన్యమునకు (2) శివుడని పేరు. మాయతో సంబంధమే లేకుండ శుద్ధమైన, దూరముగనున్న మూడు పాదముల బ్రహ్మచైతన్యము (దీనికే త్రిపాద్బ్రహ్మము అని పెరు).

(3) శుద్ధపరబ్రహ్మ మనబడును. ఇట్లు (1) చిచ్ఛక్తి, (2) శివుడు. (3) శుద్ధపరబ్రహ్మము అని యొకే బ్రహ్మచైతన్యము మాయ యనెడు ఉపాధియొక్క భేదమువలన వేరు వేరు పేర్లతో పిలువ బడును.

ఇచ్చట సూతసంహితలోని కొన్ని పదములకు అర్థము వ్రాయ లేదు. ఏలనన—అవి వేదాంతశాస్త్రము చదువుకొన్నవారికే బోధ పడును

పైన వ్రాసినట్లు పరిపాకము నొందుటకు ఉన్ముఖమైన కర్మలు కాలక్రమమున పండుట కారంభించి పూర్తిగ పరిపక్వమగును. అప్పటికి ప్రళయకాలము గూడ పూర్తియగును. అట్లు ప్రళయకాలము పూర్తియగుచుండగ వెనుక చెప్పిన చిచ్ఛక్తికి జగత్తును సృష్టింపవలె నను కోరిక కలుగును. జగత్తును సృష్టింప నిచ్ఛగలిగిన చిచ్ఛక్తికి "సంధ్య" యని పెరు గలుగును ఆ సంధ్య అంతవరకును తన స్వాధీనమున నున్న మాయకు స్వాతంత్ర్యమిచ్చి, ఆ మాయచేత జగత్తును సృష్టింపించును. ఇట్లు జగత్సృష్టికి ముందే ప్రళయకాలము జరుగుచుండగనే సంధ్యాదేవత యావిర్భవించును. ఆమెయే మాయా ద్వారా బ్రహ్మవిష్ణుమహేశ్వరులను. జగత్తును, సృష్టించును.

ప్రళయకాలము జరుగుచుండగ. మాయయందు వాసనారూపముగ నున్న ప్రాణికర్మలు. మూడువిధములుగ నుండును,

(1) ఆరంభమునుండి మూడువంతుల ప్రళయకాలము గడచు వరకును అపరిపక్వకర్మలు (ఏమాత్రము పండనివి)

(2) నాల్గవవంతు ప్రళయకాలమారంభింపగనే ఆ కర్మలు పరిపాకోన్ముఖములగును. (పండుటకు సిద్ధముగ నున్నవి యగును).

(3) ప్రళయకాలము పూర్తికాగనే కర్మలు - పరిపక్వము (పూర్తిగా పండినవి) లగును.

అందులో అపరిపక్వకర్మలకును—పరిపక్వకర్మలకును మధ్య (సంధియందు) నున్న కర్మలకు పరిపాకమునకు (పండుటకు) ఆరంభముగానున్న దశ యొకటి యున్నది గదా! ఆ మధ్యదశలో నున్న బ్రహ్మచైతన్యమే "చిచ్ఛక్తి" యని పిలువబడునుగదా! ఆచిచ్ఛక్తియే సంధ్యాదేవత గదా! ఇట్లు పైని వర్ణించిన సంధి దశయందుండుట చేత, సంధౌ + భవా=సంధ్యా, సంధియందున్నది. కాన "సంధ్యా"

యనబడుచున్నది. అను వ్యుత్పత్తిచేత "సంధ్య" యను పేరు ఎంతయును సముచితముగను, యుక్తియుక్తముగ నున్నది.

ఇక గాయత్రీదేవియో—పై సృష్టి అరంభమై సూక్ష్మసృష్టి స్థూలసృష్టి, ప్రపంచసృష్టి యిది యంతయు పూర్తియైన తర్వాత నావిర్భవించినది కాన, సంధ్యాగాయత్రులిద్దరును వ్యవహారమున వేర్వేరు.

అవ గాయత్రీమంత్రాధిదేవత యగు గాయత్రీదేవియు, సంధ్యాదేవతయు నొక్కరే యని కొందరందురు. దానిని నిరాకరించుటకు సంధ్యాగాయత్రీదేవతలయొక్క స్వరూపభేదము వివరింపబడుచున్నది,

> నిరాజి సృష్టికాలీనే
> 　　గాయత్రీ హ్యభిమానినీ।
> చిచ్ఛక్తిరూపసంధ్యాయాః
> 　　విభిన్నైవేతి నిర్ణయః॥　　17।

గాయత్రీదేవత సంపూర్ణసృష్ట్యనంతరకాలమందలి స్థూలప్రపంచముయొక్క సమష్టిరూపమైన "విరాట్టు" అనెడు శరీరమునందు అభిమానము గలది "అగ్నిర్ముఖం= ఇత్యాది గాయత్రీహృదయ మంత్రముచేత చెప్పబడిన విశేషణములచేత (అనగా—అగ్నిదేవత గాయత్రీదేవికి ముఖము, బ్రహ్మ శిరస్సు, విష్ణువు హృదయమగును" ఈ మొదలగు వర్ణనచేత) గాయత్రీదేవికి విరాట్టే స్థూలశరీరమని తెలియుచున్నది గదా! నృసింహోత్తరతాపినీయోపనిషత్తునందు గూడ పరమాత్మయొక్క స్థూలశరీరమునకు "అగ్నిర్ముఖం=ఇత్యాది వర్ణనచేత, వీడంగములు వర్ణింపబడినవి. ఇంతియే గాదు—సూతసంహితయందు యజ్ఞవైభవఖండమున "గాయత్రీవిచారము" అను పేరుగల ఆరవఅధ్యాయమున పండ్రెండవ శ్లోకము నవతారిక యందు శ్రీసర్వజ్ఞమాధవాచార్యులవారు ఇట్లు వ్రాసిరి "కింబహునా? నామరూపాత్మకం సర్వమపి జగత్ విరాడాత్మికాయాః తన్మూర్తే రవయవత్వేన పరికల్ప్యతి" అని. అనగా ="పలుమాటలేల? నామరూపాత్మకమగు నీజగత్తంతయును మహావిరాట్స్వ్యాపిణి యగు గాయత్రీదేవియొక్క స్థూలశరీరమునకు నొక యవయవముగా కల్పింపబడుచున్నది". అని అవతారికను వ్రాసిరి. అట్లే—అచ్చటనే నవమశ్లోకావతారికయందు గూడ నిట్లు వ్రాసిరి "అథాస్యాః

సావిత్ర్యాః జపకాలే ధ్యాతవ్యాం విరాడాత్మికాం మూర్తిమాహ="జగచ్ఛరీరం సావిత్ర్యాః" ఇతి॥ అని. సర్వజ్ఞమాధవాచార్యులవారిట్లు వ్యాఖ్యానించిరి. "పృథివ్యాదిభూతభౌతికాత్మకం తస్యాః స్థూలశరీరమి"తి॥ అనగా=ఈ గాయత్రీమంత్రమును జపించుటకు ముందు గాయత్రీదేవిని ధ్యానింపవలెను గదా! అట్లు ధ్యానించుటకు విరాట్స్వరూపిణియగు గాయత్రీదేవియొక్క మూర్తిని చెప్పుచున్నాడు" అని అవతారికయొక్క అర్థము. "జగచ్ఛరీరం సావిత్ర్యా"=అను మూలముయొక్క వ్యాఖ్యానమున నర్థము=పృథివ్యాదిపంచమహాభూతములును, ఆ పంచమహాభూతములవలన బుట్టిన పాంచభౌతిక వస్తువు లన్నియును, గాయత్రీదేవియొక్క స్థూలశరీరముగా ధ్యానింపవలె నని అర్థము. కావున=గాయత్రీదేవి. స్థూలసమష్టిరూపమైన విరాట్టునందు "ఇది నా స్థూలశరీరము" అనెడు అభిమానము గలది

ఇక సంధ్యాదేవత యన్ననో=సృష్టికి పూర్వము ప్రళయకాలమున చిచ్ఛక్తిరూపముతో నావిర్భవించినది. ఇట్లిద్దరకును కాలభేదమున్నది. సంధ్యాదేవతయొక్క ధ్యేయరూపము కల్పితము. గాయత్రీదేవియొక్క రూపము వ్యావహారిక వాస్తవికము. అనగా-వ్యావహారికసత్తాగలది. గాయత్రి విరాడభిమానిని సంధ్యాదేవత అవ్యక్తమాయాభిమానిని. ఇంకను సంధ్యాదేవత నాశ్రయించిన మాయచే సృష్టింపబడిన దానిలో నేకదేశమగు విరాట్టునందు అభిమానిని. ఇట్లనేక భేదము లుండుటవలన సంధ్యాదేవతకంటె గాయత్రీదేవి భిన్నమైనదే. ఇద్దరు నొక్కరు గాదు. ఇది సంధ్యాగాయత్రీదేవతల యొక్క స్వరూపభేదము.

ఇది

విద్వచ్ఛిరోమణి — సాహిత్యవిశారద — ద్విజబృందనిషేవి సోమయాజులోపనామక వేంకటాచలశాస్త్రిచేత రచింపబడిన పూర్ణాభిధాంధ్రవ్యాఖ్యానముపేతమగు సంధ్యాతత్త్వసుబోధిని యందు ద్వితీయాధ్యాయమున సంధ్యాదేవతాస్వరూపనిరూపణంబను ద్వితీయభాగము

సమాప్తము.

ద్వితీయాధ్యాయము సమాప్తము.

ఓమ్ తత్ సత్

శివమ్

ఓమ్

"యత్సంధ్యాముపాసతే బ్రహ్మైవ తదుపాసతే।"

ఇతి శ్రుతిః।

# సంధ్యాతత్వసుబోధిని

పూర్వార్థాభిధాంధ్రవ్యాఖ్యాసముపేతము

తృతీయాధ్యాయము—ప్రథమభాగము

ఉపాసనప్రకరణము

సంధ్యాస్వరూపనిరూపణానంతరము ఉపాసనాస్వరూపము వివరింపబడుచున్నది.

"ధ్యాయత్యర్థ ఏషః, యత్సమానప్రత్యయప్రవాహీకరణమ్. తదేవోపాసనమ్" ధ్యానమనగా "ఒకేవిధమగు జ్ఞానములను (తలంపులను) ప్రవాహముగ చేయుట. అదియే ఉపాసనము". అని శ్రీశంకరభగవత్పాదులవారు చెప్పిరి. కాగా—"ఇతరజ్ఞానములు (యోచనలు) మధ్య మధ్య దూరకుండ నూనెధార వలె మధ్య మధ్య తెగకుండ ఉండెడు, ఒకేవిధమైన జ్ఞానముల ప్రవాహము ఉపాసనము.

అవ: ఇట్లు ఉపాసింపదగిన సంధ్యాదేవతయొక్క స్వరూపమును, ఉపాసనాస్వరూపమును నిరూపించిన తర్వాత, ఇప్పుడు ఉపాసనా భేదములను నిరూపించుటకారంభమగుచున్నది.

> అహంగ్రహః ప్రతీకశ్చో-
> పాసనం ద్వివిధం స్మృతం।
> ప్రకృతే చ ద్విధోపాస్యా
> త్వధికారానుసారతః॥ 18॥

ఉపాసన రెండు విధములు. అహంగ్రహోపాసనమనియు, ప్రతీకోపాసనమనియును. ఎచ్చట పరమాత్మ సగుణస్వరూపుడై "సోఽహం" "ఆ పరమాత్మ నేనే" యని అహంత్వముతో ధ్యానింప బడుచున్నాడో యది అహంగ్రహోపాసనము. "సగుణపరాకై్చతన్య మునకును స్వీయప్రత్యకై్చతన్యమునకును, ఐక్యభావనము అహం గ్రహోపాసనము. ఉపాసనావిధివాక్యమున అహంపదము లేకపోయి నను అహంపదమును చేర్చి ఉపాసనను చేయవలెను. ఇట్లే శారీరక మీమాంసాభాష్యమున చతుర్థాధ్యాయమున "ఆత్మేతి తూపగచ్ఛంతి. గ్రాహయంతి చ" అను సూత్రముయొక్క భాష్యమున శ్రీశంకరభగవ త్పాదులవారిచేత సిద్ధాంతము చేయబడినది దీనికి ఉదాహరణము సంధ్యావందనమునందలి "అసావాదిత్యో బ్రహ్మ" అను సంధ్యోపాసన వాక్యమే ఈ వాక్యమున అహంపదము లేదు. ఐనను "అహంపద మును చేర్చి "సాఽహమస్మి" అని యుపాసింపవలెనని బ్రహ్మసూత్ర కర్తయగు వ్యాసమహర్షియే "న భిన్నాం ప్రతిపద్యేత" ఇత్యాదిశ్లోక మున వ్రాసినారు. ఈ శ్లోకార్థము ఉత్తరోత్తర వివరింపబడును.

పరమాత్మవ్యతిరిక్తమైన అల్పమైన వస్తువును ఉత్కృష్ట దేవతాబుద్ధితో గాని, బ్రహ్మదృష్టితో గాని సంస్కరించి, యుపాసిం చిన యెడల అది ప్రతీకోపాసన మనబడును. ప్రతీకమనగా అవ యవము. అవయవము అల్పమగు వస్తువగును.

ఉదాహరణము = "ఆదిత్యో బ్రహ్మేత్యుపాసీత" ఆదిత్యుడు పరబ్రహ్మమని యుపాసింపుము, "మనో బ్రహ్మేత్యుపాసీత" మనను పరబ్రహ్మమని ఉపాసింపుడు. అను వాక్యములు. ఇచ్చట అల్ప వస్తువగు ఆదిత్యుడు బ్రహ్మదృష్టిచేత సంస్కరింపబడినవాడై ఉపా సింపబడుచున్నాడు. అట్లే మనస్సు గూడ అల్పవస్తువే. బ్రహ్మదృష్టి చేత సంస్కరింపబడినదై యుపాసింపబడుచున్నది.

ప్రకృతమున సంధ్యావందనమున తన అధికారా-(యోగ్యతా) నుసారముగ అహంగ్రహోపాసనమును, ప్రతీకోపాసనమును రెండు విధములైన యుపాసనములను చేయవచ్చును.

ఎవరు ఎట్టి అధికారులు ?

శ్రీసర్వజ్ఞమాధవాచార్యులవారు, సూతసంహితావ్యాఖ్యానమున అధికారులు మూడువిధములని చెప్పి, వారి లక్షణములను వ్రాసి నారు. ఎట్లనగా = త్రివిధా అధికారిణః। ఉత్తమా మధ్యమా అధమా

శ్చేతి! తత్ర విశుద్ధసత్త్వాః, సమాహితచేతసః, ఉత్తమాః. వివేక వైరాగ్యసంపన్నా అపి రజోలేశానువృత్త్యా విక్షిప్తచేతసో మధ్యమాః. ప్రబలతరదురితప్రతిబద్ధచిత్తాః, ఔత్సుక్యమాత్రేణ ప్రవృత్తా అపి అప్రతిష్ఠితజిజ్ఞాసాః అధమా ఇతి॥

అనగా—అధికారులు ఉత్తములు మధ్యములు అధములు నని మూడు విధములు. అందు విశుద్ధసత్త్వులు, సమాహితచేతస్కులును ఉత్తములు. అనగా విశేషముగా శుద్ధమైన సత్త్వగుణము కల వారు. ఇచ్చట సత్త్వగుణమునందలి విశుద్ధి అనగా—భగవద్గీత యందు చెప్పబడినరీతిగ—చిరకాలము నిష్కామకర్మ ననుష్ఠించుట చేత, పాపము, క్షీణించి, రజస్తమోగుణములు పూర్తిగ క్షీణించగా-మిగిలిన సత్త్వగుణమునకు ఆ రజస్తమోగుణముల సంబంధ మేమియును లేకపోవుటయే విశుద్ధి. ఇట్టి విశుద్ధి కలిగిన తర్వాత చిత్తమునకు విక్షేపము (చాంచల్యము) కలిగించునట్టి రజోగుణము లేక పోవుటచేత చిత్తము బాహ్యవిషయములవైపు పరుగెత్తకుండ సమాహితము (నెమ్మదిగలది) అగును. ఇట్లు సమాహితమైన మనసు గల వారు ఉత్తములు. ఇట్టి ఉత్తమాధికారి అత్యంతదుర్లభుడు.

భగవద్గీతయందు చెప్పబడిన నిష్కామకర్మానుష్ఠానము చాల కాలము చేయుటచేత వివేకవైరాగ్యములు కలిగినను, రజోగుణము పూర్తిగ క్షీణించకపోవుటవలన రజోగుణలేశము కొనసాగుచుండుట చేత చిత్తవిక్షేపము (మనస్సుచెదరుట) కలుగుచుండును. ఇట్టివారు మధ్యములు. ఉత్తములకు మనస్సు స్థిరముగ నుండును. మధ్యములకు మనసు కొంచెము చంచలముగ నుండును ఇట్టిమధ్యములు దుర్లభులు కారు. కాని, విరళముగ నుందురు. ఇక మూడవ వర్గమునకు చెందినవారు. వీరి చిత్తము పూర్వజన్మమున చేసిన ప్రబలతరమైన పాపసమూహముతో నిండియుండును. ఆ పాపవాసనలు పుణ్యకర్మలను చేయుటయందు అడ్డుపడుచుండును. ఇంకను తమోగుణము కూడ నుండును. పాపపుపనులు మంచిపనులుగను, మంచి పుణ్యకర్మలు పనికిమాలిన కర్మలుగను తోచునట్లు తమోగుణము చేయును. రజోగుణము మనసును స్థిరముగ నుండనీయక చెదరగొట్టుచుండును. రజస్తమోగుణముల స్వభావమది. పాప వాసన లడ్డుపెట్టుటచేత చిత్తము పుణ్యకర్మలు చేయుటయందు ప్రవర్తించనేరదు. ఎప్పుడైనను ఏపుణ్యలేశముచేత నైనను ఔత్సుక్యము (సరదా) చేత పుణ్యకర్మలను చేయుటయందు (ఏభగవద్గీతాశ్రవ

ణమునందైనను) ప్రవర్తించినను, ఆ ప్రవర్తనమాత్రముచేతనే ఆ కాస్త పుణ్యము క్షీణించి పోగా-అస్థిరచిత్తులై యాపనినుండి విరమింతురు. ఇట్టి వారు అధమాధికారులు.

ద్విజుడు ఈ లక్షణములచేత తన అధికారమును (యోగ్యతను) తెలిసికొని, ఆ అధికారానుసారము, ప్రతీకోపాసనమునో అహంగ్రహోపాసనమునో చేయవలెను, ఏ అధికారి యేయుపాసన చేయవలెనో సంధ్యోపాసనాస్వరూపనిరూపణానంతరము వివరింపబడును.

అవ: సంధ్యోపాసనాస్వరూపము వివరింపబడుచున్నది.

**నామరూపైః కాలభిన్నై**
**ర్వ్యక్తా సంధ్యా త్రిధా మతా।**
**సంధ్యా హి తాదృశీ బ్రహ్మ**
**సాఽహమస్మీతి భావయేత్॥** 19।

అర్థము. ప్రాతర్మధ్యాహ్నసాయంసంధ్యలయందు సంధ్యాదేవతకు వేర్వేరు రూపములు, వేర్వేరు రంగులు, వేర్వేరు పేర్లు వేర్వేరు వాహనములు మొదలైనవి కూడ కలవు.

ఈ విషయమున అత్రిమహర్షి.

"గాయత్రీ నామ పూర్వాహ్నే సావిత్రీ మధ్యమే దినే,।
సరస్వతీ తు సాయాహ్నే, సైవ సంధ్యా త్రిధా మతా॥
గాయత్రీ తు భవేద్రక్తా సావిత్రీ శుక్లవర్ణికా।
సరస్వతీ తథా కృష్ణా ఉపాస్యా వర్ణభేదతః॥
గాయత్రీ బ్రహ్మరూపా తు సావిత్రీ రుద్రరూపిణీ।
సరస్వతీ విష్ణురూపా ఉపాస్యా రూపభేదతః॥" అని.

గౌతమధర్మశాస్త్రమున ఐదారధ్యాయములందు సంధ్యాదేవత యొక్క మూడు సంధ్యలయందలి మూడు విధములైన రూపములను పూర్తి వివరములతో వ్రాయబడినవి. ఆ శ్లోకములను వెనువెంటనే వ్రాయుచున్నాను.

## గౌతమధర్మశాస్త్రమునందలి త్రివిధసంధ్యారూప వర్ణనము

### ప్రాద్ధున

"ఆచమ్యైవ తతస్తిష్ఠన్ ధ్యాయేత్సంధ్యాం సమాహితః।
రక్తస్రగ్వసనాం రక్తాం, రక్తాలంకారభూషితామ్॥
హంసాసనసమాసీనాం యజ్ఞసూత్రసులక్షణాం।
చతుర్భుజాం చతుర్వక్త్రాం, లోచనాష్టకభూషితామ్॥
అక్షస్రక్కరకౌ దక్షే పుస్తం దండం చ వామయోః।
దధానాం సంస్మరేత్సంధ్యాం భానుమండల మధ్యగాం॥
గాయత్రీనామవిఖ్యాతాం ద్విజానాం సౌఖ్యదాయినీమ్॥"

### మధ్యాహ్నమున

వృషాసనసమారూఢాం, గజచర్మవిభూషితాం।
శుద్ధస్ఫటికసంకాశాం, శార్దూలాజినవాసినీమ్॥
అర్ధచంద్రజటాజూటాం, త్రినేత్రాం చ చతుర్భుజాం।
త్రిశూలాక్షస్రజౌ దక్షే వామే డమరుదానకే॥
పంచాస్యాం మధ్యమే త్వహ్నః, సావిత్రీం సంస్మరేద్ద్విజః॥

### సాయంకాలమున

తార్క్ష్యాసనసమాసీనాం పీతవస్త్రసుభూషితాం।
నీలవర్ణాం శంఖచక్రగదాపద్మచతుర్భుజామ్॥
సరస్వతీం విష్ణురూపాం కిరీటాభరణైర్యుతాం।
సాయంసంధ్యాం స్మరేదేవమనస్తమితభాస్కరే॥

అచ్చటనే సంధ్యోపాసన విషయమున =

"ప్రాగగ్రేషు తతః స్థిత్వా దర్భేషు సుసమాహితః।
ప్రాణాయామత్రయం కృత్వా, ధ్యాయేత్సంధ్యామితి శ్రుతిః।
తత్ర స్థలే వందనం తు తాం ధ్యాయేత్సుసమాహితః॥
తావతైవ తు సాకల్యం భవత్యేవ న సంశయః॥" అని.

అత్రిమహర్షివచనమున పేరు, రంగు, రూపమను, మూడంశ ములే యున్నవి. గౌతముల వర్ణనయందన్ని యంశములున్నవి. పరస్పరవిరోధము లేదు. కావున ఇద్దరి వర్ణనములను ఏకముచేసి అర్థమును వ్రాయుదును.

## ప్రొద్దున

హంసవాహనము, బ్రహ్మరూపము, రక్త (ఎఱ్ఱని) వర్ణము, రక్త వస్త్రము రక్తమాల్యవిభూషణములు, కిరీటములతో కూడిన నాలుగు ముఖములు, కుడి పైచేయి మొదలు సవ్యముగ జపమాల, పుస్తకము. దండము, కమండలములను ధరించు నాలుగు భుజములు, జందెము, గాయత్రీ నామదేయము, గలిగి సూర్యమండలము మధ్యనుండు ప్రాతస్సంధ్యాదేవిని ధ్యానింపవలెను.

## మధ్యాహ్నమున

వృషభవాహనము, ఐదుముఖములు కల శివరూపము, తెల్లని రంగు, తెల్లనివస్త్రము, శుక్లమాల్యవిభూషణములు, అర్ధచంద్రాలంకృతజటాజూటము మూడేసికన్నులు గల ఐదు ముఖములు, కుడి పైచేయి మొదలు సవళీముగ త్రిశూలము, డమరుకము, దానముద్ర, అక్షమాలలను ధరించిన నాలుగు భుజములు, గజచర్మోత్తరీయము, పులితోలు వస్త్రము, సావిత్రీనామధేయము గలిగి, సూర్యమండలమందుండు మధ్యాహ్నసంధ్యాదేవిని ధ్యానింపవలెను.

## సాయంకాలమున

గరుడవాహనము, విష్ణురూపము, నీలవర్ణము, పసుపురంగు వస్త్రము, నీలమాల్యవిభూషణములు, ఎడమ పైచేయి మొదలు కుడివైపుగ శంఖచక్రగదాపద్మములను ధరించు నాలుగు భుజములు, కిరీటభూషితశిరస్సు, వనమాలతో కూడి యున్న సరస్వతీనామధేయము గలదై సాయంసంధ్యాదేవి సూర్యమండలమునందు ఉండును. ఆమెను ధ్యానింపవలెను.

తూర్పుకొనలు గల దర్భలమీద నిలబడి, మూడు ప్రాణాయామములను చేసి, నెమ్మదియైన మనసు గలవాడై సంధ్యాదేవతను ధ్యానింపవలెను. అని శ్రుతి చెప్పుచున్నది.

అని గౌతములవారు చెప్పుచున్నారు.

మహాతపశ్శాలురగు అత్రిగౌతమమహర్షులు ధ్యానింపదగిన సంధ్యాదేవతారూపమును ఒకే విధముగ వర్ణించిరి. ఇట్టి సంధ్యాదేవతామూర్తి ఉపాసకునిచేత కల్పితమైనది. గాయత్రీదేవియొక్క మూర్తి మాత్రము భక్తులకభీష్టవరదానముకొరకు శ్రీసాంఖ్యాయనమహర్షిచేత మహాతపస్సు చేసి ప్రార్థింపబడినదై, గాయత్రీదేవి యతని పుత్రియై ఐదుముఖములు పదిచేతులతో విరాజమానయై స్వయముగ నావిర్భవించినది. ఇట్లు రెండు రూపములకును భేదము

"సంధ్యావందన"మని లోకమున బహుళవ్యవహారముండుట చేతను, వందనశబ్దమునకు లోకమున నమస్కారార్థము ప్రసిద్ధమగుట చేతను, సందేహము రాగా—నమస్కారార్థము కాదని, ఉపాసనాప్రకరణానుకూలమైన యర్థము చెప్పబడుచున్నది. "తత్ర స్థలే వందనం తు తాం ధ్యాయేత్సుసమాహితః" అని. అస్థలమున వందనశబ్దార్థ మేమనగా—మిక్కిలి నెమ్మదియైన మనసు గలవాడై ఆ సంధ్యాదేవతను ధ్యానించుటయే యని" అని అర్థము.

అనగా—వందనశబ్దమునకు ఈ సందర్భములో ధ్యానమనియే అర్థము.

శ్రీలలితాసహస్రనామభాష్యమున శ్రీభాస్కరరాయలవారు గూడ "సంధ్యావందనపదవాచ్యం = = అభేదభావనం" అని వ్రాయుచు వందనశబ్దమునకు ధ్యానమే అర్థమని వ్రాసిరి "ఇట్లే = "సంధ్యా హి సూర్యగం బ్రహ్మ వందనం తదుపాసనం" అని యొక స్మృతియందు స్పష్టముగ నీ అర్థమే వ్రాయబడినది,

"బ్రాహ్మణో విద్వాన్ సకలం భద్రమశ్నుతే" ఈ యుపాసనామంత్రార్థమును తెలిసికొని సంధ్యోపాసనమును చేసిన ద్విజుడు, సంపూర్ణమైన మోక్షఫలమును పొందును" అను తైత్తరీయబ్రాహ్మణమునందలి వాక్యముయొక్క అర్థమును "తాపత్యైవ తు సాకల్యం భవత్యేవ న సంశయః" అను గౌతమధర్మశాస్త్రవచనము జ్ఞాపకపరచుచు మోక్షఫలమును పొందుటలో ఉపాసకుని సందేహమును పోగొట్టుచున్నది. ఇట్లే "శుచిర్వాప్యశుచిర్వా యః=బ్రహ్మభూయాయ కల్పతే=నాత్ర సంశయః" అను విష్ణువచనము గూడ మోక్షరూపఫల విషయమున సందేహమును పోగొట్టుచున్నది

"బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి" అను శ్రుతి సంధ్యోపాసకునకు మోక్షఫలమును చెప్పుచున్నది. "న సంశయః" "నాత్ర సంశయః" అను స్మృతివచనములు శ్రుతిననుసరించుచున్నవై సందేహపడువాని యొక్క సందేహమును నివారించుచున్నవి.

ఈ విధముగ శ్రుతిస్మృతులు సంధ్యోపాసనమును, దాని మోక్ష ఫలమును గొంతెత్తి గట్టిగా ఉద్ఘోషించుచుండగ చాలమంది విన నొల్లకున్నారు.

అహా! కాలమహిమ! సర్వజగజ్జనని అగు శ్రీసంధ్యాదేవి యవ్యాజకరుణచేత ద్విజులందరకును శ్రద్ధను కలిగించుగాక! ద్విజు లందరును శ్రద్ధతో యథోక్తముగ సంధ్యాదేవిని ఉపాసింతురు గాత! ఉపాసనాపూర్ణఫలమును పొందెదరు గాత!

ఇట్లు మూల శ్లోకపూర్వార్ధముచేత ధ్యానింపదగిన సంధ్యాదేవతా రూపమును వివరించి, ఉత్తరార్ధముచేత తదుపాసనస్వరూపము చెప్పబడుచున్నది.

తాదృశీ=శ్లోకమున పూర్వార్ధముచేత వర్ణింపబడిన వర్ణరూప నామములతో గూడిన, సంధ్యా—ఆదిత్యమండలాంతర్వర్తి-ఆదిత్య జీవప్రేరకమగు చిచ్ఛక్తిరూపిణియగు సంధ్య, బ్రహ్మ= సత్య జ్ఞానానంతమైన పరబ్రహ్మమే. అని తొలుత చెప్పబడిన రూపవర్ణనా మాదులతోకూడిన సంధ్యాదేవతను "అసావాదిత్యో బ్రహ్మ" అనుమంత్ర ముతో పరబ్రహ్మాఽభిన్నముగ ధ్యానింపవలెను. తర్వాత, సా= ముందు పరబ్రహ్మాఽభిన్నముగ భావింపబడిన ఆ సంధ్యాదేవత, అహమస్మి=నేనే యగుచున్నాను. ఇతి భావయేత్=అని అభేదముగ ధ్యానింపవలెను. ఉపాసింపవలెను.

ఉపాసనావాక్యము యొక్క అర్థమును ముందు తెలిసికొనవలసి యున్నది.

"అసావాదిత్యో బ్రహ్మ+సాఽహమస్మి" ఇది యుపాసనా వాక్యము.

"అసౌ + ఆదిత్యః + బ్రహ్మ + సా + అహం + అస్మి" అని పద చ్ఛేదము.

"అసౌ" పదము నటుంచి. ముందు ఆదిత్యపదముయొక్క అర్థమును విచారింతము. ఆదిత్యశబ్దమునకు మూడర్థములు కలవు.

(1) ఆదిత్యమండలము, (2) ఆదిత్యమండలమునందు (ఇది నామండలమనెడు) అభిమానముగల జీవుడగు సూర్యుడు. మన స్థూలశరీరమునందు "ఇది నా శరీరము" అను అభిమానము మన జీవునకున్నట్లే. జీవుడగు సూర్యునకు గూడ తన మండలమునందు "ఇది నా మండలము" అను అభిమానముండును. కాన జీవుడగు సూర్యుడు రెండవ అర్థము, (3) మూడవది. ఆ జీవుని ప్రేరేపించు బ్రహ్మచైతన్యము. అందరి జీవులనున్ను, లోపలను అంతర్యామియై యున్న బ్రహ్మచైతన్యమే ప్రేరేపించుచున్నది. కాని లోకములో సాధారణముగ పైకి కనబడుచున్న శరీరము, లోపలనున్న జీవుడు ఈ రెండింటినే గుర్తించి అర్థముగ జెప్పుకొనుట వాడుక. లోపలనున్న బ్రహ్మచైతన్యము గురించి సామాన్యులకు తెలియదు. కాని వేదాంతశాస్త్రవిచారము చేయునప్పుడు లోపలనున్న బ్రహ్మచైతన్యమును మూడవ అర్థముగ తీసికొనవలెను. ప్రస్తుతమున ఆదిత్యపదమునకు మండలము గాని, తదభిమానియగు జీవుడగు సూర్యుడు గాని అర్థముగా చెప్ప వీలులేదు ఏల? ఆదిత్యపదము తర్వాత బ్రహ్మపదమున్నది గదా! దాని అర్థము పరబ్రహ్మము. కావున ఆదిత్యుడు-పరబ్రహ్మము అను రెండింటికి ఐక్యము ఎట్లు చెప్పగలము? ఆదిత్యమండలము గాని, ఆదిత్యజీవుడుగాని పరబ్రహ్మము కాదు గదా! మండలము, జీవుడును మిథ్యావస్తువులు. పరబ్రహ్మము సత్యమైనది చైతన్యరూపమైనది. రెండింటికిని ఐక్యము కుదురదు అట్లయిన నేమి చేయవలెను? ఇట్లు చేయవలెను.

ఆదిత్యశబ్దమునకర్థమైన మూడు భాగములలో, తొలి రెండు భాగములను విడిచిపెట్టి మూడవభాగమగు బ్రహ్మచైతన్యమును మాత్రము అర్థముగ చెప్పవలెను మూడవ భాగము బ్రహ్మచైతన్యమే కావున రెండింటికి ఐక్యము కుదురును. సందేహము లేదు, ఈ విధముగ నచ్చుటచ్చుట అర్థమును చెప్పుట శాస్త్రమునను, లోకమునను వేదమునందును గలదు, దీనికి భాగలక్షణ (లేక జహదజహల్లక్షణ) అని శాస్త్రమున పేరు. ఆదిత్యశబ్దమునకు అర్థమైన బ్రహ్మచైతన్యము సంధ్యయే "సంధ్యా హి సూర్యగం బ్రహ్మ" అని వ్యాసులవారు చెప్పిరి గదా! కావున ఆదిత్యశబ్దమునకు ఆదిత్యమండలాంతర్యామియైనదియు, ఆదిత్యజీవప్రేరకమైన బ్రహ్మచైతన్యరూపిణియగు

సంధ్యయే పై భాగలక్షణచేత అర్థమగుచున్నది. అట్టి సంధ్యయు పర బ్రహ్మచైతన్యమున్ను ఒక్కటియే గదా! రెండింటికిని ఐక్యము కుదురును. ఇంతవరకు సరిపడినది. ఇంకొక్క విషయమును తెలిసికొనవలసియున్నది.

ఆదిత్యమండలమందున్న బ్రహ్మచైతన్యము నిర్గుణము, నిరాకారము. దానిని అధ్యాత్మ సంస్కారము లేని మనసుగల మనమెట్లు ధ్యానింపగలము? ధ్యానింపలేము. అందువలన కృపానిధులగు మహర్షులు ఆ చైతన్యమునకు నామరూపములను కల్పించిరి. ఆ కల్పించిన నామరూపములతో నున్న చెతన్యమును మనము ధ్యానింపగలము.

ఆ నామరూపము లెట్టివి? అత్రిమహర్షియును గౌతమమహర్షియును ఆ నామరూపములను వివరించినారు. ఆ బ్రహ్మచైతన్యమునకు మూడు సంధ్యలందును మూడు వేర్వేరు రూపములను వేర్వేరు నామములను వర్ణములను వాహనములను గూడ చెప్పిరి. ఈ వివరములను 84, 85, 86 వ పుటలయందు చూచునది. అన్నింటితో కూడిన బ్రహ్మరుద్రవిష్ణురూపములతో, ఆదిత్యమండలాంతర్యామి యగు బ్రహ్మచైతన్యమును ధ్యానింపవలెను. ఇప్పుడు "అసౌ" శబ్దమున కర్థమును వ్రాసెదను.

"అసౌ=వెనుక వర్ణింపబడిన వర్ణరూపనామవాహనములతో గూడిన" అని అర్థము. ఏలననిన—శ్రీమాధవాచార్యులవారు "ఉద్యంతమస్తం యంత"మను బ్రాహ్మణ భాగమునకు వ్యాఖ్యానము వ్రాయుచు, "యథోక్తనామాదిభిః ధ్యేయం" అని "అసౌ" శబ్దమునకు అర్థమును వ్రాసిరి. అనగా—అత్రిగౌతములు వర్ణించిన నామరూపాదులతో ధ్యానింపదగిన"దని అర్థము, ఆదిత్యః=సంధ్యాదేవత, బ్రహ్మ=పర బ్రహ్మస్వరూపమే అని ముందు, సంధ్యాపరబ్రహ్మములకు అభేద ధ్యానమును చేయవలెను. తర్వాత="సోఽహమస్మి"=సః=పర బ్రహ్మాఽభిన్నమైన ఆ సంధ్యాదేవత, అహం=నేను, అస్మి=అగుచున్నాను,అని రెండవది, ముఖ్యమైనదగు ధ్యానమును చేయవలెను.

ఇంతవరకు మంత్రములోని పదముల అర్థము విడివిడిగ బోధపడుటకొరకు వ్రాయబడినది. ఇక ఉపాసనము (ధ్యానము) ఏ యాకారములో నుండవలెనో ఆ యుపాసనాకారమును వ్రాసెదను. 19వ శ్లోకమున మొదటి రెండు పాదములును అసౌ పదమునకర్థము.

మూడవ పాదము "ఆదిత్యో బ్రహ్మ" అను దాని అర్థము. నాలవ పాదము "అహంగ్రహోపాసనము".

॥ఉపాసనాకారనిరూపణము॥

ప్రొద్దున

"అసావాదిత్యో బ్రహ్మ + సాఽహమస్మి" అని.

అనగా దీని అర్థము

ఆదిత్యమండలాంతర్యామి, ఆదిత్యజీవప్రేరక, హంసవాహన, బ్రహ్మరూప (రక్తవర్ణ-రక్తవస్త్ర-రక్తమాల్యవిభూషణ-సకిరీట చతుర్ముఖ-అక్షమాలా-పుస్తక,- దండకమండలుధర — చతుర్భుజ—చతుర్ముఖ-బ్రహ్మరూప) గాయత్రీనామక - సంధ్యా=(సత్యజ్ఞానానంతం త్రిపాత్పరం) బ్రహ్మ॥ సాఽహమస్మి=(తాదృశపరబ్రహ్మాఽభిన్న) సంధ్యాఽహమస్మి" అని.

మధ్యాహ్నమున

"అసావాదిత్యో బ్రహ్మ + సాఽహమస్మి"

దీని అర్థము

ఆదిత్యమండలాంతర్యామి ఆదిత్యజీవప్రేరక-వృషభవాహన రుద్రరూప (శుక్లవర్ణ—శుక్లవస్త్ర, శుక్లమాల్యవిభూషణ-గజచర్మవిభూషిత-వ్యాఘ్రచర్మధర—త్రినేత్రపంచముఖ-అర్ధేందుశేఖర జటాజూటధర-త్రిశూల-డమరుక-దానముద్రా - జపమాలా - ధర-చతుర్భుజ-రుద్రరూప) సావిత్రీనామక-సంధ్యా = (సత్యజ్ఞానానంతం త్రిపాత్పరం) బ్రహ్మ॥ సాఽహమస్మి=(తాదృశ - త్రిపాత్పరబ్రహ్మాభిన్న) సంధ్యాఽహమస్మి" అని.

సాయంసంధ్యోపాసనాకారము

అసావాదిత్యో బ్రహ్మ + సాఽహమస్మి॥

దీని యర్థము

ఆదిత్యమండలాంతర్యామి, ఆదిత్యజీవప్రేరక-గరుడవాహన-విష్ణురూప (నీలవర్ణ—పీతవస్త్ర. నీలమాల్యవిభూషణ—శంఖచక్ర

గదాపద్మధర, చతుర్భుజ—వనమాలాకిరీటాదిభూషిత—విష్ణురూప) సరస్వతీనామక—సంధ్యా (సత్యజ్ఞానానంతం త్రిపాత్పరం, బ్రహ్మ॥ సాఽహమస్మి (తాదృశపరబ్రహ్మాఽభిన్న) సంధ్యాఽహమస్మి॥ అని.

ఇచ్చట కుండలీకృతమైన (బ్రాకెట్లలోనున్న) భాగములు ఉపాసనాకారములో ప్రవేశింపవు. కాని—ఉపాసన (ధ్యానము)లో "బ్రహ్మరూప" "రుద్రరూప" "విష్ణురూప" అనే పదములను తలచునపుడు ఆకుండలులలోనున్న విశేషణములతో కూడ నారూపములు తోచవలె నను నభిప్రాయముతో కుండలులలో ఆ విశేషణములు వ్రాయబడినవి. తర్వాత "బ్రహ్మ" పదమును తలచగనే బ్రహ్మమందు సత్యత్వ— జ్ఞానత్వ—అనంతత్వ ధర్మములు తోచుటకొరకును, సాఽహమస్మి" అను నప్పుడు "సా" అను పదముచేత పూర్వము పరబ్రహ్మాఽభిన్నముగ భావింపబడిన సంధ్యాదేవతను గ్రహింపవలెననిన్నీ, కుండలులలో ఆయా విశేషణములుంచబడినవి. కావున కుండలీకృతభాగములను విడిచి మిగిలిన భాగమె ఉపాసనాకారమున నుండవలెను.

## ప్రాతస్సంధ్యోపాసనవాక్యార్థము

ఆదిత్యమండలమునందు చాల లోపలనుండుచు ఆదిత్య (సూర్యునియొక్క) జీవుని ప్రవర్తింపజేయుచు-హంసవాహనము మీద, (ఎఱ్ఱని రంగు గలిగి, ఎఱ్ఱని చీర రవికెలను ధరించి, కిరీటములు ధరించిన నాల్గు ముఖములు గలిగి, జపమాల పుస్తకము దండకమండలములను నాల్గు చేతులతో ధరించిన' చతుర్ముఖ బ్రహ్మరూపముతో నున్న, గాయత్రి యను పేరు గల సంధ్యాదేవత, (సత్యమై, జ్ఞానస్వరూపమై, అనంతమైన త్రిపాత్) పరబ్రహ్మమే. అట్లు త్రిపాత్పరబ్రహ్మ-అభిన్నమైన యీ సంధ్యాదేవత, నేను, అగుచున్నాను, అని యర్థము.

## మధ్యాహ్నసంధ్యోపాసనవాక్యముయొక్క అర్థము.

ఆదిత్యమండలమునందు, చాల లోపలనుండుచు. ఆదిత్య జీవుని ప్రవర్తింపజేయుచు, తెల్లని వృషభవాహనము మీద తెల్లని రంగు గలిగి, తెల్లనిచీరను, రవికెను ధరించి, మూడేసి నేత్రములు గల ఐదు ముఖములు గలిగి, జటాజూటములందు అర్ధచంద్రుని

గలిగి, త్రిశూలమును ఉడుకును, దానముద్రను, జపమాలను నాలుగుచేతులతో ధరించి, పులితోలును కట్టిన) రుద్రరూపముతో నున్న సావిత్రి యను పేరు గల సంధ్యాదేవత (సత్యమై, జ్ఞాన రూపమై. యనంతమైన త్రిపాత్) పరబ్రహ్మమే". అట్లు త్రిపాత్పర బ్రహ్మ-అభిన్నమైన యా సంధ్యాదేవత నేను అగుచున్నాను అని యర్థము.

సాయంసంధ్యోపాసనవాక్యముయొక్క అర్థము.

ఆదిత్యమండలమునందు, చాల లోపల నుండుచు, ఆదిత్య జీవుని ప్రవర్తింపజేయుచు, గరుడవాహనము మీద (నీలము రంగు గలిగి, పసుపుపచ్చని చీర రవికెలను ధరించి, శంఖచక్రగదాపద్మ ములను నాల్గు చేతులతో ధరించిన) విష్ణురూపముతోనున్న సరస్వతి యను పేరు గల సంధ్యాదేవత—(సత్యమై, జ్ఞానరూపమై యనంత మైన త్రిపాత్) పరబ్రహ్మమే". అట్లు త్రిపాత్పరబ్రహ్మాఽభిన్నమైన సంధ్యాదేవత నేను, అగుచున్నాను. అని యర్థము.

సూర్యమండలములోపల నున్న ఈ సంధ్యాదేవతను తన కెదు రుగ కోటిసూర్యప్రకాశమానమై ప్రత్యక్షముగ ఉన్నట్లు ధ్యానింప వలెను. ఇట్టి రూపమును ధ్యానము చేయలేని మందుడు "ఆదిత్య మండలమునందున్న సంధ్యాదేవత—పరబ్రహ్మమే అట్టి సంధ్యా దేవత నేను" అని అర్థమును తలంచుచునైనను ధ్యానింపవలెను.

"న భిన్నాం ప్రతిపద్యేత" = ఇత్యాది వ్యాసస్మృతిశ్లోకమునం దలి నాల్గవ పాదమున "విధినా యేన కేనచిత్" అని యున్నది. దాని యర్థము "యేన కేనచిత్ విధినా = సగుణోపాసనవిధానముచే గాని, లేక నిర్గుణోపాసనవిధానముచే గాని, ఉపాసకుని యోగ్యతానుసార ముగ ఉపాసింపవలెనని యర్థము. కాగా— శ్రీమాధవాచార్యులవారు మధ్యమాధికారులకొరకు అత్రిగౌతములు చెప్పినట్లు బ్రహ్మరుద్ర విష్ణురూపములతో సంధ్యాదేవతను సగుణముగ ధ్యానింపవలెనని పరాశరమాధవీయమున సూచించిరి. శ్రీభాస్కరరాయలువారు శ్రీలలితాసహస్రనామభాష్యమున "ఆదిత్యావచ్ఛిన్నచైతన్యస్య స్వావ చ్ఛిన్నచైతన్యేన సహ అభేదభావనారూపం" అని వర్ణించుటచేత కేవల నిర్గుణనిరాకారచైతన్యములకే అభేదధ్యానమును చెప్పుటవలన వారు నిర్గుణసంధ్యోపాసనమును సూచించిరి

ఇట్లు సగుణము నిర్గుణము అను ఉభయవిధసంధ్యోపాసనములును వర్ణింపబడినవి. ఈ పై రెండు ఉపాసనములును ఆదిత్యోపాధికబ్రహ్మోపాసనములు. ఇక నిరుపాధికశుద్ధబ్రహ్మోపాసనమును ఓంకారముచేత చేయవలెను.

అందువలన పెద్దలు "ఓమిత్యేకాక్షరా"నువాకము ద్వారా ఓంకారసాధనముతో ప్రణవార్థమగు అఖండ-నిర్గుణ-నిరుపాధిక-శుద్ధపరబ్రహ్మోపాసనమును కూడ సంధ్యాకాలమున చేయవలెనని ఏర్పరచిరి, ఇది సంధ్యోపాసనము కాదు. ఓంకారము నుచ్చరించుచు తదర్థమగు సర్వవ్యాపకాఽఖండ-శుద్ధ - నిర్గుణ - పరబ్రహ్మమును నృసింహోత్తరతాపినీయోపనిషత్తునందును శ్రీవిద్యారణ్యకృతవార్తికసారమునందును చెప్పబడిన విధముగ ధ్యానింపవలెను. దీనిని ఉత్తమాధికారులు నిర్గుణోపాసనముగను, మధ్యమాధికారులు ప్రతీకోపాసనముగను ఉపాసింపవలెను. ఈవిషయము ముందు పుటలలో వివరింపబడును.

పై వ్యాసస్మృతివచనమునందున్న గాయత్రీపదమును బట్టి ఇది గాయత్రీదేవిని గూర్చి చెప్పినదని యనుకొనరాదు. ఏలనన— ఇది ఉపాసనప్రకరణము. ఈ శ్లోకమున ఉపాసన చెప్పబడినది. సంధ్యావందనమున గాయత్రికి జపమే కాని యుపాసన లేదు. ఇక— సంధ్యాదేవతకు ప్రాతఃకాలమున "గాయత్రి" యను పేరు గలదు. అందువలన వ్యాసులవారు గాయత్రి యను పేరు గల ప్రాతఃసంధ్యాదేవతయొక్క ఉపాసనను గూర్చి ఈ శ్లోకమును వ్రాసిరి. కాన, గాయత్రీశబ్దమునకు గాయత్రి యను పేరు గల ప్రాతసంధ్యాదేవత యని యర్థమును చెప్పుకొనవలయును వీరమిత్రోదయగ్రంథమున శ్రీమిత్రమిశ్రులవారు సంధ్యోపాసనశబ్దముయొక్క అర్థమును గూర్చి చర్చించుచు, ఈ శ్లోకమునే యుదహరించి, యిది సంధ్యాదేవతను గూర్చియే, యని చెప్పినారు. ఇట్లు సంధ్యాదేవత వేరు, గాయత్రీదేవత వేరు అని, నిర్ణయించుటయు నైనది.

ఒకానొక వేదాంతపండితవరేణ్యు డిట్లనియెను.

"అసావాదిత్యో బ్రహ్మ" యను వాక్యము—ప్రతీకోపాసనవాక్యమే కాని, అహంగ్రహోపాసనవాక్యము కాదు. ఏలనన—ఈ

వాక్యమున ప్రత్యక్చైతన్యబోధకములగు అహమాదిపదములు లేవు గాన. యని.

ఈ మాటలు నేరచించిన సంస్కృతసంధ్యాతత్వసుబోధినీ గ్రంథమందలి "ఉద్యంతమ స్తంయంత"మిత్యాదితైత్తరీయబ్రాహ్మణ భాగమునకు సర్వతంత్రస్వతంత్రులును. వేదభాష్యకర్తలును నగు శ్రీసర్వజ్ఞమాధవాచార్యులవారి వ్యాఖ్యానమును పరిశీలింపమిచేత గలిగిన భ్రాంతివలన అనిన మాటలుగాన నిరసింపదగినవే.

ఎట్లనగా—శ్రీసర్వజ్ఞమాధవాచార్యులవారు "ఉద్యంతమస్తం యంతమాదిత్యమభిధ్యాయన్=అను చోటనున్న ఆదిత్యం" అను పదమునకు "యథోక్తనామాదిభిఃధ్యేయం సంధ్యాపదవాచ్యమాదిత్యం బ్రహ్మేతి ధ్యాయన్" అనివ్యాఖ్యానించిరి. దాని యర్థమిది, "యథోక్తనామాదిభిః ధ్యేయం" అనగా—అత్రిమహర్షి చెప్పినట్లు వేరు వేరు (రక్తాది) వర్ణములతోను, వేరువేరు (బ్రహ్మాది) రూపములతోను అట్లే వేరు వేరు గాయత్రి మొదలగు నామములతోను కూడుకొని యున్నట్లుగ ధ్యానింపదగినట్టియు నని యర్థము. ఇక "సంధ్యాపదవాచ్యం ఆదిత్యం" అనగా—సంధ్యాపదమునకు వాచ్యార్థమైన ఆదిత్యుని" అని యర్థము. అనగా నేమి? ఇట్లు. ఆదిత్యపదమునకు (1) ఆదిత్యమండలము (2) ఆదిత్యమండలాభిమానియగు జీవుడు (3) ఆ జీవప్రేరకమైన బ్రహ్మచైతన్యము" అని మూడర్థములున్నవి, ఈ మూడింటిలో మూడవదగు ఆదిత్యజీవప్రేరకమగు బ్రహ్మచైతన్యము సంధ్యాపదమునకు వాచ్యార్థము. ఎట్లనగా-బ్రహ్మవిద్వరేణ్యులును, బ్రహ్మసూత్రకర్తలునగు శ్రీవేదవ్యాసభట్టారకులు తమ స్మృతియందు సంధ్యాస్వరూపమును గూర్చి యిట్లు వ్రాసిరి. "సంధ్యా హి సూర్యగం బ్రహ్మ సంధ్యానాదవిభాగతః" అని. అనగా-సూర్యమండలాంతర్యామి, సూర్యజీవప్రేరకమగు బ్రహ్మచైతన్యము సంధ్యాపదమునకర్థము. ఆ బ్రహ్మచైతన్యమునకేల సంధ్యానామము పెట్టబడెను? అనగా-అవిక్చైభాగతః-ఉపాసకుడు తనప్రత్యక్చైతన్యమును సూర్యజీవప్రేరక బ్రహ్మచైతన్యమును అభేదబుద్ధితో, సంధ్యానాత్-చక్కగ ధ్యానము చేయును గనుక "సమ్యక్+ధ్యేయా=సంధ్యా-"చక్కగధ్యానింపదగినది గాన సంధ్య యను పేరు పెట్టబడినది యని, సంధ్యాపదమున కర్థము వ్రాసిరి.

కావున వ్యాసభట్టారకుల నిర్వచనప్రకారము సంధ్యాపద వాచ్యార్థము సూర్యమండలాంతర్యామి. సూర్యజీవప్రేరకమగుబ్రహ్మ

చైతన్యమే. కాగా ఆ యాదిత్యపదమునకు భాగలక్షణచేత ఆదిత్య మండలము ఆదిత్యజీవుడు అను రెండర్థములను విడిచిపెట్టి మూడవయర్థమగు బ్రహ్మచైతన్యమునే తీసికొనవలెను. కాగా—అట్టి బ్రహ్మచైతన్యమునకును మంత్రమునందలి బ్రహ్మపదమునకర్థమైన బ్రహ్మచైతన్యమునకును అభేదము సరిపోవును.

ఇచ్చట ఆదిత్యపదముయొక్క అర్థమగు బ్రహ్మచైతన్యము ప్రతీకము ఎంతమాత్రము కాదు గదా! కావున నిది ప్రతీకోపాసనమని యెట్లు చెప్పనొప్పును? ఎవ్వరికిని చెప్పశక్యము గాదు.

ఇంకనూ ఆదిత్యమండలాంతర్యామియగు ఆ బ్రహ్మచైతన్యము అత్రిమహర్షిచేత వర్ణింపబడిన వర్ణరూపనామములతో కూడుకొని యున్నట్లు ధ్యానింపవలెనని యుండుటవలన ఆ బ్రహ్మచైతన్యమును సగుణముగ ధ్యానింపవలెనని యర్థమగుచున్నది. కాన "సగుణ పరాక్చైతన్యమునకును స్వీయప్రత్యక్చైతన్యమునకును ఐక్యభావనము అహంగ్రహూపాసన మగుటవలన ఉపాసనావాక్యమున అహం పదము లేకపోవుట దోషము కాదు. అచ్చట అహంపదమును చేర్చి యుపాసన చేయవలెను. అట్లే శారీరకమీమాంసాభాష్యమున చతుర్థాధ్యాయమున "ఆత్మేతి తూపగచ్ఛంతి గ్రాహయంతి చ॥అనుసూత్ర భాష్యమున శ్రీశంకరభగవత్పాదులవారిచేత సిద్ధాంతము చేయబడినది. ఈ యభిప్రాయముతోనే శ్రీవ్యాసభట్టారకులు తమస్మృతియందు ఈ సంధ్యోపాసనము నుద్దేశించియే "న భిన్నాం ప్రతిపద్యేత గాయత్రీం బ్రహ్మణా సహ।సాఽహమస్మీత్యుపాసీత విధినా యేన కేనచిత్" అని అహంపదమును చేర్చి దీనిని అహంగ్రహోపాసనముగ చేసిరి కాన "అసావాదిత్యో బ్రహ్మ" యనునది అహంగ్రహోపాసనమే కాని ప్రతీకోపాసనము కాదు. కాదు, కాదు.

ఇచ్చట "ఉద్యంతమస్తం యంతమాదిత్యం=అను తైత్తరీయ బ్రాహ్మణశ్రుతిచేతను. "అసావాదిత్యో బ్రహ్మేతి యద్ధ్యానం="అను స్మృతిరత్నమహోదధివచనముచేతనున్నూ "అసావాదిత్యో బ్రహ్మ" అను మంత్రముమాత్రము సంధ్యోపాసనకు విధింపబడినదై లభ్యమగుచున్నది. కాని అంతమాత్రమే ఉపాసనాకారము కాదు. ఈ మంత్రము ఉపాసనాకారముయొక్క పూర్వార్ధము మాత్రమే. ఈ యుపాసన అహంగ్రహోపాసన యగుటచేత ఉత్తరార్ధభాగముగ - "సాఽహమస్మి" అను ధానిని చేర్చుకొనవలెను. అట్లు చేర్చని యెడల ఇది

అహంగ్రహోపాసన కాక "ప్రతీకోపాసన" యగును. ప్రతీకోపాసనకు మోక్షము ఫలము కాదని శాస్త్రసిద్ధాంతము ప్రతీకోపాసనకు విద్యుల్లోక ప్రాప్తియే ఫలము. సంధ్యోపాసనకు మోక్షము ఫలమని శ్రుతి స్మృతులు స్పష్టముగ చెప్పుచున్నవి. కావున దీనిని యహంగ్రహో పాసనగ చేయుటకొరకు "సాఽహమస్మి" యని చేర్చుకొనవలెను. అప్పుడిది అహంగ్రహోపాసన యగును. కాగా మోక్షము ఫలమగును.

ఇంకను, తైత్తరీయోపనిషత్తునందు శీక్షావల్లియందు పంచమాను వాకమున అహంపదము లేకుంతగనే అహంగ్రహోపాసనము విధింప బడినది ఎటనగా "స య ఏషోఽంతర్హృదయ ఆకాశః, తస్మిన్నయం పురుషో మనోమయః, అమృతో హిరణ్మయః" అని. ఇచ్చట హృద యాకాశవర్తియగు పరమాత్మాఖ్యుడైన పురుషుడు మనోమయత్వాది గుణవిశిష్టుడై ఉపాసింపబడవలె నని యర్థము. "ప్రాచీనయోగ్యో పాస్వ" యనునది ఉపాసనావిధి. ఇచ్చట "మనోమయోఽమృతో హిరణ్మయః వరమాత్మాఽహమ్" అని యుపాసన చేయవలెను. ఇచ్చట ప్రత్యక్చైతన్యవాచకపదము లేదు. లేకపోయినను నిది యహంగ్రహోపాసనమే "ఎచ్చటెచ్చట సగుణ—ఈశ్వరోపాసన విధింపబడునో యచ్చటచ్చట "అట్టి యీశ్వరుడు నేను." "తాదృశ ఈశ్వరోఽహమ్" అని అహంగ్రహోపాసనమునే చేయవలెను. "ఆత్మేతి తూపగచ్ఛంతి గ్రాహయంతి చ" యను సూత్రభాష్యమున నిట్లే నిర్ణయింపబడినది అసావాదిత్యో బ్రహ్మ అను శ్రుతివాక్యము ఉపాసనాకారముయొక్క ఒకభాగము. కావున శ్రుతివాక్యమున అహంపదము లేకపోయినంతమాత్రముచేత నది దోషము కాదు. అని రాద్ధాంతము.

ఇచ్చట "సాఽహమస్మి" యనిచేర్చుట నా స్వకపోలకల్పితము గాదు. మరి? "ఆత్మేతి తూపగచ్ఛంతి. గ్రాహయంతి చ" (4-1-3) అను బ్రహ్మసూత్రమును వ్రాసిన శ్రీవ్యాసభట్టారకులే, వారువ్రాసిన స్మృతిలో నిట్లు చేర్చుకొనవలెనని చెప్పిరి. ఎట్లనగా-"న భిన్నాం ప్రతిపద్యేత గాయత్రీం బ్రహ్మణా సహ। సాఽహమస్మీత్యుపాసీత విధినా యేన కేనచిత్" అని "గాయత్రీనామకసంధ్యాదేవతను ముందుగా పరబ్రహ్మభిన్నముగా భావించి (ఉపాసించి) తర్వాత ఆ బ్రహ్మాభిన్న సంధ్యాదేవతను "సా"యను పదముచేగ్రహించి "సాఽహమస్మి" ఆ సంధ్యాదేవత నేను అని అహంపదమును చేర్చి యుపాసింపవలెనని విధించినారు.

ఇచ్చట "సాఽహమస్మి" అని శ్రీవ్యాసులవారే అహంగ్రహోపాసనను విధించుటవలన, నే రంచిన సంస్కృత సంధ్యాతత్వసుబోధినీగ్రంథమునందలి "అసావాదిత్యోబ్రహ్మ బ్రహ్మాఽహమస్మి" అను ఉపాసనావాక్యమునందలి "బ్రహ్మాఽహమస్మి" అను రెండవ భాగమునందున్న "బ్రహ్మ" పదమును తీసివేసి, దానికి బదులుగ "సా" అను పదమును ఈ తెనుగుగ్రంథమున చేర్చుట యైనది. కావున, పాఠకమహాశయులు, ఈ వ్యత్యాసమును గురించి సందేహపడవద్దని మనవిచేయుచున్నాను

"అసావాదిత్యో బ్రహ్మ" అనువాక్యమునందలి ఆదిత్య శబ్దమునకు భాగలక్షణచేత సంధ్యాదేవతయే అర్థము. గాన "సాఽహమస్మి" అనువాక్యముననున్న "సా" అను స్త్రీలింగపదము చేత ఆసంధ్యాదేవతను గ్రహింపవలెను అని భావము.

ఈ వ్యాసవచనమే లేనియెడల సంధ్యోపాసన ఏ దారిని పట్టెడినో కదా? "సాఽహమస్మీత్యుపాసీత" యను వ్యాసమహర్షి వచనము వల్లనున్నూ, "సంధ్యా హి సూర్యగం బ్రహ్మ సంధ్యానాదవిభాగతః" యను మహాభారతవచనమువల్లనున్నూ "అసావాదిత్యో బ్రహ్మ" యని ముందుగ పరబ్రహ్మాఽభిన్నముగ ధ్యానింపబడిన సంధ్యాదేవతను "సా" యను పదముచే గ్రహించి, "సాఽహమస్మి" యని తనకును సంధ్యాదేవతకును, (అనగా సూర్యమండలాంతర్గతబ్రహ్మచైతన్యమునకును తనదగు ప్రత్యక్చైతన్యమునకును)ఐక్యమును భావింపవలెను. అనునర్థము స్పష్టముగ లభించుచున్నది.

శ్రీ భాస్కరరాయలువారు చెప్పినట్లు, ఇట్లు నిరాకారములగు ఉభయచైతన్యములకును ఐక్యభావనయే బ్రహ్మసాక్షాత్కారకారణము మోక్షప్రదమున్ను.

శ్రీభగవద్గీతావ్యాఖ్యాతలగు శ్రీనీలకంఠపండితులిట్లనిరి. "క్షణమపి క్రతుశతస్య చతుస్సప్తత్యా యత్ఫలం, తదవాప్నోతి." ఒక్క క్షణకాలము తన యంతఃకరణమందు (బుద్ధియందు)న్న తన ప్రత్యగాత్మ (ప్రత్యక్చైతన్యము)ను ఆధ్యాత్మికసంస్కారసంపన్నమై యంతర్ముఖమగు తన మనసుచేత చూడగలిగెనేని, ఏడువేల నాలుగువందల క్రతువులు (యాగములు)చేసిన గలుగు ఫలము గలుగునని యర్థము. ఆహా! ఆత్మసందర్శనఫలమెంతగొప్పది! ద్విజుడు సంధ్యోపాసనము వలన నిట్టిఫలమును గూడ బొందగలుగును. సందేహము లేదు.

బ్రహ్మవిద్వరేణ్యులు శ్రీమధుసూదనసరస్వతులవారు చెప్పినది.

"యో వా ఏతదక్షరం గార్గి! అవిదిత్వా అస్మిన్ లోకే, జుహోతి, యజతే, తపస్తప్యతే బహూని వర్షసహస్రాణి, అంతవదేవాస్య తద్భవతి" ఇతి॥

శ్రీయాజ్ఞవల్క్యమహర్షి గార్గితో నిట్లు చెప్పిరి. ఓ గార్గి! ఏ ద్విజుడు ఈ లోకమున తాను బ్రతికియుండగనే నాశరహితమైన ఈ పరబ్రహ్మమును (అనగా తన బుద్ధిలోనున్న తన ప్రత్యక్చైతన్యమును) అంతర్ముఖమగు తనమనసుతో చూడకుండ, ఎన్ని హోమములు (యజ్ఞములు) చేసినను పూజలు చేసినను అనేకవేల సంవత్సరములు ఘోరతపస్సును చేసినను గూడ వాని యన్నింటి ఫలమున్నూ చివరకు నాశమయ్యేదే. అనగా మోక్షము నీయజాల వని భావము. కర్మలవలన మోక్షము రాదనియును, ధ్యానము వలనను, జ్ఞానమువలనను మాత్రమే మోక్షము కలుగునని భావము,

కావున ద్విజవర్యులారా! తీవ్రతరమగు సంధ్యోపాసనమునకు సమానమగు సులభతమమోక్షోపాయము లేదు. లేదు, లేదు. సంధ్యోపాసనమువలన తన ప్రత్యక్చైతన్యసందర్శనమగును. సంధ్యోపాసన ఫలమనంతము. కాగా "అసావాదిత్యో బ్రహ్మ + సాఽహమస్మి" అను నదియే సంపూర్ణోపాసనాకారము. అని తెలిసికొనవలెను.

"అసావాదిత్య" మంత్రమునకు ఉపాసనవిషయమై ఇంత గ్రంథము ఉండగ—శ్రీకృష్ణపండితులవారు "అసావాదిత్యమంత్రమును అర్ఘ్యప్రక్షేపము తర్వాత చేయవగు ప్రదక్షిణమునందు వినియోగించినారు.

బ్రహ్మసూత్రకర్తలగు శ్రీవ్యాసభట్టారకులు పైశ్లోకమున "సాఽహం"అని "అహం" పదమును చేర్చి "అసావాదిత్యో బ్రహ్మ + సాఽహమస్మి"యని సంధ్యోపాసనను అహంగ్రహోపాసనముగ సాధించినారు.

కాగా = ముందుగ సూర్యమండలమునందు, పూర్వము చెప్పిన విధముగ నామరూపవర్ణాదులతో కూడిన సంధ్యాదేవతను తన కెదురుగ నున్నట్లు చక్కగ ధ్యానించి, తర్వాత ఆసంధ్యాదేవతను

సత్యజ్ఞానానంతమైన పరబ్రహ్మముగ (మాయాసంబంధమే లేని త్రిపాత్పరబ్రహ్మముగ) అసావాదిత్యో బ్రహ్మ" యనుచు ధ్యానింప వలెను. సంధ్యాదేవత మాయాసంబంధముకలదై (మాయాశబలితమై) వ్యావహారికముగా ఏకపాద్బ్రహ్మము కదా! కాన నిటువంటి రూప నామాదివిశిష్టమై ఏకపాద్బ్రహ్మరూపమగు సంధ్యాదేవతను మాయా సంబంధరహిత, విశుద్ధ, త్రిపాద్బ్రహ్మముగ భావింపవలెనని యర్థము. తర్వాత-"సాఽహమస్మి"యను భావనయందు సా"యను పదముతో, తొలుత పరబ్రహ్మాఽభిన్నముగ బావింపబడిన సంధ్యాదేవ తను గ్రహించి "సాఽహమస్మి" పరబ్రహ్మభిన్నమగు ఆసంధ్యాదేవత నేను, అని ఉపాసింపవలెను. అట్టిసంధ్యాదేవతకును తనకును ఐక్యమును భావింపవలెను. ఇది సగుణాఽహంగ్రహోపాసనము

ఉత్తమాధికారిసంధ్యోపాసనము

నిర్గుణాఽహంగ్రహోపాసనము

**వేద, వేదాంతములను** చదివి పంచకోశవివేకము గల ద్విజ వర్యులు ఈక్రిందివిధముగ నుపాసింపవలెను

"సంధ్యా హి సూర్యగం బ్రహ్మ"యను స్మృతివచనాను సారముగ ఆదిత్యమండలాంతర్యామియై ఆదిత్యజీవప్రేరకమైన బ్రహ్మచైతన్యమే ప్రాతరాదిసంధ్యానామములతో వెలయుచుండునని ఉపాసకుడు ముందుగనే తెలిసికొని యుండును. కాగా = ముందుగ॥—"అసావాదిత్యో + బ్రహ్మ + సాఽహమస్మి"యను మూల మంత్రమునే మనసున ననుకొనుచు = దాని యర్థమును-"ఆదిత్య మండలాంతర్యామి ఆదిత్యజీవప్రేరకం చ-యత్ బ్రహ్మచైతన్యం—తత్ + సత్యజ్ఞానానంతం త్రిపాత్పరం బ్రహ్మైవ॥ అని నామరూపాదులు లేని సోపాధికమగు అదిత్యావచ్ఛిన్న చైతన్యమును, నిరుపాధిక శుద్ధ త్రిపాద్బ్రహ్మచైతన్యముతో అభిన్నముగ ధ్యానింపవలెను, **తర్వాత** = "సాఽహమస్మి" యనుకొనుచు = "సా"పదముతో మాయాసంబంధ రహిత, శుద్ధత్రిపాద్బ్రహ్మచైతన్యాభిన్న-ఆదిత్య మండలావచ్ఛిన్నబ్రహ్మ చైతన్యమును గ్రహించి-సాఽహమస్మి॥అ యాదిత్యావచ్ఛిన్నబ్రహ్మ చైతన్యము -నే నగుచున్నాను. అనిభావింపవలెను.

ఇచ్చట "**అహం**"పదముతో = "అన్నమయ-ప్రాణమయ-మనోమయ-విజ్ఞానమయ - ఆనందమయాఖ్య - పంచకోశవ్యతిరిక్తం,

పంచకోశప్రకాశకం ఎతత్సర్వసాక్షిభూతం మదంతఃకరణావచ్ఛిన్నం చ యత్ప్రత్యక్చైతన్యం, స ఏవ అహంపదార్థః। ఆదిత్యాపచ్ఛిన్న చైతన్యస్య మదంతఃకరణావచ్ఛిన్న చైత్యన్యస్య చ ఉపాధ్యపగమే సతి, మఠాకాశ ఘటాకాశయోరివ ఏకత్వాత్-త్రిపాత్పరబ్రహ్మ చైతన్యాభిన్న ఆదిత్యావచ్ఛిన్న బ్రహ్మచైతన్యమహమస్మి” అని ధ్యానింపవలెను.

ఇచ్చట అన్నమయాదిపదములు తలంచునప్పుడు ఆయా కోశస్వరూపములు ఒకటితర్వాత నొకటిగా మనసున తోచవలెను. తర్వాత అంతఃకరణావచ్ఛిన్నమైన ప్రత్యక్చైతన్యము తోచవలెను.

అట్లే తొలుత ఆదిత్యమండలావచ్ఛిన్నబ్రహ్మచైతన్యము మనసున తోచ (బాసింప) వలెను. తర్వాత - ఆయాదిత్యావచ్ఛిన్న చైతన్యము —మాయాసంబంధరహితమైన (పంచీకృతపంచమహాభూత భౌతికములకావల నున్నట్లు భావింపవలెను ) శుద్ధత్రిపాత్పరబ్రహ్మ చైతన్యము, రెండునొక్కటిగా మనసున తోచ(భాసింప)వలెను.

ఇట్లు తొలుత భావించి,-ఆ త్రిపాత్పరబ్రహ్మచైతన్యాబిన్నమైన— ఆదిత్యావచ్ఛిన్న చైతన్యము - స్వాంతఃకరణావచ్ఛిన్నమైన ప్రత్యక్చైతన్యము-రెండును ఉపాధిరహితమైనవై - యొక్కటియైనట్లు, సంస్మరింపబడి, విశుద్ధమైన మనసుతో, చూచుచు భావింప(ధ్యానింప) వలెను. ఈ ధ్యానము కష్టాతికష్టతమము. కావుననే, శ్రీభాస్కరరాయల వారు తమసౌభాగ్యభాస్కరమను శ్రీలలితాసహస్రనామభాష్యమున “ఏతచ్చ వేదాంతరహస్యాభిజ్ఞానాం శిష్టానామపి కాదాచిత్కమేవ, న సార్వదికం” అనిరి. అనగా-ఈపైన వ్రాసిన నిర్గుణాఽహంగ్ర హెూపాసనము-వేదాంతశాస్త్రరహస్యములు తెలిసినట్టి మహాశిష్టులకు గూడ ఏదో యొకప్పుడే కుదురునుగాని ప్రతిదినమునను త్రిసంధ్య లందును కుదరదు-అనివ్రాసిరి. ఆహా! సంధ్యోపాసనమహిమ! ఇంతమహిమోపేతమగు సంధ్యోపాసనము శ్రీకృష్ణపండితులవారు వ్రాయక ఆ యుపాసనమంత్రమును ప్రదక్షిణమునందు వినియోగించినారు.

ఇచ్చట “అహం”పదమును తలచగనే - పూర్వోక్తప్రత్యక్చైతన్యము స్ఫురించుటకొరకు-తైత్తరీయోపనిషత్తులోని బ్రహ్మానంద వల్లియందు వర్ణింపబడిన పంచకోశములయొక్క స్వరూపము శ్రీశంకరభగవత్పాదులచేత స్వకృతభాష్యమునందు చక్కగ విశదీక

రింపబడినది. శ్రీవిద్యారణ్యులవారిచేత తైత్తరీయోపనిషద్దీపికయందు అంతకంటె చక్కగ నిరూపింపబడినది. కాన ఈరెండుగ్రంథములను చక్కగ చదివి పంచకోశముల స్వరూపమును, వానియొక్క ఉనికిని చక్కగ మనసున పట్టించుకొని, సంధ్యావందనకాలముకంటె ఇతరమైన కాలములందు తీరుబడిగ కూర్చొని, పంచకోశముల పరిశీలనమును చేసి చేసి తన ప్రత్యక్చైతన్యమును స్వచ్ఛమైన తన యంతఃకరణమున ప్రతిబింబించిన దానినిగను, తన యంతఃకరణమున అంతర్యామిగ నున్న దానినిగను, అంతఃకరణముద్వారా పంచకోశములను ప్రకాశింపచేయుచున్నదానినిగను, కోటిసూర్యప్రకాశమైన దానినిగను శ్రద్ధగా చాలసారులు భావించి భావించి, అహంపదమును తలంచగనే పూర్వోక్తప్రత్యక్చైతన్యము స్ఫురించునట్లుగ- బాగుగ నభ్యాసము చేయవలెను

ఇంతియే కాదు-"సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" ఇత్యాద్యవాంతరవాక్యముల ద్వారా-త్రిపాత్పరబ్రహ్మతత్వమును బాగుగ పరిశీలనము చేసి నిశ్చయించుకొనవలెను.

తర్వాత పూర్వాభ్యాసముచేత చక్కగ భావింపబడిన ప్రత్యక్చైతన్యమును, "సోఽహమస్మి"యను ధ్యానకాలమున-పూర్వము పరబ్రహ్మబిన్నముగ భావింపబడిన సంధ్యతో నభిన్నముగ రెండు చైతన్యములకు నైక్యమును పది నిముసముల కాలమైనను ధ్యానింపవలెను.

ఇది

సగుణ - నిర్గుణ - అహంగ్రహోపాసనవిధానము.

సమాప్తము.

॥ సంధ్యోపాసనరహస్యము ॥

ఇట్టి సంధ్యాఽహంగ్రహోపాసనము యొక్క మహావిశేషమిది.

1) మాయాసంబంధమే లేని శుద్ధమైన పరబ్రహ్మచైతన్యము త్రిపాద్బ్రహ్మము అనబడును.

2) మాయయందు ప్రతిబింబించిన బ్రహ్మచైతన్యము ఏక పాద్బ్రహ్మము అనబడును. ఇదియే సంధ్యాదేవత.

3) మలినసత్వగుణప్రధానమైన అవిద్యయందు ప్రతిబింబించిన బ్రహ్మచైతన్యము జీవుడు.

సంధ్యాదేవత ప్రొద్దున మధ్యాహ్నము, సాయంకాలములందు ఆదిత్యమండలమున క్రమముగా బ్రహ్మ—రుద్ర-విష్ణురూపములతో విరాజిల్లుచుండును.

క) ఇట్లు మూడవస్థలయందున్న బ్రహ్మచైతన్యమును మధ్యనున్న సంధ్యాదేవత దగ్గరనుండి ఆరంబించి,-ముందుగ మాయతో సంబంధించిన చైతన్యమునకును (అనగాసంధ్యాదేవతకును) మాయా సంబంధము లేని శుద్ధ (త్రిపాత్) పరబ్రహ్మచైతన్యమునకున్నూ, ఐక్యమును ధ్యానింపవలెను.

తర్వాత అట్టి పరబ్రహ్మాఽభిన్నమగు సంధ్యాదేవతకున్నూ, తనకున్నూ(జీవునకున్నూ) ఐక్యమును ధ్యానింపవలెను. ఇదియే సంధ్యోపాసనము. (ఇచ్చట-సగుణోపాసనము నిర్గుణోపాసనము అని రెండు విధములగు ఉపాసనలు అధికారిభేదము ననుసరించి యుండునని తొలుత చెప్పబడినది).

ఖ) పైన వివరించిన ప్రకారము మూడు విధములుగ భాసించుచున్న చైతన్యములలో మధ్యనున్నచైతన్యమునకు సగుణరూపమును కల్పించి, మూడింటిని ఏకముగా చేయుట సంధ్యోపాసనము.

గ) శుద్ధబ్రహ్మచైతన్య మొక్కటియే, మాయ యనెడు ఉపాధితో సంబంధించకపోవుట, సంబందించుటలచేత 1) శుద్ధ చైతన్యమని, 2) మాయాశబళితబ్రహ్మచైతన్యమని, 3) అవిద్యాప్రతిబింబితబ్రహ్మచైతన్యమనియును, అనేకవిధములుగ భాసించుచున్న దానిని, ఒక్కటిగా ధ్యానించుటయే సంధ్యోపాసనము.

ఘ) అనేకత్వములో ఏకత్వమును జూచుట సంధ్యోపాసనము.

ఙ) ఇట్లు ద్విజుడు తాను శుద్ధచైతన్యస్వరూపుడనని ప్రతిదినము-మూడు వేళలందు చక్కగ గుర్తెరుంగుట సంధ్యోపాసనము.

అహా ! ద్విజుడు కృతకృత్యుడగుటకు సులభోపాయమగు నిట్టి సంధ్యోపాసనమును నిత్యకర్మగ విధించిన శ్రుతిమాతయొక్క అకారణ కరుణాలహరి ! ఆశ్రుతిమాతకివియే నా కోటి కోటి ప్రణామంబులు.

కావుననే సుదూరప్రయాణంబులందును, విమానప్రయాణము లందును, రోగగ్రస్తుడైనప్పుడును, బంధనస్థితియందును, ఆధునిక జీవనవృత్తియందును, ఇత్యాదిబహువిధములైన, సౌకర్యములు లేని సమయములందు, ముఖ్యకాలమున ఇతరాంగములను చేయుటకు నేమియును వీలు లేని యెడల, వానిని విడిచియైనను, పైని వర్ణింప బడిన విధముగ సంధ్యోపాసనమును మాత్రము నైనను చేయవలెను. అంతమాత్రము చేత కృతార్థుడగును. సందియములేదు. అని విష్ణుస్మృతి వీరమిత్రోదయము రేణుకాపురాణము మొదలగునవి యుద్ఘోషించుచున్నవి.

ఉభయమీమాంసాప్రవీణ — పూర్వమీమాంసాలంకార — పూర్వమీమాంసాకేసరి బ్రహ్మశ్రీ కె, బాలసుబ్రహ్మణ్యశాస్త్రిల వారును సంస్కృతసంధ్యాతత్వసుబోధిని ఉపోద్ఘాతమున ఇట్లే వ్రాసిరి.

ఇట్టి మహత్తమమైనది, సులభమైనదియు నగు నుపాసనము మరియొక్కటి లేదనియే నా మతము.

ఇట్లు అహంగ్రహోపాసనమును వివరముగ చెప్పి, తర్వాత ఎవరి కెందున అధికారము(యోగ్యత)కలదో వారు, ఆ ఉపాసనమును చేయుదురు గాక ! యను నభిప్రాయముతో వ్యాసులు చెప్పుచున్నారు, "విధినా యేన కేనచిత్" అని. యేనకేనచిత్ = ఏయొక, విధినా = విధానముచేతగాని అనగా సగుణోపాసనవిధానముచేత గాని, నిర్గుణో పాసనవిధానముచేతగాని, ఉపాసీత = ఉపాసింపవచ్చును. అని యా వచనముయొక్క యభిప్రాయము.

అవ = పదునెనిమిద శ్లోకమున "అధికారానుసారతః॥ అని చెప్పబడెను దాని వ్యాఖ్యానమున, శ్రీవిద్యారణ్యులవారు నిర్వచించిన మూడు విధములైన యధికారులు వివరింపబడిరి. కాగా ఏ యధి కారి ఏయుపాసనమును చేయవలెనను సందేహము కలుగగా-తన్ని వారణార్థము నిర్ణయము చేయబడుచున్నది.

ఉత్తమో నిర్గుణే కుర్యాత్
సగుణం, ప్రతి(తీ)కం, పరః।
ధ్యాయేన్మందః ప్రతీకౌ ద్వౌ
బాలో వాక్యద్వయం వదేత్॥ 20

ముగ్గురధికారులలో మొదటివాడగు ఉత్తమాధికారి "అనావాదితోఽ బ్రహ్మ.సాఽహమస్మి" అని శ్రీభాస్కరాచార్యుల వారు చెప్పిన రీతిగ సోపాధికనిర్గుణాహంగ్రహోపాసనను ముందు చేసి, తర్వాత ఓంకారముతో నిరుపాధికనిర్గుణబ్రహ్మోపాసనమును చేయవలెను. ఇట్లు రెండు నిర్గుణోపాసనలు.

పరః=తర్వాతివాడు, అనగా మధ్యమాధికారి, "అనావాదితోఽ బ్రహ్మ. సాఽహమస్మి" యనుచు సగుణాఽహంగ్రహోపాసనమును, "ఓంకారో బ్రహ్మ"యనుచు ప్రతీకోపాసనమునున్నా చేయవలెను. ఇచ్చట "ప్రతీక" యను పదమే ఛందస్సు చెడిపోవు నను భయముచేత "ప్రతిక" యని వాడబడినది.

మందః = మందబుద్ధిగల యధమాధికారి పై రెండుపాసనములనున్నా ప్రతీకోపాసనములనుగనే చేయవలెను. ఇక బాలుడనగ చిన్నవయసుగలవాడని యర్థము గాదు. ఏలనన—ఉపాసన యనగా మానసికభావన. కావున, యట్టి మానసికభావన చేయలేనియెడల వృద్ధుడుగూడ ఈ విషయమున బాలుడని శాస్త్రము చెప్పును. కాన అట్టి బాలుడు భావనలేకుండ కేవలవాక్యములనే మూడునాలుగుసారులుచ్చరింపవలెను.

పై విధముగ అధికారిభేదముననుసరించి భిన్నభిన్నోపాసనా నిర్ణయము నా స్వకపోలకల్పితము గాదు. తైత్తరీయారణ్యకమున సప్తమప్రపాఠకమున అష్టమానువాకమున "ఓమితి బ్రహ్మ" అను వాక్యావతారికయందు శ్రీవిద్యారణ్యయతీంద్రులు, తమ భాష్యమున ఇట్లు వ్రాసిరి. "సప్తమానువాకమున, సూక్ష్మవస్తువును

గ్రహించలేనట్టియు స్థూలమును మాత్రము గ్రహించగలిగిన మందు నకు (అధమాధికారికి) స్థూలరూపముగల పృధివ్యాది (భూమి మొదలగు) ఉపాధిగల బ్రహ్మోపాసనము చెప్పబడినది. అట్లే-ఆరవయను వాకమున కొంచెము సూక్ష్మవస్తువును గ్రహించగల మధ్యమాధికారికి సూక్ష్మరూపముగల మనస్సుమొదలగు ఉపాధి గల బ్రహ్మోపాసనము చెప్పబడినది. ఇక అష్టమానువాకమున ఉత్తమాధికారికి ఉపనిషత్తులచేత చెప్పబడిన ఓంకారార్థమగు శుద్ధబ్రహ్మోపాసనము చెప్పబడుచున్నది. అని. కాగా—ఉత్తమాధికారికి నిర్గుణోపాసనము, మధ్యమాధికారికి సగుణోపాసనము, అధమాధికారికి ప్రతీకోపాసనము. అని శ్రుతియే నిర్ణయించినదని, భావము.

అవ=ఇట్లు సోపాధిక నిర్గుణసంధ్యోపాసనమును వివరించి ఇప్పుడు నిరుపాధికశుద్ధబ్రహ్మోపాసనము, 21-వ శ్లోకముచేత వివరింపబడుచున్నది.

> నిరుపాధ్యప్యుపాస్యం స్యా
> త్ప్రణవేనాఽధికారిణా।
> ఓమిత్యేకాక్షరమితి
> ఋష్యాదిప్రతిపాదకమ్॥ 21

ఉత్తమాధికారియగు నుపాసకుడు ఓంకారసాధనముచేత, మాయాసంబంధమే లేనిదగుటవలన, నిర్గుణ-నిరుపాధికమగు శుద్ధబ్రహ్మమును గూడ ప్రణవప్రతిపాద్యమగుదానిని సంధ్యావందనమున ఉపాసింపవలెను. అని యర్థము.

సంధ్యావందనమున ఓంకారసాధనముచేత నిర్గుణశుద్ధబ్రహ్మోపాసనము చేయు విషయమున ప్రమాణమేమి? యను శంకకు సమాధానము చెప్పబడుచున్నది. "ఓమిత్యేకాక్షరం" అని. "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ=ఇత్యాద్యనువాకము ఈ యుపాసనకు ఆవశ్యకమైన ఋషిదేవతాదులను చెప్పుచున్నది.

గాయత్రీహృదయపరనమునకు ముందు ఆంధ్రదేశీయద్విజులందరిచేతను పఠింపబడుచున్నదియు ఉపాసనమున కుపయోగించు ఋష్యాదులను చెప్పుచున్న "ఓమిత్యేకాక్షర"మను ననువాకమే ప్రమాణమని భావము. ఉపాసనకు ముందు ఋషిచ్ఛందో దేవతా వినియోగజ్ఞానమావశ్యకము గాన- 'ఆ ఋష్యాదులను చెప్పునట్టి ఈ యనువాకపరనమే ప్రమాణము. తైత్తరీయారణ్యకభాష్యమున శ్రీశంకరులవారు ఈ యనువాకభాష్యమున ఈ విషయమునే శ్లోకరూపమున జెప్పిరి. "ప్రణవే బ్రహ్మర్షిః ప్రోక్తః, ఛందో గాయత్రముచ్యతే। పరమాత్మా దేవతాఽయం మోక్షాదౌ వినియుజ్యతే" అనగా— ప్రణవమంత్రముచే చేయబడు నిర్గుణోపాసనమునకు, పరబ్రహ్మమే ఋషి=ఈ మొదలగు అర్థము సులభము. సంధ్యావందనమున నిర్గుణోపాసన చేయుటకు భారద్వాజమహర్షి ఇట్లు చెప్పిరి. "ఏవమార్షాదికం స్మృత్వా తత ఓంకారమభ్యసేత్" అనగా— "ఓమిత్యేకాక్షరమిత్యాద్యనువాకముచేత ఋషి దేవతాదులను స్మరించి, తర్వాత నోంకారముచేత నిర్గుణమునుపాసింపవలెను. అని. ఓంకారము నుచ్చరించుచు తదర్థమగు,పరబ్రహ్మమును ధ్యానింపవలెనని యర్థము.

ఒకానొక డిట్లడిగెను. "ఓంకారమంత్రముచేత నిర్గుణోపాసనకు ఋష్యాదులు చెప్పినట్లే-సంధ్యోపాసనమునకుగూడ ఋష్యాదులు చెప్పబడలేదేమి? అని. ఈ ప్రశ్నను నన్నడుగకూడదు. వేదమాత నడుగవలెను. అని సమాధానము. ఉపనిషద్భాష్యమున శ్రీశంకరులే ఇట్లు వ్రాసిరి. "ఏ యుపాసనకు ఋష్యాదులు చెప్పబడెదరో- ఆ యుపాసనదగ్గరనే ఋష్యాదులను స్మరింపవలెను. చెప్పబడని వాటికి లేదు" యని.

స్మృత్యంతరమున ఉపాసనాప్రకారము, ఉపాసనఫలము గూడ చెప్పబడినవి. "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ ధ్యాయన్నేవ జపన్

ద్విజః। అవాప్తసర్వకామోఽసావాత్మతత్త్వాయ కల్పతే'' అని. ''ఓమ్'' అనుచు ప్రణవమును జపించుచు, దాని యర్థమగు ఏకము అద్వితీయ మగునట్టియు నాశరహితమైన పరబ్రహ్మమును ధ్యానము చేయుచునే, ద్విజుడు సర్వకామములను పొందినవాడే యయి, ఆత్మ సాక్షాత్కారమును పొందుటకు సమర్థుడగుచున్నాడు. అని. ఇట్లు భరద్వాజులవారు, స్మృత్యంతరము, శ్రీశంకరభగవత్పాదుల వారున్నూ స్పష్టముగ చెప్పుటవలన ఈ యనువాకము నిర్గుణోపాస నోపయోగియే. ఈ యనువాకమునకు గాయత్రీహృదయముతో నెట్టి సంబంధలేశము గూడ లేదు. కావుననే సంధ్యోపాసనము ముగిసిన వెనువెంటనే నిర్గుణోపాసననోపయోగి యగు నీ యనువాకమును సర్వాంధ్రద్విజులును పఠించుచున్నారు. కావున సంధ్యావందనమున నిరుపాధికనిర్గుణబ్రహ్మోపాసనము కూడ నున్నది. అట్లు కాని యెడల నీ యనువాకపఠనము వ్యర్థము కావలసివచ్చును. కాగా— ఈ యనువాకపఠనము ఇట్లు జ్ఞాపకము చేయుచున్నది. ''ఈచోటున ఓంకారసాధనముచేత నిరుపాధికనిర్గుణబ్రహ్మోపాసనమును చేయ వలెను'' అని.

ఈ నిరుపాధికనిర్గుణోపాసనము గూడ సంధ్యోపాసనము వలె కాలప్రవాహమున విచ్ఛిన్నసంప్రదాయకము అగుటచేత అనుష్ఠాన విచ్ఛేదము కలిగెను.

ఈ యనువాకము గాయత్రీహృదయపఠనమునకు ముందు పఠింపబడుటచేత- సంప్రదాయము తెలియమిచేత గాయత్రీహృదయ ములో చేరినదని తలంపబడుచున్నది. కాని ''ఆయాతు వరదా దేవీ''అను నదియే గాయత్రీహృదయారంభము. ఓమిత్యేకాక్షరము నుండి గాదు. అత్రిమహర్షి యిట్లు చెప్పుచున్నారు. ''ఆయాతు వరదా దేవీత్యేతద్ధృదయముచ్యతే। గాయత్ర్యాస్తజ్జపిత్వాఽగా జపకర్మ సమారభేత్'' అని. ''ఆయాతు వరదా దేవీ'' నుండి గాయత్రీహృదయమని చెప్పబడుచున్నది. గాయత్రీజపమునకు

ముందు హృదయమును పఠించి, తర్వాత గాయత్రీజపము నారంభింప వలెను. అని.

ఇంతియే గాదు. ధర్మప్రవృత్తిగ్రంధమున యోగియాజ్ఞ వల్క్యులు సంధ్యావందనప్రకరణమున నిట్లు చెప్పిరి.

"స్ఫటికమణికల్పే చిత్తమణిదర్పణే ప్రతిబింబితమాత్మానం ఉపాధేర్నిష్కృష్య, స్వే మహిమ్ని స్థితం సచ్చిదానందమహామస్మీతి కంచిత్కాలం ధ్యాయేత్" అని.

అనగా— స్ఫటికమణివలె నిర్మలమైన మనస్సనెడు, మణులతో జేసిన యద్దమునందు, ప్రతిబింబించిన తన ప్రత్యగాత్మను ఉపాధియగు నంతఃకరణమునుండి విడదీసి తన మహిమయందు ప్రతిష్ఠితమైన సచ్చిదానందరూపపరబ్రహ్మమును నేనే" యని కొంచెము సేపు ధ్యానింపవలెనని యర్థము. ఆహా! నిర్గుణోపాసనను వివరించునప్పుడుగూడ మహర్షియొక్క సాహితీదృష్టి!

ఇట్లు యాజ్ఞవల్క్యులు సంధ్యావందనప్రకరణమున జెప్పుట వలన- ఈ యాజ్ఞవల్క్యవచనమే బ్రహ్మచారులకును గృహస్థులకును కూడ నిర్గుణనిరుపాధికబ్రహ్మోపాసనమునందు అధికారము కలదనుటయందు నిశ్చప్రచమైన బలవత్తర ప్రమాణము. తిరుగులేని ప్రమాణము. దీని నెవ్వరును త్రోసివేయలేరు. ఈ వచనముచేత "సన్న్యాసులకే గాని గృహస్థబ్రహ్మచారులకు నిర్గుణోపాసనయందధికారము లేదను కొంతమంది వాదము సుదూరపరాస్తమైనది.

ఇంతియ కాదు— కఠోపనిషత్తునందు యమధర్మరాజుచేత బ్రహ్మచారియగు నచికేతునకు "సంగ్రహేణ బ్రవీమ్యోమిత్యేతత్" ఓనచికేతా? నీకు సంగ్రహముగ చెప్పుచున్నాను. "ఓమ్" అనునదియే ఇది." అని. ప్రణవముచేత నిర్గుణోపాసన ముపదేశింపబడుటవలన బ్రహ్మచారులకును, గృహస్థులకును, గూడ నిర్గుణోపాసనము వారింప శక్యము గానిదియే.

కొంతమంది, "శుద్ధబ్రహ్మతత్త్వము నుపాసనచేయుట అశ

క్యము. గాన శుద్ధబ్రహ్మోతత్త్వోపాసనయే లేదని చెప్పుదురు. అది సరిగాదు. తైత్తిరీయారణ్యకమున సప్తమ ప్రపాఠకమున అష్టమానువాకమున "ఓమితి బ్రహ్మ" అను వచనవ్యాఖ్యానావసరమున శ్రీవిద్యారణ్యస్వాము లిట్లనిరి. "తదేవం శుద్ధబ్రహ్మతత్త్వస్యాపి ఉపాస్తిసంభవాత్, "బ్రహ్మోపాప్నవానీత్యేవం కామయమానః ప్రణవముచ్చారయన్ తదర్థరూపబ్రహ్మతత్త్వముపాసీత. తేన చోపాసనేన బ్రహ్మ ప్రాప్నోత్యేవ" అని.

అనగా—"కావున ఈవిధముగ శుద్ధబ్రహ్మతత్త్వమును గూడ నుపాసింపవచ్చును గాన "బ్రహ్మభావమును పొందెదను గాక!" యని కోరుచున్నవాడై ప్రణవము నుచ్చరించుచు, దాని యర్థమగు శుద్ధబ్రహ్మతత్త్వము నుపాసించవది. ధ్యానించునది. ఆ ధ్యానము చేత బ్రహ్మభావమును తప్పక బొందగలడు" అని భావము.

ఇట్లు శ్రుతులు, స్మృతులును గృహస్థులకును, బ్రహ్మచారులకును గూడ ప్రణవముచేత నిరుపాధికనిర్గుణోపాసనము కలదని చెప్పుటలో ఆక్షేపింప శక్యము కానట్టియు కదలింప శక్యముకానట్టి ప్రమాణము లగుచున్నవి.

త్రిమాత్రమగు నోంకారముచేత నిర్గుణోపాసనము విద్యారణ్యకృతవార్తికసారమందు, మాండూక్య నృసింహోత్తరతాపినియా ద్యుపనిషత్తులయందు చెప్పబడిన ప్రకారము చేయవలెను. ఇది గురుముఖమునుండి తెలిసికొనవలసినది.

ఇట్టి నిర్గుణోపాసనమునకు "సాయుజ్యం విని యోగం" సాయుజ్యముక్తి ఫలము" అని ఆ యనువాకమే ఫలమును జెప్పుచున్నది. ఎట్లనగా— వేదాంతపంచదశియందు శ్రీవిద్యారణ్య యతీంద్రు లిట్లు చెప్పిరి.

"బ్రహ్మజ్ఞానాయతే నాశాన్నిర్గుణోపాసనం శనైః। ఇహ వా మరణే వాస్య బ్రహ్మలోకేఽథవా భవేత్ ॥ బ్రహ్మనాశాత్కృతిస్సమ్యగుపాసీనస్య నిర్గుణమ్" అని.

అనగా—నిర్గుణోపాసనమును స్థిరముగ, నిరంతరము, సబీజ నిర్బీజసమాధిక్రమముతో చేయుచున్న వానియొక్క, ఆ నిర్గుణోపాసనమే మెల్లగ - చరమవృత్తిగా మారి, సాక్షాదనుభవరూప బ్రహ్మజ్ఞానమే యగును. కాగా—అట్టి చరమవృత్తి ఇహలోకమున మరణముకంటె ముందు కలుగవచ్చును. అప్పుడాతడు జీవన్ముక్తు డనబడును. అప్పటికింకను పూర్వజన్మపుణ్యము ఫలించని యెడల మరణకాలమున కలుగవచ్చును. అప్పటికిని పుణ్యపరిపాకము కాని యెడల, మరణానంతరమున అర్చిరాదిమార్గము ద్వారా బ్రహ్మలోకమును బొంది మరల నక్కడ నిర్గుణోపాసనము, బ్రహ్మతత్వవిచారమును, పూర్తిచేయగా- అక్కడే బ్రహ్మలోకముననే బ్రహ్మసాక్షాత్కారమగును. అని యర్థము.

తైత్తరీయారణ్యకభాష్యమునందు సగుణోపాసకులకు గూడ బ్రహ్మలోకప్రాప్తి ఫలము చెప్పబడినది. బ్రహ్మసూత్రభాష్యమున గూడ నట్లే చెప్పబడినది. బ్రహ్మసూత్రభాష్యమున నాలుగవ యధికరణమున నాలుగవ సూత్రముయొక్క భాష్యమున "విద్యాసమాధివశాత్ ఉత్తరేణ పథా గమనం" అని శ్రీశంకరులు వ్రాసిరి. "విద్యా సమాధి వశాత్" అనగా ఉపాసనయందు స్థైర్యప్రకర్ష వలన నిశ్చలనిరంతరధ్యానమువలన అర్చిరాదిమార్గమున ఉపాసకుడు బ్రహ్మలోకమునకు బోవును అని. ఉపాసనయందు స్థిరత్వము, దార్ఢ్యము, అప్పుడప్పుడు కాకుండ, ఎల్లవేళలందును, మధ్యమధ్య, వ్యవధానము లేకుండ సతతనిరంతరనిశ్చలోపాసనము చేయుటవలన కలుగును.

## దేహపాతానంతరమున సంధ్యోపాసకుని గతి యేమి?

ఇందుకు సమాధానము ఈ పుటలోనే శ్రీశంకరులచే చెప్పబడినది. అది యిచ్చట విశదముగ వ్రాయబడుచున్నది. సంధ్యో

పాసకుడు దేహపాతానంతరమున పునరావృత్తిరహితశాశ్వత బ్రహ్మలోకమును బొందును. ఇందులకు ప్రమాణము గోభిలమహర్షి వచనము.

"సంధ్యాముపాసతే యే తు సతతం సంశితవ్రతాః।
విధూతపాపాస్తే యాంతి బ్రహ్మలోకం సనాతనమ్॥ అని.

ఏ ద్విజుడు సంతతము నిరంతరముగ మిక్కిలి తీవ్రమైన నిశ్చయముతో సంధ్యోపాసనను చేయునో, ఆతడు దేహపాతానంతరము తనయొక్క సంచిత- ఆగామి పుణ్యపాపములనన్నింటిని ఈ లోకముననే దులుపుకొని, పునరావృత్తిరహితశాశ్వతబ్రహ్మలోకమునకు వెళ్లును. అని తాత్పర్యము.

ఇట్లు బ్రహ్మలోకమునకు సగుణోపాసకులు వెళ్లుదురని వ్యాసకృతబ్రహ్మసూత్రములందు నాల్గవ యధ్యాయమున రెండుమూడు పాదములందు నిర్ణయింపబడినది. శ్రీశంకరభగవత్పాదులవారిచేత విశదముగ వివరింపబడినది.

బ్రహ్మలోకమునకెట్లు వెళ్లునో వివరింపబడుచున్నది. ఛాందోగ్యోపనిషత్తునందు నెనిమిదవ యధ్యాయమున ఆరవ ఖండమున చివర నీ క్రింది మంత్రమున్నది.

"శతం చైకా చ హృదయస్య నాడ్యః। తాసాం మూర్ధానమభినిఃసృతైకా। తయోర్ధ్వమాయ న్నమృతత్వమేతి, విష్వఙ్ఙన్యా ఉత్క్రమణే భవంతి॥

ఈ మంత్రము కఠోపనిషత్తునందుకూడ ద్వితీయాధ్యాయమున తృతీయవల్లియందు పదునారవ మంత్రముగ నున్నది.

దీని యర్థము.

మానవుని యెడమ ఱొమ్ము లోపలి భాగమున తామర మొగ్గ ఆకారము గల యొక మాంసపుముద్ద వ్రేలాడుచుండును. దానిని హృదయమందురు. తామర మొగ్గవలె నుండుటచేత హృదయపుండ

రీకమని పేరు. అది తలక్రిందులుగా నున్న తామరమొగ్గవలె నుండును.

దానిలోపల కొంచెము గుల్ల చోటుండును. దానిని ఉపనిషత్తులందు దహరాకాశ మందురు. దహర=చిన్న, ఆకాశము, అచటనే పరమాత్మ యుండును. కావున ఆ దహరాకాశమున జ్ఞానులు, యోగులు బ్రహ్మోపాసనము చేయుదురు. అచ్చటనే యంతఃకరణము (బుద్ధి) ఉండును. పరమాత్మ యందులో ప్రవేశించి యుండును. ఆ పరమాత్మ అంతఃకరణము నంటక, యుండి ఆ యంతఃకరణమున (బుద్ధియందు) తన ప్రతిబింబమును కలిగించును. కాదు-కాదు అద్దమువలె నిర్మలమగు నా బుద్ధియందు పరమాత్మ ప్రతిబింబము పడును. ఆ ప్రతిబింబమే జీవుడు. ప్రతిబింబమునకు బింబముండవలెను గదా! ఆ బింబమే పరమాత్మ. ప్రతిబింబరూపమున నున్న జీవునకు అసలు (ముఖ్య)రూపము పరమాత్మయే. కావుననే ఇద్దరు నొకటి యనుట. అంతమున ప్రతిబింబము బింబమునందే కదా! ఐక్యము నొందును. ఇట్లు హృదయపుండరీకము, పరబ్రహ్మముండు స్థానము గాన పరబ్రహ్మోపాసనకు స్థానమయ్యెను. ఇంత వరకు నిది మంత్రమున కుపోద్ఘాతము.

ఇక మంత్రార్థము తెలిసికొందము.

హృదయస్య=పైన వర్ణింపబడిన హృదయమునకు, శతం చ= నూరున్నూ, ఏకా చ=మరియొకటియున్నూ, అనగా-నూటయొక్క, నాడ్యః=నాడులు కలవు. అనగా—ఈ హృదయమునుండి సూక్ష్మాతి సూక్ష్మమైన యసంఖ్యాకమైన నాడులు బయలుదేరి శరీరమునందంతటను వ్యాపించి యున్నవి. వానిలో నూటయొక్క నాడులు ముఖ్యముగ చెప్పుకొనదగినవి యై యున్నవి. వీనికేల ముఖ్యత్వము వచ్చిన దనగా—మరణకాలమున జీవుడు ఈ నాడుల ద్వారము

నుండియే బయటకు పోవును గనుక. తాసాం=ఆ నాడులలో, ఏకా=ఒక నాడి, మూర్ధానం=తలనుగూర్చి, అభినిఃసృతా=బయలు దేరి వెళ్ళినది. అనగా— శిరస్సు లోపలి భాగములో ప్రవేశించినది. కావున ఈనాడికి మూర్ధన్యనాడి యనియును, బ్రహ్మలోకమునకు పోవు మార్గమగుటచేత, బ్రహ్మనాడి యనియును పేరులు కలవు. తయా=ఆ బ్రహ్మనాడిద్వారా, ఊర్ధ్వం=పైకి, (వెలుపలికి), ఆయన్=వచ్చిన జీవుడు, అమృతత్వం=మోక్షమును, ఏతి=పొందును. సంధ్యోపాసనవంటి సగుణోపాసనను బాగుగ చేసిన యుపాసకుడు మాత్రమే ఈ మూర్ధన్యనాడి గుండా బయటికి పోగలుగును. మరెవ్వరును పోలేరు. మరి, యితరులే మార్గమున బయటికి పోవుదురు?' అన్యాః=మిగిలిన నూరు నాడులును, విష్వఙ్=శరీరమున అన్ని వైపుల వ్యాపించి యున్నవై, ఉత్క్రమణే=ఉపాసకులు కానట్టి యితర మానవులు (జీవులు) బయటకు పోవుటకు—భవంతి=ఉపయోగపడుచున్నవి.

కావున, సగుణోపాసన (సంధ్యోపాసన) చేయని మానవులు మిగిలిన నూరునాడులలో నేదియో యొక నాడిగుండా, బయటికి పోయి, వారి పుణ్యాపాపముల ననుసరించి ఏవియో లోకములకు బోవుదురు. సగుణోపాసకుడు (సంధ్యోపాసకుడు) మాత్రమే బ్రహ్మనాడి గుండా బయటికిపోయి అర్చిరాదిమార్గమున పునరావృత్తి రహిత-శాశ్వతబ్రహ్మలోకమునకు బోవును. ఇతర నాడులగుండా బయటికి పోవు జీవుడు, నోటిగుండానో, ముక్కుగుండానో, కండ్లద్వారానో, చెవులద్వారానో పోవును. అట్టివారు బ్రహ్మలోకమునకు పోనేరరు. ఆహా! వేదమెంత గంభీరమగు రహస్యాతిశయముగు విషయములను విశదీకరించినది!

ద్విజులీ విషయమును గుర్తించుదురు గాక!

ఇట్టి హార్దబ్రహ్మోపాసనసామర్థ్యముగల ద్విజుడు (హృదయపుండరీకమున బ్రహ్మోపాసన) (సంధ్యోపాసన) చేయు విధానము

తెలిసి యుపాసన చేయు సామర్థ్యము గల ద్విజుడు ఆ బ్రహ్మనాడీ ద్వారా సూర్యమండలము గుండా శాశ్వతబ్రహ్మలోకమునకు బోవును. ఎట్లుపోవును? వివరింపబడుచున్నది.

శరీరమునుండి బయలు వెడలిన ఉపాసకుడగు జీవుడు బ్రహ్మ లోకమును చేరుట కొకమార్గ మున్నది. ఆ మార్గమునకు (1) దేవ యాన మనియును, (2) అర్చిరాదిమార్గ మనియును, (3) ఉత్తర మార్గమనియును పేర్లు గలవు.

సగుణోపాసకుడు (సంధ్యోపాసకుడు) ఈ మార్గము గుండా బ్రహ్మలోకమును జేరును. ఉపాసన చేయకుండ, యజ్ఞములు చేయు వారు గుళ్ళు గోపురములు కట్టించువారు, ఆరామతటాకాదిప్రతిష్ఠలు చేయువారు, స్వర్గలోకమునకు బోవుదురు. పోయి వారి పుణ్యము కర్చు కాగా మరల భూమిని బుట్టెదరు. వారు పోవుమార్గమునకు (1) పితృయాణ మనియును, (2) ధూమాదిమార్గ మనియును, (3) దక్షిణమార్గ మనియును పేరులు. ఈ కర్మలు చేయువారు మంచి కర్మిష్ఠులుగ నుండవలయును. ప్రస్తుతమగు అర్చిరాదిమార్గము ఉప నిషత్తులలోను బ్రహ్మసూత్రములలోను, వాని భాష్యములలోను, వివరింపబడిన రీతిగా నిచ్చట వివరింపబడును.

ఈ మార్గము న్వాల దీర్ఘముగ నుండును. ఏల ననగా-అట్టి వారుకూడ అనేకలోకములను దాటి వెళ్ళవలెను. కాని జీవుడు అతిశీఘ్రముగా పోయి చేరును. ఒక సెకెనుకు కోట్లకొలది మైళ్ళ వేగమున బోవు ననవచ్చును. అట్లు ఛాందోగ్యోపనిషత్తు నందున్నది.

ఈ మార్గమున పదిమూడు పర్వములున్నవి. పర్వములనగా గనుపులు. వెదురు గడకున్నట్లుండును. ఒక్కొక్క పర్వమునందును ఆగి యాగి పోవును. కావున తెనుగున వీనిని మజిలీలని మనమను కొనవచ్చును. ఈ మజిలీల పేర్లను, ఉపాసకు డీమజిలీలలో పోవు రీతిని వివరించెదను.

(1) అర్చిస్సు (ప్రకాశ మనుకొనవచ్చును.) దీని యధిదేవత అగ్ని, (2) అహస్సు, పగలు, (3) శుక్లపక్షము, (4) ఉత్తరాయణ

A

మాసములు, (5) సంవత్సరము, (6) దేవలోకము, (7) వాయు లోకము, (8) ఆదిత్యలోకము, (మండలము) (9) చంద్రలోకము, (మండలము) (10) విద్యుల్లోకము, (మెఱుపులు) (11) వరుణలోకము, (12) ఇంద్రలోకము, (13) ప్రజాపతిలోకము, (విరాట్టుయొక్క లోకము.) ఇవి మజిలీలు. వీని తర్వాతిది గమ్యస్థానమగు బ్రహ్మ లోకము. పదునాల్గవది. ఇదియే సృష్టికర్తయొక్క లోకము. ఈ మజిలీల గుండా ఎట్లుపోవునో తెలిసికొనుటకు ముందు "ఉత్క్రమణ" మెట్లు జరుగునో తెలిసికొందము.

"ఉత్క్రమణ"మనగా జీవుడు శరీరమును విడిచి పైకి బయలు వెడలుట యని యర్థము. ఈ యుత్క్రమణసమయమున జీవుడు తన జ్ఞానేంద్రియశక్తులను, కర్మేంద్రియశక్తులను, ప్రాణశక్తులను, మనో బుద్ధులనున్నూ, అవి యుండు శరీరావయవములనుండి ఉపసంహ రించుకొనిన (వెనుకకు తన దగ్గరకు తీసికొనిన) వాడగును. ఆ యింద్రియశక్తులు తమ కాశ్రయమగు నవయవములు లేకపోవుటవలన నేపనిని చేయలేని వగును. అట్లు జీవుడు ముద్దకట్టిన ఇంద్రియశక్తి మనోబుద్ధులు గలవాడై, యుండిపోవును. ఇట్టి జీవుడెట్లు బయటికి వెడలును? ఇన్ని మజిలీల గుండా బ్రహ్మలోకమున కెట్లు బోవును? అను శంక కలుగును. సమాధాన మీయబడుచున్నది.

ఛాందోగ్యోపనిషత్తునందు 8వ అధ్యాయమున 6వ ఖండమున 2వమంత్రమున నిట్లున్నది.

"ఏతా ఆదిత్యస్య రశ్మయః ఉభౌ లోకౌ గచ్ఛంతి। ఇమం చాముం చ। అముష్మాదాదిత్యాత్ప్రతాయంతే। తా ఆసు నాడీషు సృప్తాః। ఆభ్యో నాడీభ్యః ప్రతాయంతే। తేఽముష్మిన్నాదిత్యే సృప్తాః ॥ఇతి॥

## అర్థము

ఈయాదిత్యుని (సూర్యుని) కిరణములు రెండు లోకములకును వెళ్లును. ఏ రెండు లోకములకు? ఇమం చ = ఈ భూలోకమునకును,

అముం చ=ఆ యాదిత్యలోకమునకును. ఆదిత్యకిరణము లాదిత్య లోకమునకు బోవుటేమి? సమాధానము. అముష్మాత్=(ఆ సూర్యుని కిరణములు) ఆ, ఆదిత్యాత్=సూర్యునినుండి, ప్రతాయంతే=అన్ని వైపులకును వ్యాపించుచున్నవి. తాః=అందులోని కొన్ని విశేషకిరణములు, ఆసు నాడీషు=ఈ శరీరమందలి నాడులయందు, సృప్తాః=ప్రవేశించును. మరల, ఆభ్యః నాడీభ్యః=ఈ నాడులనుండి, ప్రతాయంతే=వెలుపలవ్యాపించుతవి. తే=ఆరశ్ములు అనగా నాడులయందు ప్రవేశించి బయటకు వచ్చిన కిరణములు. అముష్మిన్=ఆ దూరమందున్న, ఆదిత్యే=సూర్యునియందు, సృప్తాః=మరల ప్రవేశించుతవి అని. కాగా ఆ సూర్యరశ్ములు ముందు శరీరమందలి నాడులలో ప్రవేశించుతవి. అట్లే మూర్ధన్యనాడిలో కూడ ప్రవేశించి తద్వారా ఆనాడి పుట్టిన చోటగు హృదయపుండరీకమున గూడ ప్రవేశించును. అచ్చటనే జీవుడుండును గదా! ఆ జీవుని గూడ స్పృశించుతవి.

మరల ఛాందోగ్యమున 6వ ఖండమున 5వ మంత్రము. "అథ యత్రైత దస్మాచ్ఛరీరా దుత్క్రామతి అథ తైరేవ రశ్మిభి రూర్ధ్వ మాక్రమతే. స ఓమితివా హోద్వా మీయతే ॥ఇతి॥"

## దీని యర్థము

ఇట్లే దేహమున్నంతకాలము రాత్రింబగళ్ళు సూర్యకిరణములతో నాడుల ద్వారా జీవునకు సంబంధమెడతెగకనే యుండును. ఇట్లుండగా—యత్ర=ఏసమయమున, అస్మాత్=ఈ, శరీరాత్=శరీరమునుండి, ఉత్క్రామతి=జీవుడు బయటకు వెడలుటకు నిశ్చయించునో అప్పుడు, ఏతైరేవ=బ్రహ్మనాడిగుండా తనతో సంబంధించినట్టియే, రశ్మిభిః=సూర్యరశ్ముల సహాయముతో, వాని ద్వారా గానే, ఊర్ధ్వం=పైకి, ఆక్రామతే=ఎగబ్రాకును. అనగా—వెళ్లును. అప్పుడు, సః=ఆ జీవుడు (సంధ్యోపాసకుడైన జీవుడు.) ఓమితి=ఓంకారము నుచ్చరించుచు, స్మరించుచు, పరబ్రహ్మమును ధ్యానించుచు, ఉద్వా=

ఊర్ధ్వమునకు, మీాయతే=పోవును. సూర్యుని వైపు పోవునని భావము.

ఈ విషయమునే వ్యాసులవారు తమ బ్రహ్మసూత్రములలో నాల్గవ యధ్యాయమున రెండవ పాదమున 18 వ సూత్రమున సూత్రీకరించిరి.

## రశ్మ్యనుసారీ

పైన వివరించిన యర్థమే. అనగా సగుణోపాసకుడగు సంధ్యోపాసకుడు ఉపాసనసిద్ధిని పొందిన జీవుడు బ్రహ్మనాడి గుండా తన నివాసమగు హృదయపుండరీకమును ప్రవేశించి తనను స్పృశించిన సూర్యకిరణముల ననుసరించియే పైకి వెడలును. ముద్దయై పోయి కదలలేని జీవుడెట్లు పైకి వెడలునని యింతకుముందు కలిగిన శంకకు ఉపనిషత్తున్నూ, వ్యాససూత్రమున్నూ రెండున్నూ ఏకగ్రీవముగ బదులు చెప్పినవి. ఆ సూర్యకిరణముల సాయముతో వాని ద్వారా సూర్యలోకములోనికి (మధ్యనున్న అర్చిస్సు అహస్సు మొదలగు మజిలీలద్వారా) పోవునని భావము. ఈ సంధ్యోపాసకుడు పగలు మాత్రమే కాక, రాత్రియందు తన దేహమును విడిచినను గూడ, సూర్యరశ్ముల ద్వారానే పోవును. ఏలనన—దేహమున్నంతవరకును సూర్యరశ్ములకును శరీరమందలి నూటయొక్క నాడులకును పగలనక రాత్రియనక సంతతము సంబంధముండునని ముందే చెప్పుటయైనది. అచ్చటనే వ్యాసులవారు 19 వ సూత్రము నిట్లు సూత్రీకరించినారు.

"నిశి నేతి చేన్న, సంబంధస్య యావద్దేహభావిత్వాత్" అని. అర్థము పైన వివరించినదే. సూర్యకిరణములే చంద్రుని మీాద పడి చంద్రకిరణములుగ మారి ప్రసరించి రాత్రివేళ నాడులందు ప్రవేశించుచున్నవని యొకానొక వ్యాఖ్య కలదు.

ఇట్లు సంధ్యోపాసకుడగు జీవుడు బయటకు వెడలి పైకి పోవును. ఆ మార్గములో తొలి మజిలీ—

1. అర్చిస్సు. సూర్యకిరణముల సాయముతో అర్చిస్సులో ప్రవేశించగనే ఆ అర్చిరభిమాని దేవత అనగా ఆ అర్చిస్సుయొక్క అధిష్ఠానదేవత యగు అగ్ని ఆ జీవునకెదురేగి తోడి తెచ్చి తర్వాత రెండవ మజలీయగు అహస్సు దగ్గరకు తోడ్కొనిపోవును. వెంటనే ఆ యహరభిమానిదేవత (అహస్సధిష్ఠానదేవత) ఎదురేగి జీవుని, మర్యాదలతో తోడితెచ్చి శుక్లపక్ష మనెడు మూడవ మజలీకి తోడుకొని పోవును. అక్కడ శుక్లపక్షాధిదేవత ఎదురేగి జీవుని, మర్యాదలతో తోడితెచ్చి నాలుగవ మజలీయగు నుత్తరాయణ మాసములకు జేర్చును. వెంటనే ఉత్తరాయణదేవత ఎదురేగి జీవుని, మర్యాదలతో తోడితెచ్చి ఐదవమజలీయగు సంవత్సరమును చేర్చును. ఆ సంవత్సరాధిష్ఠానదేవత యాజీవుని పై విధముగనే మర్యాదలతో నారవ మజలీ యగు దేవలోకమును జేర్చును. దేవలోకదేవత కూడ జీవుని పైవిధముగనే మర్యాదలతో వాయులోకమును చేర్చును. వాయులోకదేవత ఆ జీవుని, మర్యాదలతో పైవిధముగ ఆదిత్యలోకమును (మండలమును) జేర్చును. ఇట్టి సగుణోపాసకులను ఆ యామజలీలకు జేర్చుటకు గాను నియమింపబడిన ఆదిత్యలోకదేవత ఆ జీవుని, మర్యాదలతో చంద్రలోకమును (మండలమును) చేర్చును. అట్లే చంద్రలోకదేవత ఆ జీవుని, మర్యాదలతో విద్యుల్లోకమును జేర్చును. జీవుడు విద్యుల్లోకమును చేరగనే బ్రహ్మలోకాధిపతియగు చతుర్ముఖబ్రహ్మ ఈ జీవుని ఉపాసనాసామర్థ్యమును దివ్యజ్ఞానమువలన తెలిసికొనును. ఆ జీవునకు బ్రహ్మలోకప్రవేశమున కుండవలసిన ఉపాసనాసిద్ధి యున్నయెడల, వెంటనే తన మనస్సంకల్పముచేత నొక అమానవపురుషుని సృష్టించి యా జీవుని తోడితెచ్చుటకు విద్యుల్లోకమునకు పంపును. ఆ యమానవపురుషుడు విద్యుల్లోకమునకు బోయి యక్కడ నున్న జీవుని విద్యుల్లోకాధిదేవతతో సహా తోడ్కొని వరుణలోకమును జేరును. అచ్చట వరుణలోకాధిదేవత ఎదురేగి మర్యాదలతో తోడ్కొని వచ్చును. అచ్చటనుండి ఆ యమానవపురుషుడు వరుణలోకాధిదేవత సహా

యయుతో నా జీవుని ఇంద్రలోకమునకు తీసికొని వెళ్ళును. ఇంద్ర లోకాధిదేవత యా జీవుని, మర్యాదలతో తోడ్కొని వచ్చును. తర్వాత ఆ యమానవపురుషుడు ఆ జీవుని, మర్యాదలతో ప్రజాపతి (విరాట్టు) లోకమునకు తీసికొని వెళ్ళును. అచ్చట విరాడ్లోకాధి దేవత ఆ జీవుని, మర్యాదలతో నెదురేగి తెచ్చును. తర్వాత ఆ యమానవపురుషు డాజీవుని బ్రహ్మలోకమునకు గొంపోయి, బ్రహ్మ సభాప్రవేశమును చేయించును. బ్రహ్మ ఆ జీవునకు నిర్గుణోపాసనా పద్ధతి నుపదేశించి, ఉపాసనకు సౌకర్యములను చేయించును.

ఆ జీవుడు బ్రహ్మలోకములో తర్వాతిదగు నిర్గుణోపాసనను, బ్రహ్మతత్త్వవిచారమును శ్రద్ధాభక్తులతో తీవ్రవ్రతముతో చేసి పర బ్రహ్మసాక్షాత్కారము నొందును. తర్వాత బ్రహ్మలోకమునకు ప్రళయము వచ్చువరకును అచ్చటనే బ్రహ్మానందమనుభవించుచు నుండి, ప్రళయము వచ్చిన తర్వాత, తనవలె నున్న మరికొందరి జీవులతోడను, ఆ బ్రహ్మతోడను పరబ్రహ్మైక్యము నొంది విదేహ కైవల్యము నొందును.

చూచితిరా! సంధ్యోపాసన మహిమను!

వేలకొలది యశ్వమేధయాగములు చేసినవారికి గాని, వేల కొలది రాజసూయయాగములు చేసినవారికి గాని ఈ సంధ్యోపాస కుని మహిమ రాదు. రాదు. రాదు. ఇది సత్యము.

సంధ్యోపాసకుడు ''బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి'' అని.

వేదములు ఉపనిషత్తులు ధర్మశాస్త్రములు గొంతెత్తి చాటు చున్నవి.

కాని మ్రొక్కుబడి తీర్చుకున్నట్లు, రోజున కేరెండు మూడు సారులే గాక ఇతరమైన తీరిక వేళలందు గూడ అర్థభావనాపురస్సర ముగా భక్తిశ్రద్ధలతో ధ్యానింపవలెను. ధ్యానమే ఉపాసనము. సంధ్యోపాసనము బ్రహ్మోపాసనమని వేదమే స్పష్టముగ చెప్పుచు న్నది. శ్రీశ్రీశ్రీ కాంచీకామకోటి పీఠాధిపతులు అవుననిరి. కొమ్ములు తిరిగిన పండితులును అవుననిరి. వేయేల త్రిమూర్తులును

సంధ్యోపాసనము చేయుచున్నారు. మానవుల విషయము చెప్ప వలెనా? సంధ్యోపాసనసిద్ధి పొందిన ద్విజుడు సకల సంచితాగామి-పుణ్యపాపములను విదిలించివేయును.

సంధ్యోపాసకుని మహిమ యంతయు నిట్లు తెలియుచున్నది. దీర్ఘదీర్ఘమైన అర్చిరాదిమార్గమున అంతమంది లోకాధిదేవతలచేత గౌరవింపబడి మార్గము చూపెట్టబడినవాడగును. అంత మహత్త్వము తలంచుటకు గూడ శక్యము గాదు. సాక్షాద్బ్రహ్మసభలో ప్రవేశము. బ్రహ్మచేత నుపదేశము. ఆహా! వర్ణనాతీతమహిమ కదా! కావున ద్విజవర్యులెల్లరును సంధ్యోపాసనమును యథావిధిగ నాచరించి తత్ఫలమును బొందుదురు గాక!

ఓం తత్ సత్

శివమ్.

## ప్రతీకోపాసన విధాన-తత్ఫల-విచారము

ప్రతీకోపాసన విషయమున ప్రశ్నోపనిషత్తునందు ఐదవ ప్రశ్న యొక్క భాష్యమున శ్రీశంకరులిట్లు వ్రాసిరి.

“యః కశ్చన మనుష్యేషు అధికారగుణవిశిష్టః త్రైవర్ణికః యావజ్జీవ మోంకార మభిధ్యాయీత” అభిముఖ్యేన చింతయేత్. బాహ్యవిషయేభ్యః ఉపసంహృతకరణః, సమాహితచిత్తః భక్త్యా వేశితబ్రహ్మభావే ఓంకారే ఆత్మప్రత్యయసంతానాఽవిచ్ఛేదః, విభిన్నజాతీయప్రత్యయాంతరాఖిలీకృతః, నిర్వాతదీపశిఖాసమః అభి ధ్యానశబ్దార్థః” అని.

మానవులందు ప్రతీకోపాసనచేయవగిన యధికారము గల త్రైవర్ణికు డెవరైనను యావజ్జీవము ~~ఓంకారాభిధ్యానము~~ చేయ వచ్చును. ఆభిముఖ్యముతో చింతింపవచ్చును.

అనగా—(1) తన మొత్తమును [illegible] వెలుపలి విషయములనుండి పూర్తిగ మరలింపవలెను. అనగా మనస్సు బుద్ధి అహంకారము చిత్తము ఈ నాలుగును వెలుపలి విషయముల

మీఁదికి బయలుదేరి వెళ్ళకుండ నరికట్టవలెను. ఒకవేళ తనను వంచనచేసి బయటికి వెళ్ళినయెడల మంచితనముతో వాటిని లోపలికి తీసికొనవలెను. ఇట్లు దీర్ఘకాలాభ్యాసము లేనిది ఒక్క నాటితో కుదురునది కాదు. తర్వాత (2) సమాహితచిత్తుఁడు కావలెను. అనగా చిత్తము ఎట్టి సంకల్పము లేకుండ నెమ్మదిగ నుండవలెను. అప్పుడే సాధకుఁడు ఉపాసింపదలచిన విషయము మీఁదికి మనసు (వెలుపలికి తొంగి చూడకుండ) అభిముఖముగనుండి ధ్యానము చేయ గలఁడు. ఆభిముఖ్యముగ చింతింపవలె ననుమాట కిదియే యర్థము. ఈ రెండు విశేషణములును ఉపాసకునకు.

ఇక—ఓంకారమునందు నిరతిశయభక్తిభావముతో బ్రహ్మభావము నావేశింపజేసి, "ఓంకారో బ్రహ్మ" ఓంకారో బ్రహ్మ" ఓంకారము బ్రహ్మమే" అని మనసున తలంచుచు ఈ ధ్యానమున ఇతర తలంపులు మధ్యమధ్య దూరకుండ చూచుచు, గాలి లేని చోటున కదలక మెదలక స్థిరముగ నుండు దీపపుకొడినవలె నిశ్చలమైన ధ్యానము "అభిధ్యాన" మనబడును. అట్టి అభిధ్యానమును చేయవలెను.

ఈ ప్రతీకోపాసనవిధానము విషయమున శ్రీవిద్యారణ్య యతీంద్రులు తైత్తరీయారణ్యక-సప్తమ ప్రపాఠక-తృతీయానువాక భాష్యమున నిట్లు వ్రాసిరి.

"ఏ ప్రతీకమునందు (అల్పవస్తువునందు) (ప్రస్తుతమున ఓంకారము) ఏ దేవతయొక్క దృష్టిని (ప్రస్తుతమున పరబ్రహ్మ దృష్టిని) ఉపాసకుడుంచునో, ఆ ప్రతీకము ఆ దేవతారూపమే"యను దృఢమగు నభిమానము ఎప్పటికి కుదురునో యప్పటి వరకును, ఆ ప్రతీకోపాసనా వృత్త్యాకారమును (ప్రకృతమున "ఓంకారో బ్రహ్మ" అను వృత్త్యాకారమును) ఆవర్తింపవలెను. విడువకుండ నట్లె వేయుచుండవలెను. ఆ ప్రతీకమున ఆదేవతాభిమానము స్థిరపడి పోయిన యెడల మఱి పోదు. ఎట్లనగా—ఒక పాడుపడిన దేవాలయమునందు, పూజాదులు లేకుండ పాడుపడిన దేవతావిగ్రహము

నందు, అంతకు మునుపు దానిమీద మనకున్న దేవతాభిమానము మనకు పోదు గదా! ఆ విగ్రహమును చూడగనే ''దేవుడ''నుచు నమస్కరించెదము. అట్లే. కావున ప్రతీకమునందు దేవతాభిమానము బాగుగ దృఢమగు నంతవరకును ఉపాసించువానికి శాస్త్రమందు చెప్పబడిన ఫలము తప్పక లభించును. సందేహము లేదు.

ఆ ప్రపాఠకముననే మరల నిట్లు వ్రాసిరి. ప్రతీకపక్షములో ఓంకారము శబ్దస్వరూపమైనదే కావున, బ్రహ్మదృష్టితో ఉపాసన చేసినను, అది శబ్దోపాసనమే యగును. కాని బ్రహ్మోపాసనము కాదు. ప్రతీకోపాసనమున ప్రతీకము ప్రధానము. కాగా— ప్రతీకోపాసకునకు బ్రహ్మలోకప్రాప్తియే యుండదు. కావున అప్పుడు బ్రహ్మత్వప్రాప్తి మాటయే లేదు.

ఓంకారార్థమగు శుద్ధబ్రహ్మతత్త్వోపాసన చేసిన యెడల బ్రహ్మలోకప్రాప్తి యగును. కాని బ్రహ్మతత్త్వజ్ఞానము ద్వారా విదేహముక్తి (కైవల్యము) రూపమైన బ్రహ్మత్వప్రాప్తి కలుగును. అని, విద్యారణ్యులవారు చెప్పిరి. కాగా—ప్రతీకోపాసనకు ఇహలోకమున చిత్తస్థైర్యమును చిత్తశుద్ధిని కలిగించుట ద్వారా కాలక్రమమున అహంగ్రహ–సగుణ–నిర్గుణోపాసనలు చేయుటకు యోగ్యతను కలిగించుట దృష్టఫల మగుచున్నది. ప్రతీకోపాసకుడు మరణానంతరము విద్యుల్లోకమును పొందునని యచ్చటనే కలదు.

బ్రహ్మసూత్రశాంకరభాష్యముయొక్క వ్యాఖ్యానమగు భామతికి వ్యాఖ్యానమైన కల్పతరువునకు అప్పయ్యదీక్షితులవారు వ్రాసిన పరిమళవ్యాఖ్యానమున ''అప్రతీకాలంబనాన్నయతి'' అను సూత్రవ్యాఖ్యానమున దీక్షితులవారిట్లు వ్రాసిరి. ''అందువలన ప్రతీకోపాసకులకుగూడ అహంగ్రహ–సగుణనిర్గుణోపాసకులతోగూడ అర్చిరాది మార్గము, విద్యుల్లోకపర్యంతము సమానము. అమానవపురుషుడు ప్రతీకోపాసకులను అక్కడనుండి బ్రహ్మలోకమునకు తీసికొని వెళ్లడు. సగుణనిర్గుణోపాసకులను మాత్రము బ్రహ్మలోకమునకు తీసికొని

వెళ్లును. కావున ప్రతీకోపాసకులు గూడ అర్చిరాదిమార్గముననే విద్యుల్లోకపర్యంతము మాత్రమే వెళ్లి అక్కడ ఆగిపోయెదరు. అటుపైని వెళ్లలేరు. అని స్పష్టముగ వ్రాసిరి.

ఇది ప్రతీకోపాసన విషయము.

## ఉపాసన, తత్త్వవిచారముల ఫలవిచారము

తైత్తిరీయారణ్యకవిద్యారణ్యభాష్యమున సగుణనిర్గుణోపాసనలయొక్కయున్నూ, తత్త్వవిచారముయొక్కయున్నూ ఫలవిచారమిట్లు చేయబడినది.

"వేదాంతవాక్యము రెండు విధములు. అవాంతరవాక్యమని, మహావాక్యమనియును. జగత్కారణమగు బ్రహ్మయొక్క తాత్త్విక (వాస్తవ) స్వరూపమును చెప్పునది అవాంతరవాక్యము, జీవబ్రహ్మలయొక్క ఐక్యమును తెలుపునది మహావాక్యము, అని. అందు మహావాక్యముచేత జీవబ్రహ్మలయొక్క తాదాత్మ్యమును (ఐక్యమును) తెలిసికొనినవాడు ఉపాసకుడు గాడు. జ్ఞానియే. ఏలననగా ఐక్యమును తెలిసికొనినవాడు, తన కర్తృత్వబుద్ధిని విడనాడును. వానికి కర్తృత్వబుద్ధి గూడ నుండదు. కాని "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ"యను నవాంతరవాక్యముచేత జగత్కారణ బ్రహ్మయొక్క తత్త్వమును మాత్రము తెలిసికొనిన వానికి అంత మాత్రముచేత కర్తృత్వబుద్ధి పోదు. కాబట్టి వానికుపాసకత్వముండును. వానికి బ్రహ్మలోకప్రాప్తి ప్రయోజనము. మహావాక్యముచేత బ్రహ్మతత్త్వమును తెలిసికొనిన జ్ఞానికి విదేహకైవల్యరూపమోక్షము లభించును. అందువలన బ్రహ్మభావమును గోరువాడు బ్రహ్మతత్త్వము నుపాసింపవలెను. అందుకొరకే ఉత్తరతాపనీయోపనిషత్తునందు, నిర్గుణబ్రహ్మతత్త్వవిషయకములైనవి, చాల యుపాసనలు విధింపబడినవి." అని.

ఇవి భాష్యపంక్తులు.

"సత్యంజ్ఞానమనంతం బ్రహ్మ" "ఆనందో బ్రహ్మ" ఇత్యాదులు అవాంతరవాక్యములు. (1) తత్త్వమసి (2) అహం బ్రహ్మాస్మి (3) అయమాత్మా బ్రహ్మ (4) ప్రజ్ఞానం బ్రహ్మ" ఇవి జీవబ్రహ్మైక్యమును తెలుపు మహావాక్యములు.

బ్రహ్మభావమును కోరు మానవుడు, పంచకోశస్వరూపవివేకము గలవాడై, తద్వ్యతిరిక్తముగ ప్రత్యక్చైతన్య స్వరూపమును తెలిసికొని, నిరంతరనిర్గుణోపాసనమును సబీజ, నిర్బీజసమాధిక్రమమున చేయుచున్నవాడై మహావాక్యముచేత బ్రహ్మతత్త్వవిచారమును గూడ చేయుచున్నయెడల అనేకపూర్వజన్మసంచితపుణ్యపుంజపరిపాకముచేత యేదో యొక నాడు బ్రహ్మసాక్షాత్కారము నొందును. అప్పుడు అక్రియాత్మస్వరూపుడైన వానికి కర్తృత్వబుద్ధి యుండకపోవుటచేత ఉపాసకత్వముండదు. బ్రహ్మభావమును పొంది జీవన్ముక్తుడగును. ప్రస్తుతమున సంధ్యాదేవత జగత్కారణబ్రహ్మరూపిణి యగుటచేత ఆమెను గూర్చి సగుణాహంగ్రహోపాసనమును జేయునతడు (జీవబ్రహ్మైక్యజ్ఞానోదయముకంటె ముందే) మరణించిన యెడల అప్పుడతడు అర్చిరాదిమార్గము గుండానే బ్రహ్మలోకమునకు వెళ్లును. ఇట్లు సగుణోపాసకుడే బ్రహ్మలోకమునకు వెళ్లుచుండగా, నిర్గుణోపాసకుని గూర్చి సందియమే లేదు.

నిర్గుణోపాసనమును జేయుచు బ్రహ్మతత్త్వవిచారమును గూడ నిరంతరము చేసినయెడల పూర్వపుణ్యపరిపాకముచేత ఇహలోకముననే బ్రహ్మసాక్షాత్కారమును బొంది జీవన్ముక్తుడు కావచ్చును.

ఇట్లు ప్రతీక-అహంగ్రహ-సగుణ-నిర్గుణోపాసన-బ్రహ్మతత్త్వవిచారాదులయొక్క స్వరూపఫలాదులు విచారింబడినవి.

కేవల బ్రహ్మతత్త్వవిచారము చేయువారికి కూడ ఉపాసన లేనిది ఫలము సిద్ధింపదు. అట్లే నిర్గుణోపాసన చేయువారికైనను బ్రహ్మతత్త్వవిచారము చేయనిది ఫలము లభింపదు. రెండింటికిని అన్యోన్యోపకారకత్వ మున్నది. భగవాన్ రమణమహర్షు లిట్లు చెప్పిరి.

"న సంసిద్ధిర్విజిజ్ఞాసోః కేవలం శాస్త్రచర్చయా।
ఉపాసనం వినా సిద్ధిర్నైవ స్యాదితి నిర్ణయః"

అని. దీనియర్థము పైన వ్రాసినదే.

## సంధ్యోపాసన వైశిష్ట్యము

శ్రీ భగవద్గీతయందు నారవ యధ్యాయమున ధ్యాన యోగము విధింపబడినది. అది సగుణధ్యానము. ఏలననగా "యోగి నామపి సర్వేషాం" ఇత్యాది శ్లోకమున నున్న "యోగినాం" అను పదమునకు "రుద్రాదిత్యాది ధ్యానపరాణాం" రుద్రుడు ఆదిత్యుడు మొదలగు దేవతలయొక్క ధ్యానపరులైన" అని భాష్యమున శంకరు లట్లే వ్రాసిరి.

అట్లే అష్టమాధ్యాయమున "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ" ఇత్యాది శ్లోకమునందు ఓంకారసాధనముతో నిర్గుణోపాసనము విధింపబడినది. ఈ రెండుపాసనలున్నూ సర్వకర్మసన్యాసము చేసిన సన్యాసులకే విధింపబడినవి.

కాని సంధ్యావందనమున ఈ సగుణనిర్గుణోపాసనలు రెండును ఓంకారసాధనతో చేయవలగిన నిర్గుణనిరుపాధికబ్రహ్మోపాసనమున్నూ గృహస్థబ్రహ్మచారులకు విధింపబడినవి. అందునను అవశ్యకర్తవ్య మైన నిత్యకర్మలుగా విధింపబడినవి. కావున గృహస్థులును బ్రహ్మ చారులును ఈ సగుణనిర్గుణోపాసనలను ప్రతిదినము మూడుసార్లు నిత్యకర్మలుగా తప్పవిసరిగా చేయుటకు ఎంతటి ఎటువంటి పుణ్య మును చేసి యుందురో కదా! కావుననే ఇటువంటి సగుణనిర్గుణో పాసనగర్భితమైన సంధ్యావందనకర్మ సకలవైదికకర్మలయందును మిక్కిలి ప్రధానమైనది యయ్యెను.

"బ్రహ్మణోపాస్యతే సంధ్యా విష్ణునా శంకరేణ చ" అని యోగియాజ్ఞవల్క్యమహర్షి వ్రాసిన వచనము వలననే ఈ సంధ్యో పాసనమహిమ స్పష్టముగ తెలియుచున్నది.

భగవద్గీతచే నుపదిష్టమగు ధ్యానయోగమునకును ఈసంధ్యో పాసనరూపధ్యానయోగమునకును సామ్యవైషమ్యములు.

## పోలికలు-భేదములు

(1) రెండును సగుణనిర్గుణధ్యానయోగములే. ఇది సామ్యము.
(2) భగవద్గీతయందు చెప్పబడినవి సన్యాసులకు.
సంధ్యావందనము గృహస్థ బ్రహ్మచారులకు.
ఇది వైషమ్యము [భేదము.]
(3) యోగసిద్ధికి ముందు మరణించినవారిస్థితి,
ఇద్దరకును కొన్ని యంశములందు పోలిక యున్నది.

## ఎట్లనగా—గీతయందు

(క) మరణించిన యోగభ్రష్టుడు అశ్వమేధయాజుల పుణ్య లోకములలో చిరకాలము భోగములనుభవించి మరల శుచియగు శ్రీమంతులింట గాని లేక యోగులింటగాని పుట్టును. వేలకొలది అశ్వమేధయాగములు కూడ సంధ్యోపాసనకు సరిగావు'' అనెడు మార్కండేయ పురాణవచనము,సంధ్యోపాసకునకు అంతకంటె గొప్ప పుణ్యలోకప్రాప్తిని గాని, అదే పుణ్యలోకప్రాప్తినిగాని చెప్పు చుండుటచేత సామ్యమనవచ్చును.

(ఖ) ''బ్రాహ్మణ్యాచ్చ న హీయేత అన్యజన్మగతోఽపి సన్'' అను వీరమిత్రోదయశ్లోకము సంధ్యోపాసకునకు మరల జన్మ మెత్తనలసి వచ్చిన యెడల బ్రాహ్మణజన్మమే యెత్తునని చెప్పుటచేత జన్మయందును పోలిక తెలియుచున్నది.

గీతయందు=యోగి పూర్వజన్మమున నెచ్చట యోగమును వదలెనో మరుజన్మమున నచ్చటనే యారంభించి తీవ్రయత్నముతో సిద్ధిని పొందగలడని చెప్పబడెను.

సంధ్యోపాసకుని విషయమున.

వీరమిత్రోదయ శ్లోకమునందలి ''బ్రాహ్మణ్యాచ్చ'' యను చోట నున్న అధికచకారము = బ్రాహ్మణజన్మమును పొందుట

మాత్రమే కాదు—మరుజన్మమున గాయత్ర్యుపదేశానంతరమే పూర్వజన్మసంస్కారము మేలుకొని వానిని తీవ్రముగ సంధ్యోపాసన చేయుటయందు పురికొల్పి—ఆ జన్మముననే సగుణనిర్గుణోపాసన - సబీజనిర్బీజ- సమాధి- క్రమమున బ్రహ్మసాక్షాత్కారమును కలిగించును. అను విశేషార్థము నిచ్చుటచేత–ఈ విషయమున సామ్యము కలదు.

(4) భగవద్గీత చెప్పిన ధ్యానయోగము సన్న్యాసులకే పరిమితము. సంధ్యోపాసనము శ్రుతిమాతకృపచే గృహస్థబ్రహ్మచారులకు గూడ సులభముగ పొందశక్యమైనది. (ఇది వైషమ్యము)

(5) ధ్యానయోగము స్మృతిచెప్పినది. సంధ్యోపాసనము శ్రుతి చెప్పినది. (ఇదిగూడ వైషమ్యము)

ఆహా! సంధ్యోపాసన మెంత మహిమ గలది!

అందు సందేహలేశము గూడ లేదు.

## సంధ్యోపాసనఫలవిచారము

పూర్వమీమాంసకులలో ప్రాభాకరమతానుయాయులు "నిత్యకర్మలకు ఫలమే లేదు" యని యందురు. సంధ్యోపాసనము నిత్యకర్మ గావున వారిమతప్రకారము ఫలము లేదని యభిప్రాయము.

ఇక పూర్వమీమాంసకులలో "భాట్టమతానుయాయులు" నిత్యకర్మను చేయకపోవుటవలన కలుగబోవు పాపముయొక్క– నివృత్తియే, నిత్యకర్మలు చేయుటవలన కలుగు ఫలము. అంతియే కాని ప్రత్యేకముగ వేరు ఫలము లేదందురు. వీరేదో ఫలమున్నట్లు మాటలు మార్చి చెప్పినను లోపలికి తొంగిచూడగ — ఫలము హుళక్కియే. నిత్యకర్మఫలవిషయమున ఈ రెండుమతములును సరియైనవి గావు.

ఏలననగా—శ్రుతిస్మృతులు నిత్యకర్మలకు ఫలమున్నదని ముక్తకంఠముగను స్పష్టముగను ఉద్ఘోషించుటవలన. ఎట్లనగా—

(1) "ఉద్యంతమ స్తంయంతమాదిత్యం=బ్రహ్మైవ సన్ బ్రహ్మా ప్యేతి" అను తైత్తరీయబ్రాహ్మణవచనము జీవబ్రహ్మైక్య రూపఫల మున్నదని స్పష్టముగ చెప్పుచున్నది. ఈ బ్రాహ్మణవచనమునకు వ్యాఖ్యానము చేయుచు సర్వజ్ఞమాధవాచార్యులవారు "అసావాదిత్యో బ్రహ్మ" యనుచు చేయు సంధ్యోపాసనమునకు జీవబ్రహ్మైక్య రూపమోక్షమే ఫలమని స్పష్టముగ వ్రాసిరి.

(2) ఇక "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ=సాయుజ్యం వినియోగం॥ అను ననువాకము, నిర్గుణనిరుపాధికబ్రహ్మోపాసనమునకు సాయుజ్య ముక్తియే ఫలమని స్పష్టముగ చెప్పినది. శ్రీ శంకరులును అట్లే చెప్పిరి.

(3) "సంధ్యాముపాసతే యే తు సతతం సంశితవ్రతాః।
విధూతపాపా స్తే యాంతి బ్రహ్మలోకం సనాతనమ్॥

అను గోభిలమహర్షి వచనము, "శుచిర్వాప్యశుచిర్వా యః=బ్రహ్మ భూయాయ కల్పతే"యను విష్ణుస్మృతివచనము, ఇంక ననేకమైన స్మృతులును ముక్తకంఠముగ సందేహమునకు తావులేకుండ బ్రహ్మ లోకప్రాప్తి లేక జీవబ్రహ్మైక్యము ఫలమని చెప్పుచున్నవి.

బ్రహ్మసూత్రభాష్యమున"ఆతివాహికాధికరణము"న "న చ కార్యే ప్రత్యభిసంధిః" అను సూత్రముయొక్క భాష్యమున "నిత్య నైమిత్తికకర్మలు చేయుటవలన ప్రత్యవాయము (పాపము) పుట్టక పోవుట మాత్రమే ఫలము. కాని వేరే ప్రత్యేకముగ ఫలము లేదని పూర్వమీమాంసకులు చెప్పుటకు ప్రమాణము లేదు. ఏల ననగా—ఆ కర్మానుష్ఠానమువలన ఒకఫలము పుట్టుచుండుటవలన ఫలమున్నదని చెప్పవలెను. అని పూర్వమీమాంసామతమును ఖండించి శ్రీశంకరాచార్యులవారు నిత్యకర్మలకు ఫలమును సాధించిరి.

కావున నిత్యకర్మలు స్వసన్నిధానమాత్రముచేతనే ఆ కర్మలు చేయకపోవుటవలన కలుగబోవు ప్రత్యవాయమును నివారించి తమ యనుష్ఠానముచేత శాస్త్రోక్తఫలమును పుట్టించుతవి యని భావము.

(1) శ్రీభగవద్గీతాభాష్యమున శ్రీశంకరులు మూడు నాలుగు

స్థలములందు, సందర్భమును పురస్కరించుకొని నిత్యకర్మలకు ఫల మున్నదని నిరూపించిరి.

ఎట్లనగా—ఆరవ యధ్యాయమున మొదటి శ్లోకము నవ తారికయందు "నిత్యస్య చ కర్మణః వేదప్రమాణావబుద్ధత్వాత్ ఫలేన హి భవితవ్య మిత్యవోచామ. అన్యథా వేదస్యానర్థక్యప్రసం గాత్" అని. అనగా—నిత్యకర్మలు వేదములచేతనే తెలియబడు చున్నవి. కాన వాటికి ఫలము తప్పక యుండవలయును. ఫలము లేదని చెప్పిన యెడల వేదము నిష్ప్రయోజనమే యవవలసి వచ్చును అని.

(2) ఇట్లే పదునెనిమిదియవ యధ్యాయమున ఆరవ శ్లోక భాష్యమున "నిత్యానామపి కర్మణామిహ ఫలవత్త్వస్యోపపాది తత్వాత్" అని. అనగా—నిత్యకర్మలకు గూడ ఫలమున్నదని ఇచ్చట నిరూపించుట యైనది. అని.

(3) ఇట్లే—ఆ యధ్యాయముననే "సర్వధర్మాన్ పరిత్యజ్య= ఇత్యాది అరువదియారవ శ్లోకభాష్యమున "నిత్యానాం కర్మణాం ఫలవత్త్వశ్రుతేః" నిత్యకర్మలకు ఫలమున్నదని శ్రుతిచెప్పుటవలన అనియును చెప్పిరి.

(4) "కచ్చిన్నోభయవిభ్రష్టః = ఇత్యాది భగవద్గీతాషష్ఠా ధ్యాయశ్లోకవ్యాఖ్యానమున శ్రీమధుసూదనసరస్వతులవారు "నిష్కా మానామపి కర్మణాం ఫలసద్భావస్య ఆపస్తంబవచనాద్యుదాహ రణేన బహుశః ప్రతిపాదితత్వాత్" అని, అనగా—"నిష్కామకర్మ లకుగూడ ఫలమున్నదని ఆపస్తంబమహర్షి వచనములు మొదలగు నుదాహరణముల నిచ్చి చాలసారులు నేను ముందు నిరూపించి యున్నాను" అని వ్రాసినారు.

(5) "సాయుజ్యం వినియోగం" అనియు, బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి" అనియును శ్రుతియే ముక్తకంఠముతో నిత్యకర్మ లకు ఫలమున్నదని సుస్పష్టముగ జ్ఞాపకము చేయుచున్నది. ఇట్లు

శ్రుతిస్మృతులనెడు ఢంకాలు మ్రోగుచుండుటవలన నిత్యకర్మలకు వేరు ఫలమున్నదని చెప్పబడుచున్నది. ఇట్లంతయును నిరవద్యము.

ఇది

విద్వచ్ఛిరోమణి–సాహిత్యవిశారద–ద్విజబృందనిషేవి
సోమయాజులోపనామక వేంకటాచలశాస్త్రిచేత రచింపబడిన
పూర్ణాభిధాంధ్రవ్యాఖ్యాసముపేతమగు
సంధ్యాతత్త్వసుబోధినియందు తృతీయాధ్యాయమున
సంధ్యోపాసనాకారాదినిరూపణంబను ప్రథమభాగము
సమాప్తము.

ఓం తత్ సత్

శివమ్.

ఓమ్

"యత్సంధ్యాముపాసతే బ్రహ్మైవ తదుపాసతే"

ఇతి శృతిః

# సంధ్యాతత్త్వసుబోధిని

## పూర్ణాభిధాంధ్ర వ్యాఖ్యాసముపేతము

## తృతీయాధ్యాయము ద్వితీయభాగము

## సంధ్యాపూర్వోత్తరాంగ వివరణము

అవ. ప్రథమద్వితీయాధ్యాయములలో చెప్పబడిన విషయముల నుపన్యసించి, తృతీయాధ్యాయమున చెప్పదలచిన విషయము ప్రతిజ్ఞ చేయబడుచున్నది.

**యత్నేన మహతా హ్యంగి సస్వరూపం సుసాధితం।**
**నిరూప్యంతే తదంగాని పూర్వాణ్యుత్తరాణి చ॥ 22**

నిరాకరించదగిన పూర్వపక్షవిషయము బలిష్ఠముగ నుండుట వలన గొప్ప ప్రయత్నముతో దానిని నిరాకరించి, అంగియగు సంధ్యోపాసనను సాధించి, యుపాస్యసంధ్యాదేవతయొక్కయు, ఉపాసనయొక్కయును స్వరూపములు చక్కగవివరింపబడినవి.

ఇకమీదట నాసంధ్యోపాసనయొక్క పూర్వోత్తరాంగములు ఈ తృతీయాధ్యాయద్వితీయభాగమున వివరింపబడుచున్నవి.

**సాంగోపాంగప్రధానాంగే చాచాంతిప్రాణసంయమౌ।**
**బ్రాహ్మస్నానం తథా మంత్రా చమనోత్తరమార్జనే॥ 23**

**అఘదాహార్ఘ్యవిక్షేపౌ పూర్వాంగాణి ప్రచక్షతే।**
**శ్రీగాయత్రీజపః సూర్యోపస్థానం దిఙ్నమస్కృతిః॥ 24**

**రోదోనమస్కృతిశ్చైవ ప్రవరేణాఽభివాదనం।**
**పంచైతాన్యుత్తరాంగాణి స్మృతికారాః ప్రచక్షతే॥ 25**

అంగియగు కర్మకు కొన్ని యంగములగు కర్మలుండును. ఆ యంగకర్మలలో కొన్ని యంగికంటె ముందుగా చేయబడును. అవి పూర్వాంగములనబడును. కొన్ని యంగకర్మలు అంగికర్మకు తర్వాత చేయబడును. వానిని ఉత్తరాంగములందురు. అంగములకు గూడ కొన్నింటికి అంగములుండును. వానిని ఉపాంగములందురు. ఇట్లు అంగోపాంగసహితమైన మొత్తము అంగికికూడ కొన్ని యంగములుండును. ఇట్లంగములు మూడు విధములుగ నుండును.

వాని యందు, అంగోపాంగసహితమైన మొత్తము అంగికి ముందుగ [1) ఆచమనము, (2) ప్రాణాయామము, (3) సంకల్పము అని మూడంగములుండును. వీనికి ప్రత్యేకమైన పేరు లేదు.

తర్వాత—(1) బ్రాహ్మస్నానము లేక ప్రథమమార్జనము, (2) మంత్రాచమనము లేక అభ్యుక్షణము, (3) ద్వితీయమార్జనము లేక పునర్మార్జనము, (4) పాపపురుషదహనము, (5) అర్ఘ్యప్రక్షేపము అని అంగియగు సంధ్యోపాసనమునకు నైదు పూర్వాంగములు. కాని యైదవదగు అర్ఘ్యప్రక్షేపము, మొదటి నాల్గింటికంటెను నాంతరీయకమగు (మిక్కిలి ముఖ్యమగు) పూర్వాంగము. మిగిలిన నాలుగును సాధారణాంగములు. అందులో రెండు స్మార్తాచమనములు, అభ్యుక్షణమునకు నుత్తరాంగమగుచు ఉపాంగమగును. అట్లే ప్రదక్షిణము ఆచమనము రెండును అర్ఘ్యప్రక్షేపమునకు ఉత్తరాంగములగుచు ఉపాంగము లగును.

ఇక (1) గాయత్రీజపము (2) సూర్యోపస్థానము (3) దిఙ్నమస్కారము (4) భూమ్యాకాశవందనము (5) అభివాదనము అని యైదు ఉత్తరాంగములున్నవి. అందునను గాయత్రీహృదయపఠనము, మూడు ప్రాణాయామములు, గాయత్రీజపమునకు రెండు పూర్వాంగము లగుచు ఉపాంగములగును. గాయత్ర్యుద్వాసనము ఉత్తరాంగమగుచు, మొత్తము మూడు ఉపాంగములు. అందులో గాయత్రీ

జపము, సంధ్యోపాసనకు అంతరంగమగు నుత్తరాంగము. మిగిలిన నాలుగు సాధారణాంగములు.

ఇట్లు ద్విజులందరును అంగోపాంగములతో కూడిన (సాంగోపాంగమగు) అంగియొక్క జ్ఞానము కలవారై, అనగా ఏది యంగి? ఏవి యంగములు? ఏవి యుపాంగములు? అని వివరముగ తెలిసికొన్నవారై, సంధ్యోపాసనము నాచరింపవలెను.

ఇట్టి అంగాంగిజ్ఞానము కాలప్రవాహములో కొట్టుకొనిపోవుట చేతనే ప్రథమాధ్యాయమున జరిగిన వివాదమునకు హేతువైన వ్యామోహము ప్రతిపక్షులకు గలిగెను.

## న్యాసాదులు అవైదికములని నిర్ణయము

అవ ఉపాసనకుత్తరాంగమైన తర్పణము, గాయత్రీజపమునకు పూర్వోత్తరాంగములైన అంగన్యాసకరన్యాసములేల చెప్పబడలేదు? అను శంకకు సమాధాన మీయబడుచున్నది.

> తర్పణన్యాసముద్రాస్తు క్రియంతే తాంత్రికే బుధైః।
> న తు వైదికసంధ్యాయాం మానవాదిష్వనుక్తితః॥ 26

మంత్రశాస్త్రమున లలితా (పంచదశి) మంత్రమనియు, బాలామంత్రమనియు మహాగణపతిమంత్రమనియు నిట్లనేక మహామంత్రములు ప్రసిద్ధమైనవి కలవు. ఆ మంత్రములను జపించువారికి ఆ యా మంత్రములకు సంబంధించిన సంధ్యావందనము మంత్రశాస్త్రముచే విధింపబడియున్నది. దానికి తాంత్రిక సంధ్యావందనమని పేరు. ఆ సంధ్యావందనమునందు ఆ యా దేవతలకు తర్పణము, ఆ యా మంత్రజపమున కంగముగ అంగన్యాసకరన్యాసములు ముద్రలు శాపవిమోచనము మొదలైనవి చాల యున్నవి.

అట్లే వైదికసంధ్యావందనాంగమైన గాయత్రికంటె వేరైన గాయత్రీమంత్రము (వాస్తవముగా గాయత్రీమంత్రమొక్కటియే తాంత్రికమైన దగుటచేత వేరుగా వ్యవహారము) తాంత్రిక సంధ్యా

వందనమున నున్నది. ఆ మంత్రమునకు గూడ తాంత్రికసంధ్యా వందనమున్నది. ఆ సంధ్యావందనమున గాయత్రీజపాంగముగా అంగ న్యాసకరన్యాసములు, తర్పణము, ముద్రలు, శాపవిమోచనము మొదలైనవి గూడ నాచరింపబడును. తాంత్రికసంధ్యావందనమున వానిని చేయవలయును. అట్లు చేయనియెడల "ఇతి ముద్రా న జానాతి గాయత్రీ నిష్ఫలా భవేత్" ఇట్లు ముద్రలను తెలిసికొనని యెడల గాయత్రీజపము నిష్ఫలమగునని యుండుటచేత అంతయు నిష్ఫలమగును.

గాయత్రీమంత్రపురశ్చరణ చేయువారు వీనినన్నింటిని చేయ వలెను. కాన అట్టి వారు వైదికసంధ్యావందనమున గూడ వీటిని చేసిన ఫలమధికముగ లభించునను నాసతో వైదికసంధ్యావందన మున వీటిని చేర్చిరి. తర్వాత రానురాను కాలక్రమమున వైదిక సంధ్యావందనమున వానివేళ్ళు మిక్కిలి లోతుగ నాటుకొన్నవి. అందువలన ఇప్పుడు విజ్ఞులు కూడ వీటిని విడనాడుటకు మిక్కిలి సందే హించుచున్నారు. కాని ఇవి మనుపరాశరాదిస్మృతులందు చెప్పబడ లేదు.

ఇంతియే కాదు. మీదు మిక్కిలి చాలమంది నిబంధనకారుల చేత గట్టిగ నిషేధింపబడినవి కూడ. ఎట్లనగా—

(1) స్మృతిముక్తాఫలమునందు గృహ్యాపరిశిష్టమున "ఏనమ ప్యేకే నేచ్ఛంతి. స హి విధిరవైదిక ఇతి" అని. అనగా—ఈ న్యాసాదులను ఆచరించుటకు కొంతమంది యిష్టపడకున్నారు. ఏల? ఆ న్యాసవిధి అవైదికము గదా! యని. ఈ న్యాసవిధి తాంత్రికమే గాని వైదికము కాదు. అని భావము.

(2) ఆహ్నికచంద్రికయందు—"అయం న్యాసవిధివిశేషోఽ వైదికః" ఇతి. అనగా ఈ న్యాసవిధి తాంత్రికమే గాని వైదికము కాదు అని.

(3) తైత్తరీయసంధ్యాప్రయోగమున — "న్యాసవిధేరవైదికత్వముక్తమేవ" అనగా ఈ న్యాసవిధి యవైదికమని చెప్పనే చెప్పబడినది. అని యర్థము.

(4) ధర్మసింధుసారమున–"ఏతేన న్యాసవిధే రవైదికత్వాత్ అక్షరన్యాస పదన్యాసాదీనామపి, ముద్రావిధేః శాపవిమోచనాది విధేశ్చ తాంత్రికత్వేన అవైదికత్వా దనావశ్యకమేవేతి వేదితవ్యం" అని అనగా ఇందుచేత న్యాసవిధి అవైదికమగుటచేత అక్షరన్యాసము పదన్యాసము మొదలగునవియు ముద్రావిధియు శాపవిమోచనాదివిధియున్నూ తాంత్రికములే యగుటచేత అవైదికములు. కాన వైదికసంధ్యావందనమున అనావశ్యకములే యని తెలిసికొనవలయును. అని.

ఇట్లు నిషేధింపబడుటచేత వైదిక సంధ్యావందనమున న్యాసాదులు చేయనవసరము లేదు. చేయకపోవుటవలన నెట్టిపాపలేశము గూడ నంటదు. కాన వానినన్నిటిని విజ్ఞులు ఉపేక్షింతురు గాక!

ఇంకను కొందరు,మిక్కిలి యాదరముతో తాంత్రికులు చెప్పునట్లు "అస్య శ్రీగాయత్రీమహామంత్రస్య ఇత్యాదిగా—గాయత్రీ మంత్రమునకు ఋషిచ్ఛందోదేవతావినియోగాదులను కూడ చెప్పుదురు. కాని యది యంతయు ననావశ్యకము. తాంత్రికము కావున. అంతియే కాదు. గాయత్రీహృదయముననే "గాయత్ర్యా గాయత్రీచ్ఛందో, విశ్వామిత్ర ఋషిః=ఇత్యాదిగా నవి యన్నియును చెప్పబడినవి. ఋష్యాదులు మాత్రమే గాదు—ధ్యానము గూడ హృదయమున చెప్పబడినది. ఈ వివరములన్నియును ఈ యధ్యాయమున గాయత్రీహృదయనిరూపణసమయమున చెప్పబడును. హృదయమునసే ధ్యానము చెప్పబడుటవలన ప్రత్యేకముగ "ముక్తావిద్రుమ=

ఇత్యాదిధ్యానశ్లోకమును పఠింపనక్కరలేదని కొందరందురు. కాని మూర్తిధ్యానశ్లోకమును పఠింపవలెను.

ఇది

విద్వచ్ఛిరోమణి–సాహిత్యవిశారద–ద్విజబృందనిషేవి
సోమయాజులోపనామక వేంకటాచలశాస్త్రిచేత రచింపబడిన
పూర్ణాభిధాంధ్రవ్యాఖ్యాసముపేతమగు
సంధ్యాతత్త్వసుబోధినియందు తృతీయాధ్యాయమున
సంధ్యోపాసనాపూర్వోత్తరాంగవివరణంబను ద్వితీయభాగము
సమాప్తము.

తృతీయాధ్యాయము సమాప్తము.

ఓమ్ తత్ సత్

శివమ్

ఓమ్

''యత్సంధ్యాముపాసతే—బ్రహ్మైవ తదుపాసతే''

ఇతి శ్రుతిః

# సంధ్యాతత్త్వసుబోధిని

పూర్ణాభిధాంధ్రవ్యాఖ్యాసముపేతము

చతుర్థాధ్యాయము ప్రథమ భాగము

సంధ్యోపాసనపూర్వోత్తరాంగానుష్ఠానపద్ధతినిరూపణము

అవ=ఇట్లు పూర్వోత్తరాంగములను ఉపాంగములను వివరించి, వాని యనుష్ఠానపద్ధతిని చెప్పబోవుచు, ముందుగ ననుష్ఠించువాని లక్షణము తెలియదగిన దగుటచేత అనుష్ఠించువాని లక్షణము చెప్పబడుచున్నది.

> యథావిధి కృతస్నానో విద్వాన్ బద్ధశిఖో ద్విజః।
> యజ్ఞోపవీత్యుపాసీత సాంగాం సంధ్యాం బహిఃస్థలే॥ 27

## అర్థము

విద్వాంసుడైన ద్విజుడు యథావిధిగ స్నానము చేసినవాడై శిఖను ముడి వేసికొని, యజ్ఞోపవీతము కలవాడై, గ్రామమునకో లేక గృహమునకో వెలుపల ప్రదేశమున సాంగోపాంగముగ సంధ్యా దేవత నుపాసింపవలెను, అని.

(1) శ్లోకమునందలి విశేషణములలో ముఖ్యమైనది కాన ''ద్విజః'' యను విశేషణము ముందుగ వివరింపబడుచున్నది. ''ద్విః జాయతే'' ''ఇతి ద్విజః'' రెండు సారులు పుట్టువాడు ద్విజుడనబడుచున్నాడు. తల్లిగర్భమునుండి పుట్టుట తొలి జన్మము. గాయత్ర్యుపదేశము మరుజన్మము. గాయత్ర్యుపదేశము కలవాడే సంధ్యోపాసన

చేయుట కర్తృ డగుచున్నాడు. అదియును గాయత్ర్యుపదేశమైన నాటినుండి మరణపర్యంతము త్రిసంధ్యలందును సంధ్యోపాసనను చేయవలెను. అత్రిమహర్షి యిట్లు చెప్పెను.

"సంధ్యాత్రయం తు కర్తవ్యం ద్విజేనాత్మవిదా సదా।
మౌంజీబంధనమారభ్య సాయం ప్రాతశ్చ కాలయోః॥ మధ్యాహ్నేఽపి చ కర్తవ్యం యావత్ప్రాణవిమోచనమ్॥ అని. ఉపనయన దినము మొదలు త్రిసంధ్యలయందును ద్విజుడు ఆత్మజ్ఞానప్రాప్తికొరకు ప్రాణావసానమువరకును, సంధ్యోపాసనను చేయవలెను. ఈ ప్రమాణవచనములవలన ప్రాతస్సాయంకాలములందే సంధ్యోపాసన చేయవలెనను విష్ణుస్మృతివచనానుసారముగ "రెండు సంధ్యలే" యను వాదము పరాస్తమైనది.

## సంధ్యామంత్రార్థ జ్ఞానావశ్యకత

(2) రెండవ విశేషణము "విద్వాన్" అనునది. అనగా— తెలిసినవాడు. ప్రకృతమున—సంధ్యోపాసన—తదంగానుష్ఠానపద్ధతిని, సంధ్యావందనమంత్రార్థములను, బాగుగ తెలిసినవాడని యర్థము. కాగా—మంత్రార్థమును తెలిసినవాడై, మంత్రార్థము ననుసంధానము చేయుచున్నవాడై, సంధ్యోపాసనను చేయవలెను. అని భావము. అప్పుడే కర్మయొక్క పూర్ణ ఫలము లభించును.

## స్నానవిషయము

(3) "యథావిధి కృతస్నానః"=శాస్త్రమున చెప్పిన ప్రకారము మంత్రములతో అఘమర్షణస్నానము చేసినవాడని యర్థము. ఇచ్చట "యథావిధి" యని చెప్పుటచేత "కాకస్నానము" వలె ఒక్కసారి నీటిలో "బుడుంగు"మని మునిగి లేచిన, స్నాన మనిపించుకొనదు. మంత్రములతో చేసిననే శుద్ధుడగును.

స్నానములు ముఖ్యగౌణములుగా వర్ణింపబడినవి. ఎట్లనగా

"స్నానమబ్దైవత్రైర్బ్రాహ్మ మవగాహం తు వారుణం। ఆగ్నేయం భస్మనా స్నానం వాయవ్యం గోరజః స్మృతమ్॥ యత్తు సాతపవర్షేణ తత్స్నానం దివ్యముచ్యతే। ఆర్ద్రేణ కర్పటేనాంగమార్జనం కాపిలం స్మృతమ్॥ ప్రాతఃస్నానే త్వశక్తః స్యాత్కాపిలం స్నానమాచరేత్। ముఖ్యం తు వారుణం గౌణాన్యుచ్యంతేఽన్యాని సూరిభిః॥

(1) ఆపో హి ష్ఠాది-అబ్లింగమంత్రములతో చేయు స్నానము బ్రాహ్మస్నాన మనబడును. దీనినే మాంత్రస్నానమనియు నందురు.

(2) సూక్తపరనాదులతో నీటిలో మునుగుచు అఘమర్షణ మంత్రములతో చేయు స్నానము వారుణ మనబడును.

(3) మంత్రములతో విభూతిని ఒడలున పూసుకొనుట ఆగ్నేయస్నానము.

(4) ప్రాతఃసాయంకాలములందు గోవులమందలు పోవునప్పుడు లేచు ధూళితో చేయు స్నానము వాయవ్యస్నానము.

(5) ఒకే కాలమున వానయు నెండయు నుండగా నా వానలో స్నానము చేయుట దివ్యస్నానమనబడును.

(6) తడిగుడ్డతో నొడలంతయును తుడుచుకొనుట కాపిల స్నానమనబడును. ప్రాతఃస్నానము చేయు శక్తిలేనివారు కాపిలస్నానమును చేయవలెను.

పై యారు విధములైన స్నానములలో వారుణస్నానము ముఖ్యస్నానమనబడును. మిగిలిన యైదును శక్తిలేనివారికి గౌణస్నానములు. ముఖ్యగౌణములలో ముఖ్యము శ్రేష్ఠము. ముఖ్యస్నానమును చేయలేని పక్షమున గౌణస్నానము విధింపబడినదని తెలియునది.

## స్నానవిషయమున దక్షస్మృతి

(1) ఉషఃకాలము రాగానే లేచి యథావిధిగ శౌచమును ముగించి దంతధావనమును చేసి స్నానమును చేయవలెను.

(2) ఈ శరీరము మిక్కిలి మలినమైనది. ఎట్లన—ఈ శరీరమున తొమ్మిది రంధ్రములు కలవు. రాత్రింబగళ్ళు ఆ రంధ్రములు పలు విధములగు మలములను విడుచుచునే యుండును. వాటిని శోధించుటకు ప్రాతఃస్నానమును చేయవలెను. స్నానము చేయని ద్విజుడు జపహోమాదులను చేయకూడదు. ప్రాతఃస్నానము దృష్ట ఫలములను అదృష్టఫలములను నిచ్చునని ప్రశంసించుచున్నారు. దృష్టఫలమనగ కనపడు ఫలము. అదృష్టఫలమనగ పుణ్యము. గంగా గోదావర్యాదులందు స్నానము చేసిన అదృష్ట (పుణ్య)ఫలము లభించును.

ప్రాతఃస్నానము చేసినవాడు శుద్ధమైన శరీరము కలవాడై జపాది సర్వకర్మలు చేయుట కర్హుడగును.

ఈ ప్రాతఃస్నానముచేత పది దృష్టఫలములు కలుగుచున్నవి. ఎట్లన—(1) మంచిరూపము (2) శరీరమునకు పుష్టి (3) ఇంద్రియాదులకు బలము (4) శరీరమునకు మంచి కాంతి (5) ఆరోగ్యము (6) ఆయుర్వృద్ధి (7) మనస్సుకలత పోవుట (8) దుస్స్వప్ననాశము (9) తపస్సు చేయవలెనను శ్రద్ధ (10) మంచి జ్ఞాపకశక్తి, (మేధ). ఈ పదియును కలుగును.

### ఉషఃకాల పరిమాణము

''పంచపంచ ఉషఃకాలః'' సూర్యోదయము మొదలు ఏబదియైదు ఘటికలు దాటిన తర్వాత అనగా మరునాడు సూర్యోదయమునకు రెండు గంటలు ముందుగ ఉషఃకాల మారంభమగును.

''అరుణోదయకాలము'' స్కాందస్మృతి

''చతస్రో ఘటికాః ప్రాతరరుణోదయనిశ్చయః'' అని.

సూర్యోదయమునకు ముందు నాలుగు గడియలకాలమునకు అరుణోదయమగును. అరుణుడుదయించును. అనగా ఉదయమునకు ముందుగ ఒకగంట ముప్పదియారు నిముషములకు సూర్యుని సారథి యగు అరుణుడుదయించును. అది స్నానమునకు గొప్ప పుణ్యకాలము.

స్మృత్యంతరమున—"ప్రాతఃస్నాయాదరుణకరగ్రస్తాం ప్రాచీమవలోక్య" అని. తూర్పున అరుణకిరణములను జూచి ప్రాతఃస్నానమును జేయవలెనని. కావున ప్రాతఃస్నానము అరుణోదయకాలమున జేయవలెను. అంతకు ముందు చేయరాదు. వివాహోపనయనవ్రతాదులప్పుడు ఆకర్మల సౌకర్యముకొరకు అరుణోదయకాలముకంటె ముందు గూడ చేయవచ్చును. అది ప్రాతఃస్నానము గాదు. సౌకర్యస్నానము.

## యజ్ఞోపవీతవిషయము

పరాశరమాధవీయమున"ఎల్లప్పుడును జందెమును ధరించియే యుండవలెను. ఎల్లప్పుడును ముడివేసిన శిఖతోనే యుండవలెను. శిఖ లేనివాడును, జందెము లేనివాడును, చేసిన వైదికకర్మ యంతయును చేయబడని దానిక్రిందనే లెక్క. శ్లో=సదోపవీతినా భావ్యం సదా బద్ధశిఖేన చ। విశిఖోఽనుపవీతీ చ యత్కరోతి న తత్కృతం" అని. ఆ జందెము నొక్కసారి పైకి తీసివేసినను ప్రాయశ్చిత్తము చేసికొనవలయును.

## "యజ్ఞోపవీత నిర్మాణ విషయము" గౌతములు

"స్త్రియా కారితేన తంతునా యజ్ఞోపవీతం కుర్యాత్" స్త్రీ చేత తయారుచేయబడిన దారముతో జందెమును తయారు చేయవలెను. ప్రత్తినూలుతో తయారైన జందెమునే ధరింపవలెను. పట్టు, ఊలు, నైలాను దారములు పనికిరావు.

## జందెపు నిడివి

ఎడమభుజమున వేసికొనిన జందెపు ముందుభాగముయొక్క ఒక కొస బొడ్డును, మరియొక కొస వెనుకభాగమున నాభికి తిన్నగ వీపును తాకుచుండగ రెండు కొసల మధ్యభాగము మొలను తాక వలెను. ఇది కొలత. ఇంతకంటె పొట్టిగ గాని పొడవుగ గాని యుండకూడదు.

యజ్ఞోపవీతసంఖ్య. దేవలమహర్షి.

"ఉపవీతం వటోరేకం ద్వే తథేతరయోః స్మృతం।
తృతీయముత్తరీయార్థే వస్త్రాభావే తదిష్యతే"

బ్రహ్మచారికి ఒక జందెము. గృహస్థునకును వానప్రస్థునకును రెండేసి యుండవలెను. కాని గృహస్థవానప్రస్థులు ఉత్తరీయముకొరకు మూడవ జందెమును ధరింపవలెను. ఎప్పుడైన ఉత్తరీయము లేని సందర్భము వచ్చిన యెడల, దానికి బదులుగ నీ మూడవ జందెముపయోగించును. అని.

స్మృత్యంతరమున— చత్వార్యన్నాద్యకామః, పంచ దశ వాఽయుష్కామః అని. అన్నము మొదలగునాహారమును అధికముగ కోరువాడు నాలుగు జందెములను ధరింపవలెను. దీర్ఘాయుస్సును గోరువాడు ఐదు గాని పది గాని ధరింపవలెను, అని. ఇట్లు చెప్పుట వలన ఆంధ్రదేశమున, వేసికొనిన నైదింటినే వేసికొనవలెను. మూడింటిని కాని నాలుగింటిని గాని వేసికొనగూడదను పామర వచనము కొట్టివేయబడినది. ఆంధ్రదేశమున నైదింటిని ధరించుటాచారము. ద్రావిడదేశమున రెండింటినే ధరించుటాచారము.

## సాంగాం సంధ్యాముపాసీత

అంగోపాంగములలో నెచ్చటను నొకింతగూడ లోపము కలుగకుండ పూర్ణముగ సంధ్యోపాసనము నాచరింపవలయును.

ఎచ్చట నాచరింపవలెను? "బహిః స్థలే"

స్మృతులందు గ్రామపదము వాడబడినది. అందువలన గ్రామమునకు వెలుపల సంధ్య నుపాసింపవలెనని యర్థమగుచున్నది. కాని, మహాపట్టణములందు, గ్రామము వెలువల యనిన నెట్లు కుదురును? కుదరనే కుదరదు. మహాపట్టణపు మధ్యనున్న వైదికు డెట్లు వెలుపలికి పోయి సంధ్య వార్వగలడు? అందువలన—గృహమునందు అర్ఘ్యముల నీయగూడదు గానను, "బహిః సంధ్యాముపాసీత వెలుపల సంధ్య నుపాసింపవలెను" అని నిరుపదముగ "బహిః" యని హారీతులు చెప్పుటవలన ఇంటికి వెలుపల యని కూడ నర్థమును చేసికొనవచ్చునని తోచుచున్నది. వ్యాసులవారు="గృహమున వార్చిన ఒక మడుగు పుణ్యమే కలుగును. పశుల కొట్టమునందు పది రెట్లు పుణ్యము. నదీతీరమున శతసహస్రములు రెట్లు పుణ్యము, విష్ణు సన్నిధానమున అనంతపుణ్యము కలుగును అని. ఇచ్చట విష్ణు పదము శివ–గణేశ–అంబికాది–ఇతర దేవతలకు కూడ సూచకము. దేవాలయములు గ్రామమధ్యమునను ఇంటి వెలుపలను కూడ నుండును కావున ఇంటి వెలుపల సంధ్యనుపాసింపవచ్చునని యర్థము చేసికొనవచ్చునని తోచెడిని. శాతాతపస్మృతి=వెలుపల సంధ్యవార్చిన యెడల అబద్ధమాడుటవలన, మద్యము సేవించుటవలన, పగలు స్త్రీ సంగమమువలన, శూద్రసంపర్కముగల యన్నమును తినుటవలనను కలుగు పాపము పోవునని. శ్లో=అనృతం మద్యగంధం చ, దివా మైథున మేవ చ। పునాతి వృషలస్యాన్నం బహిః సంధ్యా హ్యుపాసితా" అని.

## గౌతమ ధర్మశాస్త్రమున

"బహిఃసంధ్యాముపాసీత గృహేష్వర్ఘ్యం న దాపయేత్" అని. వెలుపలనే సంధ్యోపాసనను చేయవలెను. అర్ఘ్యమును గృహములోపల విడువగూడదు. అని. కాన అర్ఘ్యప్రక్షేపము

మాత్రమునైనను ఇంటిలో నీయగూడదు. సంపూర్ణసంధ్యోపాసనమును ఇంటికి వెలుపల జేయుటయే శ్రేష్ఠము.

## అంగముల ననుష్ఠించు పద్ధతి

పురాణాచమనం కృత్వా సపుంద్రశ్చ తతః స్మృతేః।
ఆచాంతిద్వయ, మాయమ్య ప్రాణాన్, సంకల్ప్య, మార్జయేత్॥ 28

ముందుగ శుద్ధికొరకు ఒక పురాణాచమనమును చేయవలెను. తర్వాత కర్మకు అంగముగ ఆచారము ననుసరించి, నుదుటిమీద చేతులు మొదలగు నవయవములమీద సమంత్రకముగ పుండ్రమును (పుండ్రము=బొట్టు, ప్రస్తుతమున విభూతి) ధరింపవలెను. అటు తర్వాత సాంగోపాంగమైన ప్రధానమగు సంధ్యోపాసనమునకు అంగముగా రెండు స్మృత్యాచమనములను చేయవలెను. తర్వాత "ఇన్ని" యని సంఖ్యను చెప్పకపోవుటవలన ఒక ప్రాణాయామమును చేయవలెను. తర్వాత "మమోపాత్తదురితక్షయద్వారా శ్రీపరమేశ్వరప్రీత్యర్థం ప్రాతః(మాధ్యాహ్నిక-సాయం)సంధ్యాముపాసిష్యే" అని సంకల్పమును జేయవలెను. అటు తర్వాత బ్రాహ్మస్నానమను పేరు గల ప్రథమమార్జనమును చేయవలెను, అని యర్థము.

## ఆచమననిరూపణము

స్మృతిముక్తాఫలమున="కుర్వీత పంచపాత్రం తు సంధ్యోపాస్తౌ గృహే ద్విజః। ఉపస్పర్శే ప్రాశనేఽర్ఘ్యే మార్జనేఽఘవిమోచనే" అని.

ద్విజుడు గృహమున సంధ్యోపాసనము చేయునెడల నైదు చిన్నపాత్రలను వాడవలెను. ఎందులకనగా—(1) అన్నియాచమనములకొక పాత్రము. (2) అబ్భక్షణమున కొక పాత్రము. (3) రెండు మార్జనముల కొక పాత్రము, (4) పాపపురుషదహనమున కొక పాత్రము, (5)అర్ఘ్యప్రక్షేపములకొక పాత్రము. ఇట్లైదు పాత్రములు. చెరువు, నదులందైన, పాత్ర లనావశ్యకము లగుటచేత గృహే"

యని చెప్పబడెను. ఇట్టి ప్రయోగముచేత గ్రామము వెలుపలనే కాక గృహమునకు వెలుపల గూడ సంధ్యోపాసనము చేయవచ్చు నని యర్థము వచ్చుచున్నది.

పూర్వకాలమున ఈ యాచార ముండియుండవలెను. ప్రస్తుత కాలమున నెక్కడను నీయాచారము నాకు కనబడలేదు. నేను విన్నదియు లేదు. లేక ఈ సువిశాలభారతవర్షమున నెక్కడనైన నీ యాచారముండవచ్చును. ఆధునికశిష్టులు ఒక పెద్దపాత్రను ఒక చిన్న యుపపాత్రను మాత్రము వాడుచు, ప్రతియంగకర్మయందును పెద్ద పాత్రమునుండి యుపపాత్రములోనికి నీళ్ళు వంచుకొనుచుందురు.

సంధ్యావందనమునకు పంచపాత్రము ఉద్ధరిణిని వాడుదురు కదా! ఆ పంచపాత్ర యేది? ఈ యైదుపాత్రలే. కాని వెడల్పు ముఖముగల పాత్ర గాదు. మరి యేమన—సంస్కృతమున ఐదు పాత్రల మొత్తమునకు "పంచపాత్రము" అని యందురు. పంచవటి యనునట్లు ద్విగుసమాసమిది. కాని కాలక్రమమున సంధ్యోపాస నము వలె సంప్రదాయము విచ్ఛిన్నమై చివరకు "పంచముఖం పాత్రం=పంచపాత్రం=వెడల్పు ముఖముగల పాత్రము పంచపాత్ర మైనది. కాలమహిమ!

ఆచమనము మూడువిధములు. (1) శ్రౌతము, (2) స్మార్తము (3) పౌరాణికము అని. అందు తైత్తరీయారణ్యకమున "త్రిరాచా మేత్, ద్విః పరిమృజ్య=ఇత్యాదిగా చెప్పబడినది శ్రౌతాచమనము. ఈ యాచమనము బ్రహ్మయజ్ఞము మొదలగు కర్మలకంగము. సంధ్యోపాసనాంగము కాదు.

బ్రహ్మయజ్ఞే తు వై కుర్యాచ్ఛ్రౌతే రాచమనం ద్విజః॥
శ్రుత్యాచమనమును బ్రహ్మయజ్ఞమునందు చేయవలెను. అని యర్థము. "షట్కర్మచంద్రిక" యను గ్రంథమున "దేవ్యాః పాదైస్త్రిభిః పీత్వా"=ఇత్యాదిగా చెప్పబడిన మరియొక

శ్రౌతాచమనము కూడ నున్నది. అది గాయత్రీపురశ్చరణమున కంగ మని వేరొక గ్రంథమున స్పష్టముగ చెప్పబడినది. ఈ రెండాచమనము లును సంధ్యావందనాంగములు కావు. కాన వివరింప నక్కఱలేదు.

ఆపస్తంబులవారు స్మార్తాచమనమును చెప్పిరి.

ఎట్లనగా— "అథాచమనవిధిః = ఇప్పుడాచమన విధానము చెప్పబడుచున్నది. ఆసీనస్త్రిరాచామేత్, హృదయంగమాభిరద్భిః = ఇచట చెప్పని కొన్నియంశములను వేరు స్మృతినుండి తీసికొనవచ్చును. అది ధర్మశాస్త్రసంప్రదాయము—"అనుక్తమన్యతో గ్రాహ్యం" అని. కాగా—శుచియైన ప్రదేశమున, ఆసనమున గాదు, కుడిచేతిని (రెండుచేతులనని కొందరు) రెండు కాలిముడుకుల మధ్య నుంచుకొని, తూర్పుముఖముగ గాని, ఉత్తరాభిముఖముగ గాని కూర్చున్నవాడై, గోకర్ణాకృతిగల అరచేతియందు, ఉద్ధరిణితో నీటిని వేసికొని, చిటికెన వ్రేలు, బొటనవ్రేళ్ళను దూరము చేయగ, ఆ సందులగుండా కారిపోగ మిగిలిన యుదకమును నురగ-బుడగలు లేకుండ చూచి, త్రాగినప్పు డెల్ల లోపల హృదయమువరకు నీటిని వెళ్లనిచ్చుచు, మూడు సారులు నీటిని త్రాగవలెను. బ్రాహ్మణుడిట్లు చేయవలెను. క్షత్రి యులకు కంఠమువరకు వెళ్లిన చాలును. వైశ్యులకు దవడలవరకు వెళ్లిన చాలును. శూద్రులకు నాలుకకు తగిలిన చాలును. కాని శూద్రులకు ఒక్కసారియేచాలును. మూడుసారులు కాదు. "త్రిరోష్ఠౌ పరిమృజేత్ = మూడు సారులు పెదవులను తుడవవలెను. ఎట్లు? బ్రహ్మతీర్థముతో. (మణికట్టు దగ్గర ధనరేఖ యారంభించు చోటు బ్రహ్మతీర్థము) అప్పుడు పెదవులను కొంచెము లోపలికి ముడిచి, పెదవుల దగ్గర రోమములు గల ప్రదేశమును తుడవవలెను. రోమములు లేని పెదవులను తాకినయెడల ఎంగిలి యగును. మరల నాచమనము చేసిననే శుద్ధుడగును.

"ద్విరిత్యేకే" = రెండుసారులు తుడిచిన చాలునని కొంద రందురు. ఈ వికల్పము సమానబలము కలదియే. ఇందు ఒకపక్షము ఎక్కువ, రెండవ పక్షము తక్కువ యని లేదు.

"సకృదుపస్పృశేత్ = వ్యాఖ్యా = మధ్యమాభిస్త్రిభిరంగుళీభి రోష్ఠౌ=మధ్యనున్న మూడు వ్రేళ్ల కొసలతో, కొంచెము లోపలికి ముడిచిన పెదవులను ఒకసారి తుడవవలెను. "ద్విరిత్యేకే" రెండు సార్లు తుడవవలెనని కొందరందురు. ఇదియును తుల్యవికల్పమే. "దక్షిణేన పాణినా సవ్యం పాణిం ప్రోక్ష్య=కుడిచేతితో నెడమచేతిని ప్రోక్షింపవలెను. తథా పాదౌ, శిరశ్చేంద్రియాణ్యుపస్పృశేత్ = అట్లే పాదములనున్ను, శిరస్సునున్ను ప్రోక్షింపవలెను. తర్వాత నింద్రియములను వ్రేళ్ళతో తాకవలెను. అన్ని యింద్రియములను తాకవలెనా? కాదు. "చక్షుషీ నాసికే, శ్రోత్రే చ=కండ్లను, ముక్కుచెరమలను, చెవులను మాత్రము తాకవలెను. అందు అంగుష్ఠానామికల కొసలను చేర్చిన ముద్రతో ముందుగ కుడికంటెని, తర్వాత నెడమకంటెని తాకవలెను. అంగుష్ఠతర్జనీసంయోగముద్రతో ముక్కుచెరములను, అంగుష్ఠకనిష్ఠికాసంయోగముద్రతో రెండు చెవులను తాకవలెను. రెండు వ్రేళ్లకొసలతో నైనను, రెండు చెవులను ఒక్కసారి తాకుట శక్యము కాదు గాన, మూడింద్రియములను రెండు వ్రేళ్లకొసలు చేర్చిన ముద్రలతోనే ప్రత్యేకముగ ముందు కుడి, తర్వాత నెడమను తాకవలెను. "అథాప ఉపస్పృశేత్ = ఇంద్రియస్పర్శ మైన తర్వాత, చేతులను కడుగుకొనవలెను. ఇది స్మార్తాచమనము. స్మృత్యాచమనమనియు నందురు. సమస్తస్మార్తకర్మలయందును ఈ యాచమనమునే చేయవలెను. కేశవాదిపౌరాణికాచమనమును కాదు. పౌరాణికమును కర్మాది యందు మాత్రము శుచిత్వము కొరకు చేయవలెను. కాని వర్తమానకాలమున ఆచమనము చేయవలసిన చోటుల యందంతటను పౌరాణికాచమనమునే చేయుచున్నారు. చాలమందికి స్మార్తాచమనము తెలియదు.

స్మృతిముక్తాఫలమునం దిట్లున్నది.

"సంధ్యాయాం కర్మకాలే చ స్మృతేరాచమనం చరేత్।
బ్రహ్మయజ్ఞే తు వై కుర్యాచ్ఛ్రుతేరాచమనం ద్విజః॥ అని.

సంధ్యావందనమునందును, ఇతరసమస్తస్మార్తకర్మలయందును స్మార్తాచమనమునే చేయవలెను. బ్రహ్మయజ్ఞమున శ్రౌతాచమనమును చేయవలెను. అని. ఈ స్మార్తాచమనమును సంధ్యావందనారంభమునందు రెండుసారులు చేయవలెను. పరాశరమాధవీయమున నిట్లు చెప్పబడినది. "హోమే భోజనకాలే చ సంధ్యయో రుభయోరపి। ఆచాంతః పునరాచామేత్" = అని.

హోమారంభమునను, భోజనారంభమునను, సంధ్యావందనారంభమునను రెండు సారులు స్మార్తాచమనమును చేయవలెను. అని.

ఆశ్వలాయనగృహ్యపరిశిష్టమున సంధ్యారంభప్రకరణమున "ఏతదాచమనం. ఏవం ద్విరాచమ్యాత్మానమభ్యుక్ష్య" అని. ఇది స్మార్తాచమనము. దీనిని రెండుసారులు చేసి, తర్వాత మార్జనమను సంధ్యాప్రథమాంగము నాచరింపవలెను. అని.

## పురాణాచమననిరూపణము

పురాణాచమనమును కేశవాదిచతుర్వింశతినామములతో గాని, అచ్యుతాదినామములతో గాని, వేదములనామములతో గాని, మహావ్యాహృతులతో గాని, ప్రణవాది చతుర్థ్యంతస్వాహాంతములుగ దేశాచారము ననుసరించి చేయవలెను.

ప్రయోగసారమను గ్రంథమున పౌరాణికాచమనపద్ధతి చెప్పబడినది. దీని నాంధ్రదేశీయు లాచరింతురు. కాన వ్రాయుచున్నాను. "కేశవాద్యైస్త్రిభిః పీత్వా ద్వాభ్యాం ప్రక్షాళయేత్కరౌ। ద్వాభ్యామోష్ఠౌ చ సంమార్జ్య ద్వాభ్యామున్మార్జయేచ్ఛిరః॥ ఏకేన వామం సంప్రోక్ష్య పాదావపి తథైకతః। ఏకేనాపి చ మూర్ధానం తతః సంకర్షణాదిభిః॥ సర్వేషామంగులీనాం తు మూలేన చుబుకం స్పృశేత్। తర్జన్యంగుష్ఠయోగేన ఘ్రాణద్వయముపస్పృశేత్॥ అంగుష్ఠేన కనిష్ఠేన నాభిదేశముపస్పృశేత్। కరమధ్యం హృది స్థాప్య కరాగ్రం శిరసి న్యసేత్॥ ముకుళేన చ హస్తేన బాహుమూలే ఉపస్పృశేత్। ఏవమాచమనం కుర్యాత్సాక్షాన్నారాయణో భవేత్ ॥ఇతి॥

## స్మృత్యంతరే

ఓంకారపూర్వం తన్నామ చతుర్థ్యంతతిసంఖ్యయా। స్వాహాంతం ప్రాశయేద్వారి నమోఽంతం స్పర్శయేత్తథా॥ పుణ్యస్త్రీణాం నమోఽంతం స్యాత్, విధవానా మమంత్రకం। విప్రాణాం క్షత్రియాణాం చ ప్రణవాదినమోఽంతకమ్॥ నమోఽంతకం చ వైశ్యానాం శూద్రాణాం నామమాత్రకమ్॥ అని.

ఇరువదినాలుగు నామములకును ఆరంభమున ఓంకారముండవలెను. మొదటి మూడు నామములతో చతుర్థ్యంత స్వాహాంతముగా నీరు త్రాగవలెను. మిగిలిన ఇరువదియొక్క నామములతో చతుర్థ్యంత నమోఽంతములతో, చెప్పినట్లు మార్జనను గాని స్పర్శను గాని చేయవలెను. ఇది బ్రాహ్మణులకు, క్షత్రియులకును సమానము. పుణ్యస్త్రీలు ఆరంభమున ఓంకారము లేకుండ కేవలచతుర్థ్యంతనమోంతములతోనే నీళ్లు త్రాగవలెను. మార్జనస్పర్శములు లేవు. అన్ని నామములను చతుర్థ్యంత నమోఽంతములనుగా చెప్పవలెను. విధవ, కేశవ, నారాయణ, మాధవ, యని నామమాత్రమును చెప్పుచు నీరు త్రాగవలెను. ఇతరనామములను నామమాత్రముగనే "గోవింద, విష్ణో, మధుసూదన, ఇత్యాదిగా చెప్పవలెను. వైశ్యులు పుణ్యస్త్రీలవలెనే ఆచమనము చేయుదురు. శూద్రులు నామమాత్రముతో నీళ్లు త్రాగుట మాత్రమే. ఇతరనామములు చెప్పనవసరము లేదు. ఇది వ్యవస్థ॥

ఓంకారాది చతుర్థ్యంత స్వాహాంతముగా తొలిమూడు నామములతో నీటిని త్రాగవలెను. నాలుగైదు నామములతో చేతులు కడుగుకొనవలెను. ఆరేడు నామములతో మధ్య మూడువ్రేళ్ళతో లోపలకు ముడుచుకొనిన పెదవులను తుడవవలెను. ఎనిమిదితొమ్మిది నామములతో తలమీద నీళ్లు చల్లుకొనవలెను. పదియవ నామముతో ఎడమచేతిని ప్రోక్షింపవలెను. పదునొకండవ నామముతో పాదములను ప్రోక్షింపవలెను. పండ్రెండవ నామముతో మరల

శిరస్సున ప్రోక్షింపవలెను. తర్వాత సంకర్షణనామముతో ఎల్ల వ్రేళ్ళ మొదళ్ళచేత గడ్డమును తాకవలెను. వాసుదేవ-ప్రద్యుమ్న నామములతో అంగుష్ఠతర్జనుల కొనలను కలిపిన ముద్రతో రెండు ముక్కు-చెరమలను విడివిడిగా తాకవలెను. ముందు కుడి తర్వాత నెడమ. అనిరుద్ధ-పురుషోత్తమనామములచే అంగుష్ఠానామికల కొనల ముద్రతో కండ్లను విడివిడిగా తాకవలెను. అధోక్షజ-నారసింహ నామములతో పై ముద్రతోనే రెండు చెవులను తాకవలెను. అచ్యుత నామముతో నంగుష్ఠకనిష్ఠికల ముద్రతో నాభిని తాకవలెను. జనార్దననామముతో నరచేతిని హృదయమున నుంచునది. ఉపేంద్ర నామముతో వ్రేళ్ళ చివరి భాగములను తలమీద నుంచునది. హరి-శ్రీకృష్ణనామములతో వ్రేళ్ళను మొగ్గవలె నొక్కటిగా చేర్చి బాహుమూలములను తాకునది. ఇట్లిరువదినాలుగు నామములతో నాచమనము చేసిన సాక్షాన్నారాయణస్వరూపు డగును.

ఇట్లు త్రివిధాచమనములును నిరూపింపబడినవి. ఇక నాచమన విషయమున నవశ్యము తెలిసికొనదగిన అంశములు తెలుపబడును. ఆపస్తంబులవారు="తిష్ఠన్నాచామేత్ ప్రహ్వో వా" నిలబడి గాని, వంగి గాని యాచమింపగూడదు. అని. ఈ నిషేధముచేతనే ఒకా నొక సందర్భమున నిలిచియున్నవానికిని వంగి యున్నవానికిని ఆచమ నము అనుమతింపబడిన దగును. ఎట్లనగా-"నీళ్లు నేలమీద నుండగా (పాత్ర లేనప్పుడు) ఒడ్డున కూర్చొనుటకు వీలు లేనప్పుడు, తొడ బంటి నీటిలో గాని, బొడ్డుబంటి నీటిలో గాని, నిలబడి యాచమనము చేయవచ్చునని. స్మృతిరత్నమహోదధియందు = జానుభ్యామూర్ధ్వ మాచమ్య జలే తిష్ఠన్న దుష్యతి। తస్మాదధస్తాత్తిష్ఠంశ్చ నాచామేత్తు విచక్షణః॥ ముడుకులు మునిగిపోవు నీటియందు నిలబడి యాచ మించిన దోషము లేదు. కాన బుద్ధిమంతుడు అంతకంటె తక్కువ లోతు గల నీటియందు నిలువబడి యాచమింపగూడదు. అని. పితామహస్మృతి = "అంతరుదకమాచాంతోఽంతః శుద్ధ్యతి। బహి

రుదకమాచాంతో బహిరేవ శుధ్యతి । తస్మాదంతరేకం బహిరేకం కృత్వా పాదమాచామేత్ । సర్వతః శుద్ధో భవతి॥

నీటిలో నుండి యాచమించిన నీటిలోనే శుద్ధుడగును. వెలుపల నుండి యాచమించిన వెలుపలనే శుద్ధుడగును. కాన నీటిలో నొక పాదమును వెలుపల నొకపాదము నుంచి, యెడమచేతితో నీటిని తాకుచు, కుడిచేతితో నాచమించిన యెడల అంతట శుద్ధుడగును.

## వస్త్రవిషయము

హారీతస్మృతి=“ఆర్ద్రవాసా జలే కుర్యా త్తర్పణాచమనే జపం। శుష్కవాసాః స్థలే కుర్యా త్తర్పణాచమనే జపమ్॥ తడిబట్ట కట్టుకొనిన వాడు తర్పణా-చమన-జపములను, నీటిలోనే చేయవలెను. పొడి బట్ట కట్టుకొన్న యాతడు, పై వాటిని గట్టుననే చేయవలెను. అని.

ఇది సామాన్యవిధి. ఒకప్పుడు విశేషవిధి యుండవచ్చును. ఎట్లనగా—విష్ణుస్మృతి “జానుభ్యాముపరిష్టాత్తు శుష్కవాసాః స్థితో జలే । సవ్యేనాచమనం కుర్వన్న దుష్యతి కదాచన॥ ఇతి॥ ముడుకుల బంటి జలముకంటె నెక్కువ లోతు గల జలములో పొడిబట్ట కట్టుకొన్న యాతడు నిలబడి ఆచమనమును చేసినను తప్పు కాదు. వేరొక స్మృతియందు=తడిబట్టతో జపమును హోమమును దానమునున్నా చేసిన నది రాక్షసప్రీతికరమగును. కాలి ముడుకులకు వెలుపల చేతుల నుంచి, యే కర్మ చేసినను నది రాక్షసప్రీతికరమగును. గౌతములు= “సప్తవాతాహతం వస్త్రం శుష్కమిత్యాహ గౌతమః । సద్యః ప్రక్షాళితం చేలమభావే శుష్కవాససః॥పొడిబట్టలేని యెడల, అప్పటి కప్పుడు తడిపిన వస్త్రమును గాలిలో నేడు సారు లెగురవేసిన యెడల, తడిదైనను దానిని పొడి బట్టగానే వాడవచ్చుననియును, దానిని గట్టుకొని, భూమిమీద గూడ జపహోమాదులు చేయవచ్చుననియును గౌతమమహర్షి చెప్పుచున్నారు.

స్మృత్యంతరమున=

"వ్రతాదికే నార్ద్రవాసా ఆచామేన్నైకవాససా।
న జీర్ణేన న నీలేన పరిప్లుష్టేన నో జపేత్॥ ఇతి॥

తడిబట్టతో వ్రతాదులను చేయగూడదు. తడిబట్టతో ఆచమింపగూడదు. చినిగినట్టియు, నల్లనిదైనట్టియు, కాలినట్టి వస్త్రముతో ఆచమింపగూడదు. వ్రతాదులు చేయగూడదు.

స్మృత్యంతరమున=

నోత్తరీయమధః కుర్యాన్నోపర్యాధస్థ్యమంబరం।
నాంతర్వాసో వినా జాతు నివసేద్వసనం ద్విజః॥
అంతరాచ్ఛాద్య కౌపీనం వాససీ పరిధాపయేత్।
ఉత్తరీయం సదా దధ్యాత్తద్వినా నాచరేత్క్రియాః॥
నార్ద్రమేకం చ వసనం పరిదధ్యాత్కథంచన।
సవ్యాదంసాత్పరిభ్రష్ట కటిదేశ ధృతాంబరః॥
ఏకవస్త్రం తు తం విద్యాద్దైవే పిత్ర్యే చ వర్జయేత్।
ఏకకచ్ఛో ద్వికచ్ఛశ్చ ముక్తకచ్ఛస్తథైవ చ॥
ఏకవాసా అవాసాశ్చ నగ్నః పంచవిధః స్మృతః॥ ఇతి॥

ఉత్తరీయమును దోవతిగ కట్టరాదు. కట్టుకొను పంచను త్తరీయముగ వాడరాదు. లోపల నొక చిన్నవస్త్రము లేనిది పంచ కట్టగూడదు. లోపల కౌపీనమును ధరించి పైన వస్త్రమును ధరింపవలెను. ఉత్తరీయమును ఎల్లప్పుడు (జందెమువలె) ధరించియే యుండవలెను. ఉత్తరీయము లేనిది ఏ కర్మను చేయరాదు. ఎడమ భుజము మీద వస్త్రము లేకుండ మొలకు వస్త్రము ధరించినవాడు, ఏకవస్త్రు డనబడును. అట్టి యేకవస్త్రము దైవపిత్రుకార్యములందు పనికిరాదు. ఒక్క దోపుతో దోవతి కట్టినవాడు, రెండు దోపులతో దోవతిని కట్టినవాడు, దోవతి దోపు జారినవాడు, ఒక్క

ద్రోవతిని కట్టినవాడును, వస్త్రము కట్టనివాడును, అని దిగంబరుడు ఐదు విధములు. అనగా పై యైదుగురును దిగంబరులని యర్థము. దిగంబరు డే కర్మను చేయ ననర్హుడు. అని.

## వస్త్రధారణ మంత్రము

"పరిధాస్యై, యశోధాస్యై, దీర్ఘాయుత్వాయ, జరదష్టిరస్మి।
శతం జీవామి శరదః పురూచీ, రాయస్పోష,మభిసంవ్యయిష్యే॥

## ఉత్తరీయధారణ మంత్రము

"యశసా మా ద్యావాపృథివీ, యశసేంద్రబృహస్పతీ।
యశో భగశ్చ మా విందద్యశో మా, ప్రతిపద్యతామ్॥ అని.
"రేతోమూత్రపురీషాదిస్పర్శేఽపి చావికం శుచి॥

రేతస్సు, మూత్రము, మలము వీటి స్పర్శ కలిగినను దావణి మడియే.

"భూమిగతాస్వప్స్వాచమ్య ప్రయతో భవతి" భూమి మీద నున్న జలముల నాచమనము చేసిన శుద్ధుడగును." అని ఆపస్తంబులవారు చెప్పినట్లు, భూమి మీదనున్న (నదీతటాకాదులందలి) జలమును స్వయముగ నాచమనము చేసి శుద్ధుడు కావలెను. అట్లు వీలుకాని చో "ప్రయతేనాన్యేనాత్మాన మాచామయేత్" శుద్ధుడైన మరియొక బ్రాహ్మణునిచేత నాచమనము చేయింపబడవలెను. అదియును వీలు కాని యెడల, నా విప్రునకు బదులుగ ఉద్ధరిణిని వాడవలయును. ఇది యుద్ధరిణి రహస్యమని పెద్దలు చెప్పుదురు.

స్మృత్యంతరమున =

"ఆచామేన్నాసనస్థాంఘ్రిర్న బద్ధాసన ఏవ వా।న ప్రసారిత పాదో వా బహిర్జానుకరోఽపి వా॥ "పవిత్రకర ఆచామేచ్ఛుచిః కర్మార్థమాదరాత్। కుశమాత్రకరో వాపి దర్భమాత్రకరోఽపి వా॥

అంగుష్ఠాగ్రం సమాకుంచేత్ మధ్యమామధ్యపర్వణి। గోకర్ణం తద్ధి విజ్ఞేయం సర్వేష్వాచమనేష్విహ॥

ఆసనము మీాద పాదములు పెట్టుకొని గాని, బాసికము పట్టు వేసికొని గాని, పాదములు చాచుకొని గాని, మోకాళ్ళకు వెలుపల చేతులు పెట్టుకొని గాని, ఆచమింపగూడదు. పాదములు రెండింటిని నేలమీాద పెట్టి యాచమింపవలెను. చేతికి బంగారుపవిత్రము పెట్టుకొనినవాడై, లేక కుశలు గాని, దర్భలు కాని, పవిత్రముగ పెట్టుకొనినవాడై, శుచియైనవాడై, కర్మ చేయుటకొరకు ఆదరముతో నాచమింపవలెను.

## గోకర్ణహస్తలక్షణము

బొటనవ్రేలికొనను నడిమివ్రేలు నడిమి కనుపుదగ్గరకు వంచియుంచవలెను. అదియే యన్ని విధములైన యాచమనములకును గోకర్ణహస్తమని తెలియవలెను.

"ఆచమనము చేయురీతి" స్మృతిముక్తాఫలము. "సంహతాంగులిహస్తేన గృహీత్వా చాంబు వీక్షితం। ముక్తాంగుష్ఠకనిష్ఠేన శేషేణాచమనం చరేత్॥ ఇతి॥

చేతి నాలుగు వ్రేళ్ళను దగ్గరగా కలిపి నిలువుగా నుంచి, బొటనవ్రేలి కొనను నడిమివ్రేలు నడిమి గనుపు దగ్గరకు వంచి, అట్టి గోకర్ణహస్తమున జలము నుద్ధరిణితో గ్రహించి ధూళిధూసరములు లేకుండ చూచి, తర్వాత అంగుష్ఠకనిష్ఠికలను వేరు చేయవలెను. అట్లు చేయగా నా సందులనుండి కొంచెము జలము కారిపోవును. కారగా మిగిలిన జలము నాచమింపవలెను.

కొంతమంది =

"గోకర్ణాకృతిహస్తేన మాషమాత్రం జలం పిబేత్।తన్న్యూనమధికం వాపి సురాపానసమం భవేత్॥ గోకర్ణాకృతి హస్తముతో

జలమును గ్రహించి, మినపగింజ మునుగుట కుండవలసినంత జలము నుగా చేసి. దాని నాచమింపవలెను. మినపగింజకొలతకంటె నెక్కువ యున్నను, తక్కువ యున్నను ఆ జలపానము కల్లుత్రాగుటతో సమానమగును. అంత పాపమును బొందునని భావము. అని యాచమనపు జలము కొలత చెప్పుదురు. కాని ఆ పద్ధతిలో మహా కష్టము లుండుటచేత నది విడువదగినదే. ఎట్లన—చేతిలోని జలము మినపగింజ కొలత గలదియా? కాదా? యని ప్రతియొక్కసారియును ఎవరూహించి, నిర్ణయింపగలరు? ఎవ్వరు, నిర్ణయింప లేరు. పైపెచ్చు—అది తక్కువ యున్నను, ఎక్కువ యున్నను కల్లు త్రాగిన పాపము కలుగును. ఆహా! ఈ పద్ధతివలన నెంతకష్టము కలుగుచున్నది? ఈ పద్ధతి అననుష్ఠాపకత్వ (మెవ్వరికిని చేయ శక్యము గాకపోవుట యను) దోషముతో కూడియుండుటవలన అప్రమాణ మగుచున్నది.

మొదటి పద్ధతియందు ఏ పాపము ఏ కష్టము నుండదు. కాన నాపద్ధతియే ఆశ్రయణీయము. శిష్టాచారము గూడ నదియే.

ఇంకను—ఆశ్వలాయన గృహ్యాపరిశిష్టమున ద్వితీయఖండమందు గూడ నీపద్ధతియే గ్రహింపబడినది.

ఎట్లనగా=

“శుచౌ దేశే భూమిష్ఠపాదః, అనపాశ్రితః ఉపవిష్టః శిఖాం బద్ధ్వా ఆచామేత్ ।ప్రకృతిస్థం, అఫేనబుద్బుదం ఉదకమీక్షితం,దక్షిణేన పాణినాఽఽదాయ, కనిష్ఠాంగుష్ఠౌ విశ్లిష్టౌ వితత్య, తిస్ర ఇతరాంగుళీః సంహతోర్ధ్వాః కృత్వా, బ్రాహ్మేణ తీర్థేన హృదయప్రాపి త్రిః పిబేత్॥ అని. అనగా—శుద్ధమైన చోటున పాదములను భూమిమీద నుంచి, దేనికిని చేరబడక కూర్చున్నవాడై శిఖను ముడివేసికొని, స్వభావమందున్న (వేడిచేయబడనిది, ఏ రుచులును కలుపనిది) నురగ బుడగలు లేని, ధూళి లేనిదిగా చూడబడిన జల

మును గోకర్ణాకృతిగల కుడిచేతితో తీసికొని, కనిష్ఠాంగుష్ఠములను విడదీసి, దూరముగ చేసి మిగిలిన మధ్యాంగుళులను చేర్చి నిలువుగ నుంచి, నిలిపి కనిష్ఠాంగుష్ఠాంగుళుల సందులగుండా కారిపోగా మిగిలిన జలమును, బ్రహ్మతీర్థముతో ఒక్కొక్కసారి త్రాగిన నీరు, గొంతుక దిగి హృదయమువరకు వెళ్ళిన తర్వాతనే మరల త్రాగునట్లు మూడు సారులు త్రాగవలెను. అని. ఇచ్చట ఆచమనము చేయుపద్ధతి (తొలుత వ్రాసిన పద్ధతివంటిదే) కరతలామలకము వలె స్పష్టముగ వర్ణింపబడినది. కాన నిదియే యనుసరింప తగినది.

మనుస్మృతిలో విశేషము—

"అనుష్ణాభిరఫేనాభిః పూతాభిర్వస్త్రచక్షుషా। హృద్గతాభిరశబ్దాభిరద్భిరాచమనం చరేత్" వేడి చేయబడనట్టియు, నురగలేనట్టియు, వస్త్రముచే వడగట్టి ధూళి లేకుండ చూడబడినట్టియు, హృదయము వరకును పోవునట్టి జలములతో, శబ్దము కలుగకుండ నాచమనము చేయవలెను అని. వేడి చేయబడని నీరు స్వస్థులకు. "ఉష్ణాభిశ్చ కారణాత్" జ్వరము మొదలగు కారణములున్నయెడల వేడినీటితో నాచమింపవలెనని ఆపస్తంబులవారు చెప్పినారు. కాని మార్జనము అర్ఘ్యప్రక్షేపము మొదలగు కర్మలను చల్లని స్వాభావికజలములతోనే జేయవలెను. కడుపులోనికి వెళ్ళవలసిన జలము వేడిగ నుండవలెను.

స్మృతిముక్తాఫలమునందు—

యః క్రియాః క్రియతే మోహాదనాచమ్యైవ నాస్తికః।భవంతి హి క్రియాస్తస్య వృథా సర్వా న సంశయః॥ ప్రత్యఙ్ముఖశ్చేదాచామేత్పునః స్నానేన శుద్ధ్యతి॥ అని. ఆచమనము చేయకుండ చేసిన వైదికకర్మలన్నియును నిష్ప్రయోజనములగును. పడమర ముఖముగా గాని దక్షిణాభిముఖముగా గాని ఆచమించినయెడల మరల స్నానము చేసిననే గాని, శుద్ధుడు కానేరడు. అని.

"శిరః ప్రావృత్య కంఠం వా ముక్తకేశశిరోఽపి వా। వినా యజ్ఞోపవీతేన హ్యాచాంతోఽప్యశుచిర్భవేత్॥ తలను గాని కంఠమును గాని వస్త్రముచే కప్పికొని కాని, జుట్టును ముడివేయకుండ గాని జందెము లేకుండ గాని ఆచమించినను శుద్ధుడు కానేరడు. ధారాజలములతో సంధ్యావందనమున ఆచమనమార్జనాదులు చేయరాదు.

యమస్మృతి—

అపి వారి నఖైః స్పృష్ట్వా య ఆచామతి వై ద్విజః। సురాం పిబతి స వ్యక్తం యమస్య వచనం యథా॥ కాంస్యైరాయసపాత్రైశ్చ త్రపుసీసకపిత్తలైః। ఆచాంతః శతకృత్వోఽపి న శుద్ధ్యతి కదాచన॥ గోటితో తాకబడిన నీటి నాచమించిన కల్లు త్రాగుటతో సమానము. ఇంకను—ఇనుము, కంచు, తగరము, సీసము, ఇత్తడి, వీటితో చేసిన పాత్రలను ఆచమనమునకు వాడరాదు. వాటితో నూరు సారులాచమించినను శుద్ధుడు కానేరడు. కాగా వెండి, రాగి పాత్రలే శ్రేష్ఠమని భావము. స్మృత్యంతరమున కంచు ఇత్తడి పాత్రల నంగీకరించుట వలన వెండి రాగి పాత్రలు లేనపుడు కంచు ఇత్తడి పాత్రలను వాడవచ్చును. ఇనుము, సీసము, తగరపు పాత్రలను మాత్ర మెప్పుడును వాడనే రాదు. ఇనపపాత్రలను నిషేధించుటవలన ఈ కాలపు స్టైన్ లెస్ స్టీలు పాత్రలు నిషేధింపబడినట్లే. వాటిని వైదికకర్మలందు వాడకూడదు.

వసిష్ఠస్మృతి—

హోమే త్రికాలసంధ్యాసు, క్రియాసు పఠనే తథా। నైకవస్త్రః ప్రకుర్వీత ద్విజో వాచమనే జపే॥

హోమము త్రికాలసంధ్యోపాసనలు వేదపఠనము ఆచమనము జపము వీనిని ఏకవస్త్రము ధరించిన యాతడు (ఉత్తరీయము లేకుండ) చేయగూడదు.

## పవిత్ర విషయమున స్మృతిముక్తా ఫలము

పవిత్రకర ఆచామేత్ శుచిః కర్మార్థమాదరాత్।
కుశమాత్రకరో వాఽపి దర్భమాత్రకరోఽపి వా॥
జపహోమహరా హ్యేతే దైత్యా అవ్యక్తమూర్తయః।
పవిత్రకృతహస్తస్య విద్రవంతి దిశో దశ॥

రాక్షసులు అస్పష్టాకారములతో వచ్చి జపహోమములను చెడగొట్టుదురు. కాని చేతియందు పవిత్రము గల వానిని చూడగనే వారు పది దిక్కులకు పారిపోవుదురు. కాన బంగారముతో కాని వెండితో కాని, కుశదర్భలతో గాని చేసిన పవిత్రమును చేతికి ధరింపవలెను.

స్మృత్యంతరమున=''నాఽన్యోదకశేషేణాచామేత్। యద్యాచామేత్, భూమౌ కించిజ్జలం స్రావయిత్వా ఽఽచామేత్''ఇతరులు వాడగా మిగిలిన నీటితో అచమింపగూడదు. ఒకవేళ ఆచమింప వలసివచ్చిన యెడల. కొంచెము నీటిని వంపి, మిగిలిన దానితో ఆచమింపవచ్చును.

## యమస్మృతి

''ఆచ్ఛన్నదక్షిణాంసస్తు నాచామేత్తు కదాచన।

కుడిభుజము మీద నుత్తరీయమును గాని యంగవస్త్రమును గాని మరి యే యితరవస్త్రమును గాని యుంచుకొని యాచమింప గూడదు. కాన జందెము వలె వల్లెవాటుగ వేసికొనియే యాచమనము, భోజనము, జపము, ధ్యానము, హోమము, స్వాధ్యాయము, పూజ మొదలగువానిని చేయవలెను. ఇట్లు చేసినయెడల వస్త్రము ఏ పనియందు నడ్డు రాదు.

''అగ్నిరంగుష్ఠః. తస్మాత్తేనైవ సర్వాణి స్థానాని స్పృశేత్॥

చేతి బొటనవ్రేలు అగ్ని. కావున దానితోడనే యాచమన సమయమున అగ్నిస్థానములను స్పృశింపవలెను. అని. ఇది వెనుక జెప్పిన యాచమనస్పర్శలతో తుల్యమైన వికల్పము గలది. ఈ యాచారము ద్రావిడ (అరవ) దేశమున పూర్తిగ కనబడుచున్నది. ఆంధ్రదేశమునందు వెనుక జెప్పినట్లుగా ఇతరాంగుళులతో గూడిన బొటనవ్రేలితో స్పృశించుచున్నారు. చాలస్మృతులందట్లుండుటచేత.

ఇట్లాచమనవిషయమున చెప్పవలసిన విషయముల నన్నింటిని చెప్పినట్లు తలంచుచున్నాను.

## పుండ్రధారణము

పుండ్రమనగా ముఖ్యముగ నుదుట నుంచదగిన బొట్టు. దీని కంగముగ భుజములు, వక్షము, ఉదరము, మొదలగు నవయవముల మీద కూడ పుండ్రమును ధరింతురు.

వసిష్ఠస్మృతి=

ధృతోర్ధ్వపుండ్రదేహస్తు సంధ్యాకర్మ సమాచరేత్।
జపకాలే మృదా కుర్యాత్ సంధ్యాకాలే తు వారిణా॥
భస్మనా హోమకాలే తు చందనం సార్వకాలికం।
ఊర్ధ్వపుండ్రం మృదా కుర్యాత్తిర్యక్పుండ్రం తు భస్మనా॥
చందనేనోభయం కుర్యాదన్యథా త్వశుభం భవేత్॥

ఊర్ధ్వపుండ్రమును=నిలువు బొట్టును ధరించి సంధ్యావందనమును చేయవలెనని వసిష్ఠులవారు చెప్పుచున్నారు. ఏ యే పుండ్రముల నెప్పుడెప్పుడు ఎట్లెట్లు ధరింపవలెనో వివరించుచున్నారు. గాయత్రీ జపకాలమున మట్టితోను. సంధ్యోపాసనకాలమున నీటితోను, ప్రాతర్హోమకాలమున భస్మముతోను, అన్నికాలములందును చందనముతోను, పుండ్రమును ధరింపవలెను.

అందునను ఊర్ధ్వపుండ్రమును మట్టితోను, అడ్డబొట్టును భస్మముతోను, చందనముతో, రెండువిధములైన బొట్టుల నుంచ వచ్చును. వేరు విధముగా నుంచిన నశుభము కలుగును. కాగా— నిది యంతయు నేకవాక్యము చేయగ- పురాణాచమనానంతరము, ముందుగా నీటితో నిలువుబొట్టును బెట్టి, సంధ్యావందన మారంభించి, సంధ్యోపాసనాంతము చేసి, తదనంతరము గాయత్రీహృదయపరనము నకు ముందు, తులసిమట్టితోనో, గోపీచందనముతోనో ఊర్ధ్వ పుండ్రమును ధరించి, జపాది సంధ్యావందనమును ముగించి, హోమ మునకు ముందు, భస్మముతో నడ్డుబొట్టును పెట్టవలెనని శాస్త్రము చెప్పుచున్నది.

కాని యాచారమున పురాణాచమనము తర్వాతనే భస్మ ధారణము చేయబడుచున్నది. తర్వాత రెండు స్మార్తాచమనములు, ప్రాణాయామము, సంకల్పము చేయబడుచున్నది.

స్మృతులం దూర్ధ్వపుండ్రము బహువిధములుగ ప్రశంసింప బడుచున్నది. కాని, యాంధ్ర దేశమున నెచ్చటను నిలువుబొట్టు స్మార్తులందు కనబడుటలేదు. ద్రావిడ దేశమున పలు తావుల కన బడుచున్నది. దేశకులాచారము ప్రధానము.

## ధర్మప్రవృత్తి గ్రంథమున

మధ్యమానామికాంగుష్ఠైర్లలాటే చ త్రిపుండ్రకం।
నేత్రయుగ్మప్రమాణం తు, త్రిపుండ్రం ధారయేద్ద్విజః॥

ద్విజుడు మధ్యమానామికాంగుష్ఠములతో కనుబొమల చివరి వరకును నుదుటను త్రిపుండ్రమును ధరింపవలెను. అని. తొలుత బొటనవ్రేలితో కుడినుండి యెడమవైపునకు క్రింది రేఖను దిద్దవలెను. తర్వాత అనామికామధ్యమములతో దానిపైన రెండు రేఖలను దిద్దవలెను. అని.

## స్మృత్యంతరమున

అకారోఽనామికా ప్రోక్తా హ్యుకారో మధ్యమాంగుళిః।
మకార స్తర్జనీ తస్మాత్త్రిభిః కుర్యాత్త్రిపుండ్రకమ్॥

ఉంగరపు వ్రేలు అకారము. నడిమి వ్రేలు ఉకారము. చూపుడు వ్రేలు మకారము. ఇట్లు మూడు వ్రేళ్లును చేరిన అ+ఉ+మ్= ఓంకారమగును. కాన నీమూడు వ్రేళ్ళతో మూడు విభూతి రేఖలను ఒక్కసారియే నుదుటిమీద పెట్టవలెను. అని. ధర్మప్రవృత్తి స్మృత్యంతరములలోని ఈ రెండు పద్ధతులును సమానములే. ఎట్లు పెట్టుకొనినను పెట్టుకొనవచ్చును.

## స్మృత్యంతరమున

ఊర్ధ్వపుండ్రే త్రిపుండ్రం స్యాత్త్రిపుండ్రే నోర్ధ్వపుండ్రకం।
లౌకికం చందనాద్యం తు భస్మోపరి న ధారయేత్॥

నిలువుబొట్టు మీద నడ్డ బొట్టును పెట్టవచ్చును. కాని యడ్డ బొట్టు మీద నిలువు బొట్టును పెట్టకూడదు.

మంత్రములతో ధరించిన విభూతిమీద లౌకికమైన, మంత్రములు లేని గంధపుబొట్టును పెట్టకూడదు. నిలువుబొట్టును గాని, యడ్డబొట్టును గాని తమ కుటుంబాచారము ననుసరించి ధరింపవలెను.

## త్రిపుండ్రమును ధరించు పద్ధతి

హోమభస్మమును "సద్యోజాతం ప్రపద్యామి= ఇత్యాది పంచ బ్రహ్మమంత్రములతో చేతిలోనికి తీసికొని, "అగ్నిరితి భస్మ, వాయురితి భస్మ" అను మంత్రముచేత నాభస్మమును అభిమంత్రించి, "మానస్తోకే తనయే = ఇత్యాది మంత్రముచేత నీటితో రుద్ది, "త్ర్యంబకం, త్ర్యాయుషం = అను మంత్రములతో నుదురు, రెండు భుజములు, (8 చోటులందు) నాభి – శిరో – హృత్పార్శ్వములందు

(పంన్రెండు చోటులందు) మూడేసి మూడేసి రేఖలను ముందు చెప్పిన ఓంకారముద్రచేత, (తర్జనీమధ్యమానామికలచేత) పెట్ట వలెను. ఇది శాంభవవ్రతము. సర్వవేదములందును జెప్పబడినది. అని.

## పుండ్రధారణము సమాప్తము

భస్మధారణానంతరము సంధ్యోపాసనాంగముగ రెండు స్మార్తాచమనములను చేయవలెను. ఆచమనము తర్వాత, కర్మ చేయు స్థలమును ఆశ్రయించియున్న భూతములను, పిశాచములను, ఉచ్చాటన చేయవలెను. ఉచ్చాటన-అనగ, అచ్చటనుండి తొలగి పోవునట్లు చేయుట.

అట్లు ఉచ్చాటన చేయనియెడల, అవి కర్మకు అనేక విధము లగు విఘ్నములను చేయును. అందువలన, "ఉత్తిష్ఠంతు" మంత్రముచేత భూతోచ్చాటనమును చేయవలెను. తర్వాత—

## ప్రాణాయామము

వ్యాస : "దక్షిణే రేచకం కుర్యాద్వామేనాపూర్య చోదరం।
కుంభకేన జపం కుర్యాత్ప్రాణాయామస్స ఉచ్యతే" అని

ముందు లోపలి వాయువును కుడి ముక్కు- రంధ్రముగుండా వెలుపలికి త్రోసివేసి, తర్వాత ఎడమ ముక్కు- రంధ్రముగుండా, వెలుపలి గాలిని లోపలికి మెల్లగ పీల్చవలెను. దీనిని పూరక మందురు. తర్వాత, రెండు ముక్కు-రంధ్రములను, గట్టిగ, వ్రేళ్ళతో అదిమిపట్టి, లోపల గాలిని నిలుపవలెను. దీనిని కుంభకమందురు. ఈ కుంభకమునందు, ప్రాణాయామమంత్రమును, మూడు సారులు మనసున జపింపవలెను. తర్వాత లోపలి గాలిని కుడి ముక్కు- రంధ్రముగుండా మెల్లగా వెలుపలికి విడిచిపెట్టవలెను. దీనిని రేచక మందురు. ఇట్లు పూరక రేచక కుంభకములు మూడును చేరి, మంత్ర జపముతో, ప్రాణాయామమనబడును.

స్మృతులందు వైదికప్రాణాయామమునకు రేచకపూరక కుంభకములకు కాలనియమము చెప్పబడలేదు. కుంభకమునందు మంత్రమును మూడుసారులు జపింపవలెనని మాత్రము చెప్పబడినది. యోగశాస్త్రీయప్రాణాయామములకు కాలనియమమున్నది.

అమృతనాదోపనిషత్తునందు, మనుస్మృతియందును ప్రాణాయామమంత్రము సమముగా చెప్పబడెను. ఎట్లనగా—

"సవ్యాహృతిం సప్రణవాం గాయత్రీం శిరసా సహ।
త్రిః పఠేదాయతప్రాణః ప్రాణాయామస్స ఉచ్యతే" అని.

ముందు ప్రణవములతోగూడిన ఏడు వ్యాహృతుల తోడను; చివర శిరోమంత్రముతోను, ఆరంభమున ప్రణవముతో గూడిన, గాయత్రీమంత్రము ప్రాణాయామమంత్రమగును. ఈ మంత్రమున పది ఓంకారములుండును. ఈ మంత్రమునంతను కుంభకమునందు మనసున మూడుసారులు జపింపవలెను. ఇది యొక ప్రాణాయామమగును. తైత్తిరీయారణ్యకమున ఈ ప్రాణాయామమంత్రము చెప్పబడినది. ఎట్లనగా—

"ఓం భూః ఓం భువః ఓగ్ం సువః ఓం మహః ఓం జనః ఓం తపః ఓగ్ం సత్యం ఓం తత్సవితుర్వరేణ్యం, భర్గో దేవస్య ధీమహి, ధియో యో నః ప్రచోదయాత్. ఓమాపో జ్యోతీ రసోఽమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్" అని.

ఈ మంత్రమునందు అరువది యొక్క అక్షరములు కలవు. పెద్ద మంత్రము.

ఈ మంత్రమును కుంభకమునందు మనసున మూడు సారులు జపింపవలెను.

తైత్తిరీయారణ్యకమునందు ద్రావిడపాఠమునందు దశమ ప్రపాఠకమున ఇరువదియేడవ అనువాకమున ఈ పై ప్రాణాయామ మంత్రము చెప్పబడినది. ఈ పెద్ద మంత్రము తర్వాత, ఇరువదియొని

మిది ఇరువదితొమ్మిదవ అనువాకములుగ, ఇంతకంటె చాల చిన్నవి మరిరెండు ప్రాణాయామమంత్రములు చెప్పబడినవి. ఇవి ఆంధ్రపారమున లేవు. ఈ రెండింటిలో తొలి మంత్రమునందు ముప్పదియారక్షరములును, రెండవ దానియందు ఇరువదియారక్షర ములును గలవు. అందు మొదటి మంత్రముయొక్క అవతారికా భాష్యమునందు, "తస్మిన్నేవ ప్రాణాయామే వికల్పితం మంత్రాంతర మాహ" ఆ ప్రాణాయామమునకే ఆ మంత్రమునకు వికల్పముగ మరియొక మంత్రము చెప్పబడుచున్నది. అని వ్రాయబడినది. రెండవ మంత్రము నవతారికయందు, "పునరపి వికల్పితం మంత్రాంతర మాహ" మరలనున్నూ వికల్పముగ మరియొక మంత్రము చెప్పబడు చున్నది, అని. ఇంతియేగాక, ఈ మంత్రముల భాష్యముల చివర, "ప్రాణాయామే శక్తితారతమ్యమనుసృత్య వికల్పితం మంత్ర ద్వయ ముక్తమ్" ప్రాణాయామమును చేయువారి కందరకును శక్తి సమానముగ ఉండదు గదా! ఒకరు పై పెద్ద మంత్రమును కుంభక మున మూడు సారులు జపింప గలగ వచ్చును. మరి కొందరికి అంత శక్తి లేకపోవచ్చును. శక్తి లేనివారి గతి ఏమి? ప్రాణాయామమును విడువవలసినదేనా? కాదు. కాదు. శక్తి లేనివారికి గూడ, గతి కల్పింపబడుచున్నది. శక్తి లేనివారికి అంతకంటె తక్కువ అక్షర ములు గల చాల చిన్న మంత్రమును వేదమాత అనుగ్రహించినది. అంతకంటె ఇంకా తక్కువ శక్తిగల వారి కొఱకు, 26 అక్షరములు గల మరియు చిన్న మంత్రమును వేదమాత అనుగ్రహించినది. పై రెండు చిన్న మంత్రములును ఈ క్రింద వ్రాయబడుచున్నవి.

## ప్రాణాయామము కొరకు రెండవ చిన్న మంత్రము

"భూర్భువస్సువర్మహర్జన స్తపస్సత్యమ్. తద్బ్రహ్మ తదాప ఆపో జ్యోతీ రసోఽమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్" అని. 36 అక్షరములు.

## ప్రాణాయామము కొరకు మూడవ చిన్న మంత్రము

"ఓం తద్బ్రహ్మ, ఓం తద్వాయుః, ఓం తదాత్మా, ఓం తత్సత్యం, ఓం తత్సర్వం ఓం తత్పురోర్నమః" అని. ఇందు 26 అక్షరములు గలవు.

ఈ మూడు మంత్రములలో పెద్ద మంత్రమునకు ఎక్కువ పుణ్యము, చిన్న మంత్రమునకు తక్కువ పుణ్యము అనే భేదము ఏ మాత్రము లేదు. పుణ్యము విషయమున మూడును సమానమే. కాని కుంభకమును ఎక్కువ కాలము చేయు శక్తిని సంపాదించుటలో చిన్న మంత్రముల కంటె, పెద్ద మంత్రములకు ఎక్కువ ప్రాధాన్యము. అభ్యాసముచేత క్రమముగ పెద్ద మంత్రములతో ఎక్కువ కాలము కుంభకము చేయు శక్తి, అలవడును. కాని తొందర పడకూడదు. మెల్లగ, క్రమముగ, అభ్యసింపవలెను. తొందరపడిన ఆరోగ్యము చెడును.

ఈ విషయమును భారద్వాజులవారు స్పష్టముగ చెప్పుచున్నారు.

### భరద్వాజస్మృతి

"అశక్యః స్యాద్యది ప్రోక్తః, ప్రాణాయామో ద్విజన్మనః।
బాలస్య చేత రేషాం చ దశకృత్వో జపః స్మృతః॥
సప్తైవ వ్యాహృతీరేతాః కేవలా వా ద్విజో జపేత్" అని.

అనగా - బాలునకుగాని, వృద్ధునకుగాని ప్రాణాయామము కుంభకముతో చేయుటకు శక్యము కాదని చెప్పినయెడల, అట్టి ప్రాణాయామమునకు బదులు, ప్రాణాయామమంత్రమునే పది సారులు జపింపవలెను. ఇది రెండవ పక్షము. కాదు. పోదు. ఎట్లైన ప్రాణాయామమును చేయవలెను. అనే ఉత్సాహము, ఆసక్తి ఉన్న యెడల, వేదములో చెప్పబడిన, మూడవ మంత్రముకంటె కూడ, మిక్కిలి చిన్నదియగు నాల్గవ మంత్రమును, వేదముల అంతమును

కనుగొనుటకు ఐదువందల సంవత్సరములు ప్రయత్నించిన భరద్వాజ మహర్షి, అనుగ్రహించుచున్నారు. ఎట్లనగా- "కేవలమైన అనగా- ఓంకారముకూడ లేని, ఏడు వ్యాహృతులను మాత్రమునైనను, కుంభకమునందు మూడు సారులు జపించిన యెడల, అది ప్రాణాయామమగును. ఈ సప్తవ్యాహృతులు, ప్రాణాయామమంత్రమున ఆరంభమున ఉన్నవే.

## ప్రాణాయామమునకొఱకు నాలవ మంత్రము

(4) భూర్భువస్సువర్మహర్జనస్తపస్సత్యమ్॥ 13 అక్షరములు. ఇది పై మూడింటికంటె చాల చిన్న మంత్రము. దీనిని బాలవృద్ధులు గూడ కుంభకమున మూడు సారులు జపించుట సులభము. ఆహా! భారద్వాజులవారి కారుణ్యాతిశయము!

ఇంక—ద్రావిడపాఠములోని మంత్రములతో ఆంధ్రులు ఎట్లు ప్రాణాయామమును చేయుదురు? అని సందేహపడ నక్కఱ లేదు. వేదభాష్యకర్తలగు శ్రీ సర్వజ్ఞమాధవాచార్యులవారే ఆ మంత్రములకు కూడ భాష్యమును వ్రాసినారు. ఆ మంత్రములను వేదమాత ఎందులకు అనుగ్రహించినదో వివరించినారు. అశక్తుల కొఱకే ఆ మంత్రములని వివరించినారు. అట్టి అశక్తత ఆంధ్రులలో లేనియెడల ధన్యులే. భారద్వాజులవారు చిన్న మంత్రమును శక్తి లేనివారికే కదా వ్రాసినారు. ద్రావిడపాఠములోని రెండవ మూడవ మంత్రములను మనసున ఉంచుకొనియే భారద్వాజుల వారు, అంతకంటె చిన్న మంత్రమును అనుగ్రహించినారు. ఆపస్తంబులవారి ఆచమనసూత్రవ్యాఖ్యానమున హరదత్తాచార్యుల వారు "అనుక్తమన్యతో గ్రాహ్యం" ఒక స్మృతిలో చెప్పని విషయములను మరియొక స్మృతినుండి గ్రహింపవలెను" అని వ్రాసిరి. ఆ న్యాయమును అనుసరించియే శ్రీ సర్వజ్ఞమాధవాచార్యులవారు పై చిన్న ప్రాణాయామమంత్రములకు భాష్యమును వ్రాసినారు. కావున సంశయింప నక్కఱలేదు. తమ తమ శక్తి

ననుసరించి ద్రావిడపాఠములోని చిన్న మంత్రములను రెండింటిని ఉపయోగపఱచుకొని ద్విజులు కృతార్థు లగుదురు గాత!

నారదులవారు ప్రాణాయామపదమున కర్థమును, దాని భేదములను వివరించిరి.

"ప్రాణో వాయుశ్శరీరస్థ ఆయామ స్తస్య నిగ్రహః।
ప్రాణాయామ ఇతి ప్రోక్తో ద్వివిధః ప్రోచ్యతే హి సః॥
అగర్భశ్చ సగర్భశ్చ ద్వితీయస్తు తయోర్వరః।
అపి ధ్యానం వినాఽగర్భః సగర్భ స్తత్సమన్వితః॥ అని.

శరీరము నందున్న వాయువునకు ప్రాణమని పేరు. ఆయామ మనగా వాయువును లోపల స్తంభింపజేయుట. కాగా—శరీరము లోపల నున్న వాయువును లోపల స్తంభింపజేయుట ప్రాణాయామ మనబడును. ఇది అగర్భ మనియు, సగర్భ మనియును రెండు విధములు. రేచక పూరకకుంభకములు లేకుండ కేవల ప్రాణాయామ మంత్రమును పఠించుట మాత్రము అగర్భప్రాణాయామము. రేచక పూరకకుంభకములు గలిగి, కుంభకములో ప్రాణాయామమంత్ర జపమును చేసిన, అది సగర్భప్రాణాయామ మనబడును. అగర్భము వివాహోపనయనాదియాజ్ఞికకార్యములందు ప్రసిద్ధము. సంధ్యో పాసన-జపాదులందు, తాంత్రిక జపాదులందును, సగర్భమును జేయవలెను. అగర్భముకంటె సగర్భము శ్రేష్ఠము. ఎందువలన ననగా—అప్పుడే దానికి ప్రాణాయామ మను పేరు సార్థక మగును. ఇంకను, ఇంద్రియదోషములను నాశముచేసి, మనస్సునకు స్థిరత్వము నిచ్చును. మనుస్మృతి ఇట్లు చెప్పుచున్నది—

"దహ్యంతే ధ్మాయమానానాం ధాతూనాం హి యథా మలాః।
తథేంద్రియాణాం దహ్యంతే దోషాః ప్రాణస్య నిగ్రహాత్॥ ఇతి॥

బంగారు మొదలగు లోహములను బాగుగ కాల్చిన యెడల వాని యందలి మాలిన్యము కాల్చబడి, ఎట్లు పోవునో, అట్లే—

ప్రాణవాయువును కుంభించుటవలన ఇంద్రియదోషములు దహింపబడి, పోవును. అని.

కాగా—మనసులోని కుళ్లు పోగా- మనసు దుర్బలమై నిశ్చల మగును. యోగశాస్త్రమునందలి ప్రాణాయామమున, పూరకకుంభకరేచకములందు కొన్ని లెక్క లున్నవి. వైదిక ప్రాణాయామమున అవి లేవు. కాని, వాని వాని శక్త్యనుసారము పైన చెప్పబడిన నాలుగు మంత్రములలో నొక మంత్రమును అభ్యాసక్రమముచేత వశమైన దానిని మూడుసారులు జపింపవలెను. దీని నైనను అనుభవమున్న పెద్దలవద్ద తెలిసికొని చేయుట మంచిది. లేని యెడల శరీరమునకు హాని కలుగవచ్చును. ప్రస్తుతమున నాచరణలో నున్నట్లు, ప్రాణాయామమంత్రమును నొకసారి చెప్పి నంతమాత్రమున అది శాస్త్రీయ ప్రాణాయామము కానేరదు.

తొలు దొలుత సాంగోపాంగప్రధాన సంకల్పమునకు ముందు ఒక సగర్భప్రాణాయామమును జేయవలెను. సంకల్పమునకు ప్రాణాయామము అంగము గనుక.

## కూర్మపురాణమున

"ప్రాణాయామత్రయం కృత్వా ధ్యాయేత్సంధ్యామితి శ్రుతిః॥

మూడు ప్రాణాయామములను జేసి సంధ్యాదేవతను ధ్యానింపవలెను. అని శ్రుతి చెప్పుచున్నది. ఇట్లే అపరార్కమను గ్రంథమున.

ప్రాణాయామత్రయం కృత్వా సంధ్యోపాసన మాచరేత్॥

పై యర్థమే. కావున అర్ఘ్యప్రక్షేపణానంతరము ఆత్మప్రదక్షిణాచమనములను జేసి ఉపాసనా పూర్వాంగముగ మూడు సగర్భప్రాణాయామములను చేయవలెను.

## సంవర్త స్మృతి

"ప్రాణాయామైస్త్రిభిః పూతో గాయత్రీం తు జపేత్తతః॥

మూడు సగర్భప్రాణాయామములను జేసి శుద్ధ - నిశ్చల

మనస్కుడై గాయత్రీమంత్రజపమును జేయవలెను. అని. ఉపాసన మునకును, జపమునకును మనోనైశ్చల్య మావశ్యకము. గాన, రెండింటికిని ముందు మూడేసి ప్రాణాయామములు విధింపబడినవి.

విద్యారణ్యులవారు తమ యనుభూతిప్రకాశమున నిట్లు చెప్పిరి.

"ప్రాణాధీనా మనోవృత్తిః ప్రాణరోధేన శామ్యతి॥ అని.

మనసునందు వృత్తులు (భావములు) ప్రాణచలనము వలన కలుగును. అట్టి ప్రాణమును కుంభించిన యెడల మనసున వృత్తులు పుట్టకుండ నిలిచిపోవును. అందువలన మవసు నెమ్మదిగ నుండును. ధ్యాన జపములు చేయుటకు వీలుండును. చక్కగ సాగును. అని. సంధ్యావందనము మొత్తమునకు తొలు దొలుత చేయు సంకల్ప మొక్కటియే చాలును. అంతియ కాని అంగములకు ప్రత్యేకముగ సంకల్పము లక్కర లేదు. కాగా—సంకల్పమున కంగముగ నొక్క ప్రాణాయామమే. శ్రీకృష్ణ పండితులవారి మతమున అర్ఘ్యప్రక్షేప జపోపస్థానములు మూడును సమప్రధానములు గాన ప్రధాన సంక ల్పము కాక ఆ మూడింటికిని ప్రత్యేకముగ సంకల్పములు చేయబడు చున్నవి.

మన మతము ప్రకారము సంధ్యోపాసన మొక్కటియే ప్రధానము, అంగి యగుటచేత దానికి మాత్రమే సంకల్పము. ఇతర మైనవి యన్నియు అంగము లగుటచేత వానికి సంకల్పము లుండవు. శ్రీకృష్ణ పండితులవారి మతమున గూడ నంగములగు మార్జనా బ్భక్షణాదులకు సంకల్పము లేదు. కావున ప్రధానమైన దాని కొక్క దానికే సంకల్పము. అంగములగు అర్ఘ్యజపాదులకు గూడ సంకల్ప ముండవలెనని పట్టుదల యున్నయెడల అంగములగు మార్జనాబ్భక్ష ణాదులకు గూడ సంకల్పము చేయబడు గాక! అవి చేసిన యపరాధ మేమి? కావున నంగములకు సంకల్పముండదు. ఇట్లు సంధ్యావందన మున ఏడు ప్రాణాయామములు.

ఇట్లే ఆరంభమున శుద్ధికొరకు నొక పురాణాచమనము. కర్మాంగముగ రెండు స్మార్తాచమనములు. అభ్యుక్షణమున కుత్తరాంగములుగ రెండు స్మార్తాచమనములు. అర్ఘ్యప్రక్షేపమున కుత్తరాంగముగ నొక స్మృత్యాచమనము. చిట్టచివర నొక పురాణాచమనము. ఇట్లు రెండు పురాణాచమనములు, ఐదు స్మార్తాచమనములు వెరసి ఆచమనములు గూడ ఏడే.

## ప్రాణాయామముద్రవిషయమున స్మృతిముక్తాఫలము

"పంచాంగుళీభిర్నాసాగ్రపీడనం ప్రణవాభిధా।
ముద్రేయం సర్వపాపఘ్నీ వానప్రస్థగృహస్థయోః॥
కనిష్ఠానామికాంగుష్ఠైర్నాసాగ్రస్య చ పీడనం।
ఓంకారముద్రా సా ప్రోక్తా యతేశ్చ బ్రహ్మచారిణః॥

ఐదు వ్రేళ్ళతోను ముక్కును మూయు ముద్రకు "ప్రణవ ముద్ర" అని పేరు. ఈ ముద్రతో గృహస్థులును వానప్రస్థులును ప్రాణాయామములను చేయవలెను.

చిటికెనవ్రేలు ఉంగరపువ్రేలు బొటనవ్రేళ్ళతో ముక్కును మూయు ముద్రకు ఓంకారముద్ర యని పేరు. ఈ ముద్రతో బ్రహ్మచారులు సన్యాసులును ప్రాణాయామమును చేయవలెను. "అంగుష్ఠేన పుటం ధార్యం నాసాయా దక్షిణం ద్విజైః" బొటనవ్రేలితో ముక్కు కుడి చెరమను మూయవలెను. అని. ఈ రెండు ముద్రలును యజుర్వేదులకు చెప్పబడినవి.

"అంగుష్ఠతర్జనీభ్యాం తు ఋగ్వేదీ సామగాయనః।
అంగుష్ఠానామికాభ్యాం చ గ్రాహ్యం సర్వైరథర్వభిః॥

## స్మృతిముక్తాఫలము

ఋగ్వేదియు సామవేదియును బొటనవ్రేలు చూపుడు వ్రేళ్ళతో రెండింటితోనే ప్రాణాయామమును చేయవలెను. అథర్వ

వేదులు బొటనవ్రేలు ఉంగరపు వ్రేళ్ళతో రెండింటితోనే ప్రాణా యామమును చేయవలయును. మూడింటితో గాని యైదింటితో గాని కాదు. కాని వేదభేదముచేత ముద్రాభేద మున్నట్లు తెలియక పోవుటచేత ద్విజు లాయా ముద్రల విషయమున తికమకలు పడు చున్నారు ఎవరికి తోచినట్లు వారు చేయుచున్నారు. అని కూడ ననవచ్చును. ఈ ప్రమాణవచనముల దెలిసికొని తికమక పడ కుందురు గాక!

ఇట్లు వైదికప్రాణామము నిరూపింపబడినది.

# సంకల్పము

ప్రాణాయామము తర్వాత సంధ్యోపాసనసంకల్పము చేయ వలెను. ఈ సంకల్పము దేశాచారముననుసరించి వేరు వేరుగ నుండును. కొంతమంది నిత్యకర్మసంకల్పమున దేశకాలగోత్రనామా దులను చెప్పుదురు. కొందరు కామ్యనైమిత్తికములలోనే దేశకాలా దులను చెప్పవలెను. కాని, నిత్యకర్మలకు చెప్పనక్కర లేదని, నిత్య కర్మయగు సంధ్యావందనసంకల్పమున దేశకాలాదులను చెప్పక "మమోపాత్తదురితక్షయద్వారా (శ్రీ) పరమేశ్వరప్రీత్యర్థం ప్రాతః (మధ్యాహ్న-సాయం) సంధ్యాముపాసిష్యే" యని సంకల్పమును చెప్పుదురు. ఇదియే యుచితమని తోచెడిని. ఏలననగా-భారద్వాజు లిట్లు చెప్పినారు—

"తతస్సంకల్పయేత్రాప్వతస్సంధ్యోపాస్తిం కరోమ్యహం।
ఇతి స్వచేతస్స్మరణం యత్తత్సంకల్ప ఉచ్యతే॥ అని.

ప్రాణాయామానంతరము "ప్రాతస్సంధ్యాముపాసిష్యే" యని తన మనసున తలంచుకొనుటయే సంకల్పము" అని స్పష్టముగ సంకల్పముయొక్క ఆకారమును కనబరిచిరి. శౌనకకారికయందు కూడ—

"అథ సంధ్యాముపాసిష్యే ఇతి సంకల్ప్య మార్జయేత్॥ అని.

ప్రాణాయామానంతరము "సంధ్యాముపాసిష్యే" అని సంకల్పము చేసి, ప్రథమమార్జనమును చేయవలెను. అని—

## మదనపారిజాతమున సంవర్తులు

నత్వా తు పుండరీకాక్షముపాత్తాగః ప్రశాంతయే।
ప్రాతస్సంధ్యాముపాసిష్యే పరమేశ్వరప్రీతయే॥

అని, సంధ్యావందనారంభమున, తొలుదొలుత "అపవిత్రః పవిత్రో వా" అను శ్లోకమును పఠించి, ఆచమనప్రాణామామములను చేసిన తర్వాత "మమోపాత్తదురితక్షయద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం ప్రాతస్సంధ్యాముపాసిష్యే" అని సంకల్పించవలెనని వ్రాసిరి.

ఇట్లు బహుస్మృతులందు సంధ్యావందనసంకల్పమునందు దేశకాలాదిసంకీర్తనము కనబడదు. "సంకల్పే ఉల్లేఖశ్చ నైమిత్తికేషు. న నిత్యకర్మసు. నిత్యకర్మసు తిథ్యాదిసంకీర్తనస్య అనావశ్యకత్వాత్" సంకల్పమునందు తిథ్యాదులను అనగా దేశకాలగోత్రాదులను నైమిత్తికకర్మలందే చెప్పవలెను.

కాని నిత్యకర్మసంకల్పములందు కాదు. నిత్యకర్మసంకల్పములందు దేశకాలాదులను చెప్పుట అనావశ్యకమని బ్రహ్మశ్రీ పిడపర్తి కృష్ణమూర్తిశాస్త్రులవారు "క్షయమాసకర్తవ్యనిర్ణయమను తమ గ్రంథమున వ్రాసినారు. కాన నిత్యకర్మయగు సంధ్యావందనము యొక్క సంకల్పమున దేశకాలాదులను చెప్ప నక్కర లేదు.

సంకల్పము చేసిన తరువాత ఉద్ధరిణిలోని నీటిని చేతిలో వేసికొని, "ఉపాసిష్యే" యనుచు పళ్ళెరమున వదలవలెను. అని చెప్పుదురు. ఆంధ్రదేశమున ఉద్ధరిణిలోని నీటిని ఉంగరపువ్రేలికొనతో తాకుదురు.

## ప్రథమ మార్జనము

### గోభిలస్మృతి

"స్పృష్ట్వా చాభిష్టుతం తోయం, మూర్ధ్నా బ్రహ్మముఖేన చ।
ఆపోహిష్ఠాదిభిర్మంత్రైర్దర్భైశ్శిరసి మార్జయేత్॥ అని.

మనుస్మృతియందు బ్రహ్మముఖము నిరూపింపబడినది.

"ఓంకార పూర్వికాస్త్రిస్రో మహావ్యాహృతయోఽవ్యయాః।
త్రిపదా చైవ గాయత్రీ విజ్ఞేయం బ్రహ్మణో ముఖమ్॥

ఓంకారము, మూడుమహావ్యాహృతులు, మూడుపాదముల గాయత్రీమంత్రము, చేరిన (అనగ - మామూలుగ మనము జపము చేయు గాయత్రీమంత్రము) బ్రహ్మముఖ" మనబడును. ఇట్టి బ్రహ్మ ముఖముచేతను, గాయత్రీశిరోమంత్రముచేతను అభిమంత్రించిన జల మును ఆపోహిష్ఠాదిమంత్రముల జెప్పుచు, దర్భలతో శిరసున చల్లు కొనవలయును. మార్జనప్రకారమును వ్యాసులు చెప్పిరి.

"ఆపోహిష్ఠేత్యృచా కార్యం మార్జనం తు కుశోదకైః।
ప్రతిప్రణవసంయుక్తం క్షిపేద్వారి పదే పదే॥
వపుష్యష్టౌ క్షిపేదూర్ధ్వమధో యస్య క్షయాయ చ॥ అని."

ఆపోహిష్ఠాది మంత్రములు తొమ్మిది. మార్జనము చేయు నప్పుడు ఆ మంత్రముల కారంభమున ఓంకారమును చేర్చి ఒక్కొక్క మంత్రము పూర్తియైన తర్వాతనే దర్భలతో ఆ జల మును ఎనిమిది మంత్రములతో తలమీద చల్లుకొనవలెను. "ఓం యస్య క్షయాయ జిన్వథ" యను మంత్రముతో పాదముల మీదను చల్లుకొనవలెను. ఇట్టి సందర్భములలో నెల్లరకు నెల్లప్పుడును దర్భలు దొరుకుట కష్టము. కాన, దర్భముడి గల బంగారపుటుంగరమును గాని, దర్భముడిలేని బంగారపుటుంగరము నైనను ధరించిన ఆ ఫలము ప్రాప్తించునని శాస్త్రము చెప్పుచున్నది.

## శౌనకస్మృతి

"అష్టాక్షరం నవం పాదం పాదాంతే వారి చోత్సృజేత్।
అపదాంతే తు యద్వారి, తద్వారి రుధిరం భవేత్॥
స్పృష్ట్వా హస్తేన వామేన తటే నద్యాదికేషు చ।
పాణినా దక్షిణేనైవ మార్జయేత్సకుశేన తు॥
పాత్రస్థితోదకేనైవ వామహస్తోదకేన వా॥
గృహే తు మార్జనం కుర్యాన్నాన్యథేత్యబ్రవీన్మనుః॥

ఆపోహిష్ఠాదిమంత్రమున తొమ్మిది పాదములు గలవు. ఒక్కొక్క పాదమునను ఎనిమిదేసి యక్షరము లుండును. ప్రతి పాదారంభమునను ఓంకారమ్మును చేర్చవలెను. పాదము చివరను చల్లుకొనవలెను. పాదము పూర్తికాకుండ నీరు చల్లుకొనిన, ఆ నీరు రక్తముతో సమానమగును. నదులు, చెరువులందు చేయు నెడల, ఒడ్డున కూర్చొని, లేక తొడబంటినీటిలో నిలబడి ఎడమచేతితో నీటిని తాకుచు, కుడిచేతితో నీటిని చల్లుకొనవలెను. లేక, గృహమందు చేయునెడల, పాత్రలోని జలమును ఉద్ధరిణితో తీసి, ఆ యుద్ధరిణిలోని నీటిని చల్లుకొనవలెను. ఉద్ధరిణి లేనియెడల ఎడమచేతిలో నీరు నుంచుకొని దానిని దర్భలతో చల్లుకొనవలెను. దర్భలు లేనియెడల వ్రేళ్ళ కొనలతో చల్లుకొనవలెను. వేరు విధము లేదని మనువు చెప్పెను.

## హారీతస్మృతి

ఉత్తానదేవతీర్థేన దర్భాగ్రైర్మూర్ధ్ని విప్రుషాం।
స్పృష్ట్వాఽప ఊర్ధ్వవిక్షేప ఉల్లేఖ్యామితి సూరయః॥

వెల్లికిలగ నున్న అరచేతి వ్రేళ్ళ కొనలందు దర్భలుంచుకొని వానితో నీటిని స్పృశించి యా దర్భాగ్రముల కంటిన జలబిందువులను తలమీదను చల్లుకొనవలెను, దీనిని మార్జన మందురని పండితులు చెప్పుచున్నారు.

## బ్రహ్మాస్మృతి

మంత్రపూతం జలం యస్మాదాపోహిష్ఠాదిమంత్రితం।
పతత్యశుచి దేశేషు తస్మాత్తత్పరివర్జయేత్॥

బ్రహ్మముఖ – గాయత్రీశిరస్సులు, ఆపోహిష్ఠాదిమంత్రముల చేతను అభిమంత్రింపబడిన నీరు అశుచిప్రదేశములందు పడకుండ తల మీదను, పాదముల మీదను మాత్రము పడునట్లు జాగ్రత్తగ మార్జనము చేయవలెను.

పరాశరస్మృతిలో ఈ మార్జనము బ్రాహ్మస్నాన మనబడునని వ్రాయబడెను.

"స్నానాని పంచ పుణ్యాని కీర్తితాని మనీషిభిః।
ఆగ్నేయం వారుణం బ్రాహ్మం వాయవ్యం దివ్యమేవ చ॥
ఆగ్నేయం భస్మనా స్నానమవగాహం తు వారుణం।
ఆపోహిష్ఠేతి చ బ్రాహ్మం వాయవ్యం గోరజః స్మృతమ్॥
యత్తు సాతపవర్షేణ స్నానం తద్దివ్యముచ్యతే॥

మంత్రములతో భస్మను బడలికి పూసుకొనుట ఆగ్నేయ స్నానము. నీటిలో మునుగుట వారుణస్నానము. ఆపోహిష్ఠాదిమంత్రములతో మార్జనము బ్రాహ్మస్నానము. ప్రాతఃసాయంకాలములందు ఆవులమందచే పైకి నెగురకొట్టబడిన ధూళితో స్నానము గోరజః స్నానము. ఎండకాయుచుండగ పడిన వర్షములో స్నానము, దివ్య స్నానము. ఇట్లు స్నాన మైదు విధములు. ఈ మైదును పుణ్య (శుద్ధ) స్నానములే. ఈ మార్జనమువలన ఉపాసకునియొక్క తొమ్మిది విధములైన పాపములు తొలగిపోవునని వ్యాసులు చెప్పిరి.

"రజస్తమోమోహజాతాన్, జాగ్రత్స్వప్నసుషుప్తిజాన్।
వాఙ్మనఃకాయజాన్ దోషాన్నవైతాన్ నవభిర్హరేత్॥

ఇచ్చట రజస్తమోమోహశబ్దములచేత అజ్ఞానరూపమైన కారణదేహము సూచింపబడును. వాఙ్మనఃశబ్దములచేత లింగ

దేహము సూచింపబడును. కాయశబ్దముచేత స్థూలశరీరము చెప్ప బడును. ఇట్లు మూడు శరీరములచేత జాగ్రత్స్వప్నసుషుప్తులనబడు మూడవస్థలయందు చేయబడు పాపములు తొమ్మిది విధములగును. ఈ తొమ్మిది విధములైన పాపములును తొమ్మిది మార్జనలచేత హరింపబడును. అని భావము.

అవ = ప్రథమమార్జనము తర్వాత చేయదగు కృత్యము చెప్ప బడుచున్నది.

అభ్యుక్షణం తతః కృత్వా కుర్వీతాచమనద్వయం।
ద్వితీయం మార్జనం కృత్వా ప్రదహేత్పాపపూరుషమ్॥ 29

ప్రథమమార్జనము తర్వాత అభ్యుక్షణమును చేయవలెను. తర్వాత అభ్యుక్షణమున కుత్తరాంగముగ రెండు స్మార్తాచమనము లను చేయవలెను. తర్వాత ద్వితీయమార్జనమును చేయవలెను. తదనంతరము పాపపురుషదహనమును చేయవలెను.

## అభ్యుక్షణవిషయమున భారద్వాజస్మృతి

"సాయమగ్నిశ్చ మేత్యుక్త్వా ప్రాతః సూర్యేత్యపః పిబేత్॥
ఆపః పునంతు మధ్యాహ్నే ఇతత స్త్వద్భిర్ద్విరాచమేత్॥ అని.

ఉపనయనదినమున సాయంకాలసంధ్యావందనమును తొలి సారిగ నారంభింపబడును. అందువలన భారద్వాజులవారు శ్లోకమున "సాయమగ్నిశ్చ మేత్యుక్త్వా" అనిముందు సాయంకాలాభ్యుక్షణమును చెప్పిరి. సాయంకాలమున "అగ్నిశ్చ మా మన్యుశ్చ = ఇత్యాది మంత్రమును, ప్రొద్దున "సూర్యశ్చ మామన్యుశ్చ = ఇత్యాది మంత్ర మును, మధ్యాహ్నమున "ఆపః పునంతు = ఇత్యాది మంత్రమును చెప్పుచు గోకర్ణాకృతిహస్తమున గ్రహించిన జలమును అర్థభావనా పురస్సరముగ అభిమంత్రించి చివర "స్వాహా" యనుచు ఆ జలమును త్రాగవలెను. తర్వాత అభ్యుక్షణమునకు ఉత్తరాంగముగ రెండు స్మృత్యాచమనములను చేయవలెను.

## ద్వితీయమార్జనవిషయమున వ్యాసులు

తతస్సురభిమత్యా చ మార్జనం తు కుశోదకైః।
కుర్యాద్ధిరణ్యవర్ణాభిర్యథాశాస్త్రం తు మార్జనమ్॥

అబ్భక్షణానంతరమున మరల "సురభిమతీ" యనగా "దధిక్రావణ్ణ" మంత్రముచేతను, చకారమువలన తొమ్మిది ఆపోహిష్ఠాది మంత్రములచేతను, "హిరణ్యవర్ణాః" ఇత్యాది చతుర్మంత్రముల చేతను యథాశాస్త్రముగ కుశలచేత గాని దర్భలచేతగాని ద్వితీయ మార్జనమును చేయవలెను. "దధిక్రావణ్ణ" మంత్రమున "సురభి" అను పదముండుటచేత దానికి "సురభిమతీ" యను పేరు వచ్చెనని స్మృతిలో చెప్పబడెను.

### వ్యాసస్మృతి

ప్రోక్షయేత్సురభిమత్యా చ ఆపోహిష్ఠాదిభిస్తథా। అని.

"వధిక్రావణ్ణ" మంత్రము తర్వాత ఆపోహిష్ఠాదినవమంత్రములతో మార్జనము చేవలెనని. కాగా—(1) వధిక్రావణ్ణ మంత్రముచే ఒక మార్జనము, (2) ఆపోహిష్ఠాదులతో తొమ్మిది మార్జనములు, (3) హిరణ్యవర్ణాదులతో నాలుగు, వెరసి పదునాలుగు ప్రోక్షణములు ద్వితీయమార్జనము నందున్నవి. ఈ మార్జనములను గూడ కుశాగ్రములతో జేయవలెను.

## పాపపురుషదహనము

### ప్రజాపతిస్మృతి

"జలపూర్ణం తథా హస్తం నాసికాగ్రం సమర్పయేత్।
ఋతం చేతి పఠిత్వా తు తజ్జలం తు క్షితౌ క్షిపేత్॥

గోకర్ణాకృతి హస్తమున జలమును గ్రహించి ముక్కునకు దగ్గర పెట్టి "ఋతం" ఇత్యాది మంత్రమును గాని, ద్రుపదామంత్రమును గాని వారి వారి వేదశాఖ ననుసరించి, పఠించి, ఆ జలమును భూమిమీద చల్లివేయవలెను అని.

ఇచ్చట కొన్ని వివరములను పూర్తిగ నీయలేదు. దేవీభాగవతమున సంధ్యావందన ప్రకరణమున దీని ప్రకార మంతయును స్పష్టముగ నున్నది.

"ఉద్ధృత్య దక్షిణే హస్తే జలం గోకర్ణవత్కృతే।
నీత్వా తం నాసికాగ్రం తు వామకుక్షౌ స్మరేదఘమ్॥
పురుషం కృష్ణవర్ణం చ ఋతం చేతి పఠేత్తతః।
ద్రుపదాం వా ఋచం, పశ్చాత్ వామనాసాపుటేన చ॥
శ్వాసమార్గేణ తం పాపమానయేత్కరవారిణి।
నావలోక్యైవ తద్వారి వామభాగేఽశ్మని క్షిపేత్॥
నిష్పాపం తు శరీరం మే సంజాతమితి భావయేత్॥ అని"

## వసిష్ఠస్మృతి

గృహీత్వా పాణినా వారి, స్వశాఖోక్తామృచం జపేత్।

## ఆశ్వలాయనగృహ్యపరిశిష్టము

"రేచనవర్త్మనా పాణిస్థ ఉదకే పతితం ధ్యాత్వా, తదుదకమనవేక్షమాణో వామతో భువి తీవ్రపాతేన క్షిప్త్వా తం పాప్మానం వజ్రహతం సహస్రధా దళితం భావయేత్। ఏష పాప్మ వ్యపోహ॥ఇతి.

పై వచనములయొక్క సారమును మొత్తముగా వ్రాసెదను' ధర్మశాస్త్ర సంప్రదాయ మేమనగా—

"అనుక్తమన్యతో గ్రాహ్యం" ఒక స్మృతియందు చెప్పని విషయములను వేరొక స్మృతినుండి గ్రహింపవలెను. ఏలననగా— ఒక కర్మయొక్క సంపూర్ణాంశములు ఒక్క స్మృతియందు ఒక్కొక్కప్పుడు చెప్పబడవు. స్మృతులందు చెదరు మదరుగ చెప్పబడును. వాని నన్నింటి నొక్కదగ్గర చేర్చి ఏకవాక్యత కుదర్చవలెను. కాగా— పాపపురుషదహనముయొక్క అంశముల నన్నింటిని ఒక్క దగ్గర చేర్చి, ఆ ప్రయోగము ఈ క్రింద వ్రాయబడుచున్నది.

గోకర్ణాకృతిహస్తముతో నీటిని గ్రహించి, ముక్కు దగ్గరకు చేర్చి (1) "మనోవాక్కాయ కర్మలచేత నే జేసిన పాపమంతయును నల్లని రంగుగల పురుషాకృతితో నా యెడమ కుక్షిలో నున్నది. అని ముందుగ భావింపవలెను. తర్వాత యజుర్వేదీయులు ద్రుపదా మంత్రమును, ఋగ్వేదీయులు ఋతం చ" యను మంత్రమును అర్థమును భావించుచు, పఠించి, చేతిలోని జలమును అభిమంత్రించి, (2) తర్వాత వామకుక్షిలోని పాపపురుషుని శ్వాసతో గూడ శ్వాస మార్గము గుండా ముక్కు ఎడమ చెరమనుండి వెలుపలికి తెప్పించి చేతిలోని జలములో ప్రవేశించినట్లు భావింపవలెను. (3) తర్వాత ఎడమ ప్రక్కను మండుచున్న వజ్రశిల యున్నట్లు భావించి, చేతిలోని జలమును, చూడకుండ ఆ వజ్రశిలమీద గట్టిగ విసరి కొట్టి ఆ పాప పురుషుడు వజ్రశిలమీద పడి, వేయి వ్రక్కలై భస్మమైనట్లు (4) భావించి, అంతటితో తన శరీరము పాపలేశము గూడ లేనిదిగ (5) భావింపవలెను. ఇట్లైదు భావనలతో నీ పని జరుగును. ద్రుపదా మంత్రమును గూర్చి స్మృతిముక్తాఫలమున నిట్లున్నది. "పఠేదృచం తు ద్రుపదాం సర్వాఘౌఘవినాశినీమ్" సమస్తపాపరాశులను నాశము చేయు ద్రుపదామంత్రమును పఠింపవలెను అని. ఆహా! ఈ ద్రుపదా మంత్రము సర్వపాపరాశులను దహించి వేయుచున్నది! ఏమి మహిమ!

ఇట్టి ఈ పద్ధతిగూడ ఆచారములో కొంత, కాదు కాదు, చాలవరకు నష్టసంప్రదాయమైనదే. సంధ్యోపాసనకు వలె పూర్తిగ సంప్రదాయము నష్టము కాలేదు. కొంచెము మిగిలి యున్నది. ఆహా! కాలమహిమ! ఈ పద్ధతి నందరును భక్తిశ్రద్ధలతో కడు జాగ్రత్తగ నాచరింతురు గాక!

## అర్ఘ్యప్రక్షేపము

**విధూతపాపః శుద్ధః సన్ స్వాధ్యాయాదిత్యమండలే।**
**ద్విజో మందేహరక్షోఘ్న మర్ఘ్యత్రితయముత్క్షిపేత్॥ 30**

ఇట్లు సంధ్యోపాసకుడు వెనుక జెప్పిన విధముగ ప్రథమ మార్జనము, అభ్యుక్షణము, ద్వితీయమార్జనము, పాపపురుషదహనములచేత నిష్పాపుడై శుద్ధమైనవాడై సర్వలోకప్రకాశకుడైన సూర్యనారాయణునితో యుద్ధము చేయుచు ఉపద్రవము కలిగించుచున్న మందేహులను పేరుగల రాక్షసులను గాయత్రీమంత్రముచే నభిమంత్రించిన జలములచేత శాంతింపజేసి, సూర్యునకు స్వాస్థ్యమును కలుగజేయుట కొరకు అర్ఘ్యప్రక్షేపముల నిచ్చుటకొరకు సిద్ధపడుచున్నాడు. ఆ యర్ఘ్యప్రక్షేపములకు ప్రయోగమిట్లు. సూర్యోదయమునకు ముందున్న రాత్రి యొక్క చివరి రెండు గడియలు రౌద్రముహూర్త మనబడును.

రౌద్రముహూర్తారంభముతో సంధ్యాకాల మారంభమగును. కావున రౌద్రముహూర్తారంభముననే సంధ్యావందన మారంభింపవలెను. అట్లారంభించి పాపపురుషదహనమును ముగించి, అర్ఘ్యప్రక్షేపమును మనసున తలచుకొని లేచి, పాదములు రెండును దగ్గరగ చేర్చి, సమముగ నుంచుకొని, తూర్పుముఖముగ (ఉత్తరముఖముగ కాదు) దోసిలితో జలమును తీసికొని ప్రొద్దున కొంచెము వంగి, మధ్యాహ్నమున నిలువుగ నిలబడి సాయంకాలమున పడమర ముఖముగ కూర్చొనియు దోసిలినుండి బొటనవ్రేళ్ళను విడదీసి నిలబెట్టి, ప్రణవవ్యాహృతులతో గూడిన గాయత్రీమంత్రముచేత ఆ జలము నభిమంత్రించి దోసిలిని గోశృంగమంత ఎత్తునెత్తి (అనగా తన కనుబొమల మధ్యవరకు ననియర్థము.) ప్రొద్దునను, మధ్యాహ్నమునను జలములందు పడునట్లు దోసిలిని పైకి ఎత్తి యర్ఘ్యములను చిమ్మవలెను. జలములేని యెడల భూమిమీదనే నీళ్ళు చల్లి శుద్ధముచేసి యర్ఘ్యమును చిమ్మవలెను. అర్ఘ్యమును పైకి చిమ్మునప్పుడు కాలిమడమలను గూడ కొంచెము పైకెత్తవలెను. సాయంకాలమున జలముతో శుద్ధముచేసిన భూమిమీదనే పడునట్లు పడమరముఖముగ కూర్చొనియె యర్ఘ్యమును పైకి చిమ్మవలెను. మూడు సంధ్యలందును అర్ఘ్యములను పైకి చిమ్మవలెను.

క్రిందికి జారవిడువకూడదు. ఇట్లు మూడేసి అర్ఘ్యములను చిమ్మ వలెను. తొలి అర్ఘ్యమును చిమ్ముసప్పుడు, "ఇదమర్ఘ్యం సూర్య గతి నిరోధక-మందేహరాక్షస- ఆయుధనాశాయ భవతు" అనియు, రెండవ యర్ఘ్యము చిమ్ముసప్పుడు, "ఇదమర్ఘ్యం సూర్యగతి నిరోధక - మందేహరాక్షస - హాయనాశాయ, భవతు" అనియు, మూడవ యర్ఘ్యమును చిమ్ముసప్పుడు, "ఇదమర్ఘ్యం సూర్యగతి నిరోధక-సర్వమందేహరాక్షశ-నాశాయ భవతు" అనియును చెప్పు కొనుచు చిమ్మవలెను.

అనగా—తొలి అర్ఘ్యమును ఇచ్చునప్పుడు "ఈ యర్ఘ్యము సూర్యుని గమనమును అడ్డుపెట్టుచున్న మందేహరాక్షసుల ఆయుధ ములను నాశము చేయుగాక!" అని యనుచు చిమ్మవలెను. రెండవ అర్ఘ్యమును ఇచ్చునప్పుడు "ఈ యర్ఘ్యము, సూర్యుని గమనమును అడ్డుపెట్టుచున్న మందేహరాక్షసుల గుఱ్ఱములను నాశము చేయు గాక!" అని యనుచు చిమ్మవలెను. మూడవ అర్ఘ్యము నిచ్చు నప్పుడు "ఈ యర్ఘ్యము సూర్యుని గమనమును అడ్డుపెట్టుచున్న మందేహరాక్షసుల నందరను నాశము చేయుగాక!" అని అనుచు చిమ్మవలెను.

సంధ్యావందనమున అర్ఘ్యములను ఎందుకు చిమ్మవలెనో చాల మందికి తెలియదు. ఈ పైన చెప్పిన ప్రకారము అనుచు, అర్ఘ్యములను చిమ్మిన యెడల అర్ఘ్యములను ఎందుకు చిమ్ము చున్నారో, స్పష్టముగ తెలియును. అట్లు తెలిసికొనిన వారికి అర్ఘ్య ములను చిమ్ముటయందు ముందుకంటె ఎక్కువ భక్తిశ్రద్ధలు కలుగును.

ఏలనన—సంధ్యాకాలమున అర్ఘ్యములను చిమ్మనివాడు మరు జన్మమున గుడ్లగూబగ పుట్టునని శాస్త్రము చెప్పుచున్నది.

"గాయత్ర్యా అభిమంత్రితా ఆప ఊర్ధ్వం విక్షిపంతి॥

గాయత్రీమంత్రముచేత అభిమంత్రించిన జలములను పైకి చిమ్ముదురు" అని యుండుటవలన మూడు సంధ్యలందును యజుర్వేదీయులు గాయత్రీమంత్రముతోనే యర్ఘ్యములను చిమ్మవలెను. మాధ్యాహ్నికార్ఘ్యప్రక్షేపవిషయమున "ఆశ్వలాయనగృహ్యపరిశిష్టమున "అథాఽఽకృష్ణీయయా, హంసవత్యా వా త్రిః సకృద్వాఽర్ఘ్యముత్క్షిప్య" అని. ఆకృష్ణేనరజసా=యను మంత్రముచేత గాని, హంసవతీమంత్రమనగా-హంగ్ంసశ్శుచిషత్=ఇత్యాది మంత్రముచేతగాని మూడుసారులుగాని,యొక్క సారి గాని యర్ఘ్యములను చిమ్మవలెనని మాధ్యాహ్నికార్ఘ్యమునకు వేరు మంత్రములు, సంఖ్యావికల్పము చెప్పబడినవి. అది ఋగ్వేదీయులకని స్మృతులు చెప్పుచున్నవి. "తద్బహ్వృచానాం" అది ఋగ్వేదులకు" అని చెప్పుచున్నవి. కాన యజుర్వేదీయులకు మధ్యాహ్న సంధ్యయందు హంసమంత్రముతో అర్ఘ్యప్రక్షేపము లేనే లేదు. మూడర్ఘ్యములును గాయత్రితోనే చేయవలెనని నిర్ణయము. ఆచార మెప్పుడు ఎట్లు మారినదో తెలియదు.

మీద చెప్పిన అంశములకు ఈ క్రింద ప్రమాణవచనము లీయబడుచున్నవి.

## స్మృతిముక్తాఫలమున

ప్రాఙ్ముఖః సతతం విప్రో సంధ్యోపాసనమాచరేత్।
అర్ఘ్యప్రక్షేపణం కుర్యాదాదిత్యాభిముఖో ద్విజః॥
ప్రాతః ప్రహ్వః క్షిపేదప్సు మధ్యాహ్నే ఋజుసంస్థితః।
అర్ఘ్యప్రక్షేపణం కుర్యాత్సాయం తూపవిశన్ భువి।

## ఆపస్తంబ స్మృతి

ఉపవిశ్య తు సాయాహ్నే జలేష్వర్ఘ్యం న నిక్షిపేత్।
నిక్షిపేద్యది మూఢాత్మా రౌరవం నరకం వ్రజేత్॥

ఇట్లు చెప్పుటచేత, ఆపస్తంబీయులు మాత్రము కూర్చొనియే అర్ఘ్యమీయవలెను. సాయంకాలము గూడ నిలువబడియె అర్ఘ్య మీయవలెనను మతము ఆపస్తంబీయులది మాత్రము కాదు.

## స్మృతిముక్తాఫలమున

పాణిభ్యాం జలమాదాయ గాయత్ర్యా చాభిమంత్రితం।
గోశృంగమాత్రముద్ధృత్య జలమధ్యే జలం క్షిపేత్॥
గోశృంగమితి యత్ప్రోక్తం తద్భ్రూమధ్యం ప్రచక్షతే।
గోశృంగమనగా, కనుబొమలమధ్యమని యర్థము.
జలేష్వర్ఘ్యం ప్రదాతవ్యం జలాభావే తు తత్స్థలే।
సంప్రోక్ష్య వారిణా సమ్యక్ దద్యాదర్ఘ్యం యథావిధి॥

## పారిజాతమున

ద్వౌ పాదౌ చ సమం కృత్వా పార్ష్ణీ ఉద్ధృత్య ప్రక్షిపేత్।
ముక్తహస్తేన దాతవ్యం ముద్రాం తత్ర న కారయేత్॥
తర్జన్యంగుష్ఠసంయోగాద్రాక్షసీముద్రికా భవేత్।
యో దదాతి తయా చార్ఘ్యం తత్తోయం రుధిరం భవేత్॥

అర్ఘ్యమిచ్చునప్పుడు బొటనవ్రేలును చూపుడువ్రేలును కలిసిన యెడల అది రాక్షసముద్ర అగును. ఆ ముద్రతో అర్ఘ్యముల నిచ్చిన, ఆ జలము రక్తముతో సమానమగును, కావున బొటన వ్రేళ్ళను విడదీసి నిలువుగ నిలబెట్టవలెను.

మందేహానాం వినాశాయ ప్రక్షిపేత్తు జలాంజలీన్।
ప్రాయశ్చిత్తార్థమాచమ్య ముచ్యతే బ్రహ్మహత్యయా॥

మందేహరాక్షసుల నాశముకొరకు అర్ఘ్యములను చిమ్మ వలెను. "యత్ప్రదక్షిణం ప్రక్రమంతి తేన పాప్మానమవధూ న్వంతి" అను శ్రుతివచనముచేత అర్ఘ్యప్రక్షేపానంతరము నొక యాత్మప్రదక్షిణమును చేసిన యెడల రాక్షసపీడవలన కలిగిన

బ్రహ్మహత్యాపాపమును దులిపివేసికొనుచున్నాడు. కావున ఆత్మ ప్రదక్షిణము చేసి, ఒక స్మార్తాచమనమును చేయవలెను. బ్రహ్మహత్యాపాపమునుండి ముక్తుడగును.

మూడర్ఘ్యముల నెందుకీయవలెనో వ్యాసులవారు చెప్పుచున్నారు.

ఏకం తు శస్త్రనాశాయ ద్వితీయం హయనాశనే।
రాక్షసానాం వధాయైకం దద్యాదర్ఘ్యత్రయం బుధః॥

తొలి యర్ఘ్యమును మందేహరాక్షసుల యాయుధముల నశింపజేయును. రెండవ యర్ఘ్యము మందేహుల గుఱ్ఱముల నశింపజేయును. మూడవది యా రాక్షసుల నందరను అరుణద్వీపమున నెత్తి పడవేయును. కావున నిట్లు తెలిసికొనినవాడై మూడర్ఘ్యములను చిమ్మవలెను.

అవ. ఆచారమున కనబడమిచేత నర్ఘ్యముయొక్క ఉత్తరాంగములు ప్రత్యేకముగ చెప్పబడుచున్నది.

**ప్రదక్షిణం పరిక్రమ్య పాప్మానమవధూయ చ।**
**ఉపవిశ్యాఽథ చాచమ్య శుద్ధో భవతి పాప్మనః॥　　31**

"తా ఆపో వజ్రీభూత్వా మందేహా రుణే ద్వీపే ప్రక్షిపంతి అర్ఘ్యజలములు వజ్రాయుధములుగ మారి యా మందేహరాక్షసులను కాల్చి, "అరుణ"మను ద్వీపమున విసిరివేయును. ఆ రాక్షసులకు చావు లేకపోవుటచేత చావరు. కాని యట్లు కాల్చుటచేతను, దూరమునుండి విసిరివేయుటచేతను, వారికి చాల పీడ గల్గును. అందుచేత ఉపాసకునకు బ్రహ్మహత్యాపాపము చుట్టుకొనును. ఆ పాపము నెట్లు విడిపించుకొనుట? వేదమాతయే కరుణతో వెనువెంటనే చెప్పినది. "యత్ప్రదక్షిణం ప్రక్రమంతి, తేన పాప్మానమవధూన్వంతి" అర్ఘ్యప్రక్షేపానంతర మొక యాత్మప్రదక్షిణమును చేసిన యాపాపము క్రిందకు దుల్లిపోవునని.

కాని యా పాపముయొక్క సంపర్కముచేత కలిగిన యశుద్ధి

తొలగిపోదు. కావున ప్రదక్షిణము తర్వాత కూర్చొని యాచమనము చేసిన యెడల ఆ యశుద్ధి పోయి, శుద్ధుడగును. ప్రదక్షిణ విధానమును వ్యాసపితామహశంఖమహర్షులు చెప్పిరి.

### వ్యాసులు

ప్రణవవ్యాహృతిభిశ్చైవ, కృత్వాత్మానం ప్రదక్షిణం।
ఆచమేత తతస్తిష్ఠన్ ధ్యాయేత్సంధ్యాం సమాహితః॥

### పితామహస్మృతి

పాణినా జలమాదాయ, స్రవన్ (సకృత్) కుర్యాత్ప్రదక్షిణం।

ఈ రెండు వాక్యములను పాఠాంతరముతో నేకవాక్యము చేసిన యెడల=చేతిలోనికి జలమును తీసికొని, ఆ నీటిని పరిషేచనోదకమును వలె క్రిందకు ధారగ వదులుచు, "ఓం భూర్భువస్సువః" అనుచు ప్రణవవ్యాహృతుల నుచ్చరించుచు నొక యాత్మప్రదక్షిణమును చేయవలెను. ముమ్మారు గాదు. (తర్వాత కూర్చొని) ఆచమించి మరల నిలబడి, మూడు ప్రాణాయామములను చేసి, నెమ్మదియైన మనసు గలవాడై, సంధ్యాదేవతను ధ్యానింపవలెను. అని.

### శంఖమహర్షి

మందేహానాం వినాశాయ ప్రక్షిపేత్తు జలాంజలీన్।
ప్రణవవ్యాహృతిభిశ్చైవ కృత్వాత్మానం ప్రదక్షిణమ్॥
ఆచమేత తతస్తిష్ఠన్ ధ్యాయేత్సంధ్యాం సమాహితః॥ అని.

పైన వివరించిన యర్థమే=ఇట్లు మహర్షులందరును ప్రదక్షిణమును చెప్పి దానికి వేరుగ మంత్రమును చెప్పుచుండగా శ్రీకృష్ణపండితులవారు, సంధ్యావందనమున కంతకును అంగి యగు "అసావాదిత్యో బ్రహ్మ" యనెడు సంధ్యోపాసనమంత్రమునే ఈ ప్రదక్షిణమునకు వినియోగించిరి. అందుకు గాను అన్వయము కుదరని యొకానొక శ్లోకమును గూడ ప్రమాణముగ కనబరచిరి.

ఇట్లు పూర్వాంగనిరూపణము ముగిసినది.

# సంధ్యోపాసనము

అవ. పూర్వాంగనిరూపణానంతరము అంగి యగు సంధ్యోపాసనముయొక్క అనుష్ఠానపద్ధతి వివరింపబడుచున్నది.

**ఆదిత్యమండలే స్వస్థే ప్రాణాయామత్రయం చరేత్।**
**తతో యథాధికారం స సంధ్యాం ధ్యాయేత్సమాహితః॥ 32**

అర్ఘ్యప్రక్షేపములచేత రాక్షసోపద్రవము నివర్తించి, ఆదిత్యమండలము స్వస్థమగును. ఆదిత్యుడు స్వస్థుడు కాగా ఉపాసకుడు మూడు ప్రాణాయామములను చేసి, నెమ్మదియైన మనసు కలవాడై, శ్రీవిద్యారణ్యులవారు చెప్పిన రీతిగ తన యధికారమును తెలిసికొని, లేక పెద్దలవలన తెలిసికొని, ద్వితీయాధ్యాయమున ప్రథమభాగమున చెప్పిన రీతిగ –సంధ్యాదేవతను సూర్యమండలమునందు సగుణముగనో నిర్గుణముగనో కొంచెము కాలము ధ్యానింపవలెను. తొలుత నొకసారి వివరింపబడుటవలన మరల వివరింపనక్కర లేదు.

## వ్యాసస్మృతి

"ప్రాక్తూలేషు తతః స్థిత్వా దర్భేషు సుసమాహితః।
ప్రాణాయామత్రయం కృత్వా ధ్యాయేత్సంధ్యామితి శ్రుతిః॥

తూర్పుకొనలుగల దర్భలమీద నిలబడి, మూడుప్రాణాయామములను జేసి, నెమ్మదియైన మనసు కలవాడై సంధ్యాదేవతను ధ్యానింపవలెనని శ్రుతి చెప్పుచున్నది. అని. ఈ శ్రుతివచనము ఖిలమై యుండ నోపును.

ఇట్లు మహర్షులందరును సంధ్యాదేవతాధ్యానమును శ్రుతియే చెప్పుచున్నదని చెప్పుచున్నను శ్రీకృష్ణపండితులవారు ఆ వచనములను ఏల చూడలేదో తెలియకున్నది.

సంధ్యోపాసనానుష్ఠానపద్ధతినిరూపణము సమాప్తము.

# సంధ్యోపాసనోత్తరాంగానుష్ఠానపద్ధతినిరూపణము

అవ. ఉత్తరాంగములలో మొదటిదగు గాయత్రీజపము యొక్క అనుష్ఠానపద్ధతి చెప్పబడుచున్నది.

**గాయత్రీహృదయం ప్రోచ్య ప్రాణాయామంత్రయ చరేత్।**
**సంఖ్యాతాం హి జపేద్భక్త్యా గాయత్రీమార్క దర్శనాత్॥**

## మొదటి యుత్తరాంగము, గాయత్రీజపము

గాయత్రీజపమునకు ముందు, జపమునకు పూర్వాంగమగు గాయత్రీహృదయమును, నర్థభావనాపురస్సరముగ పఠింపవలెను. తర్వాత మూడు ప్రాణాయామములను చేయవలెను. ఇంత సంఖ్య గల గాయత్రీజపమును చేసెద ననుకొని, ధ్యానశ్లోకమును అర్థ భావనాపురస్సరముగ పఠించి, యథావిధిగ భక్తితో ప్రాతఃకాల మున సూర్యదర్శనమగువరకును, సాయంకాలమున నక్షత్రదర్శనము వరకును మధ్యాహ్నమున ననుకొనిన సంఖ్య పూర్తియగువరకును గాయత్రీమంత్రమును, మంత్రార్థమును తలంచుచు జపింపవలెను.

### శంక

పూర్వాంగానుష్ఠానముచేతనే నిర్దగ్ధసమస్తపాపుడైన ద్విజుడు సూర్యమండలమున ప్రధానమగు, అంగియగు సగుణోపాసనను కాని లేక నిర్గుణోపాసనను కాని చేసి, ఓంకారముతో నిర్గుణోపాసన మునుకూడ పూర్తిచేసినవాడై, యిప్పుడు ఏ ఫలముకొరకు గాయత్రీ జపమును చేయవలయును?

### సమాధానము

సంధ్యాదేవత చిచ్ఛక్తి యని వసిష్ఠులవారిచేత నిర్ణయింప బడినది గదా! ఇంకను—సంధ్యాదేవత మహారాజ్ఞియై వెలయు చున్నది. చిచ్ఛక్తి నాశ్రయించిన మాయచేత, సృష్టింపబడిన సృష్టిలో ఏకదేశమగు స్థూలసమష్టియందభిమానము గలది, గాయత్రి. అట్టి గాయత్రి సంధ్యాదేవతకు అంతరంగదేవత యగు

ననియును వెనుక జెప్పబడినది. కాన మహారాజ్ఞీస్థానమందున్న సంధ్యాదేవతకు గాయత్రి మంత్రిణీస్థానమందుండును. కాన మంత్రిణి యగు గాయత్రీదేవి తనయొక్క మంత్రజపముచేత ప్రసన్నురాలై శీఘ్రముగ సంధ్యాదేవ్యనుగ్రహము కలుగునట్లు చేయును. "గాయత్రీం ఛందసాం మాతేదం బ్రహ్మ జుషస్వ మే" వేదములకు తల్లివగు నో గాయత్రీదేవి! ఇప్పుడే నేనుపాసించిన సంధ్యాబ్రహ్మము, నన్ను పొందునట్లు చేయుము. సంధ్యాబ్రహ్మసాక్షాత్కారము కలుగు నట్లుచేయుము. అను పై గాయత్రీహృదయమంత్రార్థమును బట్టి, శీఘ్రముగ సంధ్యాదేవ్యనుగ్రహప్రాప్తికొరకు గాయత్రీ జపమును తప్పక చేయవలయును.

సంధ్యోపాసనాధారభూతమైన ఆదిత్యమండలము యొక్క స్వాస్థ్యముకొరకు చేయబడిన అర్ఘ్యప్రక్షేపము సంధ్యోపాసనకు అవ్యహితపూర్వాంగమైనట్లు సంధ్యాదేవతాంతరంగమగు గాయత్రీ దేవియొక్క మంత్రజపము సంధ్యోపానకు సమనంతరమగు ఉత్తరాంగమగును. ఉపస్థానము సంధ్యోపాసనాధారమైన యాదిత్య మండలమునందభిమాని యగు సూర్యుని స్తుతి గావున, గాయత్రీ జపమంత యంతరంగము గాదు. కావున జపము తర్వాతిది ఉపస్థానమైనది. అని యీ క్రమమును బట్టి తోచుచున్నది.

పైన పేర్కొనిన గాయత్రీహృదయ మైదు భాగములుగ నున్నది. ఎట్లనిన—1) ఆహ్వానము, 2) స్తుతి, 3) ఆవాహనము, 4) ఛందోదేవతాఋషిప్రదర్శనము, 5) గాయత్రీదేవతాధ్యానము. ఇది యంతయును సంధ్యామంత్రార్థబోధిని యను భాగమునందు విస్తరముగ వివరింపబడినది. అందు చూడనగును.

## గాయత్రీజపప్రయోగము

గాయత్రీహృదయమును సర్థభావనాపురస్సరముగ పఠించి తర్వాత మూడు ప్రాణాయామములు చేసి, ఇంత గాయత్రీజపమును చేసెదనని మనసున ననుకొని, ముక్తావిద్రుమేత్యాదిధ్యానశ్లోకమును

అర్థభావనతో పఠించి, గాయత్రీదేవిని తనహృదయపద్మకర్ణికమీాద నెదురుగ కూర్చొని యున్నట్లు, తన కన్నులతో చూచుచున్నట్లు మనోనేత్రముతో చూచుచు, చక్కగ ధ్యానింపవలెను.

## బాలంభట్టీయమున నిట్లున్నది

గాయత్రీం సంస్మరేద్ధీమాన్ హృది వా సూర్యమండలే। "గాయత్రీదేవిని తన హృదయపద్మమున గాని, సూర్యమండలమందు గాని ధ్యానింపవలెను." అని యుండుటవలన—హృదయమున ధ్యానింపదలచినవారు హృదయపుండరీకమున గాయత్రీదేవిని ఇట్లు ధ్యానింపవలెను. మానవుని యెడమ రొమ్ములో హృదయపుండరీకము తలక్రిందులుగ తామరమొగ్గవలెను, అరటిపూవువలె నుండును. అట్టి హృదయకోశమును ఊర్ధ్వముఖమైన దానినిగను, వికసించిన దానినిగను, ఎనిమిది దళములు (రేకులు) గలదిగను, మధ్యను కర్ణిక (తామరదుద్దు) కల దానినిగను. ధ్యానింప వలెను. ఆ కర్ణికమీాద గాయత్రీదేవిని, ధ్యానశ్లోకమున వర్ణింపబడినట్లు కూర్చొని, తనకు ఎదురుగనున్నట్లు ధ్యానింపవలెను.

హృదయపద్మమున దేవతను ధ్యానించు విషయము శ్రీమద్భాగవతమున పదునొకండవస్కంధమున చక్కగ వర్ణింపబడినది.

ఈ క్రింది గుణములు కల వారి యొక్క జపము సమృద్ధమగును.

## బాలంభట్టీయమున

మనస్సంతోషణం మౌనం శౌచం మంత్రార్థచింతనం। అవ్యగ్రత్వమనిర్వేదో జపసంపత్తిహేతవః॥ అని.

మనసున సంతుష్టి యుండవలెను. మౌనము, శుచిత్వము, మంత్రముయొక్క అర్థము ననుసంధానించుట, మనసు చెదరకుండ నుండుట విరక్తి లేకుండుట (జపమునందుత్సాహముండవలెను.) ఈ

యారుగుణములున్న యెడల జపము సమృద్ధమగును. లేని యెడల జపము కాలక్షేపమే యగును. సమృద్ధము=నిండుగలది.

జపము చేయునప్పుడు ఉపయోగించకూడని ఆసనములు—

వంశాసనేషు దారిద్ర్యం, పాషాణే వ్యాధిసంభవః॥
ధరణ్యాం దుఃఖసంభూతిః, దౌర్భాగ్యం చిత్రదారుణి॥

వెదురుతో చేసిన యాసనమున జపించిన దారిద్ర్యముకలుగును. ఱాతిమీద జపించిన వ్యాధి కలుగును. భూమిమీద, దుఃఖము కలుగును. రంగురంగుల కఱ్ఱయాసనమున దురదృష్టము కలుగును అని.

తర్వాత—ప్రొద్దున నిలబడి, మధ్యాహ్నమున శక్తియున్న నిలబడి, లేని యెడల కూర్చొని, తూర్పుముఖముగను, సాయంకాలమున కూర్చొనియే వాయవ్యాభిముఖముగ, కాలి ముడుకుల నెత్తికొని ప్రథమాధ్యాయమున సందర్భానుసారముగ వివరింపబడిన తొమ్మిది విధములైన జపములలో తానేది చేయగలడో యట్టి జపమును, గాయత్రీమంత్రార్థమును భావించుచు, యథాశక్తిగ అష్టోత్తరశతమును గాని, చతుఃపంచాశత్తును (54) గాని, అష్టావింశతిని (28) గాని, చివరకు పది సారులు గాని, ప్రొద్దున సూర్యదర్శనము వరకును, సాయంకాలమున నక్షత్రదర్శనమువరకు, మధ్యాహ్నమున ననుకొనిన సంఖ్య పూర్తి యగువరకును కుడిచేతి వ్రేళ్ళ గనుపులందు లెక్కపెట్టుచు, ప్రొద్దున దోసిలిని వెల్లకిలిగ నాభి దగ్గరగను, మధ్యాహ్నమున హృదయము దగ్గర నిలువుగను, సాయంకాలమున ముక్కుకు నెదురుగ బోరగిల నుంచి, భక్తితో జపింపవలెను.

పై విషయములకు ప్రమాణశ్లోకములు.

## అత్రి స్మృతి

ఆయాతు వరదా దేవీత్యేతద్ధృదయముచ్యతే।
గాయత్ర్యాస్తజ్జపిత్వాదౌ జపకర్మ సమారభేత్॥
ఈ శ్లోకము నర్థము వెనుక వ్రాయబడినది.

## సంవర్తస్మృతి

ప్రాణాయామైస్త్రిభిః పూతో గాయత్రీం తు జపేత్తతః॥

గాయత్రీహృదయపరనానంతరము మూడు ప్రాణాయామములు చేసి మనోదోషము లేక శుద్ధుడై గాయత్రిని జపింపవలెను.

## జపసంఖ్యావిషయమున ధర్మప్రవృత్తియందు

"అష్టోత్తరశతం నిత్యమష్టావింశతిరేవ వా।
విధినా దశకం వాపి త్రిసంధ్యం సంజపేద్ద్విజః॥

సంధ్యోపాసనాంగమగు గాయత్రీనిత్యజపము నూటయెనిమిది సారులే. నిత్యజపమున వేయి మొదలగు సంఖ్యలు లేవు. వేయి మొదలగు సంఖ్యలలో జపము చేయదలచిన యెడల సంధ్యాకాలమున గాక వేరు కాలమందు చేయవలెనని సిద్ధాంతము. ఇక నూటయెనిమిది సారులు చేయుటకు వీలు లేని యెడల, ఏబది నాలుగు సారులు గాని, యిరువదియెనిమిది సారులు గాని, దానికి వీలులేని యెడల విధిప్రకారము (పంచావసానముగ అర్థభావనతో) పది సారులు గాని ద్విజుడు మూడు సంధ్యలందును జపము చేయవలెను.

శ్రీతారానాథతర్కవాచస్పతికృతమగు గాయత్రీ వ్యాఖ్యానమను గ్రంథమున "చతుఃపంచాశతం వాపి జపం కుర్యాద్యథావిధి" యథావిధిగ ఏబదినాలుగు సారులైనను జపము చేయవలెనని. కాగా—నూటయెనిమిది సంఖ్య నిత్యసంఖ్య. ఏబదినాలుగు మొదలైన సంఖ్యలు ఆపద (ఇబ్బంది) వచ్చినప్పుడు అని, స్మృతిరత్నాకరమున నున్నది. "దశాపత్సు జపేద్దేవీమష్టావింశతి మష్ట వా" పది చేయలేని యెడల నెనిమిది సారులైనను చేయవలెనని విశేషము.

## యోగియాజ్ఞవల్క్య స్మృతి

బ్రహ్మచారీ గృహస్థశ్చ శతమష్టోత్తరం జపేత్॥

గృహస్థబ్రహ్మచారులకు హోమము, వేదాధ్యయనము మొద

లగు కార్యాంతరము లుండుటవలన నూటయెనిమిదియే నిత్యజపము విధింపబడినది.

సంధ్యాత్రయమునందు జపకాలములు కాలనిరూపణవిభాగ మున వివరముగ నిరూపింపబడును. అచ్చట చూడనగును.

ధర్మసింధుసారమున—"సాయంవాయవ్యాభిముఖః, ఆ నక్షత్ర దర్శనాదితి విశేషః"—సాయంకాలమున వాయవ్యాభిముఖముగ కూర్చొని నక్షత్రములు కనబడువరకును గాయత్రీజపమును చేయ వలెను. అని విశేషముగ చెప్పబడినది.

బాలంభట్టీయమను నిబంధన గ్రంథమునందు, "సాయం సంధ్యాంగ గాయత్రీజపమును, నక్షత్రదర్శనమునకు ముందు కూడ నిలుపవచ్చునని సప్రమాణగ నిరూపింపబడినది.

ధర్మప్రవృత్తిగ్రంథమునందు-"ఊర్ధ్వజ్ఞుశ్చైవ సాయాహ్నే" అనగా సాయంకాలగాయత్రీజపమును, కాలిముడుకులను రెండింటిని గాని, ఒకటిని గాని, పైకి ఎత్తుకొని చేయవలెనని చెప్పబడెను.

అగ్నిహోత్రము చేయువారు రెండు విధములు. ఉదితహో ములు, అనుదితహోములు నని. సూర్యోదయమైన తర్వాత హోమము చేయువారు ఉదితహోములు. సూర్యుడు ఉదయించక మునుపే హోమము చేయువారు అనుదితహోములు. అందు ఉదితహోములకు గాయత్రీజపవిషయమున చిక్కు లేదు. అనుదిత హోముల విషయమున కొంచెము శ్రమమున్నది. ఎట్లనగా—సూర్య దర్శనము వరకును జపము చేయవలెనని శాస్త్రము చెప్పుచున్నది. కాని సూర్యోదయమునకు ముందే హోమమును చేయవలయును. అదెట్లు కుదురును? కుదర నేరదు.

ఇంకను—బహిస్సంధ్య ప్రశస్తము. కాన గ్రామాద్బహిః ప్రదేశమున సంధ్య వార్చిన యెడల నింటికి వచ్చుసరికి హోమ కాలము దాటిపోవును. హోమమునకు కాలాతిక్రమణ మగును.

కాన నిదెట్లు పొసగును? సమాధానము చెప్పబడుచున్నది. అత్రి స్మృతియందు——

'సంధ్యాత్రయం తు కర్తవ్యం ద్విజేనాత్మవిదా సదా।
ఉభే సంధ్యే తు కర్తవ్యే బ్రాహ్మణేన గృహేష్వపి॥

అనగా——సంధ్యోపాసనమంత్రార్థమును, సంధ్యోపాసనపద్ధతిని తెలిసిన ద్విజుడు ఆత్మజ్ఞానము కలవాడగును. కాన నట్టి యాత్మజ్ఞానముకల ద్విజుడు ఆత్మసాక్షాత్కారము కొరకు తప్పక మూడు సంధ్యలను ఆచరింపవలెను. అనుదుదితహోమి యగు ద్విజుడు ప్రాతస్సాయంసంధ్యలను మాత్రము గృహమునందే చేయవలయును. ఏల గృహమునందే చేయవలెను? హోమకాలాతిక్రమణము కాకుండుటకొరకు. గృహేషు=నిత్యబహువచనము, అపి=ఏవ=అష్టోత్తరశత జపము సూర్యదర్శనపర్యంతజపమున్ను ఉదితహోములకొరకే. ఏబదినాలుగు, ఇరువదియెనిమిది మొదలగు సంఖ్యలు అనుదిత హోములకొరకని తెలియునది. అనుదితహోములు సూర్యోదయమునకు ముందే సంధ్యావందనము పూర్తిజేసి, అగ్నిహోత్రహోమమును కూడ పూర్తి చేయవలసియున్నది.

జపసమయమున చేతులెట్లుండవలెనో ధర్మసింధుసారము చెప్పుచున్నది.

ప్రాతర్నాభౌ కరౌ కృత్వా మధ్యాహ్నే హృది సంస్థితౌ।
సాయం జపతి నాసాగ్రే జపస్తు త్రివిధః స్మృతః॥

ప్రాతఃకాలమున దోసిలిని బొడ్డునకు దగ్గరగ నుంచియు, మధ్యాహ్నమున హృదయమునకు దగ్గరగా నుంచియును, సాయంకాలమున ముక్కుకు నెదుర నుంచియును, జపింపవలెను.

## వ్యాసస్మృతి

ప్రాతరుత్తానపాణిభ్యాం, స్తబ్ధాభ్యాం మధ్యమే దినే।
అధోముఖాభ్యాం పాణిభ్యాం సాయం సంలక్షితో జపేత్॥

ప్రొద్దున దోసిలిని వెలికిలగను, మధ్యాహ్నమున కొంచెము ముడిగినదిగను, సాయంకాలమున బోరగిలగనుంచి జపమును చేయవలెను. పాణిభ్యాం సంలక్షితః = చేతులతో కూడుకొన్నవాడై యని యర్థము.

కొందరు ధర్మసింధుసారశ్లోకమున "ప్రాతర్నాసాసమా" యనియును, "సాయం జపతి నాభౌ తు" యని పాఠాంతరమును కల్పించి, ప్రాతస్సాయంకాలములందు పైవ్రాతకు వ్యత్యాసముగ జపమును చేయవలెనందురు. కాని తొలిపాఠమే మేలనిపించుచున్నది. ఏలనన—వ్యాసులు చెప్పినట్లు – ప్రొద్దున నిలబడి, వెలికిలగ నున్న దోసిలిని ముక్కునకు నెదురనుంచి జపించుటయును, సాయంకాలమున బోరగిలనున్న దోసిలిని నాభిదగ్గర నుంచి, జపించుటయును, చాల కష్టము. గత్యంతరము లేకున్న యెడల కష్టమైనను అట్లే చేయవలయును. గత్యంతరము పాఠాంతరమున్నది గదా! ప్రొద్దున నాభిదగ్గర దోసిలిని వెలికిలగనుంచి జపించుటయును, సాయంకాలమున ముక్కుకు నెదురుగ బోరగిల నున్న దోసిలితో జపించుటయును ఎంతో సౌకర్యముగ నుండును కదా! "శాస్త్రీయ చ సుఖాయ చ" అని పెద్దలందురు గదా! అనగా శాస్త్రము ననుసరించి నట్లుగును. సుఖముగను ఉండును. ఇంకను సాయంకాలమున కాలిముడుకుల నెత్తికొని గదా, జపము చేయవలయును. చేతి ముడుకులను ఆ కాలిముడుకులమీాద నుంచుకొని జపము చేయుట ఇంకను సుఖముగ నుండును. కావున తొలిపాఠమే సాధువైన పాఠము. నేనొకప్పుడు కాశీక్షేత్రమున నొక వృద్ధపండితుని అడుగగ–ప్రథమపాఠము యజుర్వేదీయులకును, పాఠాంతరము ఋగ్వేదీయులకు నని నిర్ణయింపబడినటుల నొక ధర్మశాస్త్రవేత్త తనకు చెప్పినట్లు చెప్పిరి.

జపమునందు గాయత్రీమంత్రముయొక్క పాదముమధ్యను విచ్ఛేదము (విరుచుట) కూడదు.

## స్మృతిముక్తాఫలము

యథానిశాంతం గాయత్రీముచ్చరన్ జపమాచరేత్।
సంధ్యాసు భిన్నపాదా చేత్సజపో నిష్ఫలో భవేత్। అని.

యథానిశాంతం=యథాధ్యయనం = అధ్యయనము చేసినట్లు, అని యర్థము.

అధ్యయనము చేసినట్లే గాయత్రిని ఉచ్చరించుచు జపమును చేయవలెను. సంధ్యావందనమందు పాదములను మధ్యయందు ముక్కలు ముక్కలుగా జేసిన జపము వ్యర్థమగును. ఉచ్చారణ సౌకర్యముకొరకు పాదములమధ్యను, "తత్సవితుః+వరేణ్యం" అని యును, "భర్గో దేవస్య+ధీమహి" అని గాని, "ధియో యో నః+ ప్రచోదయాత్ అని గాని, ఇంకను ఎవరికిష్టమువచ్చినట్లు వారు పద ములను విడదీయగూడదు. అధ్యయనము చేసినట్లే ఏ పాదమున కా పాదమును పూర్తిగనే చెప్పవలెను.

## వ్యాసస్మృతి

త్రిసంధ్యాసు జపేద్దేవీం విచ్ఛిద్యైవ పదత్రయం।
అవిచ్ఛిన్నాం జపేద్యస్తు, రౌరవం నరకం వ్రజేత్॥

కొందరు జపమును శీఘ్రముగ పూర్తిచేయవలెనను తలంపుతో మూడు పాదములను గాని, రెండు పాదములను గాని, విడదీయ కుండ, అవిచ్ఛిన్నముగ కలిపి, ఒకే గుక్కతో నుచ్చరింతురు. అట్లు చెప్పగూడదు. పాదములను దేనికది విడదీసియే యుచ్చరింపవలెను. అట్లుగాక రెండు పాదములను గాని, మూడు పాదములను గాని, కలిపి యుచ్చరించిన యెడల, రౌరవనరకమునకు వెళ్ళును అని.

## విష్ణుస్మృతి

"అచ్ఛిన్నపాదా గాయత్రీ బ్రహ్మహత్యాం ప్రయచ్ఛతి।
విచ్ఛిన్నపాదా గాయత్రీ బ్రహ్మహత్యాం వ్యపోహతి॥

ఏ పాదమున కాపాదముగ పాదములను విడదీయకుండ ఏకముగ నుచ్చరించిన గాయత్రి, బ్రహ్మహత్యాపాపము నిచ్చును. పాదములను విడి విడిగా నుచ్చరించిన గాయత్రి, బ్రహ్మహత్యను పోగొట్టును. కావున మూడుపాదములను విడివిడిగ జేయుచు జపము నాచరింపవలెను.

వ్యాసస్మృతిలో, పదత్రయం విచ్ఛిద్యైవ "మూడుపాదములను విడదీసియే" యనియు, విష్ణుస్మృతిలో "తస్మాత్పదత్రయం ఛిత్వా" అందువలన మూడుపాదములను విడదీసి యనియు నుండుట వలన మూడుపాదములను వేరు వేరుగ విడదీసి, యను నర్థము లభించును. కాని యిచ్చట, "మూడుపాదములను, మధ్యను విడగొట్టి" యను నర్థమును గూడ చేయవచ్చును గదా! ఇట్టి విపరీతార్థము రాకుండ ఆపుటకు ఏమైన వినిగమనము (సాధకమైన యుక్తి)కలదా? ఉన్నది. వినిగమనమున్నది. అవిచ్ఛిన్నాం జపేద్యస్తు రౌరవం నరకం వ్రజేత్" అను వ్యాసవచనమున గాయత్రిని అవిచ్ఛిన్నముగ జపింపగూడదను నిషేధ ముండుటచేత – మధ్యమధ్య విచ్ఛిన్నము చేయవలెనని యర్థము రాగా – మూడుపాదములను విడదీయవలెను అను అర్థము వచ్చునే గాని, పాదముల మధ్య విడదీయవలె నను నర్థము వచ్చుటకు వీలులేదు. కావున "అవిచ్ఛిన్నాం జపేద్యస్తు" ఇత్యాదివిష్ణువచనమే వినిగమనముగనున్నది. [సాధకమైనయుక్తిగ] ఇంకను—ఈ క్రింది మనువచనము గూడ వినిగమనముగ నున్నది. "పంచావసానాం గాయత్రీం జపేన్నిత్యమతంద్రితః। అని గాయత్రీ మంత్రమును ఐదు అవసానములు [నిలుపులు] గలదిగ జపింపవలెను. అట్లు జపించుటలో "అతంద్రితః" చాలచాల జాగ్రత్త గలవాడై యుండవలెను. ఆ పంచావసానములు ఇట్లు చేయవలెను. (1) ఓంకారము, (2) మూడువ్యాహృతులు, (3) గాయత్రీప్రథమపాదము (4) గాయత్రీద్వితీయపాదము, (5) గాయత్రీతృతీయపాదము. ఇట్లు. (1) ఓం, (2) భూర్భువస్సువః, (3) తత్సవితుర్వరేణ్యం, (4

భర్గో దేవస్య ధీమహి, (5) ధియో యో నః ప్రచోదయాత్॥ ఇట్లైదు నిలుపులు గలదిగా, గాయత్రిని జపింపవలెను. ఇట్లు జపించుటలో జాగరూకత దేనికి? ఏలనన—జపించువారు కొంచమేమరిన ఓంకారవ్యాహృతులను కలిపివేసి యుచ్చరింపవచ్చును. లేదా ఒకటి రెండు పాదములను కలిపి యుచ్చరింపవచ్చును. లేదా రెండుమూడు పాదములను కలిపి యుచ్చరింపవచ్చును. అందువలననే కొంచెము కూడ నేమరుపాటు లేకుండ అతిజాగరూకుడుగ నుండవలెనని మనువుగారి యభిప్రాయము. భవతు. కానిండు. ఒకవేళ నేమరపాటుననే రెండింటినైన కలిపి చెప్పిన, దానివలన కలుగు ప్రత్యవాయమేమి? పై స్మృతులలో చెప్పిన రౌరవనరకము, బ్రహ్మహత్యాపాతకము మొదలగునవి వచ్చితీరును. కనుకనే యేమరుపాటు లేకుండ పంచావసానముగ గాయత్రిని జపింపవలెనని విధి. ఈ మనువచనమువలన ఆ యా పాదముల చివరనే ఆపవలెను. కాని పాదమధ్యయందు విడదీయగూడ దను నర్థము స్పష్టముగ వచ్చుచున్నది. కాన పై "విచ్ఛిన్నపాదా" మొదలగు పదములకు పాదమధ్యయందు విడదీయుట యను నర్థము చేయకుండుటకు పై మనువచనము గూడ బలమైన వినిగమన మగుచున్నది. అంతియ గాక గాయత్రీదేవియొక్క పాదములను మధ్యకు ఖండించు మహాపాపికి రౌరవనరకము రాకతప్పదు కదా? కాన పాదము మధ్యను ఖండింపగూడదు. ఇంకను పంచావసానముగ నుచ్చరించుచు జపించిన యెడల—"శాస్త్రాయ చ సుఖాయ చ" యనునట్లు శాస్త్రము ననుసరించినట్లగును. మధ్యమధ్య నిలుపుటచేత మంత్రార్థభావన చేయుటకు గూడ ననువగును. అర్థభావనతోనే జపింపవలెను గదా! ఎవరైన అరగంటలో అష్టోత్తరసహస్రగాయత్రీజపము చేసెదనని తలచి, యొక్కొక్క గ్రుక్కలో (ఊపిరిలో) రెండు మూడుసారులు గూడ గాయత్రీమంత్రము నుచ్చరించుచు జపించిన యెడల, అప్పు డర్థభావన కవకాశమే యుండదు. సరి గదా! ఒత్తక్షరములు [భధ, మొదలగునవి] సరిగ నుచ్చరింపబడక పోవుటవలన, అది

వర్ణలోపముగ తయారైె, యది మంత్రమే కాకుండ పోవును. స్వరములు తప్పిపోవుట కవకాశ మున్నది. అపస్వరముగ పలికిన మహానర్థము కలుగును. కావున మనువచనమున "అతంద్రితః" అను పదము మిక్కిలి సముచితమైనది. అత్యంతజాగరూకుడే పంచావసానములతో జపము చేయగలుగును. ఈ పంచావసానముగ జపము చేయుసంప్రదాయము గూడ విచ్ఛిన్నమైపోయినది. శ్రీశ్రీశ్రీకంచి కామకోటిపీఠాధిపతులు కూడా ఈ పంచావసానజపము మిక్కిలి శ్రేష్ఠమైనదని ఆనతిచ్చిరి.

# గాయత్రీమంత్రత్రైవిధ్యము

## స్మృతిరత్నావళి

"సంపుటైకా షడోంకారా గాయత్రీ త్రివిధా మతా।
తత్రైక ప్రణవా గ్రాహ్యా గృహస్థైర్జపకర్మణి॥
గృహస్థవత్తు జప్తవ్యా సదైవ బ్రహ్మచారిభిః।
సంపుటా చ షడోంకారా భవేతామూర్ధ్వ రేతసామ్॥

గాయత్రీమంత్రము మూడు విధములు. (1) సంపుటా (2) ఏకా (3) షడోంకారా అని. గాయత్రీమంత్రమునకు ఆద్యంతములందు రెండోంకారములున్న యెడల అది "సంపుట" యనబడును. ఆరంభమునందు మాత్రమొక్క ఓంకార మున్న యెడల నది "ఏకా" యనబడును. శాస్త్రప్రకారము మంత్రము నందచ్చటచ్చట ఆరోంకారము లమర్చబడిన యెడల అది "షడోంకార" అనబడును. అందు గృహస్థులు "ఏక" యనబడు గాయత్రినే జపింపవలెను. బ్రహ్మచారులు గూడ గృహస్థులవలెనే జపింతురు. "సంపుట" "షడోంకార" గాయత్రీమంత్రములను ఊర్ధ్వరేతసులగు వానప్రస్థులు జపింపవలెను. అని.

సంవర్తస్మృతియు నిట్లే చెప్పుచున్నది. "ప్రణవాద్యాం తు

సంధ్యాయాం జపేద్వ్యాహృతిభిస్సహ॥ ఆదియందు మాత్రము ప్రణవముగల "ఏక" యనబడు గాయత్రినే వ్యాహృతులతోఁగూడ సంధ్యావందనమున జపింపవలెను. స్మృతిసారసముచ్చయగ్రంథము గూడ నిట్లే జెప్పెను.

బ్రహ్మచారీ గృహస్థశ్చ ప్రణవాద్యామిమాం జపేత్।
అంతే యః ప్రణవం కుర్యాన్నాసౌ వృద్ధిమవాప్నుయాత్॥

బ్రహ్మచారియును గృహస్థుడును ఆదియందు మాత్రము ప్రణవముగల గాయత్రినే జపింపవలెను. మంత్రము చివర కూడ ఓంకారముగల గాయత్రిని జపించిన నాతడు వృద్ధి నొందడు. అని.

## గాయత్రీమంత్రాక్షరనిర్ణయము

వేదమంత్రములయొక్క పాదములందలి యక్షరములను, లెక్కించునప్పుడు, ఉండవలసిన యక్షరసంఖ్యకంటె తక్కువ యున్నప్పుడు ఆ యక్షరసంఖ్యాపూర్తిని "వ్యూహము"తో [పదచ్ఛేదముతో] అంతఃస్థవర్ణ (యరలవ) సమానస్థానముగల స్వరముల (అచ్చుల)తో వ్యవహరించి చేయవలెను.

శౌనకులిట్లు చెప్పుచున్నారు "వ్యూహే దేకాక్షరీభావాన్ పాదేషూనేషు సంపదే" యని. ఋగ్వేదప్రాతిశాఖ్య, 17–22. "క్షైప్రవర్ణాంశ్చ సంయోగాన్ వ్యవేయాత్ సదృశైః స్వరైః। అనిన్నీ, ఋగ్వేదప్రాతిశాఖ్య 10–23 అనగా—అంతఃస్థవర్ణములగు యకార–వకారములతో సమానస్థానములగు ఇకార–ఉకారములను వేరుచేయుటతో అక్షరసంఖ్యాపూర్తిని చేయవలెను. అని యర్థము.

గాయత్రీమంత్రమున మొదటిపాదమున ఎనిమిదియక్షరము లుండవలెను. కాని మామూలుగ మనము లెక్కించగా— ఏడక్షరములే లెక్కకు వచ్చుచున్నవి. ఒక యక్షరము తక్కువ యగుచున్నది. అందువలన పైన జెప్పిన రెండు సూత్రములలో, రెండవ సూత్రము ననుసరించి, "వరేణ్యం" అనుచోట "ణ్య"

వర్ణమును విడదీసి, అంతస్థమగు యకారముతో సమానస్థానమైన "ఇ"కారమును "ణ్"కారమునకు తగిలించి, "వరేణియం" అని చేసిన యెడల ఆ, ఎనిమిదక్షరములు పూర్తి యగును. కాని, యిచ్చట నక్షరములను లెక్కించుకాలమునందు మాత్రమే పైన జెప్పిన విధముగ చేసి సంఖ్యాపూర్తిని చేయవలెనే కాని, జపము చేయునప్పుడు "వరేణియం" అని చెప్పగూడదు. "వరేణ్యం" అనియే జపింపవలెను. ఉపాసనావిధానమను గ్రంథమున నిట్లున్నది.

"పదే వరేణ్యమిత్యత్ర జ్ఞేయం వర్ణచతుష్టయం।
వరేణియం న తూచ్చార్యమితి వృద్ధప్రభాషితమ్॥ అని.

పైన జెప్పిన యర్థమే.

గాయత్రీమంత్రమున మూడు పాదములున్నవి. "త్రిపదా గాయత్రీ" అని. ఒక్కొక్క పాదమున ఎనిమిదేసి యక్షరము లుండవలెను. అప్పుడే "చతుర్వింశత్యక్షరా" యను గాయత్రీ హృదయ వచనము సరియైన దగును. మొదటి పాదమున ఏడక్షరములే యున్నవి గదా! ఎట్లు పొసగును? అను ప్రశ్న వచ్చిన యెడల పైన జెప్పినది సమాధానమగును.

## హారీతస్మృతి

"జపేన దేవతా నిత్యం స్తూయమానా ప్రసీదతి।
ప్రసన్నే విపులాన్ భోగాన్ ప్రాప్నువంతి మనీషిణః॥
యక్షరక్షః పిశాచాశ్చ గ్రహాః సర్వే విభీషణాః।
జపినం నోపసర్పంతి దూరాదేవాపయాంతి తే॥

నిత్యము మంత్రజపముచేత దేవత స్తుతింపబడినదై ప్రసన్నమగును. దేవత ప్రసన్నమైన యెడల జపించువారు అధికమైన భోగముల ననుభవింతురు. యక్షులు రక్షస్సులు, పిశాచములు, భయంకరములైన యన్ని విధములైన దుష్టగ్రహములున్ను [నవగ్రహములు కావు] జపించువాని దగ్గరకు రాజాలవు. దూరమునుండియే తొలగిపోవును.

## జపసంఖ్యానవిధానము

జపమును లెక్కించు విషయమున "ఉపాసనా విధానము"ను గ్రంథమిట్లు చెప్పుచున్నది.

జపసంఖ్యా తు కర్తవ్యా నాఽసంఖ్యాతం జపేత్సుధీః।
నసంఖ్యాకారకస్యాస్య సర్వం భవతి నిష్ఫలమ్॥

జపమును తప్పక లెక్కించవలెను. లెక్క లేని జపమును జేయగూడదు. జపమును లెక్కించని వాని జపమంతయును నిష్ఫలమగును. లెక్కించు పద్ధతిని "స్మృతితత్వదీపిక" ఇట్లు చెప్పుచున్నది.

పర్వభిస్తు జపేద్దేవిం న మాలాభిః కదాచన।
సంధ్యాజపం తు గాయత్ర్యాః కుర్యాదంగుళిపర్వభిః॥
సంధ్యాతిరిక్తగాయత్రీం కుర్యాద్వా జపమాలయా॥ అని.

గాయత్రీమంత్రజపము యొక్క లెక్కను కుడిచేతి వ్రేళ్ళ గనుపులతోడనే చేయవలెను. ఒకప్పుడును జపమాలతో చేయగూడదు. సంధ్యావందనాంగమగు గాయత్రీజపమును మాత్రము వ్రేళ్ళగనుపులతోనే చేయవలెను. మాలతో గాదు. సంధ్యావందనాంగము కాని [సహస్రగాయత్రీమంత్రజపము, పురశ్చరణ గాయత్రీ మంత్రజపము ఈ మొదలైన] గాయత్రీమంత్రజపము యొక్క సంఖ్యను మాలతో జేసిన జేయవచ్చును. అని చెప్పుటచేత సంధ్యాంగగాయత్రీజపసంఖ్యను వ్రేళ్లగనుపులతోనే జేయవలెను. వివిధములైన మాలలు కామ్యజపములకొరకే విధింపబడినవి. లెక్కించు పద్ధతియును పై స్మృతియందు చెప్పబడినది.

"ఆరభ్యానామికాయాస్తు మధ్యమే పర్వణి క్రమాత్।
తర్జనీమూలపర్యంతం జపేద్దశసు పర్వసు॥
మధ్యమాంగుళిమూలే తు యత్పర్వద్వితయం భవేత్।
తద్వై మేరుం విజానీయాత్ జపంస్తన్నాతిలంఘయేత్॥

అనామిక [ఉంగరపు] వ్రేలునందున్న మూడు గనుపులలో మధ్యనున్న గనుపునుండి యారంభించి, దాని క్రింది గనుపు మీదుగా కనిష్ఠికయొక్క క్రిందిగనుపు మీదుగా అనామిక పై గనుపు నడిమి వ్రేలు పైగనుపు, తర్జని పై గనుపునుండి క్రింది గనుపు వరకున్న పది గనుపులందును లెక్కింపవలెను. తర్వాత మరియొక పదిని లెక్కింపవలెననిన, మరల చూపుడు వ్రేలు క్రింది గనుపునుండి వెనుకకు తొలుత లెక్కించిన గనుపుల మీదుగనే, అనామిక మధ్యగనుపు వరకును, పది. మరల ననామిక మధ్యగనుపునుండి వెనుకటి వలెనే తర్జని క్రింది గనుపువరకును పది, ఈ విధముగ అనామిక మధ్యగనుపు నుండి, తర్జని క్రిందిగనుపు వరకు, మరల తర్జని క్రింది గనుపునుండి యనామిక మధ్యగనుపువరకును, పదేసి పదేసి చొప్పున నూటయెనిమిది వరకును లెక్కింపవచ్చును. పదులనుండి నూరువరకును పూవులను గుర్తుగ పెట్టుకొనవచ్చును. నడిమివ్రేలి యడుగున నున్న రెండు గనుపులను, తావళమునందలి పెద్ద మేరుపూస వలె "మేరు" గనుపులందురు. వాటిని లెక్కింపగూడదు. ఆ మేరు పూసను దాటగూడదు. దాటకుండ మరల వెనుకకే లెక్కింపవలెను. ఇది గనుపులమీద లెక్కించుపద్ధతి.

## వ్యాసస్మృతి

పర్వభిస్తు జపః కార్యః నాంగుళీనాం నిపాతనైః।
నిపాతనైస్తు యజ్జప్తం తత్సర్వం రాక్షసం భవేత్॥

వ్రేలి గనుపులందే పైన చెప్పిన విధముగ గాయత్రిని జపింపవలెను. వ్రేళ్లను ముడుచుచు లెక్కింపగూడదు. వ్రేళ్లను ముడుచుచు జపించిన, ఆ జపము రాక్షసులకు జెందును.

## ఉపాసనావిధానగ్రంథమున

అంగుళ్యగ్రేణ యజ్జప్తం యజ్జప్తం మేరులంఘనాత్।
పర్వసంధిషు యజ్జప్తం తత్సర్వం నిష్ఫలం భవేత్॥

ఆచ్ఛాద్య వాససా హస్తౌ దక్షిణేన సదా జపేత్ ।
అంగుళీర్న వియుంజీత కించిదాకుంచితే కరే॥
అంగుళీనాం వియోగాచ్ఛ ఛిద్రేషు స్రవతే జపః॥

వ్రేళ్ళకొనలతో లెక్కించినను, మేరుగనుపులను దాటి లెక్కించినను, గనుపుల మధ్యభాగములచే లెక్కించినను, ఆ జప మంతయును నిష్ఫలమగును.

జపించునపుడు రెండు చేతులను వస్త్రముచేత కప్పి లోపల కుడిచేతితో లెక్కింపవలెను. జపించునపుడు అరచేతిని నిట్టనిలువుగ నుంచక కొంచెము వంచవలెను. అట్లు వంచిన యరచేతిలోని వ్రేళ్ళను సందులు లేకుండ దగ్గరగచేర్చి యుంచవలెను. వ్రేళ్లను దూరదూరముగ నుంచగూడదు. దూరముగ నుంచినయెడల నా వ్రేళ్లసందులనుండి జపము కారిపోవును.

## గోభిలస్మృతి

మతిమాన్న కదాచిత్తు గాయత్రీముదకే జపేత్ ।
గాయత్ర్యగ్నిముఖీ ప్రోక్తా తస్మాదుత్తీర్య తాం జపేత్ ॥

నీటియందు నిలబడి గాయత్రిని జపింపరాదు. ఏలనన— గాయత్రీముఖము అగ్ని యని వేదము, (గాయత్రీహృదయము) "అగ్నిర్ముఖం" అని చెప్పుచున్నది. కాన ఒడ్డుమీదకు వచ్చి ఒడ్డున జపింపవలెను.

# జపకాలమున నిషిద్ధవిషయములు

## వ్యాసస్మృతి

ఉష్ణీషీ కంచుకీ నగ్నః ముక్తకేశో గళావృతః।
చింతావ్యాకులచిత్తో వా భ్రాంతః క్రుద్ధో బుభుక్షితః।
అనాసనః శయానో వా గచ్ఛన్నుత్థిత ఏవ వా॥
రథ్యాయామశివస్థానే న జపేత్తిమిరాంతరే॥

జపము చేయుచున్నప్పుడు తలపాగను పెట్టుకొనగూడదు. చొక్కాయ మున్నగు నంగరేకులను తొడుగుకొనరాదు. దిగంబరుడుగ నుండరాదు. జుట్టు ముడి చేసికొనవలెను. వస్త్రముచేత మెడను చుట్టుకొనగూడదు. విచారము, కోపము, భ్రాంతి వీటితో నిండియున్న మనసుగల వాడు జపము చేయరాదు. ఆకలిగొన్న వాడు జపము చేయరాదు. ఆసనములేకుండ జపము చేయరాదు. శరీరమును నేలమీద వాల్చుకొని జపింపరాదు. నడచుచు గాని, నిలబడి గాని, నడచుమార్గమున గాని, అమంగళమగు చోటున, చీకటిలోను జపింపగూడదు.

ఈ నిషేధము లన్నియును స్వస్థముగ నున్నవానికి. అస్వస్థుడైన యెడల సమయానుసారముగ కొన్ని నిషేధము లుండవు. ''నిలబడినవాడు'' అను నిషేధము ప్రాతర్మధ్యాహ్న సంధ్యాంగ గాయత్రీజపమునకు వర్తింపదు.

## వ్యాసస్మృతి

జపకాలే న భాషేత వ్రతహోమాదికేషు చ।
ఏతేష్వేవావసక్తస్తు యద్యాగచ్ఛేద్ద్విజోత్తమః॥
అభివాద్య తతో విప్రం యోగక్షేమం చ కీర్తయేత్॥

జపకాలమందును, వ్రతకాలమందును, హోమకాలమందును. ఇతరులతో మాటలాడకూడదు. కాని ఈ జపాదికార్యములను ఆసక్తితో జేయు బ్రాహ్మణుడు వచ్చిన యెడల తాను జేయు పనిని ఆపవలసిన చోటున ఆపి, వానిని నమస్కరించి యోగక్షేమములను కొంచెము పరామర్శింపవచ్చును. ఆ వచ్చినాతడు కొంచెము అసాధారణుడుగ నుండవలెను.

## ఉపాసనావిధానగ్రంథమున

జపే ప్రమాదాత్ క్షుతజృంభణాద్యోఽపానవాయునిర్గమనే
ఆచమనస్థానే దక్షిణశ్రవణం స్పృష్ట్వా జపేత్।

జపము మధ్యను తుమ్ము, ఆవులింత, ఒళ్ళు విరుపు, అపాన వాయువు పోవుట, త్రేనుపు మొదలైనవి జరిగిన యెడల, ఆచమనము చేయవలెను. కాని జపమధ్యయందు చేయగూడదు గాన, ఆచమన మునకు బదులు, కుడి చెవిని తాకిన చాలును. అట్లు తాకిన తర్వాత జపమును సాగించవచ్చును.

## బోధాయనస్మృతి

''నాభేరధః స్వకాయం చ స్పృష్ట్వా ప్రక్షాళయేత్కరౌ।
దక్షిణం వా స్పృశేత్కర్ణం స్మరేద్వా విష్ణుమవ్యయమ్॥

జపము, ధ్యానము, ఉపస్థానము, పూజ మొదలగు వైదిక కర్మలు చేయునప్పుడు ఏ కారణము చేతనైనను బొడ్డుకంటె క్రింద దగు తన శరీరభాగమును గూడ తాకకూడదు. అట్లు తాకవలసి వచ్చిన యెడల, తాకిన తర్వాత చేతులను కడిగికొనవలెను. కడిగి కొనుటకు వీలులేని యెడల తన కుడి చెవిని తాకవలెను. చెవిని తాకుటకు కూడ వీలులేని యెడల. శ్రీ మహావిష్ణువును స్మరింప వలెను. విష్ణుస్మరణచేత సకలకర్మదోషపరిహారమగును. ''విష్ణు ర్విష్ణుర్విష్ణుః'' అని ముమ్మారు తలంచవలెను. ఏదైన మంత్రజపము చేయునప్పుడు, ఇతరనామస్మరణము చేయగూడదు. కావున జప ధ్యాన సమయములలో తన కుడి చెవిని తాకుటయే మంచిది. కుడి చెవియొక్క శ్రేష్ఠత్వమును గూర్చి స్మృతిముక్తాఫలమిట్లు చెప్పు చున్నది.

''ఆదిత్యా వసవస్సోమో వహ్నిర్వాయు స్తథైవ చ।
విప్రస్య దక్షిణే కర్ణే సర్వా స్తిష్ఠంతి దేవతాః॥
కుర్వీతాలంబనం వాపి దక్షిణశ్రవణస్య చ।

ద్వాదశాదిత్యులు, అష్టవసువులు, చంద్రుడు, అగ్ని, వాయు వున్నూ మొదలగు దేవతలందరు విప్రుని కుడి చెవియందు ఉందురు. అందువలన పైన వివరించిన కర్మదోషము కలిగినప్పుడు ఆదోష పరి హారార్థము కుడిచెవిని తాకవలెను.

## గౌతమస్మృతి

క్రోధం హాస్యం చ నిద్రాం చ నిష్ఠీవనవిజృంభణే।
దర్శనం శ్వపచాదీనాం వర్జయేజ్జపకర్మణి॥

జపము చేయునప్పుడు కోపము, నవ్వు, నిద్ర, ఉమ్మట, తుమ్ము, ఆవులింత ఒళ్ళువిరుపు పంచమాదులదర్శనము మొదలగు వాటిని చేయగూడదు. అట్లు జరిగిన యెడల కుడి చెవిని తాకవలెను.

## గాయత్రీ చతుర్థపాద జపవిచారము

గాయత్రీమంత్రము యొక్క నాలుగవ పాదమును జపించుట యందు అందరికిని అధికారము లేదు. ఏల? ఉపనయనకాలమున ప్రణవముతోను మూడు మహావ్యాహృతులతోను కూడిన త్రిపాద (మూడు పాదముల) గాయత్రీమంత్రము ఉపదేశింపబడును. కావున సంధ్యావందనమున ఆ గాయత్రియే జపింపబడును. ఏలననగా— "యధానిశాంతం గాయత్రీముచ్చరన్ జపమాచరేత్" అధ్యయనము చేయబడిన విధముగనే గాయత్రి నుచ్చరించుచు జపమును చేయవలెనని శాస్త్రమున చెప్పబడుటచేత త్రిపాదగాయత్రీజపమునే చేయవలెను. 'త్రిభ్య ఏవ తు వేదేభ్యః పాదం పాదమదూదుహత్। ఏతదక్షరమేతాం చ జపన్ వ్యాహృతిపూర్వికాం॥ సంధ్యయోర్వేదవిద్విప్రో వేదపుణ్యేన యుజ్యతే॥

ఋగ్యజుస్సామవేదములు మూడింటినుండి మూడు పాదములను పితికి, [ఎంచితీసి] త్రిపాదగాయత్రి కూర్చబడినది. ఏతదక్షరమనగ–ప్రణవము. కాగా–ఎప్పుడును ప్రణవము, తర్వాత మూడు మహావ్యాహృతులు, ముందుగల ఏతాం=ఈ త్రిపదాగాయత్రిని సాయంప్రాతస్సంధ్యలందు జపించుచు, మూడు వేదముల పారాయణమువలన గలుగు మహాపుణ్యమును పొందుచున్నాడు అని. త్రిపాద గాయత్రియే యుపనయనమున నుపదేశింపబడును. దానినే యందరు జపింపవలెనని మనువు చెప్పెను. మనువుచనము మహాప్రమాణము.

కాని-గాయత్రికి "పరోరజసిసావదోమ్" అను నాలవ పాదము గూడ గలదు. అది యథర్వణవేదమునుండి గ్రహింపబడినది. అది మన కుపదేశింపబడలేదు. కాన దానిని జపించుటకు మనకధికారము లేదు. గృహస్థులును బ్రహ్మచారులును దానిని జపింపగూడదు. ఈ విషయమున పలువురు మహాపండితులు అవుననిన కాదనుచు పూర్వ పక్షసిద్ధాంతములతో చాలకాలమునుండి వాదోపవాదములను జేయు చున్నారు. ఇంతవరకు నేమియును తెగలేదు. కాని శ్రీవిద్యోపాస కులు శ్రీచక్రార్చనయందు గాయత్ర్యుచ్చారణకాలమున నా చతుర్థపాదమును గూడ నుచ్చరించి యర్చింతురని మంత్రశాస్త్రజ్ఞులు చెప్పుదురు. కాన మనువచనప్రకారము వైదికసంధ్యావందనంబున నాలవపాదమును జపించకూడదనియే పలువుర మతము.

# శ్రీగాయత్రీమంత్రమహిమ

## మనుస్మృతి

"త్రిభ్య ఏవ తు వేదేభ్యః పాదం పాదమదూదుహత్॥
ఏతదక్షరమేతాం చ జపన్ వ్యాహృతిపూర్వికాం॥
సంధ్యయోర్వేదవిద్విప్రో వేదపుణ్యేన యుజ్యతే॥

బ్రహ్మచేత ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము అనెడు మూడు వేదములనుండియు ఆవేదముల సారాంశములుగా ఒక్కొక్క పాదముగ మూడు పాదములు గ్రహింపబడినవి. ఆ మూడుపాదము లను చేర్చి త్రిపాదగాయత్రీమంత్రము కూర్చబడినది. అనగా— ఒక్కొక్క పాదము నొక్కొక్క వేదముయొక్క సారము. కాగా— వేదత్రయసారము గాయత్రీమంత్రము. ఏతదక్షర మనగా ప్రణ వము. కాగా—తొలుత ప్రణవము, తర్వాత మూడు మహావ్యా హృతులు ముందుగల, ఏతాం=ఈ గాయత్రీమంత్రమును, సాయం ప్రాతస్సంధ్యలయందు వేదము తెలిసిన విప్రుడు జపించుచు, సర్వ వేదపారాయణపుణ్యమును తప్పక పొందుచున్నాడని యర్థము.

ఆహా! గాయత్రీమంత్రమహిమ! ఈ రహస్యమును తెలియక గాయత్రి నెవ్వరును జపింపకున్నారు. అనగా నీరహస్యము నెవ్వరును తెలిసి కొనకున్నారు. గాయత్రీమంత్రము సర్వవేదసారము. గాయత్రీదేవి సర్వవేదమాత. "గాయత్రీం ఛందసాం మాతా" యనియును "స్తుతో మయా వరదా వేదమాతా" యనియును శ్రుతియే చెప్పు చున్నది.

## బోధాయనస్మృతి

"ప్రణవో, వ్యాహృతయస్తిస్రః, సావిత్రీ చేతి పంచమహాయజ్ఞాః అహరహః బ్రాహ్మణం కిల్బిషాత్పావయంతి। ఓంకారము మూడు మహావ్యాహృతులు "సావిత్రి" యనగ గాయత్రీమంత్రము ఈ యైదును ఐదు మహాయజ్ఞములతో సమానము. ఈ యైదును ప్రతిదినము జపింపబడుచున్నవై బ్రాహ్మణుని పాపములనుండి [పాప ములనునాశముజేసి] పవిత్రము జేయుచున్నవి. పంచమహాయజ్ఞములు 1. బ్రహ్మయజ్ఞము. సర్వవేదశాస్త్రపురాణేతిహాసములను పారాయణజేయుట, 2. పితృయజ్ఞము. పితృతర్పణము, 3. దేవయజ్ఞము వైశ్వదేవము, 4. భూతయజ్ఞము, భూతబలి, యనగా ప్రాణులకు ఆహారము నిచ్చుట. పలువిధములుగ నుండును. 5. మనుష్య యజ్ఞము, అతిథిసత్కారము. ఈ యైదు యజ్ఞములను ప్రతిదినమును నాచరించుచుండుటవలన బ్రాహ్మణుని సకలపాపములును నశించి, పరమపవిత్రుడగును. అశక్తివలన గాని అనవకాశమువలనగాని యా పంచమహాయజ్ఞములను చేయలేని బ్రాహ్మణుడు ఈ గాయిత్రీ మంత్రమును యథాశాస్త్రముగ భక్తిశ్రద్ధలతో జపించిన యెడల పంచమహాయజ్ఞముల నాచరించినట్లే యగును. వాని పాపములన్ని యును నశించి యత్యంతపవిత్రుడగును. సందియము లేదు. ఇది మహర్షి వచనము. ఈ గాయత్రీమంత్రమును జపించిన ద్విజులెంత ధన్యులు!

## గాయత్రీవ్యాఖ్యానగ్రంథమున భరద్వాజులు

''సమస్తసప్తతంతుభ్యో జపయజ్ఞః పరః స్మృతః ।
హింసయాఽన్యే ప్రవర్తంతే జపయజ్ఞో న హింసయా॥
తస్మాజ్జపః సదా శ్రేష్ఠః సర్వస్మాత్పుణ్యసాధనాత్ ।
ఏవం జపపరః సంధ్యాం భక్త్యోపాసీత యో ద్విజః॥
నియమేన సదా గచ్ఛేదృషిత్వం నాత్ర సంశయః॥

''సప్తతంతు'' అనగా యజ్ఞము. కాగా—వేదమునందు ప్రసిద్ధమైన యన్ని యజ్ఞములకంటె జపరూపమైన యజ్ఞమే శ్రేష్ఠము. ఏలననగ—యజ్ఞములన్నియును హింసతోగూడినవి. జపయజ్ఞమున హింసయేలేదు. అందువలన పుణ్యమును సాధించు కర్మలన్నింటిలో జపమే శ్రేష్ఠము. ఇట్లు జపపరుడై యే ద్విజుడు సంధ్యోపాసన చేయునో, యాతడు తప్పక ఋషి యగును. సందేహములేదు. సూతసంహితయందు వెనుక జెప్పిన ప్రకారము అగ్నిహోత్రము మొదలు అశ్వమేధమువరకును కాయికకర్మలే. ఉపాసనలు (ధ్యానములు) అన్నియును మానసికములు. కాయికములకంటె వాచికములుత్తమములు. వాచికములకంటె మానసికములుత్తమములు. కావున హోమరూపయజ్ఞములకంటె జపయజ్ఞములుత్తమములు అని భారద్వాజులు చెప్పిరి. ఇంకను – సప్తకోటిమహామంత్రములలో శ్రేష్ఠతమమైనదియు, మంత్రరాజమగు శ్రీ పంచదశీమహామంత్రము గూడ శ్రీ గాయత్రీమంత్రమునుండియే యుద్ధరింపబడినదని ''కామకళావిలాస'' మను గ్రంథమునందు వివరింపబడియున్నది. గాయత్రీమంత్రమున ఇరువదిమూడక్షరములున్నవి. అందు, వచ్చిన యక్షరమును మరల లెక్కింపక, క్రొత్త యక్షరములను మాత్రము లెక్కించిన యెడల పదునేనక్షరములే యున్నవి. ఆ విధముగ చూచిన గాయత్రి కూడ పంచదశాక్షరియే. ఇంత సాటిలేని మహామంత్రము కావుననే ''న గాయత్ర్యాః పరో మంత్రః'' గాయత్రీమంత్రము

కంటె గొప్ప మంత్రము మరియొకటి లేదని మనుస్మృతి యుద్ఘో
షించుచున్నది. గాయత్రీమంత్రజపముచేత నెంతెంతలేసి పాపపు
కొండలును గూడ కూలిపోవునని, ధర్మశాస్త్రములు చెప్పుచున్నవి.
గాయత్రీమంత్రజపముచేత పోని పాపము లేదు. గాయత్రీమహి
మను సహస్రముఖుడగు శేషుడు గూడ వర్ణింపలేడు. త్రిమూర్తులును
గాయత్రీదేవి యొక్క శరీరావయవములు. కావున సంధ్యోపాసనా
నంతరము ద్విజులు గాయత్రీమంత్రము నవశ్యము జపింపవలెను.

**ముక్తావిద్రుమేత్యాది**—ధ్యానశ్లోకార్థము, గాయత్రీమంత్రా
ర్థము గూడ సంధ్యామంత్రార్థబోధినీభాగమున వివరముగ వ్రాయ
బడినవి. అక్కడ చూచునది.

ఇట్లు యథాశక్తి జపించి, జపమును పరబ్రహ్మమునకు
సమర్పించునది.

జపప్రకరణము సమాప్తము.

అవ = గాయత్రీజపమునకు ఉత్తరాంగమైన గాయత్రీదేవ్యు
ద్వాసనము ఇతరమైన యుపాసనాంగములును వివరింపబడుచున్నవి.

**దేవీముద్వాస్య గాయత్రీ ముపతిష్ఠేత భాస్కరమ్।**
**దిశో నత్వా రోదసీ చ ప్రవరేణాఽభివాదయేత్॥**　　**34**

గాయత్రీజపము తర్వాత "ఉత్తమేశిఖరే" అను అనువాకముచేత
గాయత్రీదేవికి ఉద్వాసము చెప్పవలెను. ఇది జపమున కుత్తరాం
గము. తర్వాత ప్రాతర్మధ్యాహ్నములందు తూర్పుముఖముగను,
సాయంకాలమున పడమరముఖముగను నిలబడి, చేతులెత్తి జోడించి
ప్రొద్దున "మిత్రస్య చర్షణీ"యను మంత్రముచేతను, మధ్యాహ్న
మున "ఆ సత్యేన రజసా"యను మంత్రముచేతను, సాయంకాల
మున "ఇమం మే వరుణ"యను మంత్రముచేతను, సూర్యోపస్థాన
ములను చేయవలెను. తర్వాత "ఓం నమః ప్రాచ్యై దిశే" ఇత్యాది
మంత్రములచేత దిక్కులను, దిక్పతులను నమస్కరింపవలెను.
మూలమున "దిశః"యను పదము దిక్పతులకు కూడ సూచకము.

తర్వాత "ఇదం ద్యావాపృథివీ" ఇత్యాదిమంత్రముచేత భూమ్యాకాశవందనమును చేయవలెను. అటు తర్వాత ప్రవరను చెప్పి దేవతలకును ప్రక్కల నున్నయెడల గురువులకును, పెద్దలకును అభివాదనము [పేరుచెప్పి నమస్కారము] చేయవలెను. పై నుదహరించిన వానికి ప్రమాణశ్లోకములు.

## పితామహస్మృతి

"ఏవం జప్త్వా యథాశక్తి హ్యుదితే చ దివాకరే।
ఉత్తమేత్యనువాకేన ఉద్వాస్య తు యథాగతమ్॥
గాయత్రీమితి శేషః॥

ఈ విధముగ యథాశక్తిగ గాయత్రిని జపించి, సూర్యోదయమైన తర్వాత, "ఉత్తమే శిఖరే"యను ననువాకముచేత గాయత్రీదేవికి ఉద్వాసన చెప్పవలెను.

తైత్తరీయారణ్యకపరిశిష్టమున పదవ ప్రపాఠకముయొక్క భాష్యమున "ఉత్తమే శిఖరే"యను ననువాకపు నవతారికయందు "జపాదనంతరం గాయత్రీవిసర్జనస్య మంత్రమాహ" జపము తర్వాత గాయత్రీవిసర్జనమునకు మంత్రము చెప్పబడుచున్నది. అని జపమునకు వెనువెంటనే గాయత్ర్యుద్వాసన చెప్పబడినది. కాని, ఆంధ్రదేశాచారము వేరు విధముగ నున్నది. సూర్యోపస్థానాదుల తర్వాత దేవ్యుద్వాసనము కనబడుచున్నది. కాని ధర్మశాస్త్రమునందు నా యాంధ్రాచారమునకు ప్రమాణము మృగ్యమే. ద్రావిడాచారమున జపసమనంతరమే ఉద్వాసన చేయబడుచున్నది. "ఉత్తమే శిఖరే"యను మంత్రము, "స్తుతో మయా వరదా" యను మంత్రము రెండును చేరి ఒకే యనువాకమున నున్నవి. అది ముప్పదిమూడవ యనువాకము, ప్రమాణవచనమున "ఉత్తమేత్యనువాకేన" అనుదానికి "ఉత్తమే"యను పదముతో నారంభించు ననువాకముతో నని యర్థము. కాని "ఉత్తమే"యని యారంభించు

మంత్రముతో నని యర్థము కాదు. కాగా, "ఉత్తమే"యను మంత్రముతోను, "స్తుతో మయా"అను మంత్రముతోను రెండింటి తోను నుద్వాసనము చెప్పవలెను. ఈ విషయమున నాంధ్రదేశా చారము సరిగనే యున్నది. ద్రావిడులు "ఉత్తమే"యను నొక్క మంత్రముతోనే యుద్వాసనము చెప్పుచున్నారు. అది పొరపాటు. ద్రావిడసంధ్యావందనమున ఇంకను చాల లోపము లున్నవి. వారు కావలెననియే తగ్గించినట్లు తోచెడిని.

## రెండవ యుత్తరాంగము

రెండవ యుత్తరాంగమగు సూర్యోపస్థానమంత్రమునుగూర్చి కూర్మపురాణము.

> అథోపతిష్ఠేదాదిత్యముదయంతం సమాహితః।
> మంత్రైస్తు వివిధైః సౌరైః ఋగ్యజుస్సామసంభవైః॥

గాయత్ర్యుద్వాసనానంతరము ఉదయించుచున్న [ఉదయించిన] సూర్యుని నెమ్మదియైన మనసుతో ఋగ్వేదయజుర్వేద సామవేదములందలి సూర్యమంత్రములతో ఆయా వేదముల వారు స్తుతింపవలెను. [ఉపస్థానము చేయవలెను.]

ప్రొద్దున "మిత్రస్య చర్షణీ" ఇత్యాది మంత్రములచేతను, మధ్యాహ్నమున "ఆసత్యేనరజసా" ఇత్యాది మంత్రములచేతను ఉపస్థానము చేయవలెను.

"వారుణీభిరథాదిత్యముపస్థాయ చ భాస్కరం" అని. "ఇమం మే వరుణ" ఇత్యాది వారుణమంత్రములచేత, సాయముపస్థానమును చేయవలెనని నారాయణస్మృతి చెప్పుచున్నది. ఒకానొక స్మృతియందు సూర్యుడే సాయంకాలమున వరుణశబ్దము చేత పిలువబడునని యున్నది.

## మూడవ యుత్తరాంగము దిఙ్నమస్కారము

### విష్ణుస్మృతి

"కాలద్వయేఽపి సంధ్యాఖ్యదేవతాయా ఉపాసనం।
కుర్వన్ దిశో నమస్కుర్యాద్దిగీశాంశ్చ పృథక్ పృథక్॥

ప్రాతస్సాయంకాలములందు సంధ్యాదేవతోపాసనమును చేయు నుపాసకుడు ఉపస్థానము తర్వాత సంధ్యోపాసనోత్తరాంగముగ దిక్కులనున్ను, దిక్పతులనున్ను వేరు వేరుగ నమస్కరింపవలెను. కాలద్వయేఽపి అని చెప్పుటవలన దిఙ్నమస్కారము మధ్యాహ్నము నందుండదని సూచితము. శిష్టాచారము కూడ నట్లే యున్నది.

స్మృతిముక్తాఫలమున దిఙ్నమస్కారవిధానము వివరింపబడినది.

"దిశశ్చతస్రః ప్రాచ్యాద్యాః ప్రణవాదినమోంతకైః।
చతుర్థ్యంతైర్నమస్కుర్యాదూర్ధ్వాధః సంనమేద్దిశౌ॥
సంధ్యా చ సా చ సావిత్రీ గాయత్రీ చ సరస్వతీ।
చతసృభ్యో నమస్కుర్యాత్ప్రణవాదినమోఽంతకైః॥
సర్వాభ్యో దేవతాభ్యశ్చ కామోఽకార్షీచ్చ సంనమేత్।
అంతరిక్షం చ భూమిం చ దండవత్ప్రణమేత్తతః॥

తూర్పు మొదలగు నాలుగు దిక్కులనున్నూ, దిక్పతులనున్నూ, ఆదియందోంకారమున్నూ, చివరను నమఃపదమును ఉంచి చతుర్థీవిభక్త్యంతములతో నమస్కరింపవలెను. అట్లే ఊర్ధ్వదిక్కును, అధోదిక్కునున్నూ తత్పతులను నమస్కరింపవలెను. సంధ్యా- సావిత్రీ- గాయత్రీ- సరస్వతీ- దేవతలను గూడ దిక్కులను నమస్కరించిన విధముగానే నమస్కరింపవలెను. సర్వాభ్యో దేవతాభ్యో నమః అనియును నమస్కరింపవలెను. అచ్చటి, చకారము వలన "దేవేభ్యో నమః, ఋషిభ్యో నమః, మునిభ్యో నమః.

గురుభ్యో నమః, పితృభ్యో నమః'' అనియును నమస్కరింపవలెను, కామోఽకార్షీన్నమో నమః అనియును నమస్కరింపవలెను. ఇచ్చటి చకారమువలన ''మన్యురకార్షీన్నమో నమః'' అనియును నమస్కరింపవలెను.

## నాల్గవ యుత్తరాంగము

పైన దిక్కులు మొదలగు వానిని గూర్చి వరుసగ చెప్పి, భూమ్యాకాశవందనము దగ్గరకు రాగానే, తతః తర్వాత, అని చెప్పబడినది. ఏలననగా—ఇంతవరకు చెప్పినదంతయు మూడవ యుత్తరాంగము. ఇటు తర్వాతిది నాల్గవ యుత్తరాంగమని తెలుపుటకు. ఈ నమస్కారవిధానము గూడ వేరుగనే యున్నది. భూమి మీాద పడి సాష్టాంగనమస్కారము చేయవలెను. కాన నిది నాల్గవ యుత్తరాంగము' ఈ నమస్కారమునకు మంత్రము ''ఇదం ద్యావా పృథివీ'' ఇత్యాది.

## ఐదవ యుత్తరాంగము

''ప్రవరేణాఽభివాదయేత్'' ప్రవర చెప్పి అభివాదనము చేయవలెను. తన గోత్రమును ప్రవర్తింపజేసిన ఋషులయొక్క వరుస ''ప్రవర'' యనబడును. గోత్రమును ప్రవర్తింపజేసిన ఋషుల సంఖ్యయు వేర్వేరుగ నుండును. ఒకే ఋషి, ఇద్దరు ఋషులు, ముగ్గురు ఋషులు, నలుగురు ఋషులు ఇత్యాది. ఈ విధముగ ప్రవరను చెప్పి అభివాదనము చేయవలెను. అభివాదన మనగ తన పేరును చెప్పి నమస్కరించుట. అభివాదనప్రకారంబున–ఆపస్తంబులు.

''దక్షిణం బాహుం శ్రోత్రసమం ప్రసార్య బ్రాహ్మణోఽభివాదయీత[1]
ఉరస్సమం రాజన్యః, మధ్యసమం వైశ్యః॥ ఇతి.

కుడి బాహువును వంచి, చెవివరకు చాపి ఎడమచేతితో కుడి చేతి ముడుకును తాకుచు ప్రవరాదులను చెప్పి బ్రాహ్మణు డభి

వదింపవలెను. కుడి చేతిని గుండెవరకు చాపి క్షత్రియుడును, నడుము వరకు చాపి వైశ్యుండును అభివదింపవలెను. కాని యాంధ్రదేశా చారమున కుడియెడమ చేతులతో నెడమ కుడి చెవులను తాకుచు ప్రవర చెప్పి యభివదించుట యాచారముగ నున్నది. ఇందుకు ప్రమాణమింతవరకు కనబడలేదు.

అభివాదన మెట్లనిన—

చతుస్సాగరపర్యంతం గోబ్రాహ్మణేభ్యః శుభం భవతు. ఆంగీరస- బార్హస్పత్య - భారద్వాజ - త్రయార్షేయ - ప్రవరాన్విత- భారద్వాజసగోత్రః, యజుర్వేదీ, తైత్తరీయ - శాఖాధ్యాయీ ఆప స్తంబసూత్రః [తన పేరునకు శర్మపదమును చేర్చి] వేంకటాచల శర్మా అహం భో అభివాదయే'' అని పెద్దల పాదముల నంటి నమ స్కారమును జేయవలెను.

## స్మృతిచంద్రికయందు

ఏవం సంధ్యాముపాస్యాఽథ పితరావగ్రజాన్ గురూన్।
కనిష్ఠానపి వేదజ్ఞాన్ సంధ్యాకాలేఽభివాదయేత్॥
వినా పుత్రం చ శిష్యం చ దౌహిత్రం దుహితుః పతిం।
నక్షత్రం చ తథా సూర్యం ద్విజానప్యభివాదయేత్॥

ఈ విధముగ సంధ్యోపాసనను చేసి, తల్లిదండ్రులను, అన్న లను, గురువులను, వేదము చదివినవారైన యెడల తనకంటె చిన్న వారిని గూడ సంధ్యాకాలమున నభివదింపవలెను. కాని, వేదములను చదివిన వారైనను, కుమారుని, శిష్యుని, దౌహిత్రుని, పౌత్రుని, అల్లునిన్నీ నమస్కరింపగూడదు.

సాయంసంధ్యయందు నక్షత్రములను, ప్రాతర్మధ్యాహ్నము లందు సూర్యుని, బ్రాహ్మణులనున్నూ అభివదింపవలెను.

ఈ యభివాదనముతో సాంగోపాంగమగు సంధ్యోపాసనము సమాప్తమగుచున్నది.

కావున కర్మాంతమందు ఆచారము ననుసరించి యొక పురాణాచమనమును చేయవలెను. తర్వాత "ఆ బ్రహ్మలోకా దాశేషాత్" ఇత్యాది శ్లోకముచేత పదునాల్గులోకములందున్న బ్రాహ్మణులను దేవతలను నమస్కరింపవలెను.

తర్వాత "కాయేన వాచా" ఇత్యాది శ్లోకమును పఠించి తాను జేసిన కర్మను పరబ్రహ్మకు సమర్పింపవలెను.

ఇది
విద్వచ్ఛిరోమణి- సాహిత్యవిశారద- ద్విజబృందనిషేవి
సోమయాజులోపనామక వేంకటాచలశాస్త్రిచేత రచింపబడిన
పూర్ణాభిధాంధ్ర వ్యాఖ్యాసముపేతంబగు
సంధ్యాతత్వసుబోధినియందు చతుర్థాధ్యాయమున
సంధ్యోపాసనపూర్వోత్తరాంగానుష్ఠాన పద్ధతి
నిరూపణంబను ప్రథమభాగము.
సమాప్తము.
ఓమ్ తత్ సత్
శివమ్.

ఓమ్

"యత్సంధ్యాముపాసతే—బ్రహ్మైవ తదుపాసతే"

ఇతి శ్రుతిః

# సంధ్యాతత్త్వసుబోధిని

పూర్ణాభిధాంధ్రవ్యాఖ్యాసముపేతము

చతుర్థాధ్యాయము ద్వితీయభాగము

## సంధ్యాకాలాదినిరూపణము

అవ=సంధ్యాముఖ్యకాలము నిరూపింపబడుచున్నది

**రాత్ర్యంతయామనాడ్యౌ ద్వే చాహరాదిమనాడికా।**
**నాడికాత్రయమేతద్ధి ప్రాతస్సంధ్యాం జగౌ స్మృతిః॥** **35**
**అహరాదిమనాడ్యేకా ద్వే రాత్ర్యాదిమనాడికే।**
**నాడికాత్రయమేతద్ధి సాయంసధ్యాం జగౌ స్మృతిః॥** **36**

తొలినాటిరాత్రియొక్క నాలవ జాముయొక్క చివరి రెండు గడియలును, ఆ రోజు పగటియొక్క తొలిజాము మొదటి గడియ యొకటియున్ను చేరి, మూడుగడియలు, ప్రాతస్సంధ్యాముఖ్యకాలమని స్మృతులు చెప్పుచున్నవి. అట్లే, ఆ నాటిపగటియొక్క నాలవజాము యొక్క చివరి గడియ యొకటియును, ఆ రోజు రాత్రియొక్క తొలి జాముయొక్క తొలి రెండు గడియలును చేరి, మూడు గడియలును సాయంసంధ్యాముఖ్యకాలమని స్మృతులు చెప్పుచున్నవి. వీనికి ప్రమాణశ్లోకములు.

### దక్షస్మృతి

రాత్ర్యంతయామనాడ్యౌ ద్వే సంధ్యాదిః కాల ఉచ్యతే।
దర్శనాద్రవిరేఖాయా స్తదంతో మునిభిః స్మృతః॥ అని.

స్మృత్యంతరమున—

ఉదయాత్ప్రాక్తనీ సంధ్యా ఘటికాద్వయముచ్యతే।
సాయంసంధ్యా ద్విఘటికా హ్యస్తాదుపరి భాస్వతః॥ అని.

ఈ రెండు శ్లోకములలోను, సూర్యోదయమునకు ముందు రెండు గడియలును [నలువదియెనిమిది నిమిషములు] ప్రాతస్సంధ్యా ముఖ్యకాలమునకు ఆదిభాగమనియును, సూర్యాస్తమయానంతరము రెండు గడియలు [నలువదియెనిమిది నిమిషములు] సాయంసంధ్యా ముఖ్యకాలమునకు చివరిభాగమనియును స్పష్టముగ చెప్పబడినది.

పై దక్షస్మృతియందు ప్రొద్దున రవిరేఖయొక్క దర్శనముతో ప్రాతస్సంధ్యాముఖ్యకాలము పూర్తియగుచున్నదని, కాలపరిమాణ మింతయని చెప్పక అస్పష్టముగ చెప్పబడినది.

కాన ఇటుపైని ప్రాతస్సంధ్యాముఖ్యకాలపు చివరిభాగము, సాయంసంధ్యాముఖ్యకాలపు తొలి భాగమునున్నూ స్పష్టముగ తెలిసికొనవలసియున్నది.

ధర్మప్రవృత్తియందు—

రవేరస్తమయాత్పూర్వం ఘటికైకా యదా భవేత్।
సాయంసంధ్యాముపాస్యాఽథ కుర్యాద్ధోమం చ పూర్వవత్॥ అని.

సూర్యాస్తమయమునకు ముందు [అనగా పగటియొక్క నాలవజాము చివరి] ఒకగడియ సాయంసంధ్యాముఖ్యకాలముయొక్క ఆది భాగము. అని స్పష్టముగ చెప్పబడినది. కాగా పై స్మృత్యంతర వచనముయొక్క ఉత్తరార్థమునూ, ధర్మప్రవృత్తి తొలి మూడు పాదములను కలిపి ఏకవాక్యముచేయగా, సూర్యాస్తమయమునకు ముందొక్కగడియయు, సూర్యాస్తమయానంతరము రెండు గడియ లును చేరి మూడుగడియలు సాయంసంధ్యాముఖ్యకాలమగును.

అందువలన—

ప్రాతస్సంధ్యా త్రినాడీ స్యాత్ సాయంసంధ్యా తథావిధా॥

అనగా—

ప్రాతస్సంధ్యాముఖ్యకాలము మూడు గడియలు. అట్లే సాయం సంధ్యాముఖ్యకాలము గూడ మూడు గడియలే. అను స్మృతిముక్తాఫలగ్రంథమునందలి వచనము సరిగా ఉండును. కాని, ప్రాతస్సంధ్యాముఖ్యకాలపరిమాణమునందు కొంచెము సరిపరచవలసి యున్నది.

ప్రాతస్సంధ్యాత్రినాడీ స్యాత్ సాయంసంధ్యా తథావిధా'' అను వచనమునకు, సాయంసంధ్యాముఖ్యకాలసామ్యముతో వాక్యైక వాక్యతకొరకు, ''దర్శనాద్రవిరేఖాయాః'' అను చోటనున్న ''రవిరేఖా'' పదమునకు వాచ్యార్థమును విడిచిపెట్టి, ''ఏకఘటికాకాలవిశిష్ట రవిబింబము'' అను నర్థమును లక్షణావృత్తిచేత చెప్పవలెను.

ఏలననగా—

''జపేదాసూర్యదర్శనాత్'' అని సూర్యబింబదర్శనపర్యంతము జపము విధింపబడినది. కాని ''నేక్షేతోద్యంతమాదిత్యం నాఽస్తంయంతం కదాచన'' ఉదయించుచున్న సూర్యుని గాని, యస్తమించుచున్న సూర్యుని గాని ఎప్పుడును చూడరాదు'' అను నిషేధముండుటవలన, ఉదయించిన తర్వాత కొంచెము పైకివచ్చిన తర్వాతనే సూర్యబింబమును చూడవలెను. అందుకు కొంచెము కాల మావశ్యకము. జపానంతరము గాయత్ర్యుద్వాసనము సూర్యోపస్థానము దిఙ్నమస్కారాదులు అర్థభావనాపురస్సరముగా సావధానముగా నాచరించుటకు అవశ్య మొక గడియ కాలమావశ్యకమై యుండును. సాయంసంధ్యాముఖ్యకాలవిషయమున నెట్లు విస్పష్టవచనములుగలవో అట్లు ప్రాతస్సంధ్యాముఖ్యకాలపు చివరిభాగవిషయమున విస్పష్టవచనము లేకపోవుటవలన శాస్త్రీయయుక్తి నవలంబించి ''రవిరేఖా'' శబ్దమునకు ''ఏకఘటికాకాల విశిష్టరవిబింబము'' అను నర్థమును లక్షణచేత చెప్పవలసియున్నది. ఇట్లు చెప్పుటవలన నంతయును

చక్కగ సరిపోవును. సూర్యోదయమునకు పూర్వము రెండుగడియ లున్నూ, సూర్యోదయానంతరము రవిరేఖాశబ్దమునకు లక్షణచేత వచ్చిన ఒక గడియయున్నూ చేరి మూడు గడియల కాలము ప్రాతస్సంధ్యాముఖ్యకాలము అని తేలిపోయినది.

ఇట్లు ప్రాతస్సాయంసంధ్యాముఖ్యకాలములు స్పష్టముగ నిరూపింపబడినవి.

ఇప్పుడు ప్రత్యేకముగ అంగినిన్నీ అంగములనున్నూ ఆచరించుటకు ముఖ్యకాలమును నిరూపించుటకు ప్రయత్నము చేయబడును.

"రవేరస్తమయాత్పూర్వం ఘటికైకా యదా భవేత్ । సాయం సంధ్యాముపాస్యాఽథ" అను ధర్మప్రవృత్తివచనమువలన సాయంసంధ్యాముఖ్యకాలపు మూడు గడియలలో మొదటి గడియయందే సాయంసంధ్యోపాసనను చేయవలెనని స్పష్టముగ తెలియుచున్నది. కాని, ప్రాతస్సంధ్యోపాసనకు అట్లు విస్పష్టవచనము కనబడలేదు. ఐనను— "కారిక" అను గ్రంథమందు— "ప్రాతస్సంధ్యాం సనక్షత్రాం"[2] అనియు, "అర్ధాస్తమితనక్షత్రమంతరిక్షం యదా తదా। ఆరభ్య ప్రాఙ్ముఖస్తిష్ఠన్ జపేదాసూర్యదర్శనాత్" అనియును, మూడువంతులు నక్షత్రములుండగా సంధ్యోపాసనను జేసి, సగము నక్షత్రము లస్తమించిన తర్వాత జపము నారంభించి సూర్యదర్శన పర్యంతము [అష్టోత్తరశత] గాయత్రీజపమును చేయవలెను. "సజ్యోతిష్యాజ్యోతిషో దర్శనాత్" ఒక జ్యోతి ఉండగా గాయత్రీ జపమును ఆరంభించి, ఆ జ్యోతి అస్తమించిన తర్వాత మరియొక జ్యోతి ఉదయించి, కనబడువరకును గాయత్రీజపమును చేయవలెను. అని శాస్త్రము చెప్పుచున్నది.

కాన ప్రొద్దున నక్షత్రజ్యోతి ఉండగనే గాయత్రీజపమును ఆరంభించి ఆ నక్షత్రజ్యోతి అస్తమించి సూర్యజ్యోతి ఉదయించి కనపడువరకును జపమును చేయవలెను. అట్లే సాయంకాలమున సూర్యజ్యోతి ఉండగనే గాయత్రీజపమారంభించి ఆ సూర్యజ్యోతి అస్తమించి

నక్షత్రజ్యోతి ఉదయించి కనబడువరకును జపమును చేయవలెను, అని ఇట్లు స్పష్టముగ కాలపరిమాణము చెప్పకుండ నక్షత్రముల హెచ్చు తగ్గులనాధారము చేసికొని సంధ్యోపాసనగాయత్రీజపములను చెప్పిరి. ఐనను గాయత్రీజపముకంటె ముందుగనే సంధ్యోపాసనము చేయబడ వలసిన దగుటచేతను, సాయంసంధ్యోపాసనము ప్రథమఘటికయందే చేయబడుటచేతనున్నూ, ఈ యస్పష్టకాలమునే గడియల రూపము లోనికి సాయంసంధ్యోపాసనముఖ్యకాలపు పోలికతో నిర్ణయించుట సులభమే యగును. ఎట్లనగా—బహు (మూడువంతుల) నక్షత్రము లుండుకాలము ముఖ్యకాలములో మొదటిగడియ యగును. అప్పుడు సంధ్యోపాసనమును చేయవలెను. సగము నక్షత్రము లుండు కాలము, ముఖ్యకాలములో రెండవ గడియ అగును. అప్పుడు ద్వితీయఘటికయందు గాయత్రీజపము, సూర్యోదయానంతరము మూడవ (తొలి) గడియయందు ఇతరాంగములను చేయవలెను. అని స్థూలముగా నిర్ణయము. కాని ఇట్లు గడియలు విగడియలుగ కాలమును నిర్ణయించి తెలిసికొనుట సాధారణముగ చాల మందికి శక్యము కాదు. ఇంకనూ—మేఘావరణము గల సమయములలో సూర్యబింబము నక్షత్రములును ఎంతమాత్రము కనబడక పోవుట వలన సూర్యోదయాస్తమయములు తెలియకపోవుటవల్లనున్నూ సంధ్యోపాసనముఖ్యకాలనిర్ణయము అ త్యం త మ శ క్య మ గు ను. అట్లే సాయంసంధ్యాజపకాలమగు సూర్యబింబార్ధాస్తమయకాలమును గూడ నిర్ణయించుట అత్యంతాశక్యము. ఈ కారణములవలన గడియారమును శరణు బొందుటయే చాల మంచిదని, నా యభి ప్రాయము. పూర్వకాలమున జ్యోతిషవిజ్ఞానము గల ద్విజవర్యులు ఆకాశము మధ్యను రాత్రివేళ ఉచ్చనక్షత్రమునుబట్టి రాత్రి శేష కాలము తెలిసికొని దానినిబట్టి సంధ్యాముఖ్యకాలమును ఎట్లెట్లో తెలిసికొనెడివారు. జ్యోతిషవిజ్ఞాన మందరికి నుండదు కదా! ఆ విజ్ఞా నము లేనివారికి తికమకలే. ఇంకను, జ్యోతిషవిజ్ఞానము కలవారికి గూడ మేఘావరణసమయములందు కాలమును తెలిసికొనుటలో

తికమకలు తప్పవు. అప్పుడేమి గతి? గత్యభావమే. పాపము! కర్మ నెట్లాచరించెడువారో! కావున ఈ సూక్ష్మకాలభాగములను తెలిసి కొనుటకు నాధునికమగు గడియారమే శరణ్యమని నా దృఢాభిప్రాయము. కాగా—పై గడియలను గంటలు నిమిషములలోనికి మార్చుట చాలమంచిది. కావున గడియలను గంటలు నిమిషముల లోనికి మార్చ ప్రయత్నింతును. ప్రాతస్సంధ్యాముఖ్యకాలమగు మూడు గడియలకును డెబ్బదిరెండు నిమిషములగును. అనగా—ఒక గంట పంద్రెండు నిమేషములగును. సుమారు ఒకటింబావు గంట. ఇంతకాలమున సాంగోపాంగసంధ్యోపాసనమును సావకాశముగ మంత్రార్థభావనాపురస్సరముగ ననుష్ఠించుటకు శక్యమగును. దృగ్గణితపంచాంగములందును, కొన్ని ఆంగ్లదినపత్రికలందును సూర్యోదయాస్తమయకాలములు ప్రతిదినము హెచ్చు తగ్గులు లేకుండ ప్రకటింపబడుచున్నవి. దాని ననుసరించి, సూర్యోదయము నకు ముందు నలువదెనిమిది నిమిషములకు ప్రాతస్సంధ్యాముఖ్యకాల మారంభించును. సూర్యోదయానంతరము ఇరువదినాలుగు నిమేష ముల వరకుండును. ఇట్లే సాయమున గూడ అస్తమయమునకు ముందు ఇరువదినాలుగు నిమిషములకు సాయంసంధ్యాముఖ్యకాల మారంభమగును. అస్తమయము తరువాత నలువదెనిమిది నిమిష ముల వరకుండును.

అందు ప్రాతస్సంధ్యాముఖ్యకాలమందలి మొదటి గడియ యొక్క ఇరువదినాలుగు నిమిషములలో ఆచమనము మొదలు అర్ఘ్యప్రదానము పూర్తి యగువరకును తొలి పదినిమిషములలో చేయవలయును. మిగిలిన పదునాలుగు నిమిషములందు మూడు ప్రాణాయామములను సగుణసంధ్యోపాసనను, నిర్గుణోపాసనను న్ని చేయవలెను. తర్వాత రెండవ గడియయొక్క ఇరువదినాలుగు నిమిషములును మూడవ గడియయొక్క ఇరువదినాలుగు నిమిషముల లోని తొలి ఆరునిమిషములును చేరి, ముప్పదినిమిషముల (అర గంటకాలము) కాలమున గాయత్రీహృదయమును అర్థభావనా

పురస్సరముగ పఠించుట, మూడు ప్రాణాయామములను, ధ్యాన శ్లోకమును అర్థభావనాపురస్సరముగ పఠించుట, అర్థభావనతో అష్టోత్తరశతగాయత్రీజపము, జపోత్తరాంగమగు గాయత్ర్యుద్వాసనతో సహా, సావధానముగ చేయవలెను. తర్వాత మిగిలిన పదునెనిమిది నిమిషములలో సూర్యోపస్థానము దిజ్నమస్కారము భూమ్యాకాశవందనము అభివాదనము మొదలగు నాలుగుత్తరాంగములను అర్థభావనాపురస్సరముగ సావధానముగ చేయవలెను. ఇట్లే సాయంసంధ్యాముఖ్యకాలపు మూడు గడియలందును ప్రొద్దున చేసినట్లే విభజించి చేయవలెను. ఇట్లు నక్షత్ర-సూర్యబింబములతో కూడిన అస్పష్టకాలమును కొంత స్పష్టమగు గడియలలోనికిని, ఆ గడియలను మిక్కిలి స్పష్టమగు గంటలు నిమిషముల లోనికిని మార్చి యథామతిగ ప్రాతస్సాయంసంధ్యాముఖ్యకాలములను అందు జేయదగిన అంగములను, ఉపాంగములను, ప్రధానకర్మనున్ను చేయదగు సూక్ష్మమగు కాలాంశములనున్ను నిర్ణయించి నిరూపించుటయైనది.

## మధ్యాహ్నసంధ్యాముఖ్యకాలము

గోభిలః—

మధ్యాహ్నస్నానాదూర్ధ్వం యః కాలస్త్వవ్యవధానతః।
తత్ర మధ్యాహ్నసంధ్యా స్యాదూర్ధ్వం గౌణః స్మృతో బుధైః॥

మధ్యాహ్నస్నానముతర్వాత వెనువెంటనే మధ్యాహ్నసంధ్యోపాసనను చేయవలెను. మధ్యాహ్నకాలము దాటిన నది గౌణకాలమని పండితులు చెప్పిరి.

### ఆశ్వలాయనగృహ్యపరిశిష్టమున

ద్వితీయఖండమున— "యశ్చ పూర్వాహ్ణపరాహ్ణయోః (సంధిః) తత్కాలభవా దేవతా. సంధ్యా. తాముపాసీతేతి॥

పూర్వాహ్ణ-అపరాహ్ణకాలముల మధ్యకాలము మధ్యాహ్న కాలము. ఆకాలమందు, సూర్యమండలమున సన్నిహితమైన దేవత, సంధ్యాదేవత-ఆదేవత నుపాసింపవలెను. అని.

ముప్పది గడియల పగటికాలమును ఐదు భాగములుచేయగా నొక్కొక్క భాగమున నారేసి గడియ లుండును. ఆ భాగము లెవ్వియన—(1) ప్రాతఃకాలము, (2) సంగవ(పూర్వాహ్ణ) కాలము, (3) మధ్యాహ్నకాలము, (4) అపరాహ్ణకాలము, (5) సాయాహ్నము. అని.

అందు—ప్రాతఃపూర్వాహ్ణకాలములచేత పండ్రెండు గడియలు గడవగా పదిమూడవ గడియనుండి ఆరంభించి పదునెనిమిదవ గడియవరకు మధ్యాహ్నకాలము. మధ్యాహ్నకాల మారంభించగనే మధ్యాహ్నస్నానము చేయవలెను. స్నానము వస్త్రధారణము మొదలగు వాటికి అర్ధఘటికాకాలము పోయినను మిగిలిన రెండున్నర గడియలలోను మొదటి గడియన్నర (ముప్పదియారు నిమిషముల) కాలములోనే మధ్యాహ్నసంధ్యను పూర్తిగ చేయవలయును.

ఏలననగా—

"దివసస్యాష్టమే భాగే యదా మందాయతే రవిః।
స కాలః కుతపో జ్ఞేయః పితౄణాం దత్తమక్షయమ్॥ అని.

పగటియొక్క పదునేను ముహూర్తభాగములలో నెనిమిదవ భాగమునకు కుతపకాలమని పేరు. ఆ కుతపకాలమున పితృదేవతల కిచ్చినది, పితరుల కక్షయమగును. అను ధర్మశాస్త్రవచనమువలన, మూడుగడియల మధ్యాహ్నకాలములో మూడవగడియ పితరులకొరకు కుతపకాలములో చేరి పోవుటవలన ఒక గడియన్నరయే సంధ్యో పాసనకు మిగిలినది. ఇట్లు మధ్యాహ్నకాలము సగమునకు తగ్గిపోవుట చేతనే కాబోలును మిక్కిలి ప్రధానము కాని దిఙ్నమస్కారము విధింపబడలేదని పెద్దలు చెప్పుదురు. కావున ఆ మిగిలిన ముప్పది

యారు నిమేషముల కాలమును నాలుగు భాగములు చేయగా, తొమ్మిదేసి నిమిషము లొక్కొక భాగమునకు వచ్చును. తొలి తొమ్మిది నిమేషములలో ఆచమనాద్యర్ఘ్యాంతము, రెండవ భాగములో సంధ్యోపాసనము, మూడవ భాగములో గాయత్రీజపము, నాలుగవ భాగములో మిగిలిన మూడు త్తరాంగములను పూర్తి చేయవలెను. ఇట్లు మూడు సంధ్యలయొక్క ముఖ్యకాలనిర్ణయము పూర్తియైనది. ఈ విభాగము సరిగ నున్నదని తోచుచున్నది.

## సంధ్యాగౌణకాలనిర్ణయము

శంక = ఎవరేనియొక యుపాసకునకు ఏదేని బలవత్కారణము చేత, చెప్పబడిన ముఖ్యకాలమున సంధ్యోపాసనము చేయ శక్యము కాని యెడల నా యుపాసకున కేమి గతి? సంధ్యోపాసనము లోపించి నట్లేనా? లేక గత్యంతరమున్నదా? సమాధానము. ఉన్నది. చెప్ప బడుచున్నది. అట్టి ఉపాసనపరునియొక్క ఉపాసనము లోపింప కూడదు. గత్యంతరము తప్పక ఉన్నది. ఏదా గత్యంతరము?

గోభిలమహర్షి చెప్పుచున్నారు.

ముఖ్యకాలే యదాఽవశ్యం కర్మ కర్తుం న శక్యతే।
గౌణకాలేఽపి కర్తవ్యం గౌణోఽప్యేతాదృశో మతః॥ అని.

విధింపబడిన ముఖ్యకాలమున అవశ్యకర్తవ్యకర్మ చేయ శక్యము కాని యెడల, గౌణకాలమున ఆ కర్మను చేయవలెను. గౌణకాలము కూడ ముఖ్యకాలముతో సమానమైనది. వానికి కర్మ లోపము ఉండదు. గౌణమనగా—ముఖ్యకాలము వెనువెంటనే వచ్చు అముఖ్యకాలము.

అవ = కావున గౌణకాలప్రమాణము (నిడివి) తెలియవలెను. గాన మూడు సంధ్యలందును గౌణకాలప్రమాణము నిర్ణయింప బడుచున్నది.

## గౌణకాలనిరూపణము

**ప్రాతరాసంగవం గౌణః అప్రదోషావసానకం।**
**సాయం, మాధ్యాహ్నికః కాల ఆసాయమితి నిర్ణయః॥** 37

సంగవకాలారంభము వరకును ప్రాతస్సంధ్యాగౌణకాలము. అనగా— "ముహూర్తత్రితయం ప్రాతః॥ అని, ప్రాతఃకాలప్రమాణము మూడు ముహూర్తములు. అనగా నారుగడియల కాలము. కాగా సూర్యోదయము మొదలు ఆరు గడియల కాలము గౌణ కాలము. కాని యందులో మొదటి గడియ ముఖ్యకాలములో చేరిపోగా- మిగిలిన యైదు గడియల కాలము (రెండుగంటల కాలము) గౌణకాలమగును. ఇట్లే సాయంసంధ్యాగౌణకాలము, అప్రదోషావసానకం=ప్రదోషకాలము పూర్తి యగువరకు నుండును. "త్రిముహూర్తం ప్రదోషః స్యాద్భానావస్తంగతే సతి" సూర్యాస్తమయానంతరము ఆరుగడియలు ప్రదోషకాలము. ఇందుననూ-తొలి రెండుగయలు ముఖ్యకాలములో చేరిపోయినవి. కాన చివరి నాల్గు గడియలే [గంటా ముప్పదియారు నిమిషములు] సాయంగౌణ కాలము. "మధ్యాహ్నసంధ్యాగౌణకాలము" "ఆసాయం=సాయం సంధ్యాముఖ్యకాలారంభమువరకు నుండును. మధ్యాహ్నమున కుతప కాలము పోగా మిగిలిన పదునాల్గు గడియలలో సాయంసంధ్యా ముఖ్యకాలపు తొలి గడియ కూడ తీసివేయగ-పదిమూడు గడియలు [ఐదు గంటల పంద్రెండు నిమిషములు] మధ్యాహ్నసంధ్యాగౌణకాల మగును. అని తెలియదగినది.

వృద్ధమనువు కూడ నీ పక్షమును బలపరచుచున్నాడు.
న ప్రాతర్న ప్రదోషే చ సంధ్యాకాలోఽతిపద్యతే।
ముఖ్యకల్పోఽనుకల్పశ్చ సర్వస్మిన్ కర్మణి స్మృతః॥

ప్రాతఃకాల మారుగడియలకాలమందును, ప్రదోషకాల మారుగడియలకాలమందును కూడ సంధ్యాకాలాతిక్రమణ మను మాటయే లేదు.

ఏలననగా—

సర్వకర్మలయందును, ముఖ్యపక్షమనియును, రెండవ పక్ష మనియును మహర్షులచేత అంగీకరింపబడినది. కాగా—గౌణకాల మున, కాలాతిక్రమణదోషమే లేదనుటవలన, ప్రాయశ్చిత్తార్ఘ్య మీయకుండగనే సంధ్యోపాసనమును చేయవచ్చునని భావము.

బాలంభట్టీయమను గ్రంథమున గూడ ఇట్లే స్పష్టముగ నున్నది.

"ప్రాతస్సాయంసంధ్యయోః ప్రాగుక్తగౌణకాలాతిక్రమే వక్ష్యమాణప్రాయశ్చిత్తం కృత్వా సంధ్యావందనం కర్తవ్యం" ఇతి॥

అనగా—

"ప్రాతస్సాయంసంధ్యాకాలములందు, వెనుక జెప్పబడిన గౌణ కాలము కూడ గడచిపోయిన తర్వాతనే" చెప్పబోవు ప్రాయశ్చిత్త మును చేసి సంధ్యావందనమును చేయవలెను. అని.

ఇది ఇట్లుండగా కొంతమంది ఛాందసులు "కాలము అతి సూక్ష్మము. ఎవ్వరికిని తెలిసికొన శక్యము కాదు. కాబట్టి కాలాతి క్రమణప్రాయశ్చిత్తార్ఘ్యమును ఈయవలసినదే. లేనియెడల పాపము మెడకు చుట్టుకొనును." అనుచూ ముఖ్యకాలమందు కూడ ప్రాయ శ్చిత్తార్ఘ్యమును ఇచ్చుచున్నారు.

ఇది శాస్త్రసమ్మతము కాదు.

గౌణకాలపరిమాణవిషయమున పరాశరమాధవీయమున, శ్రీసర్వజ్ఞమాధవాచార్యులవారు గూడ ఇట్లే వ్రాయుచున్నారు.

"ఆసంగవం ప్రాతస్సంధ్యాయాః గౌణకాలః ఆప్రదోషావసానం చ సాయంసధ్యాయాః" అని.

అర్థము స్పష్టము.

మధ్యాహ్నసంధ్యాగౌణకాలవిషయమున గోభిలమహర్షి =

"ఊర్ధ్వం గౌణస్స్మృతో బుధైః" అని. ఊర్ధ్వం=మధ్యాహ్న సంధ్యాముఖ్యకాలము తర్వాత "ఆసాయం" అను మాటను చేర్చుకొనవలెను. అనగా—సాయంసంధ్యాముఖ్యకాలారంభము వరకును మధ్యాహ్నసంధ్యాగౌణకాలమని, పండితులంగీకరించిరని భావము.

## వాసుదేవసంహితయందు

"కలియుగే పంచఘటికాపర్యంతం ముఖ్యకాలః"

కలియుగమున, సూర్యోదయాఽస్తమయముల తర్వాత ఐదు గడియలకాలము ముఖ్యకాలమే అగును. అని. కాగా—గౌణకాలము ఒక్కగడియే ఉండును మధ్యాహ్నగౌణకాలము మాత్రము ఎక్కువగా ఉండును. సూర్యోదయాస్తమయముల తర్వాత రెండు గంటలకాలము ముఖ్యకాలముగనే యుండును. కలియుగమున మానవుల అశక్తతను గుర్తించే-పైన చెప్పిన విధముగ అనుగ్రహాబుద్ధితో ముఖ్యకాలము పొడిగించబడి యుండును.

సంధ్యాగౌణకాలనిర్ణయము సమాప్తము.

# కాలాతిక్రమణప్రాయశ్చిత్తవిచారము

శంక=పైని ఉదహరించిన గోభిలవృద్ధమను వచనములవలన ముఖ్యగౌణకాలములు రెండును సమానమైనవి యైన యెడల ముఖ్యము గౌణము అని వేరువేరు పేర్లుపెట్టుట ఎందులకు?

సమాధానము. ప్రాయశ్చిత్తము లేకపోవుటలో పోలికయున్నను, ఫలమును పొందుటలో చాల భేదమున్నది. ఎట్లు? ముఖ్యకాలమునందు ఆచరించినయెడల పూర్ణమగు బ్రాహ్మణ్యముండును. గౌణకాలమునందు ఆచరించినయెడల బ్రాహ్మణ్యము అసంపూర్ణమగును. బ్రాహ్మణ్యము తగ్గునని భావము. ఇందులకు వెనుక నుదహరించిన శాతాతప మహర్షి వచనమే ప్రమాణము.

ఎట్లనగా—

అనాదిత్యాం తు యః పూర్వాం, సాదిత్యాం చైవ పశ్చిమాం।
నోపాసీత ద్విజః సంధ్యాం స సర్వో ఉబ్రాహ్మణః స్మృతః॥

అనగా—

సూర్యోదయమునకు ముందు ప్రాతఃసంధ్యాదేవతను ఉపాసించని యాతడును, సూర్యాస్తమయమునకు ముందు సాయంసధ్యాదేవతను ఉపాసించని యాతడున్నూ అబ్రాహ్మణుడు అగును. అని భావము. ఇచ్చట అబ్రాహ్మణపదమునకు తగ్గిపోయిన బ్రాహ్మణ్యము కలవాడని యర్థము. వాని బ్రాహ్మణ్యము తగ్గిపోవునని భావము. అంతియే కాని బ్రాహ్మణేతరుడగునని అర్థముకాదు.

ఎట్లనగా—

"అనుదరా కన్యా" అనుచోట "అనుదరా" పదమునకు, ఉదరములేనిది, అని అర్థముకాదు. పల్చని ఉదరముకలది అని అర్థము చెప్పినట్లు, చెప్పుకొనవలెను.

## స్మృతికిరణావళియందు

ప్రాతస్సంధ్యాం సనక్షత్రాం నోపాస్తే యః ప్రమాదతః।
గాయత్ర్యష్టశతం తస్య ప్రాయశ్చిత్తం విశుద్ధయే॥

అనగా—

ఏ ద్విజుడు, నక్షత్రములుండగా [ముఖ్యకాలమున] పొరపాటువలన ప్రాతస్సంధ్య నుపాసింపడో, ఆతడు, ఆ పాపశుద్ధికొరకు నూటయెనిమిది సారులు గాయత్రీజపమును చేయవలెను.

అనగా—

ప్రాయశ్చిత్తమున్నది. అని భావము;

శంక = ఇట్లిచ్చట, మూడు విధములైన వచనములు కనబడుచున్నవి.

వృద్ధమనుగోభిలవచనములు గౌణకాలమందు కూడ ప్రాయశ్చిత్త మక్కఱలేదని, స్పష్టముగఁ జెప్పుచున్నవి.

### శాతాతపవచనము

ముఖ్యకాలమునందు, సంధ్యోపాసనమును చేయని యెడల బ్రాహ్మణ్యము తగ్గునని చెప్పుచున్నది.

### స్మృతికిరణావళివచనము

ముఖ్యకాలాతిక్రమణము జరిగెనేని అష్టోత్తరశతగాయత్రీ జపము ప్రాయశ్చిత్తము చేయవలెనని చెప్పుచున్నది. అందువలన ఈ మూఁడు వాక్యములకును ఏకవాక్యత యెట్లు?

సమాధానము చెప్పబడుచున్నది.

వృద్ధమన్వాదుల యభిప్రాయము.

దైవవశమునలన ముఖ్యకాలమునందు సంధ్యోపాసనము చేయ శక్యము కానియెడల గౌణకాలము కూడ ముఖ్యకాలసమాన మైనది. కాబట్టి గౌణకాలమందు కూడ సంధ్యోపాసనను చేయవచ్చును. కాలాతిక్రమణదోషము లేదు. అందువలన ప్రాయశ్చిత్త మక్కఱలేదని, గౌణకాలము కూడ దాటిపోయినయెడలనే ప్రాయశ్చిత్తము చేయవలెనని వృద్ధమన్వాదుల అభిప్రాయము.

శాతాతపుల అభిప్రాయము. బ్రహ్మజ్ఞానసంపాదనముతో బ్రాహ్మణ్యమును రక్షించుకొనుటకొరకు ముఖ్యకాలమున సంధ్యోపాసనను చేయవలెను.

ఏలననగా—

శుచిర్వాప్యశుచిర్వా యః కాలే సంధ్యాం సదా ద్విజః।
ఉపాస్తే బ్రహ్మభూయాయ కల్పతే నాఽత్ర సంశయః॥

దీని యర్థము సంధ్యాప్రశంసయందు వ్రాయబడినది. అచటి విష్ణుస్మృతివచనము ముఖ్యకాలమున సంధ్యోపాసనము చేయుటచేత

బ్రహ్మైక్యమును పొందునని స్పష్టముగా చెప్పుచున్నది కదా! ముఖ్యకాలమున సంధ్యోపాసనను చేయని యెడల గౌణకాలమున గాని, మరేకాలమున గాని చేసినను సంపూర్ణబ్రాహ్మణ్యమెట్లు వచ్చును? రాదు. కాన సోమరితనమును విడిచి ముఖ్యకాలమున సంధ్యోపాసనను చేయుటకు ద్విజుడు ప్రయత్నింపవలెను. అని అభిప్రాయము. అంతియే కాని గౌణకాలమున సంధ్యోపాసనను చేసిన, ప్రాయశ్చిత్తము చేయవలెనని కాదు. కాన వీరి వచనమునకు, వృద్ధమన్వాదుల వచనములతో విరోధము లేదు.

ఇక కిరణావళీకారుని ప్రాయశ్చిత్తము, గౌణకాలాతిక్రమణమున విధింపబడిన ప్రాయశ్చిత్తముతో సమానమే.

ఎట్లనగా—

## దేవీభాగవతమున

కాలాతిక్రమణే జాతే చతుర్థార్ఘ్యం ప్రదాపయేత్ ।
అథవా ఽష్టశతం దేవీం జప్త్వాఽఽదౌ తాం సమాచరేత్ ॥ అని.

అనగా—కాలాతిక్రమణమైన యెడల నాల్గవ యర్ఘ్యమును ఈయవలెను. లేక అష్టోత్తరశతగాయత్రీజపమును సంధ్యోపాసనసంకల్పమునకు ముందే చేసి తర్వాత సాంగోపాంగసంధ్యోపాసనను చేయవలెను.

ఈ దేవీభాగవతవచనమునందలి కాలాతిక్రమణశబ్దము వృద్ధమను గోభిలుల వచనానుసారముగ గౌణకాలాతిక్రమణమునే చెప్పును. కాగా గౌణకాలము కూడ నతిక్రమించిన యెడల తద్దోషపరిహారార్థము నాల్గవయర్ఘ్యమును ప్రాయశ్చిత్తముగా నీయవలెను. అంతతో తృప్తిపడని యెడల సంధ్యోపాసన సంకల్పమునకుముందే అష్టోత్తరశతగాయత్రీజపమును చేయవలెను. ఇచ్చట తుల్యవికల్పములైన అర్ఘ్యజపములనే విధించుచున్నది. ఇందలి జపరూప ప్రాయశ్చిత్తమునే కిరణావళివచనము విధించుచున్నది. అందునను ముఖ్య

కాలప్రాధాన్యమును చెప్పుచునే ప్రాయశ్చిత్తమును విధించుచున్నది. కాన ఈ ముగ్గురి అభిప్రాయములకును వచనములకు నెట్టి విరోధము లేనే లేదు.

శ్రీవామదేవసంహితావచనానుసారముగా నీ గౌణకాలము కూడ ముఖ్యకాలములోనే చేరిపోవుచున్నది. కాన గౌణకాలమున గూడ ముఖ్యకాలాతిక్రమణవార్తయే లేదు. కావున సర్వధా గౌణ కాలము కూడ దాటినతర్వాతనే ప్రాయశ్చిత్తమును చేయుట అని సిద్ధాంతము. ప్రాయశ్చిత్తవిధాయకవచనములన్నియును సంధ్యో పాసనమును ముఖ్యకాలమున చేయించుటకే ఏర్పడినవి. ముఖ్య కాలమే అత్యంతముఖ్యము. ఉపాసన యెంత ముఖ్యమో ముఖ్య కాలము గూడ నంత ముఖ్యము. కావుననే వీరమిత్రోదయమునందు చెప్పబడిన రీతిగా చాల అసౌకర్యములున్నను—

ఎట్లనగా—

అశుచిగానుండుట రైలునందు ప్రయాణము విమానమున ప్రయాణము, ఎడారిప్రయాణము, ఆధునికపాశ్చాత్యవేషముతో కార్యాలయమునందుండుట, కారాగారమున నుండుట ఏ విధమైన శౌచమును చేయుటకు శక్తిలేని స్థితి, చివరకు మార్జనము అర్ఘ్యము మొదలగు అంగములు కూడ చేయ, నశక్తి, ఇత్యాది-అసౌకర్యము లున్నను సంధ్యాముఖ్యకాలము రాగనే "అపవిత్రః పవిత్రో వా" ఇత్యాదిమంత్రముతో మానసస్నానముచేసి, సంకల్పముచేసి ఉపాసన ప్రకరణమునందు చెప్పిన రీతిగా ఉపాసనమును మాత్రమునైనను చేసిన యెడల కృతార్థుడగును. ప్రాయశ్చిత్తము మాటయే ఉండదు.

పూర్వమీమాంసాశాస్త్రమునందలి, "సర్వాశక్త్యధికరణ న్యాయము" ననుసరించి, అంతమాత్రమును చేసిన చాలును. తర్వాత వీలుకలిగినయెడల సాంగోపాంగముగ చేయవలెను. శక్తి వంచన చేయగూడదు. శక్తివంచన చేసిన, దైవద్రోహము, ఆత్మ ద్రోహము కూడ సంభవించును.

సర్వధర్మశాస్త్రముల యభిప్రాయ మిదియే. కావుననే పూర్వ మీమాంసాశాస్త్రమునందలి "సర్వాశక్త్యధికరణము" ఈ యభిప్రాయమునే చెప్పుచున్నది.

## ప్రాయశ్చిత్తనిరూపణము

అవ=ఇప్పుడు సంధ్యాకాలాతిక్రమప్రాయశ్చిత్తము నిరూపింపబడుచున్నది.

**గతే చ గౌణే కాలేఽపి ప్రాయశ్చిత్తం చతుర్థకం।**
**అర్ఘ్యం దద్యాజ్జపేద్వాఽపి దేవీమష్టోత్తరం శతమ్॥ 38**

"గతే చ" యనుచోట నున్న "చ" కారమునకు "ఏవ కారార్థము చెప్పవలెను. కాగా గౌణకాలము కూడ దాటిపోయిన తర్వాతనే కాలాతిక్రమణముచే కలిగిన పాపమును పరిహరించుటకు ప్రాయశ్చిత్తముగ నాల్గవ యర్ఘ్యము నీయవలెను. అనగా అంగమైన మూడర్ఘ్యములను ముందిచ్చి ప్రదక్షిణాచమనములను పూర్తిచేసి తర్వాత ప్రాయశ్చిత్తముగ నాల్గవ యర్ఘ్యము నీయవలెను. లేక "ఇది చిన్న ప్రాయశ్చిత్తము. ఇది చాలదని తోచుచున్నది. ఏదైన పెద్ద ప్రాయశ్చిత్తము చేయవలెను" అని తోచిన యెడల సంధ్యోపాసనసంకల్పముకంటె ముందుగనే అష్టోత్తరశతగాయత్రీమంత్ర జపమును చేయవలెను. శ్లోకము మూడవ పాదమున "వా+అపి" అను పదములు అర్ఘ్యమును గాని లేక జపమును గాని యేదేనొకటియే చేయవలెను. కాని రెండును చేయ నవసరము లేదని చెప్పుచున్నవి. రెండున్నూ తుల్యవికల్పము కలవే. [సమానమైనవే.]

పై విషయములకు ప్రమాణవచనములు.

### 1. ధర్మప్రవృత్తి

"కాలాతిక్రమణే చైవ త్రిసంధ్యమపి సర్వదా।
చతుర్థార్ఘ్యం ప్రదాతవ్యం గాయత్ర్యా శిరసా సహ॥

మూడు సంధ్యలందును కాలాతిక్రమణమందు ''ఓంభూః'' మొదలు, ఓగ్ంసత్యం'' వరకునున్న సప్తవ్యాహృతులతోను ''ఓమాపోజ్యోతి'' మొదలగు శిరోమంత్రముతోను కూడిన గాయత్రితో నాల్గవ యర్ఘ్యమును ప్రాయశ్చిత్తముగా నీయవలయును. శ్లోకమున 'శిరసా' యను పదము 'సప్తవ్యాహృతు'లకు సూచకము.

## 2. స్మృతిముక్తాఫలము

చతుర్థార్ఘ్యం తు గాయత్ర్యా శిరోవ్యాహృతియుక్తయా।
కాలాతిక్రమదోషార్థం త్రిసంధ్యాసు విధీయతే॥

ఈ శ్లోకమున 'తు' అను పదమునకు 'కాని' యని యర్థము. కాగా—ఇంతవరకు అంగార్ఘ్యములు మూడును కేవలగాయత్రీ మంత్రముతోనే యీయబడినవి. కాని ప్రాయశ్చిత్తార్థమగు నీ చతుర్థార్ఘ్యమును కేవలగాయత్రితో కాక పూర్వమున ఓంకారపూర్వక సప్తవ్యాహృతులతోను వెనుక శిరోమంత్రముతోను కూడిన గాయత్రితో కాలాతిక్రమదోషపరిహారార్థము మూడు సంధ్యలందును విధింపబడుచున్నది యని యర్థము.

## 3. స్మృతిముక్తావళియందు శంఖమహర్షి

''చతుర్థార్ఘ్యం తు గాయత్ర్యా శిరోవ్యాహృతిసంపుటం।
అర్ఘ్యప్రదానమాత్రేణ కాలాతీతం న దోషభాక్॥

పై శ్లోకార్థమే. ఇచ్చట కూడ ''తు'' ఉన్నది. పై శ్లోకమందలి ''తు'' అర్థమే. ఇంకొక విశేషము. ''ఇట్టి యర్ఘ్యము నిచ్చినంత మాత్రముచేతనే కాలతిక్రమణదోషము నశించిపోవునా? పోదా? యను సందేహమును, శంఖమహర్షి, తప్పక పోవునని శంఖనాదముచే నివారించుచున్నాడు.

## 4. ప్రయోగపారిజాతము

''కాలాతిక్రమణే చైవ చతుర్థార్ఘ్యం ప్రదాపయేత్॥

కాలాతిక్రమణదోషము వచ్చినప్పుడు తద్దోషపరిహారము కొరకు నాల్గవ యర్ఘ్యము నీయవలెను.

## 5. దేవీభాగవతము

"కాలాతిక్రమణే జాతే చతుర్థార్ఘ్యం ప్రదాపయేత్।
అథవాష్టశతం దేవీం జప్త్వాఽఽదౌ తాం సమాచరేత్॥

కాలాతిక్రమణము జరిగినప్పుడు నాల్గవ యర్ఘ్యము నీయవలెను. లేక నూటయెనిమిది సారులు గాయత్రీ జపమును సంధ్యోపాసనసంకల్పముకంటె ముందుచేసి, తర్వాత ఆ సాంగోపాంగ సంధ్యోపాసనను జేయవలెను. ఈ శ్లోకమున రెండు వాక్యములున్నవి. రెండు వాక్యములచేత రెండింటిని విధించుచున్నాడు. మొదటి వాక్యముచేత ప్రాయశ్చిత్తముగ నాల్గవ యర్ఘ్యము నీయవలెననియు, రెండవ వాక్యముచేత అష్టోత్తరశతగాయత్రీజపము విధింపబడినవి. ఇచ్చటి విశేషమేమనగా—తొల్తి వాక్యమున ప్రాయశ్చిత్తార్ఘ్యము నాల్గవది యగును గాన సంధ్యోపాసనసంకల్పముకంటె ముందు జేయబడదు. అట్లు చేసిన నది నాల్గవది కాదు. కావున నచ్చట "ఆదౌ" యని యనలేదు. అనుటకు వీలుండదు కూడను. కాని రెండవ వాక్యమున "ఆదౌ" యని యనుటచేత ఆ ప్రాయశ్చిత్త జపము సంధ్యావందనము మధ్యను గాక, సంధ్యోపాసనసంకల్పము కంటె ముందే చేయవలెను. అట్లు ముందుచేసి, తర్వాతనే సంధ్యోపాసన సంకల్పము, సాంగోపాంగసంధ్యోపాసనాచరణము జరుగవలెనని యభిప్రాయము అత్యంత స్పష్టముగ తెలియుచున్నది. కాని "ఒక ప్రాయశ్చిత్తము మధ్యను, మరియొక ప్రాయశ్చిత్తము ఆరంభమున నెందులకు చేయవలెను? దీనికొక మార్గము. దానికొక మార్గమా? రెండును గూడ ఆరంభమునందే జేయబడుగాక! "ఆదౌ" యని యున్నది గదా! యని కొందరు వాదింతురు. ఆ వాదము సరి కాదు. రెండు ప్రాయశ్చిత్తములును రెండు మార్గములుగనే చేయవలెను. ఏల? అచ్చట రెండు వాక్యములుండి రెండు విధములుగా చెప్పుట

వలన. ఇచ్చట రెండు ప్రాయశ్చిత్తములను జేయ నవసరము లేదు. కదా! ఏదియే నొక్కటియే జేయవలెను, అందు అర్ఘ్యరూపప్రాయశ్చిత్తము చేయదలచితివా? నాల్గవ యర్ఘ్యముగ మధ్యనే చేయుము, లేదా జపరూపప్రాయశ్చిత్తమును చేయదలచితివా? ఆ జపమును సంధ్యోపాసనసంకల్పమునకు ముందే చేసి, తర్వాత సాంగోపాంగ సంధ్యోపాసనమును జేయుము. అను నర్థము భావము అతి స్పష్టముగనే తెలియుచున్నవి. మరల శంక = అర్ఘ్యము మధ్యనేమి? జపము ఆదియందేమి? అని. సమాధానము. ఆ ప్రశ్నను దేవీభాగవతకర్త యగు వ్యాసమహర్షినే యడుగుము. మహర్షి వచనమునకు తిరుగు లేదు కదా!

పై ప్రాయశ్చిత్తములలో జపరూపప్రాయశ్చిత్తమును చేయ దలచిన యెడల సంధ్యోపాసనసంకల్పమునకు ముందే పురాణాచమనమును తరువాత రెండు స్మార్తాచమనములను జేసి ప్రాణాయామము జేసి, "మమ సంధ్యాకాలాతిక్రమణజనితదోషపరిహారార్థం అష్టోత్తరశతసంఖ్యాక గాయత్రీజపరూపప్రాయశ్చిత్తం కరిష్యే" అని సంకల్పించి ధ్యానశ్లోకమును పఠించి అష్టోత్తరశతజపమును జేసి. జపమును పరబ్రహ్మకు సమర్పించవలెను. జపప్రాయశ్చిత్తము సమాప్తము.

తర్వాత సాంగోపాంగసంధ్యోపాసనమును చేయవలెను. ఒకవేళ అర్ఘ్యరూపప్రాయశ్చిత్తమును చేయదలచినచో— మామూలు ప్రకారము సంధ్యావందనమును జేయుచు అర్ఘ్యాంతము జేసి అర్ఘ్యాంగములగు ప్రదక్షిణాచమనములనుకూడ చేసిన నక్కడితో నర్ఘ్యము పూర్తియగును. తర్వాత 'మమ సంధ్యాకాలాతిక్రమణజనితదోషపరిహారార్థం అర్ఘ్యప్రదానరూపం ప్రాయశ్చిత్తం కరిష్యే" అని సంకల్పించి దోసిలితో నీటిని పుచ్చుకొని సప్తవ్యాహృతిశిరోయుక్తగాయత్రీమంత్రముతో నభిమంత్రించి ప్రాయశ్చి

త్తార్ఘ్యమును విడుచునది. తర్వాత సంధ్యోపాసనము ఉత్తరాంగ ములు పూర్తి జేయునది.

ప్రాయశ్చిత్తార్ఘ్యమంత్రవిషయమున వ్యాసులు.

"ప్రణవవ్యాహృతియుతాం గాయత్రీం శిరసా సహ।
ఉచ్చార్య దత్వార్ఘ్యమాదౌ సంధ్యాకర్మ సమాచరేత్॥

ప్రణవసహితసప్తవ్యాహృతులను ముందు గలిగి, శిరో మంత్రమును చివర గలిగిన గాయత్రీమంత్రమును ఉచ్చరించి సంధ్యో పాసనకు ముందు (నాల్గవ యర్ఘ్యముగ) ప్రాయశ్చిత్తార్ఘ్యము నిచ్చిన తర్వాత సంధ్యాకర్మను=సంధ్యావందనమున ముఖ్యమగు కర్మను సంధ్యోపాసనమును జేయునది. శంక="సంధ్యాకర్మ" యన సాంగోపాంగసంధ్యోపాసనము కాదా? సమాధానము. కాదు. "అసావాదిత్యో బ్రహ్మ" యని చేయు సంధ్యోపాసనము. శంక= ఎట్లు? సమాధానము. "అసావాదిత్యో బ్రహ్మేతి యుద్ధ్యానం క్రియతేఽన్వహం।తదేవ సాంధ్యమిత్యుక్తం కర్మబ్రహ్మోపకారకమ్" అను స్మృతిరత్నమహోదధివచనము ప్రమాణము. అచ్చట "అసా వాదిత్యో బ్రహ్మ"యను మంత్రముచే చేయబడు ధ్యానము (ఉపా సనము) సాంధ్యం కర్మ=సంధ్యాకర్మ"యని స్పష్టముగా నున్నది. అంతియే గాదు—వెనుక నుదహరించిన ధర్మప్రవృత్తి స్మృతి ముక్తాఫలాది-పంచప్రమాణవచనముల ననుసరించి ప్రాయశ్చిత్తా ర్ఘ్యము నాల్గవదిగనే నుండవలెను గదా! అందువలన నిక్కడ "ఆదౌ" శబ్దమునకు సంధ్యోపాసనకు ముందు అనిన్నీ, "సంధ్యా కర్మ" శబ్దమునకు సంధ్యోపాసన మనిన్నీయర్థమును చేయ వలెను. వేరు విధముగ చేయరాదు.

శంక="న హి కర్మణి కర్మాంతరారంభః" ఒక కర్మయందు మరియొక కర్మను ఆరంభింపగూడదు" అను నిషేధముండగా ప్రాయశ్చిత్తార్ఘ్యమును మధ్యనెట్లు చేయనగును? సమాధానము:

పైన చెప్పిన నిషేధము సామాన్యనిషేధము. దీనిని ఏదైన విశేష విధి త్రోసివేయగలదు. ఇచ్చట "కాలాతీతవిశుద్ధ్యర్థం చతుర్థార్ఘ్యం ప్రదాపయేత్" అను విశేషవిధిసామర్థ్యమువలననే ఆ సామాన్యనిషేధమున కిచ్చట ప్రవేశించుట కవకాశము లేదు.

ఇచ్చట నొక ముఖ్యమగు సందేహము కలుగుచున్నది. ఏమన—ఈ కాలాతిక్రమణము దేనికి? అర్ఘ్యప్రక్షేపమునకా? లేక సంధ్యోపాసనమునకా? యని. బదులేమి? అర్ఘ్యప్రక్షేపమునకనియే. ఎందులకు? ప్రాయశ్చిత్తము గూడ నర్ఘ్యరూపమగుటచేత రెండింటికిని సామ్యమున్నదిగదా! అందుచేత సమంజసముగ నుండును. సమాధానము అది సమంజసము గాదు, ఏలననగా—ఏ స్మృతులందును అర్ఘ్యప్రదానమునకు కాలాతిక్రమణమైన, ప్రాయశ్చిత్తము విధింపబడలేదు. మీదుమిక్కిలి సంధ్యోపాసనమునకే కాలాతిక్రమణమునందు ప్రాయశ్చిత్తము విధింపబడినది. ఎట్లనగా—

## 1. స్మృతిముక్తావళియందు

"ప్రాతస్సంధ్యాం సనక్షత్రాం నోపాస్తే యః ప్రమాదతః।
గాయత్ర్యష్టశతం తస్య ప్రాయశ్చిత్తం విశుద్ధయే॥

ఏద్విజుడు పొరపాటువలన (గమనించకపోవుటవలన) నక్షత్రములుండగా సంధ్యోపాసనను చేయడో, యాతనికి అష్టోత్తర శతగాయత్రీజపము ప్రాయశ్చిత్తముగ విధింపబడుచున్నది. కాలాతిక్రమణజనితదోషనివృత్తికొరకు. ఇది స్పష్టము.

## 2. శాతాతపస్మృతి

"అనాదిత్యాం తు యః పూర్వాం సాదిత్యాం చైవ పశ్చిమాం।
నోపాసీత ద్విజస్సంధ్యాం స సర్వోఽబ్రాహ్మణః స్మృతః॥

దీని యర్థము వ్రాయబడినది.

ఆలోచించగా నీవచనమున ప్రత్యక్షముగ ప్రాయశ్చిత్తము

విధింపబడలేదు. అయినప్పటికిని కోటిప్రాయశ్చిత్తములచేత గూడ దుర్వారమైన (అడ్డుపెట్టశక్యముకాని) అల్పబ్రాహ్మణత్వము చెప్పబడినదిగదా! అదియే, కోటిప్రాయశ్చిత్తములను మించినది.

## 3. దేవీభాగవతమున

''కాలాతిక్రమణే జాతే చతుర్థార్ఘ్యం ప్రదాపయేత్ ।
అథవాఽష్టశతం దేవీం జప్త్వాఽదౌ తాం సమాచరేత్ ॥

దీని యర్థమీాయబడినది. ఈ వచనమున ''తాం'' అనగా సంధ్యోపాసనము అని యర్థము. కాని అర్ఘ్యప్రక్షేపమని కాదుగదా! ఇట్లు స్మృతులందు ముఖ్యకాలమున సంధ్యోపాసనము చేయని యెడలనే ప్రాయశ్చిత్తము విధింపబడినది. కాని యర్ఘ్యప్రక్షేపమునకు కాలాతిక్రమణమైన యెడల ప్రాయశ్చిత్తమెక్కడను విధింపబడనే లేదు. కావున కాలాతిక్రమణము సంధ్యోపాసనమునకే గాని యర్ఘ్యమునకు గాదు. ఎందువలన? ప్రధాన (అంగి) కర్మకే కాలాతీతము అను మాటయును ప్రాయశ్చిత్తమున్నూ అంతియే కాని, అంగమునకు కాలాతీతమనియును ప్రాయశ్చిత్తమున్ను ఉండదు. సంధ్యాకర్మయందు సంధ్యోపాసనము అంగి ప్రధానము. కాన సంధ్యోపాసనమునకే కాలాతీతము, ప్రాయశ్చిత్తము. అంగమగు అర్ఘ్యమునకు కాదు.

శ్రీకృష్ణపండితులవారు తమ భాష్యమునందు అర్ఘ్యము ప్రధాన మనినారు. కాన అర్ఘ్యమునకు కాలాతీతప్రాయశ్చిత్తమనినారు. సంధ్యోపాసనము మాటమైన ఎత్తలేదు. సంధ్యోపాసనమునకు హుళక్కియే. సిద్ధాంతమున అర్ఘ్యము ప్రధానము కాదు. సంధ్యోపాసనమే ప్రధానము. కావున ప్రాయశ్చిత్తార్ఘ్యము అర్ఘ్యప్రక్షేపమునకు ముందీయకూడదు. సంధ్యోపాసనమునకు ముందు ఈయవలయును.

మరలనొక శంక. సంస్కృతమునందు ''చతుర్ణాం పూరణం

చతుర్థకం. అనగా-నాలుగు సంఖ్యను పూర్తి చేయునది, కాన చతుర్థకము అనబడును, కదా! అంగమగు అర్ఘ్యములు ఒక్క-గాయత్రి చేతనే చేయబడును. ప్రాయశ్చిత్తార్ఘ్యము సప్తవ్యాహృతులతోను శిరోమంత్రముతోను కూడిన గాయత్రితో చేయబడును. రెండింటికిని పోలిక లేదు గదా! పోలికలేనివాటికి (విరూపములకు) సంఖ్యాపూరకత్వమెట్లు వచ్చును? సమాధానము: స్వరూపములో పోలిక లేకపోయినను అర్ఘ్యత్వమను ధర్మము రెండింటికిని సమానము. కావున ఆ ధర్మముయొక్క- పోలికతో పూరకత్వము కలుగుటలో ఆక్షేపము లేదు. కాన దోషము లేదు.

ఇట్లు కాలాతిక్రమణదోషప్రాయశ్చిత్తము నిర్ణయింపబడినది.

గౌణకాలాతిక్రమమున బోధాయనులు వేరు ప్రాయశ్చిత్తమును విధించుచున్నారు.

"సాయమతిక్రమే రాత్ర్యుపవాసః ప్రాతరతిక్రమేఽహరుపవాసః. అని. ఇచ్చట సాయంశబ్దము ఆరు గడియల కాలమగు ప్రదోషకాలమును చెప్పును. ప్రాతశ్శబ్దము ఆరు గడియల ప్రాతఃకాలమును చెప్పును. కావున నీయారు గడియల కాలము అతిక్రమించిననే, పైయుపవాసరూపప్రాయశ్చిత్తమును చేయవలెను. శంక = వెనుక చెప్పినట్లు గౌణకాలాతిక్రమణమునకు ప్రాయశ్చిత్తార్ఘ్యము చేసిన చాలు గదా! ఈ యుపవాసమేల? యని, సమాధానము: "ఏకత్రోదితానాం ప్రాయశ్చిత్తానాం సమవాయః" ఒక విషయమున విధించిన ప్రాయశ్చిత్తములన్నియును చేయబడవలెను" అను ధర్మశాస్త్రనియమ ముండుటవలన గౌణకాలాతిక్రమమున విధింపబడిన అర్ఘ్యరూపప్రాయశ్చిత్తముతో కూడ ప్రాతఃసంధ్యోపాసనము చేసి, ఆ పగలుపవాసము చేయవలెను. అట్లే సాయమున గౌణకాలాతిక్రమమైన యెడల అర్ఘ్యప్రాయ

శ్చిత్తముతో సాయంసంధ్యోపాసనమును చేసి, ఆ రాత్రి యుపవాస ముండవలెను. అని నిర్ణయము.

ద్విజుడిట్టి యుపవాసక్లేశము నోర్వలేని వాడైన యెడల నప్పుడు సోమరితనమును వీడి శ్రద్ధతో, నెట్టి దురవస్థలలో నున్నను సంధ్యాముఖ్యకాలము రాగానే ఎట్లో యొక విధముగ ఇతరాంగ ములను విడచి యైనను సంధ్యోపాసనను మాత్రము నైనను మాన సస్నానముతో నాచరించిన యెడల నంతమాత్రము చేత నే యుపవాస క్లేశము లేనివాడై ప్రాయశ్చిత్తి కాకుండ కృతార్థుడగును. ఈ విషయము వెనుక పలుమారులు చెప్పబడెను. అట్లు సంధ్యో పాసనను మాత్రమునైన సకాలమున చేయని యెడల నుపవాసము చేయవలసివచ్చును. ప్రాయశ్చిత్తియు నగును.

## స్మృత్యంతరమున విశేషము చెప్పబడినది

"మధ్యాహ్నే సమతిక్రాంతే సాయంకాలో భవేద్యది।
సాయంసంధ్యాముపాస్యాదౌ తతో మాధ్యాహ్నికీం చరేత్॥

దైవవశమువలన మాధ్యాహ్నికసంధ్యోపాసనము చేయబడ లేదు. సాయంసంధ్యాముఖ్యకాలము వచ్చివేసినది. అప్పుడేమి చేయవలెను? ముఖ్యకాలము కాన సాయంసంధ్యోపాసనము బల మైనది. కాన ముందు సాయముపాసనము చేసి తర్వాతనే ప్రాయ శ్చిత్తముతో మాధ్యాహ్నికమును చేయవలెను. ఈ న్యాయము ననుసరించియే ప్రాతర్మాధ్యాహ్నిక సంధ్యోపాసనలు కూడిన యెడల, ముందు సకాలము కాబట్టి మాధ్యాహ్నికమును చేసి ప్రాయ శ్చిత్తముతో ప్రాతరుపాసనమును చేసి ఆ పగలు ఉపవసింప వలెను,

సాయంసంధ్యాముఖ్యకాలమున మూడు సంధ్యలును చేరిన యెడల ముందు సాయముపాసనమును చేసి తర్వాత ప్రాయశ్చిత్తము లతో క్రమముగ ప్రాతరుపాసనమును మాధ్యాహ్నికోపాసనమును

చేయవలెను. మూడు ఉపాసనలకును గౌణకాలము దాటిపోయిన యెడల కాలాతిక్రమణములో వ్యత్యాసము లేదు కావున, క్రమముగ ప్రాతర్మాధ్యాహ్నిక-సాయముపాసనములను ప్రాయశ్చిత్తములతో సహా వేరువేరుగ చేయవలెను, ఆరాత్రి ఉపవసింపవలెను. ఇదియును, అర్ధరాత్రిలోపుననే జరుగవలెను. అర్ధరాత్రి దాటినయెడల ఆనాటి సంధ్యోపాసనలకు లోపమే.

ఇట్లు ఒక రోజు పూర్తిగ అతిక్రమించిన దోషమునకు పరాశరమాధవీయమున ప్రాయశ్చిత్తము ఇట్లు చెప్పబడినది:

"సంధ్యానుష్ఠానలోపే పరేద్యుః ప్రాతరుపాస్య, "మమ సంధ్యాత్రయాఽననుష్ఠానజనితదోషపరిహారార్థం అష్టోత్తరసహస్ర సంఖ్యాకగాయత్రీజపాత్మకం ప్రాయశ్చిత్తం షోడశప్రాణాయామ పూర్వకం కరిష్యే, ఇతి సంకల్ప్య- జప్త్వా తద్దినే న భుంజీత. ఇతి."

అనగా ఒక రోజంతయు బలవత్కారణముచేత మూడు సంధ్యోపాసనములను చేయని యెడల మరునాడుదయమున ప్రాతస్సంధ్యను ముగించుకొని పైవిధముగ సంకల్పము చేసి ప్రాయశ్చిత్తమును చేయవలెను, ప్రాయశ్చిత్తము చేసి ఆరోజంతయును ఉపవసింపవలెను. అని,

కాని ఒకరోజంతయును పూర్తి సంధ్యోపాసనను చేయుటకు సమయము దొరకక పోయినప్పటికిని ఆయా ముఖ్యకాలములందు సంధ్యోపాసనను మాత్రమునైనను చేసిన యెడల సంధ్యోపాసన లోపముండదు. ప్రాయశ్చిత్తమక్కర లేదు.

ప్రమాణవచనము.

## శంఖమహర్షి

"సంధ్యాదినిత్యలోపే తు దినమేకమభోజనం।
దినద్వయే త్రిరాత్రం స్యాత్, కృచ్ఛ్రార్థం తు దినత్రయే॥

దశాహే కృచ్ఛ్రమేకం స్యాత్, దూర్ధ్వం చాంద్రాయణం చరేత్ ।
చాంద్రాయణం పరాకం చ మాసాదూర్ధ్వం విధీయతే॥
తతోఽప్యేవం ప్రకల్ప్యం స్యాద్వ్యావన్మాసక్రమేణ తు।
వర్షాదూర్ధ్వం హి పతతి నిత్యకర్మబహిష్కృతః॥

ఒకరోజున మూడు సంధ్యలకును లోపము వచ్చిన, మరునాడు ఒక రోజు పూర్తిగ నుపవాసము ప్రాయశ్చిత్తము. రెండు రోజులు సంధ్యాలోపము జరిగిన, మూడురోజులుఉపవాసము ప్రాయశ్చిత్తము. మూడు దినములు సంధ్యాలోపము కలిగిన కృచ్ఛ్రవ్రతములో సగము ప్రాయశ్చిత్తముగ చేయవలెను. పది దినములు సంధ్యాలోపము కలిగిన ఒక కృచ్ఛ్రమును ప్రాయశ్చిత్తముగ చేయవలెను. పది దినముల కంటె నెక్కువ దినములు సంధ్య లోపించిన నొక చాంద్రాయణవ్రతమును చేయవలెను. ఒక మాసము దాటి సంధ్యాలోపమైన, చాంద్రాయణమును పరాకమును రెండును చేయవలెను. రెండు, మూడు మొదలగు మాసములు లోపించిన మాసక్రమము ననుసరించి చాంద్రాయణపరాకముల సంఖ్యను హెచ్చించుచు ప్రాయశ్చిత్తమును ఊహించి కల్పించునది. ఒక సంవత్సరము సంధ్యాలోపమైన యెడల నాతడు పతితుడగును. నిత్యకర్మలనుండి బహిష్కృతుడగును.

## స్మృత్యంతరమున

"సంధ్యాహీనః సప్తరాత్రం పునస్సంస్కారమర్హతి" అని.

ఏడు దినములు సంధ్యావందనము చేయని ద్విజుడు, మరల ఉపనయనసంస్కారమును పొందవలెను.

## ఆశౌచమున సంధ్యోపాసనవిచారము

అవ=జాతాశౌచమృతాశౌచములందు సంధ్యోపాసనవిధానము వివరింపబడుచున్నది.

**ఆశౌచయోరుపాస్త్యంతం కార్యం మానసమంత్రకైః।**
**ఉచ్చార్యార్ఘ్యం బహిర్మంత్రం ప్రాణాయామస్త్వమంత్రకః॥**

ఆశౌచయోః = జాతాశౌచమృతాశౌచములు రెండింటి యందును [పురుడు, చావు, మైలలందు.] ఉపాస్త్యంతం=సంధ్యోపాసన పూర్తివరకే,మానసమంత్రకైః=మంత్రములను మనసునందే చెప్పు కొనుచు, [వాచికముగగాని, ఉపాంశుగగాని చెప్పనే కూడదు.] కార్యం=సంధ్యోపాసనను పూర్వాంగములతో మాత్రము ఆచరింప వలసినది. అంతియే కాని గాయత్రీజప–ఉపస్థాన–దిఙ్నమస్కారాది–ఉత్తరాంగములను చేయరాదు. అర్ఘ్యం=అర్ఘ్యప్రక్షేపమును, మంత్రం=అర్ఘ్యమంత్రమగు గాయత్రీమంత్రమును బహిః=వెలుపలికి ఉచ్చార్య=ఉచ్చరించియే అనగా వాచికముగ చెప్పియే, కార్యం= చేయవలెను. తు=కాని, ప్రాణాయామః=ప్రాణాయామము అమంత్రకః=మానసికమంత్రములు కూడ లేకుండ, పూరకకుంభకరేచకములు మాత్రము, కార్యః=చేయవలెను. తాత్పర్యము స్పష్టము.

ప్రమాణవచనములు.

## మరీచిమహర్షి

''సూతకే కర్మణాం త్యాగః సంధ్యాదీనాం విధీయతే।

జాతాశౌచమున (పురిటియందు) సంధ్యోపాసనము మొదలగు కర్మలను జేయగూడదు. అని సంధ్యోపాసననిషేధమును చెప్పిరి.

## పులస్త్యమహర్షి

''సంధ్యామిష్టిం చరుం హోమం యావజ్జీవం సమాచరేత్।
న త్యజేత్సూతకే వాపి త్యజన్ గచ్ఛత్యధోగతిమ్॥

సంధ్యోపాసనమును, ఇష్టిని, చరుహోమమును, బ్రతికి యున్నంత కాలము చేయవలసినదే. విడిచిపెట్టిన అధోగతికి పోవును. ఇట్లు పులస్త్యులు సంధ్యాత్యాగమును నిషేధించిరి. ఇట్లు విరుద్ధములగు వచనములకు సర్వజ్ఞమాధవాచార్యులవారు సమన్వయము చేసినారు.

ఎట్లనగా—

తత్ర మరీచిః సంధ్యాకర్మణో వాచికత్వం నిషిధ్యతి పులస్త్యః సధ్యాం కర్మణో మానసికత్వ మభిప్రైతి ఇతి

అనగా—

అందు మరీచిమహర్షి సంధ్యావందనమంత్రములకు వాచికత్వము నిషేధించుచున్నారు. పులస్త్యమహర్షి సంధ్యామంత్రములకు మానసికత్వమును అభిప్రాయపడుచున్నారు. అనగా సంధ్యాకర్మను వాచికమంత్రములతో చేయగూడదని మరీచిమహర్షి చెప్పుచున్నారు. కాని సంధ్యాకర్మను మానసికమంత్రములతో చేయవలెనని పులస్త్యులు చెప్పుచున్నారని భావము. ఇందుకు ప్రమాణవచనమును గూడ చూపించినారు.

## పరాశరమాధవీయమున

సూతకే మృతకే వాపి సంధ్యాకర్మ న సంత్యజేత్।
మనసోచ్చారయేన్మంత్రాన్, ప్రాణాయామమృతే ద్విజః॥

జాతాశౌచమునందును, మృతాశౌచమునందును కూడ సంధ్యాకర్మను విడువకూడదు.

శంక = జాతాశౌచ - మృతాశౌచములు, వేదమంత్రోచ్చారణకు ప్రతిబంధకములు గదా! అట్టిచో సంధ్యాకర్మను ఎట్లు చేయుట? సమాధానము చెప్పబడుచున్నది. మంత్రములనన్నింటిని మనసున చెప్పుకోవలెను. కాని ప్రాణాయామమును మానసికమంత్రములు కూడ లేకుండ కేవలపూరక-కుంభక-రేచకములను మాత్రము చేయవలెను. అని.

## భారద్వాజులవారు

సూతకే మృతకే కుర్యాత్ప్రాణాయామమమంత్రకం।
తథా మార్జనమంత్రాంస్తు మనసోచ్చార్య మార్జయేత్॥
గాయత్రీం సమ్యగుచ్చార్య సూర్యాయార్ఘ్యం నివేదయేత్।

ఉభయాశౌచములందును ప్రాణాయామమును మంత్రము

లేకుండగనే చేయవలెను. మార్జనము ఇతరమంత్రములకు సూచకము. కాగా—మార్జనము మొదలగు ఇతరకర్మలనన్నింటిని మానసిక మంత్రములతో చేయవలెను. అర్ఘ్యములను మాత్రము గాయత్రీ మంత్రమును వెలుపలకు ఉచ్చరించుచునే చిమ్మవలెను.

## పైఠీనసిమహర్షి

సూతకే సావిత్ర్యాంజలీన్ ప్రక్షిప్య ప్రదక్షిణం కృత్వా సూర్యం ధ్యాయన్ నమస్కుర్యాత్॥ అని.

సూతకము మృతకమునకు కూడ సూచకము. ఉభయాశౌచములందును వాచికగాయత్రీమంత్రముతోనే అర్ఘ్యములను చిమ్మి సూర్యమండలమున సంధ్యాదేవతను ధ్యానించుచు నమస్కరింపవలెను. అని.

## వ్యాసులు

ప్రక్షిపేత్సూతకేత్వర్ఘ్యం గాయత్రీం సమ్యగుచ్చరన్।
తతః ప్రదక్షిణం కృత్వా సూర్యం ధ్యాయేత్తతో ద్విజః॥అని.

పై వచనార్థమే. ఇచ్చట కూడ సూర్యధ్యాన మనగా— సూర్యమండలాంతర్గతసంధ్యాదేవతాధ్యానమనియే అర్థము.

## ధర్మసింధుసారమున స్మృత్యంతరే

''అనుసంధ్యముపాసీత సంధ్యారూపం రవిం ద్విజః॥ అని.

అనగా—

త్రిసంధ్యలయందును, సంధ్యారూపుడగు రవిని (అనగా, ''సంధ్యా హి సూర్యగం బ్రహ్మ'' అను వ్యాసవచనానుసారముగ సూర్యమండలాంతర్యామియగు బ్రహ్మచైతన్యమే సంధ్య కావున అట్టి సంధ్యారూపుడగు రవి యనగా సూర్యమండలాంతర్యామి యగు సంధ్యాదేవతయే అర్థము.

## నిర్ణయసింధువున భరద్వాజులు

"మార్జనం తు నవా కుర్యాదుపస్థానం న చైవ హి"

ఆశౌచమున మార్జనమును చేసిన చేయవచ్చును లేదా మానివేయవచ్చును. కాని ఉపస్థానమును మాత్రము చేయనే కూడదు. అని మార్జనమునకు వికల్పముగ అనుమతి నొసగి ఉపస్థానమును పూర్తిగ నిషేధించుచున్నారు.

## నిర్ణయసింధువున బృహస్పతి

"సూతకే మృతకే వాఽపి సావిత్ర్యా చాంజలిం క్షిపేత్ ।
న గాయత్రీం జపేద్ధీమాన్ కుర్యాత్సౌరీముపస్థితిమ్॥

జాతాశౌచమున గాని మృతాశౌచమున గాని గాయత్రీ మంత్రము నుచ్చరించియే యర్ఘ్యప్రక్షేపములను చేయవలెను కాని బుద్ధిమంతుడగువాడు గాయత్రీజపమును చేయగూడదు సూర్యోపస్థానమునున్నూ చేయగూడదు. అని ఆశౌచములందు గాయత్రీ జపసూర్యోపస్థానములను స్పష్టముగా నిషేధించుచున్నారు. ఇందువలన నేమి తెలియుచున్నదనగా – సర్వస్మృతులును నిబంధన గ్రంథములున్నూ వెతకినంతవరకు ఆశౌచములందు సంధ్యోపాసన సమాప్తివరకే సంధ్యావందనము విధింపబడినట్లు తెలియుచున్నది. జపోపస్థానాద్యుత్తరాంగములు విధింపబడలేదు. మీదుమిక్కిలి జపోపస్థానములను భారద్వాజ, బృహస్పతులు గట్టిగ నిషేధించిరి. మిగత మూడుత్తరాంగముల నిషేధమింతవరకు కనపడలేదు. కాని యుత్తరాంగములన్నియును నిషిద్ధములే యని కొందరందురు. కాని మరికొందరు – పైకీనసివచనమున నున్న "నమస్కుర్యాత్" అను పదమును ఆధారము చేసికొని, గాయత్రీజపసూర్యోపస్థానములు ప్రత్యక్షనిషిద్ధములు కాన వానిని విడిచిపెట్టి, నమస్కారరూపము లైన దిఙ్నమస్కార; భూమ్యాకాశవందన – అభివాదనములను మానసికమంత్రములతో చేయవచ్చు ననుచున్నారు.

కాని మరికొంద రిట్లనుచున్నారు.

ఉపాసనము ముఖ్యము. ఉపాసనమాత్మధ్యానము. కాన దానికి నెట్టి యాశౌచములును అడ్డవు. ప్రస్తుతమున సంధ్యోపాసన మాత్మధ్యానము. దానిని తప్పక ననుష్ఠింపవలెను. ఆ యుపాసనకు ఐదు పూర్వాంగములు. ఐదుత్తరాంగము లున్నవి. అందు తొలి నాలుగు పూర్వాంగములును ఉపాసకుని బాహ్యాభ్యంతరములందు పరిశుద్ధుని జేయుటకొరకు విధింపబడినవి. ఐదవదగు అర్ఘ్యము ఉపాసనాధారమగు సూర్యమండలస్వాస్థ్యముకొరకు విధింపబడినది. కాన నీ యైదు పూర్వాంగములును నాంతరీయకములు. [అత్యంత ముఖ్యతమములు] వానిని తప్పక నాచరింపవలెను. కాన వానిని మహర్షులు విధించిరి. కాని ఆశౌచము వేదోచ్చారణకు ప్రతి బంధకము. కాన మంత్రములకు వాచికత్వము ఉపాంశూచ్చారణ యున్నా అత్యంతనిషిద్ధములు. అందువలన వానికి మానసికోచ్చా రణ విధింపబడినది. వెనుక శ్రీకృష్ణపండితమతనిరాకరణావ సరమున వివరించినట్లు అర్ఘ్యప్రక్షేపమున గాయత్రీమంత్రమునకు వాచికత్వము విధింపబడినది. ఇది పూర్వాంగముల తత్త్వము. ఇకనుత్తరాంగములు. ఇవి గాయత్రి సూర్యుడు దిక్కులు దిక్పతులు భూమ్యాకాశములు మొదలైన ఆయా దేవతల యనుగ్రహము ఉపాసకునకు లభించుటకొరకేర్పడినవి. ఇవి అంతనాంతరీయకములు కావు. అందువలన ఉభయాశౌచములందును నాంతరీయకములైన పూర్వాంగములను విధించి అంతనాంతరీయకములు కాని యుత్త రాంగములు నిషేధింపబడినవి. కాన నుత్తరాంగములన్నియును నిషేధింపబడినట్లే. కావున సంధ్యోపాసనమునరకే సంధ్యావందనము. ఉత్తరాంగము లుండవని యందురు. ఇదియే యుచితమేమో నని సించుచున్నది.

కాగా ఉభయవిధాశౌచములందును మానసికముగ మంత్రములు చెప్పుకొనుచు నాచమించి, ప్రాణాయామమును వెనుక

జెప్పినట్లు అమంత్రకముగ జేసి సంకల్పించి మార్జన – అభ్యుక్షణ – పునర్మార్జన – పాపపురుషదహనములను మానసికమంత్రములతో కాయికకర్మతో చేసి, అర్ఘ్యప్రక్షేపములను గాయత్రి నుచ్చరించియే చేసి, ప్రదక్షిణాచమనములను మానసిక మంత్రములతో గావించి, మూడు ప్రాణాయామముల నమంత్రకముగా చేసి సంధ్యోపాసనను యథాపూర్వముగ జేయునది.

ఇంతవరకే సంధ్యాపందనము. జాతాశౌచమున నొక విధము గను, మృతాశౌచమున మరియొక విధముగను లేదు. ఉభయవిధా శౌచములందును భేద మించుకంతయును లేదు. స్మృతులన్నియు నట్లే చెప్పుచున్నవి. సందేహము లేదు.

గ్రహణకాలమున సంధ్యోపాసనము.

## నిర్ణయసింధువు

"చంద్రే గ్రస్తాస్తే, ఉత్తరదినే సంధ్యాహోమాదౌ న దోషః"

## ఉశనఃస్మృతి

"గ్రస్తే చాస్తంగతే త్విందౌ జ్ఞాత్వా ముక్త్యవధారణం।
స్నానహోమాదికం కార్యం భుంజీతేందూదయే పునః॥"

రాత్రి మూడవజామున గాని నాలవ జామున గాని చంద్ర గ్రహణము పట్టి, మోక్షమునకు ముందే చంద్రుడస్తమించిన యెడల మరునాడుదయమున శాస్త్రముచే గ్రహణమోక్షమును నిర్ణయించి ముక్త్యనంతరమందు స్నానము సంధ్యావందనము హోమము మొదలగు నిత్యకర్మలను చేయవచ్చును. దోషము లేదు. గ్రహణసమయ మున సంధ్యోపాసన, హోమాదినిత్యకర్మలు చేయగూడదు. కాని భోజనమును మాత్రము రాత్రి చంద్రదర్శనము చేసిన తర్వాతనే చేయవలెను ఉశనఃస్మృతి ప్రమాణము. స్మృతి, చంద్రగ్రహణమును గూర్చియే చెప్పినది. సూర్యగ్రహణమును గూర్చి చెప్పలేదు. కాని నిత్యకర్మల విషయమున గ్రహణములు రెండును సమానమనియే

తోఁచెడిని, కావున సూర్యగ్రహణము, పట్టి ముక్తికి ముందే సూర్యుడస్తమించిన యెడల శాస్త్రముచేత ముక్తిని నిర్ణయించి ముక్త్యనంతరము, సమయము అర్ధరాత్రికి ముందే యైన యెడల సమయము సరిపడిన యెడల స్నానము, సంధ్యోపాసనము హోమములను చేయవచ్చును, భోజనము మాత్రము మరునాడుదయమున సూర్యదర్శనానంతరమే చేయవలెను అని తెలియదగును. ఒకవేళ ముక్తిగాని అర్ధరాత్ర్యనంతరమైన యెడల సంధ్యాదులకు లోపమే.

## దర్శాదులందు జపసంకోచము

స్మృతిరత్నాకరాదులందు చెప్పబడినది—

"నిత్యస్యార్ధం చతుర్థీవసుమనుతిథిషు స్యాజ్జపః సప్తమీాయః.
సప్తత్రింశజ్జపః స్యాత్ప్రతిపది చ పునః స్యాచ్చ షట్త్రింశదేవ।
ఏవం పర్వద్వయేఽపి త్రియుతదశతిథావష్టభిర్వింశతిః స్యా,
దేవం విష్వాది కాలేష్వఖిలమునిమతం సాయమేవం న కల్యే"॥ అని.

అనగా—

"చవితియందు అష్టమియందు చతుర్దశియందున్నూ నిత్యజపమగు అష్టోత్తరశతమునందు (అష్టోత్తరశతం నిత్యం" నిత్యజపమష్టోత్తరశతమని విధింపబడుటవలన) సగము, ఏబదినాలుగు సారులు గాయత్రిని జపింపవలెను. సప్తమియందైతే ముప్పదియేడు సారులు గాయత్రిని జపింపవలెను. పాడ్యమియందు పూర్ణిమయందు అమావాస్యయందును ముప్పదియారు సారులు గాయత్రిని జపింపవలెను. త్రయోదశియందును విష్వాదికాలములందును ఇరువదియెనిమిది సారులు గాయత్రిని జపింపవలెను. ఇట్లు జపము తగ్గుదల సాయంసంధ్యావందనమునందే. ప్రాతఃసంధ్యావందనమునందు కాదు. ఈ తగ్గుదల, యందరి ఋషుల యభిమతము. ఇచ్చట నిత్యజపము నూటయెనిమిదియే. సహస్రము మొదలగు సంఖ్యలు లేవని వెనుక నొకసారి వివ

రించుట యైనది. "ఆయన సంధ్యావందనమున ప్రతిదినము సహస్ర గాయత్రీ చేస్తారండి. రెండు సహస్రాలు చేస్తేనే గాని లేవరంటీ" ఇత్యాది వచనాలు నా చిన్నతనమున చాల సారులు విన్నాను. ఆ జపము లన్నియును సంధ్యావందనమునకు సంబంధించినవే యైనయెడల నశాస్త్రీయమైనవే. సందేహము లేదు. ధర్మశాస్త్రార్థము తెలియక ఛాందసముగా చేసిన పనులు. కాని యా జపములు సంధ్యావందనమునకు సంబంధించక, సంధ్యాతిరిక్తకాలమున జేయబడినవైన యెడల శాస్త్రీయమైనవే. వారియందు ద్వేషముచే నిట్లు వ్రాయుట కాదు. ఈ వ్రాత జూచినవారు అట్లు చేయకుందురు గాక! అని వ్రాసితిని. తెలియక చేసిన పనిని సాత్వికశ్రద్ధతో జేసిన కొంత ఫలముండునని శ్రీకృష్ణ భగవానులు గీతలయందు చెప్పిరి. కాన నిది దోషము కాకపోవచ్చును.

## పరాశరమాధవీయమున

శ్రాద్ధే ప్రదోషే దర్శే వా గాయత్రీ దశసంఖ్యయా।
అష్టావింశత్యనధ్యాయే త్రయోదశ్యాం తు మానసమ్॥

శ్రాద్ధే=శ్రాద్ధభోజనానంతరము సాయంకాలమున సంధ్యావందనకాలమున అని యర్థము.

శంక=శ్రాద్ధభోక్తకు సంధ్యాధికారమే లేదు. శ్రాద్ధభోజనము సంధ్యాధికారమునకు శత్రువగుటవలన యని. సమాధానము. "దశకృత్వః పిబేదాపః గాయత్ర్యా శ్రాద్ధభుగ్ద్విజః। తతః సంధ్యాముపాసీత జపేచ్చ జుహుయాద్ధవిః॥ శ్రాద్ధభోక్త సాయంసంధ్యా కాలమున గాయత్రీమంత్రముచే నభిమంత్రించిన జలమును పదిసారులు త్రాగిన, ఆ దోషము పోవును. తర్వాత సంధ్యావందనమును సాయమగ్నిహోత్రహోమమును చేయవచ్చునని శాస్త్రవచనమున్నది.

ఈ శ్లోకమున "అనధ్యాయ" పదముచేతనే "దర్శ" అనగా అమావాస్యను గ్రహించవచ్చును. ప్రత్యేకముగా మరల 'దర్శేవా అని చెప్పనక్కరలేదు. కాని దర్శయందు క్రొత్తవిశేషమును

విధించుటకు ప్రత్యేకముగా చెప్పెను. దర్శకంటె నితరానధ్యాయము లందు అష్టావింశతి జపమే.

ఈ దర్శాదులందు వెనుక జెప్పిన సంఖ్యలకును ఇప్పుడు చెప్పిన సంఖ్యలకును తుల్యవికల్పమగుటచేత పూర్వోత్తర విరోధ ముండదు. త్రయోదశీ జపము మానసికమని విధింపబడిన దీశ్లోక మున. ఒకవేళ ఉపాంశుజపము చేయుదురేమో, అట్లు చేయకుండు టకై మానసికమని విధింపబడినది. ఈ పైన జెప్పిన తిథులు ప్రదోష–అనధ్యాయదోషయుక్తములైనప్పుడే జపసంకోచము చేయ వలెను. దోషము లేని శుద్ధతిథులందు (సప్తమీ, త్రయోదశీత్యాది తిథులందు) యథాసౌకర్యముగా నిత్యజపమునే చేయవలెను. చతుర్దశీ– అమావాస్యా– పౌర్ణమీ– పాడ్యమీ– అష్టమీ తిథుల నాధ్యాయములు గాన ఆ తిథులలో జపసంకోచము తప్పదు. అట్లే విష్వాది దినములందును సంకోచమే, అని యెఱుంగునది.

## రోగగ్రస్తుని సంధ్యోపాసనము

### జమదగ్నిమహర్షి

రాష్ట్రభంగే నృపక్రోధే రోగార్తే సూతకేఽపి చ।
సంధ్యావందనవిచ్ఛిత్తిర్న దోషాయ కదాచన॥

ఈ శ్లోకమున సంధ్యావందనలోపమునకు నాలుగు కారణ ములు చెప్పబడినవి. (1) రాష్ట్రభంగము= [రాష్ట్రక్షోభము] భూకంపము, వరదలు, మహామారి, విషవాయువ్యాప్తి ఇత్యాద్యనేక కారణములచేత రాష్ట్రమున మహాక్షోభ కలుగవచ్చును.

నృపక్రోధే=రాజునకో రాష్ట్రాధ్యక్షునకో రాష్ట్రప్రజల మీద నేదియో కారణమున మహాఽఽగ్రహము కలిగినప్పుడును, రోగార్తే= ఉపాసకుడు రోగపీడితుడైనప్పుడును, సూతకేఽపి చ=జాతా శౌచము వచ్చినప్పుడును, ఇది మృతాశౌచమునకును సూచకము. ఇట్లు నాలుగు కారణములు. ఇందు తొలి రెండు కారణములందు ఇతరులతో సహా ద్విజులు కూడ భయాకులచిత్తులై నిలచిన చోట

నిలువక త్రిమ్మరుచుందురు. కాన నట్టి సమయమున సంధ్యావంద నము శాంతముగ చేయ శక్యము గాదు. కాన నప్పుడు సంధ్యా వందనలోపము గలిగినను దోషముండదని మహర్షులు అభయమిచ్చు చున్నారు. అట్లే, 'రోగార్తుడు' రోగముచే పీడింపబడినవాడెట్లు సంధ్యోపాసన జేయగలడు? జేయలేడు. ఈ విషయము చివర విచా రింపబడును. ఆశౌచవిషయమున ఈ జమదగ్నివచనమునకును వెనుక జెప్పిన పులస్త్యవచనమునకును విరోధమున్నది గదా! అదెట్లు పరి హారణీయము? పరిహారము చెప్పబడుచున్నది.

"ఆశౌచము వచ్చినదే! ఈ యాశౌచమున వేదమంత్రముల నెట్లు చెప్పవచ్చును? వేదమంత్రములతో నెట్లు సంధ్యోపాసన చేయ వచ్చును?" అని ఆశౌచమున సంధ్యోపాసన మానవద్దు. తప్పనిసరి యగు పూర్వాంగములతో సంధ్యోపాసనమువరకైన చేయనచ్చును. అందునను మంత్రముల నన్నింటిని మానసికముగ చెప్పుకొనుచు చేయవలెను. ఉత్తరాంగములను మానివేయవలెను. అట్లు చేయని యెడల ఆతడధోగతికి పోవునని పులస్త్యులు చెప్పిరి. కాని జాతా శౌచమృతాశౌచములలో తొలి రెండుమూడు రోజులలో గాని మరి కొన్ని రోజులలో గాని శిశువుయొక్క తండ్రి సోదరులు మొదలగు వారు ప్రసవసంబంధికార్యములలో మునిగి సంధ్యోపాసనకు క్షణ మైన తీరిక లేనివారైన యెడల నట్టి సమయమున సంధ్యావందన లోపము దోషావహము కాదని యొక సవరణను పెట్టి యనుగ్ర హించినారు. కాన విరోధము లేదు. మృతాశౌచమునను గూడ పైని జెప్పినట్లే గ్రహించునది.

ఇక రోగార్తుని విషయము. రోగార్తునకు సంధ్యావందన లోపము గలిగినను దోషము లేదని జమదగ్ని చెప్పనే చెప్పినాడు. కాని జాతాశౌచమునందు వలె సర్వాత్మనా లోపమును కల్పింపగూడదు. సర్వాత్మనా పూర్తిగా రోగముచేత నశక్తు డైన యెడల జమదగ్నివచనమే శరణమగు గాక! కొంత శక్తి యున్న యెడల యథాశక్తి సంధ్యోపాసన ననుష్ఠించు

గాక! పూజాశ్రాద్ధాదులు కాయికవాచికకర్మల నన్యులచే చేయించవచ్చును. గాని బ్రహ్మధ్యానరూపమగు సంధ్యోపాసన మన్యులచే చేయించుట తగదు. కాయికవాచికకర్మలవలన గలుగు పుణ్యము అశక్తుడగు కర్తకు సంక్రమించు గాక! కాని మానసిక ధ్యానరూపమగు నుపాసనవలన కలుగు ధ్యానశక్త్యభివృద్ధి అన్యున కెట్లు సంక్రమించును? సంక్రమించదు-కాన శక్తియున్నంతవరకు యథాశక్తిగ రోగార్తుడే చేయవలెను. శ్రీకృష్ణపండితీయమున పిత్రా భ్రాత్రా-ఇత్యాది శ్లోకమునకు మూలము మృగ్యము. జాతా శౌచాదులందు వలె పూర్తిగ మానకూడదు. యథాశక్తి నను ష్ఠింపవలెను. శక్తి లోపించిన సంధ్యాలోపము దోషావహము కాదని జమదగ్నులు సెలవిచ్చియే యున్నారు. భయపడ నవసరము లేదు యథాశక్తిగ చేయుటలో నీ క్రింది పద్ధతి యనుసరణీయము. ఎట్లనగా—

కూర్చొనుటకు శక్తి యున్న యెడల నప్పుడు భస్మస్నాన మునుగాని లేక "అపవిత్రః పవిత్రోవా-"యని మానసిక స్నానమును గాని చేసి, ఉష్ణోదకముచే నాచమించి, సాంగోపాంగసంధ్య ననుష్ఠించునది. కూర్చొనుటకు గూడ శక్తి లేని యెడల పడుకొనియే పూర్వోక్తమానసికస్నానము చేసి పవిత్రుడై సంధ్యోపాసనమును మాత్రము చేయవచ్చును. పండుకొని గూడ సగుణనిర్గుణోపాసన లను చేయ బుద్ధిశక్తి లేని యెడల ప్రతీకోపాసనను చేయునది. అందుకు గూడ శక్తి లేని యెడల బాలునివలె కేవలవాక్యమును మాత్రము పఠించునది. రోగము ప్రకోపించి ప్రజ్ఞపోయిన యెడల 'సంధ్యావందనవిచ్ఛిత్తిర్న దోషాయ కదాచన' యను జమదగ్ని వచనము మేలుకొనియే యున్నది. ఈ చివరి దశ నుద్దేశించియే జమదగ్ని వచనము ప్రవర్తించినది.

ఇట్టి రోగదశలలో ప్రజ్ఞ యున్న యెడల మోక్షకారణభూత మైన చరమవృత్తికొరకే ఉపాసకులు సంశితవ్రతులై [అతి తీక్ష్ణ మైన పట్టుదలతో] నిరంతరము అవిచ్ఛిన్నమైన ఉపాసనము (ధ్యాన

ము)ను చేయుదురు. కాబట్టి ప్రజ్ఞపోవువరకును గాని, లేక ప్రాణము పోవువరకు గాని తప్పక ఇతరాంగములను విడిచి యైనను సంధ్యో పాసనను విడువకుండ చేయవలెను. విడువనే కూడదు. నిజమైన యుపాసకుడు విడువడు. మోక్షేచ్ఛగల ఏయుపాసకుడు ఆత్మధ్యాన రూపమైన సంధ్యాధ్యానమును విడువ నొల్లును? విడువనొల్లడు. అదియే పరమపురుషార్థము గదా! ''కర్తవ్యం యావత్ప్రాణవిమోచనమ్'' అని అత్రిమహర్షి ప్రాణము పోవువరకును చేయవలెననియే కదా! చెప్పిరి.

## స్కాందపురాణమున సంధ్యాలోపవిషయమున

''దేవాగ్నిద్విజవిద్యానాం కార్యే మహతి సంస్థితే।
సంధ్యాహానౌ న దోషోఽస్తి యతః సత్కర్మసాధనమ్॥ అని,

ఈ వచనమున గూడ సంధ్యాహానికి నాలుగు కారణములు చెప్పబడినవి. ఇవి మరియొక విధమైనవి. 1) దేవకార్యము, 2) అగ్నికి సంబంధించిన పని, 3) బ్రాహ్మణులకు సంబంధించిన కార్యము, 4) విద్యకు సంబంధించిన కార్యము.

1) పార్వతీపరమేశ్వరకల్యాణము శ్రీసీతారామకల్యాణము బ్రహ్మోత్సవము, జీర్ణదేవాలయోద్ధరణము మొదలగు మహా కార్యములు వచ్చి పడినప్పుడు, 2) ఇండ్లు కాలిపోవుట, గ్రామములు కాలిపోవుట మొదలగు మహానర్థములు జరిగినప్పుడు, 3) అట్లే వేలకొలది బ్రాహ్మణులకు మహాసంతర్పణములు రాత్రింబగళ్లు జరుగు సమయమున, వస్తుసంగ్రహణము, వడ్డనలు మొదలగు తెరిపి లేని పనులు వచ్చినప్పుడును, 3) అట్లే వేదశాస్త్రముల మహాపరీక్షలకు తయారు అగుట దేశదేశములకు సంబంధించిన విద్యాసంబంధమైన మహాసమావేశములకు వేలకొలది ప్రతినిధులు వచ్చినప్పుడు వారికి సౌకర్యములు సమకూర్చుటలో నిమగ్నము కావలసి వచ్చినప్పుడును రాత్రింబగళ్లు విద్యావ్యాసంగము చేయుసందర్భములందును విశ్రాంతి లేకుండ ఆయాయి కార్యములందు మునిగియున్న ద్విజులకు సంధ్యోపాసనము జరుగకుండ ఎప్పుడైన కాలమతిక్రమించిన యెడల,

అట్టి సందర్భములలో సంధ్యావందనలోపమువలన దోషమేమియు నుండదని చెప్పుచున్నది. ఏలననగా — పైని వర్ణించిన నాలుగు పనులలో ప్రవేశించుట సత్కర్మసాధనము గదా! ఇట్లు లోకసంగ్రహార్థము ఆత్మధ్యానమునకు కొంచెము లోపము వచ్చిన, దానిని సహింపవలెను. ఇందువలన ఆత్మధ్యానమునకు సహాయకరమగు త్యాగబుద్ధిపరోపకారబుద్ధులు వర్ధిల్లినవై మనసున సత్త్వగుణాభి వృద్ధిదోహదము చేయును. కావున సత్త్వగుణాభివృద్ధికరమైనకించిత్ సంధ్యోపాసనలోపము దోషావహము కాదని మహర్షులు వక్కాణించిరి.

ఇట్లు శ్రీపరదేవతాఽనుగ్రహప్రేరితుడనై సంధ్యావందనమునకు సంబంధించిన సర్వవిషయములందును సర్వవిధసందేహనివారణముకొరకు బహుధర్మశాస్త్రగ్రంథములను యథాశక్తి యథామతి పరిశీలించి ద్విజవర్యుల ప్రమోదముకొరకు ఈ సంధ్యాతత్త్వసుబోధినీగ్రంథమును శ్రుతిస్మృతిప్రమాణవచనములతో రచించితిని. పూర్తి చేసితిని.

## గ్రంథమునకు చిరస్థాయిత్వాశంస

యత్కృపాతః కృతో గ్రంథో మయాఽయం ద్విజసంముదే।
శ్రీమాతుః కృపయా జీయాత్తస్యా గ్రంథోఽయమాశ్రుతి॥ 40

ఏ పరదేవతయొక్క కృపచేత ప్రేరేపింపబడినవాడనై నేను ద్విజవర్యుల ప్రమోదముకొరకు ఈ సంధ్యాతత్త్వసుబోధినీగ్రంథమును రచించితినో, సర్వజగజ్జననియగు శ్రీమాత శ్రీలలితాపరమేశ్వరి యొక్క ఆ కృపచేతనే ఈ గ్రంథము వేదములెంతకాలముండునో యంత కాలము జీయాత్ =సర్వోత్కృష్టముగా విరాజిల్లు గాక!

శ్రీలలితాసహస్రనామములలో "ద్విజబృందనిషేవితా" యనునది యొకనామరాజము. అనగా ద్విజవర్యులచేత నితరాం= మిక్కిలిగా సర్వదా సేవింపబడునది" ఎందువలన? శ్రీలలితా పరమేశ్వరియే సంధ్యాదేవత యగుటచేత ద్విజవర్యులు త్రిసంధ్యలయందును సంధ్యాస్వరూపిణి యగు శ్రీలలితాపరమేశానిని భక్త్యతిశయముతో సేవించుచుందురు. అందుచే శ్రీలలితాపరమేశ్వరి

అవ్యాజకృపతో ఆద్విజవర్యులకు యథార్థమగు సంధ్యాస్వరూప మును సంధ్యోపాసనాస్వరూపమున చక్కగ సులభముగ తెలుప దలచినదై నా పూర్వజన్మకృతపుణ్యపరిపాక వశమువలన నాచేతనే సంధ్యాతత్త్వసుబోధినీగ్రంథమును రచింప జేసినది.

ఈ శ్లోకమున నాల్గవ పాదమున "తస్యా గ్రంథః" అను పద సమావేశము యాదృచ్ఛికముగా జరిగినది. అట్టి యాదృచ్ఛిక పదసమావేశముయొక్క స్వారస్యముచేత "ఈ గ్రంథము శ్రీమా తదే" అను విశేషార్థము లభించుచున్నది.

కాగా-శ్రీమాతయే నాబుద్ధియందు ప్రవేశించి ద్విజవర్యుల ప్రమోదముకొరకు, సాధనభూతుడవైన నాచేత ఈ గ్రంథమును రచింపచేసినది. నేను కేవలము లేఖకుడనే. గ్రంథము శ్రీమాతిదే. కాన నాప్రార్థన అక్కరలేకుండగనే శ్రీమాతయే తన గ్రంథమును రక్షించురకొనును" అనునర్థము కూడ లభించుచున్నది. శ్రీమాత యొక్క ఈ గ్రంథము శాశ్వతముగ, ద్విజోపకారకమై ద్విజసంమో దదాయకమై శ్రీమాతయొక్క ఆజ్ఞాభూతములగు వేదములు ఎంత వరకుండునో (వేదములు నిత్యములు) యంతకాలము, సర్వోత్కృష్ట ముగ విరాజిల్లు గాత!

**సోమయాజులవంశ్యేన వేంకటాచలశాస్త్రిణా!**
**కృతా పూర్ణాభిధా జీయాద్వ్యాఖ్యాఽఽమూలమియం శివమ్॥**

ఇది

విద్వచ్ఛిరోమణి – సాహిత్యవిశారద–ద్విజబృందనిషేవి
సోమయాజులోపనామక–వేంకటాచలశాస్త్రిచేత రచింపబడిన
పూర్ణాభిధాంధ్రవ్యాఖ్యాసముపేతంబగు సంధ్యాతత్త్వసుబోధినియందు
చతుర్థాధ్యాయమున సంధ్యాకాలాదినిరూపణనామకము
ద్వితీయభాగము సమాప్తము.
చతుర్థాధ్యాయము సమాప్తము.
ఓమ్ తత్ సత్
శివమ్

ఓమ్

తైత్తరీయసంధ్యా(వందన)

# మంత్రార్థబోధిని

శ్లో॥ ఇంద్రగోపసమానాభమిందిరాశ్లిష్టవిగ్రహం।
ఇక్షుకోదండమీడేఽహమిందుచూడమిభాననమ్॥

శ్లో॥ యోఽహం రచితవాన్ పూర్వం సంధ్యాతత్త్వసుబోధినీం।
స కరోమ్యాంధ్రభాషాయాం సంధ్యామంత్రార్థబోధినీమ్॥

భారతీయులమగు మనకు వేదములు అక్షయ్యవిజ్ఞానఖనులు. వేదమాత ద్విజులకు అభ్యుదయసాధకములైనట్టియు నిశ్శ్రేయససాధకములైన కర్మలెన్నింటినో ప్రసాదించినది. అభ్యుదయమనగ ఇహ పరలోకములకు సంబంధించిన మేలు. నిశ్శ్రేయసమనగ చతుర్థ పురుషార్థము. మోక్షము. అట్టి వేదోక్తకర్మలన్నింటిలోను అత్యంత ముఖ్యమైనది సంధ్యోపాసనము. (సంధ్యావందనము).

సంధ్యావందనమును చేయనిది వేదశాస్త్రపురాణోక్తములగు ఏ కర్మలను చేయుటకు ద్విజుడు అర్హుడు కాడు. ద్విజులకు సంధ్యోపాసనము అవశ్యానుష్ఠేయమగు నిత్యకర్మ. ఇట్టి వైదికకర్మలకు వేదమంత్రములు అంగములు. అట్టి అంగభూతములగు మంత్రముల అర్థమును తెలిసికొని ఆ మంత్రార్థమును భావించుచు కర్మలు చేసిన యెడల కర్మలయొక్క పరిపూర్ణఫలము తప్పక లభించును.

మంత్రార్థమును తెలిసికొనకుండ చేసిన కర్మలకు పూర్ణ ఫలము లభింపదు. ఏదియో కొంచెము ఫలమే లభించును. ఈ విషయమును ఈక్రింది శ్రుతిస్మృతులు వివరించుచున్నవి.

## ఛాందోగ్యోపనిషత్తు

"యదేవ విద్యయా కరోతి శ్రద్ధయోపనిషదా, తదేవ వీర్యవత్తరం భవతి" అని.

విద్య యనగా అర్థజ్ఞానము. శ్రద్ధ యనగ ఆస్తిక్యబుద్ధి. ఉపనిషత్ అనగా (ప్రస్తుతమున) యోగము. అనగా ప్రయత్నము, కాగా- ఏ కర్మను మంత్రార్థజ్ఞానముతోను ఆస్తిక్యబుద్ధితోను ఉత్సాహముతో కూడిన ప్రయత్నముతోను ద్విజుడు చేయుచున్నాడో ఆ కర్మయే పూర్ణ ఫలమును ఇచ్చుటలో అధిక బలము గలది. అనగా పరిపూర్ణ ఫలమును ఇచ్చునని అర్థము.

"వీర్యవత్తరం" అను పదములోనున్న "తర" ప్రత్యయము, అర్థజ్ఞానము లేనివారు చేయు కర్మవలన అధిక ఫలము కలుగదు. కొంత ఫలము కలుగును. అను అర్థమును సూచించును. ఈ శ్రుత్యర్థమునే వ్యాసులవారు అన్వయవ్యతిరేకములతో (అనుకూల- ప్రతికూలోదాహరణములతో) స్పష్టముగ చెప్పుచున్నారు.

## వ్యాసమహర్షి

జ్ఞాత్వా జ్ఞాత్వా చ కర్మాణి జనో యో యోఽనువర్తతే।
విదుషః కర్మసిద్ధిః స్యాత్ తథా నాఽవిదుషో భవేత్ ॥

ద్విజుడు తాను చేయునట్టి కర్మలకు సంబంధించిన మంత్రముల అర్థమును, తాత్పర్యము, విశేషార్థములను బాగుగ తెలిసికొని మంత్రములను చెప్పునప్పుడు ఆ మంత్రముల అర్థమును తలంచుచు ఆకర్మలను చేయవలెను. అట్లు కర్మలను చేయు విద్వాంసునకు పూర్ణ ఫలము లభించును. కాని మంత్రార్థమును తెలియని వారికి పూర్ణ ఫలము లభింపదు. కాని ఏదో కొంత ఫలము కలుగును. మంత్రార్థమును తెలిసికొనకుండగనే మూఢనమ్మకముతో కర్మలు చేయువారు మంత్రార్థమును గూడ తెలిసికొనిన యెడల కర్మలు చేయుటయందు ఇంకను అధికమగు ఆసక్త్యుత్సాహములు కలిగి కర్మల నుత్సాహ

ముతో జేయుదురు. పూర్ణ ఫలమును గూడ బొందగలరు. కావున అందరకును సంధ్యావందనమంత్రముల అర్థతాత్పర్యములు బాగుగ తెలియుటకొరకు "సంధ్యా[వందన]మంత్రార్థబోధిని" అను పేరుతో సంధ్యాతత్వసుబోధినీగ్రంథమునందు అనుబంధముగ గ్రంథమును తెలుగున వ్రాయుచున్నాను.

అందువలన సంధ్యోపాసకులందరు సంధ్యావందనమంత్రార్థ తాత్పర్యాదులను చక్కగ తెలిసికొని పరిపూర్ణ ఫలమును పొంది నా యీ శ్రమను సఫలము చేయుదురు గాక! అని కోరుచున్నాను.

తొలు దొలుత శుద్ధిని కలిగించు "అపవిత్రః పవిత్రో వా" అను పద్మపురాణమందలి మానసస్నానమంత్రమునకు అర్థతాత్పర్యములు వ్రాయబడుచున్నవి.

"అపవిత్రః పవిత్రో వా సర్వావస్థాం గతోఽపి వా।
యః స్మరేత్పుండరీకాక్షం స బాహ్యాభ్యంతరే శుచిః॥

అపవిత్రః=శుద్ధమైనవాడు, గాకున్నను సరియే, వా=లేక పవిత్రః=శుద్ధమైనవాడైనను సరియే, వా=లేక, సర్వావస్థాం=ఎల్ల అవస్థలను, అనగా ఎట్టి శుద్ధము కాని అవస్థనైనను, గతోఽపి= పొందినవాడైనప్పటికిని, యః=ఎవడు, పుండరీకాక్షం=తెల్ల తామర రేకుల వంటి కండ్లుగల శ్రీమహావిష్ణువును, స్మరేత్="పుండరీకాక్ష"యని తలచునో, సః=ఆతడు, బాహ్యా=వెలుపలను, అభ్యంతరే=లోపలను గూడ శుచిః=శుద్ధమైనవాడు, భవతి=అగును.

తాత్పర్యము. శుద్ధమైనవాడైనను, గాకున్నను మరెట్టి యశుచియైన అవస్థయందున్నను సరియే ద్విజుడు శ్రీవిష్ణునామ సంస్మరణ చేసిన యెడల వెలుపలను లోపలను గూడ శుద్ధుడగును. కనుకనే హోమము మొదలగు వైదికకర్మలందు ఏదైన వ్యత్యాసము వచ్చిన యెడల వెంటనే "విష్ణుర్విష్ణుర్విష్ణుః" అని ముమ్మారు విష్ణునామసంకీర్తనము చేసి మరల ఆకర్మలను సరిగ చేయుచున్నారు.

ఇట్లు పుండరీకాక్షనామస్మరణ జేసి పరిశుద్ధుడై మరల శుద్ధి కొరకు ముందుగా కేశవాదినామములతో ఒక పురాణాచమనమును చేయవలెను. కాన ముందుగా ఆనామముల అర్థము చెప్పబడు చున్నది.

## కేశవాదినామార్థవివరణము

(1) కేశవః="క"యన బ్రహ్మ, "ఈశ" యన ఈశ్వరుడు. వీరిద్దరిచేత లోకపాలకుడుగ "వ" వరింపబడినవాడు. కాన విష్ణువు నకు "కేశవ"యను పేరు గలిగెను.

(2) నారాయణః="నార"యన జలములు. "అయన" అనగ స్థానము. జలములు నివాసస్థానముగ గలవాడు. క్షీరసముద్రమున శేషశాయి అగు నారాయణుడు. లేక "నార"యనగ అజ్ఞానము, మాయ. "అయన"మనగ స్థానముగ గలవాడు. ఉపాధిగ గలవాడు పరబ్రహ్మము. అట్టి పరబ్రహ్మస్వరూపుడు నారాయణుడు.

(3) మాధవః="మా"=లక్ష్మికి, "ధవః"=భర్త, లక్ష్మీ దేవికిభర్త గాన "మాధవుడు."

(4) గోవిందః=గో=వేదములచేత, విందః=తెలియదగినవాడు. వేదములచేత వర్ణింపబడినవాడు, వేదవేద్యుడు గోవిందుడు.

(5) విష్ణుః=అంతటను "ఇందుగలడందు లేడని, సందేహము వలదు. చక్రి సర్వోపగతుండు="అన్నట్లు" వ్యాపించి యున్నవాడు.

(6) మధుసూదనః="మధు"మధువను రాక్షసుని, 'సూదనః' చంపినవాడు. బ్రహ్మను కాపాడుటకు మధుకైటభులను రాక్షసులను విష్ణువు సంహరించినాడు.

(7) త్రివిక్రమః=త్రి=మూడు, విక్రమః=పాదన్యాసములు కల వాడు. వామనావతారమున బలిచక్రవర్తిని మూడడుగుల చోటు నడిగి రెండుపాదములచేత భూమ్యాకాశముల నాక్రమించి, మూడవ

యడుగును బలిశిరమున నిడి వానిని జయించి పాతాళమున కనిపెను. ఇట్లు మూడు పాదనిక్షేపములు కలవాడగుటచేత త్రివిక్రముడు.

(8) వామనః = వామనుడు, పొట్టివాడు, బలిచక్రవర్తిని జయించుటకు విష్ణుమూర్తి వామనుడుగ అవతరించెను.

(9) శ్రీధరః=శ్రీ=లక్ష్మీదేవిని, ధరః=ఱొమ్మున ధరించిన వాడు.

(10) హృషీకేశః= హృషీక = ఇంద్రియములకు, ఈశః = ప్రభువు, నియమించువాడు, లేక ఇంద్రియములను జయించినవాడు.

(11) పద్మనాభః=పద్మము నాభియందు (బొడ్డునందు) కల వాడు, ఇతని నాభికమలమునుండియే బ్రహ్మ పుట్టెను.

(12) దామోదరః=దామ=పూలమాల (వనమాల) ఉదరః= కడుపుమీద కలవాడు, కడుపుమీదినుండి క్రిందకు వ్రేలాడునట్టి వన మాలయను మాల కలవాడు. లేక దామ=త్రాడు, ఉదరః=కడుపు మీద కలవాడు. శ్రీకృష్ణావతారమున యశోదచేత త్రాటితో ఉదరమున గట్టబడినవాడు, భక్తపరాధీనుడైన వాడు.

(13) సంకర్షణః= సం=బాగుగా, కర్షణః=భక్తుల పాపము లను ఆకర్షించువాడు, పోగొట్టువాడు.

(14) వాసుదేవః= వాసు=సర్వప్రాణులయందును (అంతటను) వసించువాడు, దేవః=స్వయముగా ప్రకాశించువాడు. సర్వప్రాణు లందును అంతర్యామిగ (అంతర్యామియన పంచకోశములను దాటి లోపల సాక్షిగ నుండువాడు)నుండి స్వయముగ ప్రకాశించు వాడు. ఇట్టిది పరబ్రహ్మమే. లేక కృష్ణావతారమున వసుదేవుని కుమారుడు.

(15) ప్రద్యుమ్నః= ప్ర=అధికమైన, ద్యుమ్నః = ప్రాణులకు ధనము వంటివాడు.

(16) అనిరుద్ధః=నిరుద్ధః = అరికట్టబడినవాడు, ''అ'' దీనికి

వ్యతిరేకార్థము. కాన యోగులచేత గూడ హృదయమున బంధింప శక్యము కానివాడు.

(17) పురుషోత్తమః= పురు=శరీరమున, షః(శః) నిదురించువాడు, ఉండువాడు, జీవుడు. అతనికంటె ఉత్తముడు, పరమాత్మ.

(18) అధోఽక్షజః= అక్ష=ఇంద్రియములవలన, జః = కలిగినది. జ్ఞానము అనగా— విషయజ్ఞానము. అధః = అధఃకృతము తక్కువ చేయబడినది. అనగా—తన భక్తులకు కలిగిన భోగ్య విషయకజ్ఞానమును, వారియందలి దయచేత, పోగొట్టి భక్తిని కలిగించువాడు.

(19) నారసింహః= నర=మనుష్యుడు, సింహః = సింహము. విష్ణువు, హిరణ్యకశిపుని చంపుటకు నరసింహావతారమెత్తెను. ఆ యవతారమున సగము శరీరము మనుష్యుడుగను, మిగిలిన సగము శరీరము సింహముగ అవతరించెను. కాన నరసింహు డయ్యెను. నరసింహుడే నారసింహుడు.

(20) అచ్యుతః= చ్యుతి = యన నాశము, చ్యుతి లేనివాడు అచ్యుతుడు.

(21) జనార్దనః= జన = భక్తజనులను, అర్దనః=దయతో పొందువాడు.

(22) ఉపేంద్రః= ఇంద్ర=ఇంద్రుని ఉప(ఉపగతః) అనుసరించి పుట్టినవాడు. వామనావతారమున విష్ణుమూర్తి ఇంద్రునకు తమ్ముడుగా పుట్టినవాడు.

(23) హరిః= దుష్టులను చంపువాడు. లేక భక్తుల పాపములను పోగొట్టువాడు.

(24) శ్రీకృష్ణః= కృష్ణః = పెల్లగించువాడు, అనగా భక్తుల పాపములను పెల్లగించి పోగొట్టువాడు. శ్రీ = శోభాయుక్తుడైన వాడు. దివ్యసుందరవిగ్రహుడు. భక్తులపాపములను పోగొట్టువాడు, శ్రీకృష్ణుడు.

ఈ యర్థములు కేశవాదినామభాష్యమను గ్రంథమునుండి సంగ్రహముగ వ్రాయబడినవి. విశేషములను తెలిసికొనగోరు వారు ఆ భాష్యమును చూచునది.

# భూతోచ్చాటనమంత్రార్థము

## (ఉచ్చాటన=తరుముట)

"ఉత్తిష్ఠంతు భూతపిశాచాః ఏతే భూమిభారకాః।
ఏతేషామవిరోధేన బ్రహ్మకర్మ సమారభే"

ఏతే=ఈ, భూమిభారకాః=ఉపాసకుడుండు ప్రదేశమునకు భారమైన, అచ్చటనున్న యని యర్థము. భూతపిశాచాః=ప్రాణులను హింసించుచు వాయురూపమున నున్న భూతములు పిశాచములును ఉత్తిష్ఠంతు=దయచేసి లేచి పోవుదురు గాక! ఏతేషాం=ఈభూత పిశాచములకు, అవిరోధేన=విరోధము లేకుండ (వానితో విరోధ పడకుండ,) బ్రహ్మకర్మ=వేదమంత్రములతో చేయబడు కర్మను లేక బ్రహ్మజ్ఞానమును కలిగించెడు సంధ్యోపాసనరూపకర్మను,సమారభే= ఆరంభించుచున్నాను.

తాత్పర్యము: నేను సంధ్యావందనమును చేయదలచుకొనిన ప్రదేశమును వాయురూపముతో నావరించుకొని యున్న భూతములును పిశాచములును దయచేసి యిక్కడనుండి లేచి మరియొక చోటునకు పోవుదురుగాక! ఈ భూతపిశాచములతో విరోధము లేకుండ నేను బ్రహ్మజ్ఞానమును కలిగించు సంధ్యోపాసనమును ఆరంభించుచున్నాను. అని ప్రార్థించి భూతోచ్చాటనమును చేయవలెను. లేని యెడల నవి యేదేని రూపమున శారీరకముగనో మానసికముగనో పీడను కలిగించును.

తర్వాత మనస్సునెమ్మదికొఱకు ప్రాణాయామమును చేయవలెను. కాన నా ప్రాణాయామమంత్రమున కర్థము తెలుపబడుచున్నది.

మంత్రము: ఓం భూః, ఓం భువః ఓగ్ం సువః ఓం మహః ఓం జనః ఓం తపః ఓగ్ం సత్యం, ఓం తత్సవితుర్వరేణ్యం, భర్గో దేవస్య ధీమహి। ధియో యో నః ప్రచోదయాత్ ।'ఓమాపో జ్యోతీ రసోఽమృతం బ్రహ్మభూర్భువస్సువరోమ్॥

అర్థము=ఓం అనుదానికి ప్రణవమని పేరు. ప్రణవమునకు పరబ్రహ్మము అర్థము. ఇచ్చటనున్న భూః భువః మొదలగు నేడు వ్యాహృతులకును, ఆ పేరులుగల లోకములకు అధిపతులైన, అగ్ని-వాయు-సూర్య - బృహస్పతి - రుద్ర-విష్ణు-ప్రజాపతులు, వరుసగా అర్థములు. కాగా భూః=భూలోకాభిమానియగు అగ్ని, ఓం=పర బ్రహ్మస్వరూపుడు, భువః=భువర్లోకాభిమానియగు వాయువు, ఓం= పరబ్రహ్మస్వరూపుడు, సువః=సువర్లోకాభిమానియగుసూర్యుడు, ఓం= పరబ్రహ్మస్వరూపుడు, మహః=మహర్లోకాభిమానియగు బృహస్పతి ఓం=పరబ్రహ్మస్వరూపుడు, జనః=జనలోకాధిపతియగు రుద్రుడు ఓం=పరబ్రహ్మస్వరూపుడు, తపః=తపోలోకాధిపతియగు విష్ణువు ఓం=పరబ్రహ్మస్వరూపుడు, సత్యం=సత్యలోకాధిపతియగు ప్రజాపతి, (అనగా సృష్టికర్తయగు బ్రహ్మ) ఓం=పరబ్రహ్మస్వరూపుడు అని. ఇట్లు ఏల అనుసంధానము చేయవలెననగా 'తదేతద్దేవానా మప్రియం. యదేతన్మనుష్యా విద్యుః'' అని శ్రుతి చెప్పుచున్నట్లు మనుష్యులు బ్రహ్మజ్ఞానమును పొందుట దేవతలకిష్టము లేదు. ఏలననగా-బ్రహ్మజ్ఞానమునుపొందిన మానవుడు, చిల్లర దేవతలను పూజింపడు. అందువలన మనుష్యులు చేయు బ్రహ్మోపాసనకు ఆ దేవతలు విఘ్నములను ఆచరింతురు. కావున ఉపాసకుడు తాను చేయబోవు బ్రహ్మోపాసనకు విఘ్నములను కలిగించకుండుటకొఱకు ఆ యా లోకాభిమానులగు దేవతలను పరబ్రహ్మదృష్టితో చూడ వలెను. అగ్న్యాది దేవతలు పరబ్రహ్మదృష్టితో తలంపబడినవారై సంతసించి ఉపాసకునకు విఘ్నములను కలిగించరు. ఒక చిన్న యధికారిని, పెద్ద అధికారిని గౌరవించినట్లు గౌరవించిన యెడల ఆచిన్న అధికారి మిక్కిలి సంతసించి ఆ గౌరవించిన వారికి ఎట్టి

ఇబ్బందులు కలిగించక, మీదు మిక్కిలి అనుకూలుడై యుండుట ఎల్లరకును తెలిసినదే కదా! అట్లే దేవతలు అనుకూలురుగ ఉందురని, భావము.

గాయత్రీమంత్రార్థము. యః=ఏ సూర్యుడు, నః=మనకు, ధియః = ధర్మాధర్మబుద్ధులను, ప్రచోదయాత్ = ప్రేరేపించునో, (కలిగించునో) దేవస్య = స్వయంప్రకాశమానుడైన, సవితుః=అట్టి సూర్యునియొక్క, వరేణ్యం = అందరకును సుఖారోగ్యములను కలిగించి ఆనందకరమైన దగుటచేత అందరిచేత గోరదగిన తత్ = సర్వప్రసిద్ధమైన భర్గః= తేజస్సును ధీమహి=ధ్యానింపవలెను.

తాత్పర్యము సూర్యుడు ఇతరగ్రహముల వలె గాక, స్వయముగ ప్రకాశించువాడు. తన ఉష్ణకిరణములచేత మనకు (సర్వప్రాణులకు) చైతన్యమును కలిగించి ధర్మాధర్మబుద్ధులను కలిగించుచున్నాడు. ఆ సూర్యుని తేజస్సు మన కందరకును సుఖారోగ్యములను కలిగించి యానందకరమగుటచేత, అందరిచేతను కోరబడుచున్నది. కాన అట్టి సూర్యతేజస్సును "ఆహా! ఈ తేజస్సెంత ఆనందకరమైనది! ఇది యెల్లప్పుడును మన కారోగ్యానందములను కలిగించు గాక! యని ధ్యానింపవలెను.

## గాయత్రీశిరోమంత్రార్థము

ఆపః=జలములు, ఓం=పరబ్రహ్మస్వరూపమైనవి. ఉపాసకునకు పలువిధములుగా నుపయోగించెడు జలములు, బ్రహ్మదృష్టితో సంస్కరింపబడినవై శీఘ్రఫలసంపాదన కుపయోగించు శుద్ధిని ఉపాసకునకు కలిగించును. జ్యోతిః=సూర్యమండలము, ఓం=పరబ్రహ్మము, సంధ్యోపాసనకాధారమగు సూర్యమండలము బ్రహ్మదృష్టిచేత సంస్కరింపబడినదై ఉపాసనానుకూలమగును. బ్రహ్మ= వేదము, అమృతం=నాశములేనట్టియు, రసః=ఆనందరూపమగు ఓం= పరబ్రహ్మస్వరూపము. సంధ్యావందనములోని మంత్రములన్నియు బ్రహ్మదృష్టిచేత సంస్కరింపబడినవై మిక్కిలి వీర్యవంతములై

ఉపాసకునకు శీఘ్రఫలసాధనయందుపయోగపడును. చివర నున్న భూః, భువః, సువః యను మూడు వ్యాహృతులును ఓం=పరబ్రహ్మ రూపములు. వ్యాహృతులను పరబ్రహ్మదృష్టితో ననుసంధానించుట, వానికి ప్రాశస్త్యము సంపాదించుటకొరకు.

ఈ విధముగ అర్థానుసంధానముతో ప్రాణాయామమును చేసి నెమ్మదియైన మనసు కలవాడై "ప్రాతఃసంధ్యాముపాసిష్యే" ప్రాతఃకాలమందలి సంధ్యాదేవతను ఉపాసించెదను" అని మనసులో సంకల్పము చేసి (వెలుపలకు కూడ చెప్పుటాచారము) చేతిలోని జలమును క్రింద పళ్ళెములో విడవవలెను, తర్వాత జలముతో నుదిటిమీద ఊర్ధ్వపుండ్రమును (నిలువుబొట్టును) పెట్టుకొని లేక, విభూతిని ధరించి, మార్జనము చేయుటకొఱకు, పాత్రమునందలి జలమును గాయత్రీమంత్రశిరో మంత్రములచేత అభిమంత్రింపవలెను. అభిమంత్రించుట యనగా–ఆ జలమును (చేతితో కొంచెము కప్పు నట్లుంచి దానినే) చూచుచు మంత్రమును ఉచ్చరించుట. అట్లభి మంత్రించిన జలమును ఆపోహిష్ఠాది నవమార్జనమంత్రములచేత తలమీద ఎనిమిది సారులు, పాదములమీద ఒకసారి ప్రోక్షించు కొనవలెను. ఈ మార్జనమునకు బ్రాహ్మస్నానమనియు పేరు కలదు.

# బ్రాహ్మస్నానమంత్రార్థము

## [మార్జనమంత్రార్థము]

ఉపాసకునకు ఉపాసనయందు చిత్తైకాగ్రత యుండవలెను. ఆకలిదప్పులచేత బాధపడువానికి చిత్తైకాగ్రత కలుగదు. ఆకలి దప్పులు అన్నపానీయములు ఉండినగాని పోవు కావున ఇట్లు పరంపరగా అన్నపానములు ఉపాసనోపయుక్తము లగుటవలన వానికొఱకు ఆపోహిష్ఠాదిమంత్రములచే ఉపాసకుడు జలదేవతలను ప్రార్థించుచున్నాడు. అందు తొలి మూడు మంత్రముల కర్థము.

1) ఓం ఆపో హి ష్ఠా మయోభువః, 2) ఓం తా న ఊర్జే దధాతన, 3) ఓం మహే రణాయ చక్షసే''

హే ఆపః = ఓజలదేవతలారా! హి=ఏ కారణమువలన మీరు, మయోభావః=సుఖమును కలిగించువారుగా,స్థా=ఉన్నారో, [జలములు వర్షరూపమున సస్యవృక్షులతాదులను పెంచి, ప్రాణులకు ఆహారమును కల్పించి, సుఖక్షేమములను కలిగించుచున్నవి గదా!] తాః=(కావున) అట్టి మీరు, మహే (మహతే)=గొప్పదైనట్టియు రణాయ=రమణీయమగు, చక్షసే=బ్రహ్మజ్ఞానముకొరకు, అనగా – నేను బ్రహ్మజ్ఞానమును పొందుటకొరకు కావలసిన, ఊర్జే=అన్నము కొరకు, (అన్నమును) నః=మాకొఱకు, దధాతన=ధరించుడు, అనగా –ఇచ్చుదురు గాక!

తాత్పర్యము: ఓ జలదేవతలారా! మీరు వర్షరూపముతో ఓషధులను పెంచి, తద్వారా మాకు ఆహారమును కలిగించుడు.

ఆ యాహారముచేతఆకలిదప్పులు లేనివారమై,చిత్తైకాగ్రతతో సంధ్యోపాసనను జేసి బ్రహ్మజ్ఞానమును పొందెదము. ఈ తొలి మూడు మంత్రములచేత బ్రహ్మజ్ఞానమును పొందుటకు జలములు పరంపరాసాధనములని వర్ణింపబడినది.

(2) తర్వాతి మూడు మంత్రములచేత జలములందలి రసము కొరకు ప్రార్థించుచున్నాడు.

(4) ఓం యో వః శివతమో రసః (5) ఓం తస్య భాజయ తేహ నః, (6) ఓమ్ ఉశతీరివ మాతరః॥

హేఆపః=ఓ జలదేవతలారా!, వః=మీయొక్క, యః=ఏ, శివతమః=అధికసుఖహేతువగు, రసః=రసము. (రసము, జలముయొక్క గుణము)కలదో, తస్య=దానిని, ఇహ=ఇహలోకమున, నః=మాకు, ఉశతీః = పుత్రవృద్ధిని గోరునట్టి, మాతరః ఇవ=తల్లుల వలె, భాజయత=పొందించుడు.

తాత్పర్యము. ఓ జలదేవతలారా! మిక్కిలి సుఖ (ఆనంద) హేతువగు మీయొక్క రసమును, పుత్రవృద్ధిని గోరు తల్లులు పుత్రులకు స్తన్యము నిచ్చునట్లు మాకు ననుగ్రహింపుడు.

తుది మూడుమంత్రముల యర్థతాత్పర్యములు.

(7) ఓం తస్మా అరం గమామ వః, (8) ఓం యస్య క్షయాయ జిన్వథ, (9) ఓమ్ ఆపో జనయథా చ నః॥

హే ఆపః! = ఓ జలదేవతలారా! యస్య = ఏ అన్నముయొక్క క్షయాయ = నివాసముకొఱకు, ప్రాప్తికొఱకు, జిన్వథ = (వర్షరూపముతో ఓషధులను) తృప్తిపొందించుచున్నారో, తస్మై = అట్టి అన్నముకొఱకు, వః = మిమ్ములను, అరం = అలం = మిక్కిలిగా, గమామ = పొందుచున్నాము, ఆశ్రయించుచున్నాము. హే ఆపః = ఓజలదేవతలారా! నః = మాకు, చ = శీఘ్రముగా, జనయథ = ఆ యన్నమును కలిగించుడు.

తాత్పర్యము. ఓ జలదేవతలారా! మేము అన్నముకొరకు మిమ్ములను మిక్కిలి యాశ్రయించితిమి. కాన వర్షరూపముతో ఓషధులను పెంచి, తద్వారా మాకు అన్నమును శీఘ్రముగా ననుగ్రహింపుడు అని భావము.

ఇచ్చట తొలి మూడు మంత్రములతో అన్నముకొఱకు జలదేవతలను ప్రార్థించి, తర్వాతి మూడు మంత్రములతో జలమందలి రసమును ప్రార్థించి, తుది మూడు మంత్రములతో మరల అన్నమునే శీఘ్రముగ ననుగ్రహింపుడని మిక్కిలి ప్రార్థించుచున్నాడు.

ఇట్లు ముందు మార్జనముచేత వెలుపలి పాపమాలిన్యమును పోగొట్టుకొని తర్వాత లోపలి పాపమాలిన్యమును పోగొట్టుకొనుటకు మంత్రించిన జలమును త్రాగవలెను. కావున మూడు సంధ్యలకును సంబంధించిన ఆ మంత్రముల యర్థతాత్పర్యములు వ్రాయబడుచున్నవి.

సాయంకాల-అబ్భక్షణమంత్రార్థము.

మంత్రము=అగ్నిశ్చ మా మన్యుశ్చ మన్యుపతయశ్చ మన్యుకృతేభ్యః పాపేభ్యో రక్షంతామ్॥

అగ్నిః+చ, అగ్నిః=వాగింద్రియమునకు అధిదేవత అగు అగ్నిదేవుడును, చ=మిగిలిన పది యింద్రియాధిదేవతలును, మన్యుః+చ, మన్యుః = క్రోధము అనగా క్రోధాధిదేవతయును, చ=కామాధిదేవతయును [పైన చెప్పిన పదునొకండు, ఇంద్రియాధిదేవతలును ఈ కామక్రోధాధిదేవతలును చేరి పదుముగ్గురు దేవతలును] మన్యుపతయః+చ, మన్యుపతయః=నా క్రోధమును తమ వశమున నుంచుకొనినవారై, చ = అట్లే నా కామమును గూడ తమ వశములో నుంచుకొనినవారై, మన్యుకృతేభ్యః = నేను కామక్రోధములచేత ప్రేరేపింపబడినవాడనై చేసిన, పాపేభ్యః=పాపములనుండి, మా=నన్ను, రక్షంతాం=రక్షించుదురు గాక!

మంత్రము= "యదహ్నా పాపమకార్షం, మనసా వాచా హస్తాభ్యాం పద్భ్యాముదరేణ శిశ్నా, అహస్తదవలుంపతు. యత్కించ దురితం మయి.

అర్థము. అహ్నా=పగటియందు, మనసా = మనస్సుచేతను, వాచా=వాక్కుచేతను, హస్తాభ్యాం=చేతులతోను, పద్భ్యాం=పాదములచేతను, ఉదరేణ = కడుపుచేతను, శిశ్నా=జననేంద్రియము చేతనున్నూ యత్=ఏపాపమును, అకార్షం=కామక్రోధములచేత ప్రేరేపింపబడి చేసితినో, తత్=ఆపాపమును, అహః = పగటిదేవతయగు సూర్యుడు (పైన చెప్పిన పదుముగ్గురు ఇంద్రియాధిదేవతలతో గూడి,) అవలుంపతు=నాశము చేయుగాక! యత్, కించ=ఏ కొంచెమైనను, దురితం=పాపలేశము మయి=నాయందు, (పై దేవతలు నాశము చేయగా మిగిలి యున్న యెడల [మిగులునేమో అని నా సందేహాము.] దానిని కూడ అవలుంపతు=నాశము చేయుగాక!

మంత్రము = "ఇదమహం మామమృతయోనౌ, సత్యే జ్యోతిషి జుహోమి స్వాహా.

అర్థము. అహం=నేను, ఇదం=ఈ నా చేతియందు (జలరూపముతోనున్న) మాం=నన్ను, ప్రత్యగాత్మను, (జీవాత్మను) అమృత=నాశము లేనట్టియు, యోనౌ=సర్వజగత్కారణమైనట్టియు, సత్యే=మూడు కాలములందును లేదని చెప్పశక్యము కాని, జ్యోతిషి=జ్యోతీ రూపమైన పరబ్రహ్మమునందు జుహోమి = హోమము చేయు చున్నాను. స్వాహా=చక్కగా హుతమగు గాక!

జీవాత్మను పరబ్రహ్మమునందు హోమము చేయుట అనగా-జీవుడును పరబ్రహ్మమున్నూ ఒక్కటియే అని భావించుట. అగ్నిలో హోమము చేయబడిన నేయి అగ్నిలో ఐక్యమయిపోవును. అట్లే జీవాత్మ పరమాత్మయందు ఐక్యమగునని హోమపదము చేత సూచింపబడినది. వాస్తవమున జీవబ్రహ్మలు ఒక్కటియే. రెండు కాదు. ద్వైతప్రపంచమున అట్లు వ్యవహారము. ఇట్లు జీవబ్రహ్మైక్యానుసంధానమువలన పాపజాలమంతయును నశించిపోవును.

తాత్పర్యము. మనుజునకు (1) కళ్లు (2) ముక్కు (3) చెవులు (4) నాలుక, (5) చర్మము అను ఐదు జ్ఞానేంద్రియములును, (1) చేతులు, (2) కాళ్ళు, (3) నాలుక, (4) మలద్వారము, (5) జననేంద్రియము అను ఐదు కర్మేంద్రియములును ఒక మనస్సు అను పదునొకండింద్రియము లుండును. ఈ పదునొకం డింద్రియములకును వేరు వేరుగ అధిదేవతలుందురు. అధిదేవతలనగా అధిష్ఠించి, అధిపతులుగా ఉండు దేవతలు, వారు ఆ యింద్రియము లను తమ అధీనములో నుంచుకొని నడపుదురు. మనుజుని కామ క్రోధములను గూడ వాని అధిదేవతలు తమ అధీనములో నుంచు కొందురు. ఆ దేవతలను మనము ప్రార్థించిన యెడల వారు మన కామక్రోధములను తమ అధీనములో నుంచుకొని, అవి మనచేత పాపకార్యములను చేయించకుండ చూతురు. ఇంతకుమునుపు మనము

కామక్రోధములచే ప్రేరేపింపబడి చేసిన పాపములను పోగొట్టుదురు. మనము చేయు పాపములకన్నింటికిని కామక్రోధములే కారణము. "కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః। మహాశనో మహా పాప్మా విద్ధ్యేనమిహ వైరిణమ్॥ రజోగుణమువలన పుట్టునట్టి ఈ కామక్రోధములు ఎంత తిన్నను తృప్తి పొందనివి. మహాపాపకార్య ములను చేయించు మహాపాపాత్ములు. ఇవియే యిహలోకమున మనుజునకు మహాశత్రువులు" అని శ్రీకృష్ణపరమాత్మ అర్జునునకు భగవద్గీతయందు ఉపదేశించెను.

కావుననే మనము సంధ్యావందనము చివర "కామోఽకార్షీ న్నమో నమః, మన్యురకార్షీ న్నమో నమః"అని చెప్పుకొని వానికి నమస్కారము చేయుచున్నారము.

పై ఇంద్రియాధిదేవతలును, పగటిదేవతయగు సూర్యుడును మనచే ప్రార్థింపబడినవారై, అంతవరకు మనము కామక్రోధముల చేత ప్రేరేపింపబడి, మనస్సు, వాక్కు, చేతులు, కాళ్ళు, కడుపు మొద లగు నన్ని యింద్రియములచేతను చేసిన పాపములను తొలగించెదరు. అట్లు నాశము చేయగ, నేమైన పాపగంధము మనయందున్న యెడల దానిని గూడ నాశము చేయుదురు. ఈ మంత్రముచే నభిమంత్రించిన మన చేతియందు జలరూపముతో నున్న మన ప్రత్యగాత్మను నాశ రహితమై, జగత్కారణమై, సత్యస్వరూపమై జ్యోతీరూపమైన ఆ పరమాత్మయందు హోమము చేయుచున్నాను" అని జీవాత్మను పర బ్రహ్మముతో ఐక్యము చేయుచున్నట్లు తలచుచు ఆ నీటిని త్రాగ వలెను. అట్లు హోమము చేయబడిన జీవుడనెడు వస్తువు పరమాత్మ జ్యోతియందు బాగుగా హుతమైనదని (అనగా-ఐక్యము పొందినట్లు) భావింపవలెను. అట్టి జీవబ్రహ్మైక్యానుసంధానమువలన సమస్తపాప ములును సమూలముగ నశించిపోవును.

ఈ మంత్రమున పేర్కొనబడిన ఇంద్రియములచేత చేయబడు పాపములను తెలిసికొందము. (1) మనసా=మనస్సుచేత, ఇతరులకు అపకారమును కలిగించు దురాలోచనలు మొదలగునవి చేయబడును. (2) వాచా=వాక్కుచేత (నాలుకచేత) ఇతరులకు నొప్పి కలిగించునట్టియు చేయరాని దూషణములు మొదలగునవి చేయబడును. (3) హస్తాభ్యాం = చేతులతో ఇతరులను కొట్టుట తాకకూడని వస్తువులను తాకుట మొదలగు చాల పనులు చేయబడును. (4) పద్భ్యాం = పాదములతో గోబ్రాహ్మణదేవతలను పెద్దలను తాకుట తన్నుట వెళ్ళగూడని స్థలములకు వెళ్ళుట మొదలగునవి చేయబడును. (5) ఉదరేణ = కడుపుతో తినగూడని వస్తువులను తినుట మితిమీరి తినుట మొదలగునవి చేయబడును. శిశ్నా=జననేంద్రియముచేత అగమ్యాగమనము మొదలగు పాపములు చేయబడును. ఇట్లే ఇతరేంద్రియములకును చేయరాని పనులను ఊహించునది.

ఈ అభ్యుక్షణమంత్రము చివర తన ప్రత్యక్చైతన్యమును (జీవుని) పరబ్రహ్మచైతన్యమునందు హోమముచేయుట అను ప్రక్రియ(కార్యము)చేత సకలపాపనివర్తకమగు ప్రత్యగ్బ్రహ్మై (జీవబ్రహ్మై)క్యానుసంధానరూప-జ్ఞానయజ్ఞము సూచింపబడుచున్నది.

ఎట్లనగా——

భగవద్గీతయందు శ్రీకృష్ణభగవానుడు చతుర్థాధ్యాయమున వివిధయజ్ఞములను వర్ణించుచు జ్ఞానయజ్ఞమును 25–వ శ్లోకమున ఇట్లు వర్ణించిరి. "బ్రహ్మాగ్నావపరే యజ్ఞం యజ్ఞేనైవోపజుహ్వతి" అని. దీనికి శ్రీశంకరభగవత్పాదులవారిట్లు భాష్యమును వ్రాసిరి. "బ్రహ్మాగ్నౌ" అనుచోట బ్రహ్మపదమునకు "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" "విజ్ఞానమానందం బ్రహ్మ" "య ఆత్మా సర్వాంతరః" ఈ మొదలగు ఉపనిషద్వాక్యములచేత వర్ణింపబడిన శుద్ధనిర్గుణ పరబ్రహ్మము అర్థము. బ్రహ్మ-అగ్నిపదములకు అవధారణాపూర్వపద

కర్మధారయసమాసమగుటచేత, బ్రహ్మము, అగ్ని అగును. ఎందు లకు అగ్ని అగును? తర్వాత చేయబోవు హోమమునకు ఆధార మగుటకొరకు. అట్టి బ్రహ్మరూపమైన అగ్నియందు, అపరే=బ్రహ్మ వేత్తలు, యజ్ఞం=ఆత్మను, అనగా తమ ప్రత్యగాత్మను; (ఉపనిషత్తు లందు యజ్ఞశబ్దము ఆత్మపర్యాయములందు ఉన్నది.) తమ ప్రత్య గాత్మ స్వయముగా పరబ్రహ్మమే అగుచున్ననూ, మానవుని బుద్ధిని ఉపాధిగా పొందుటవలన, ప్రత్యగాత్మయని పేరుగలదయ్యెను. ఇంకనూ – ఉపాధియగు బుద్ధియొక్క గుణములు తనవని అనుకొను చుండెను. అట్టి తన ప్రత్యగాత్మను ఆహుతి(హోమ)ద్రవ్యమును వలె యజ్ఞేనైవ=తమద్వారాగానే, అనగా—తామే, ఉపజుహ్వతి= హోమమునుచేయుచున్నారు. అనగా—ఉపాధితో కూడికొనిన తన ప్రత్యగాత్మను ఉపాధిలేని శుద్ధ-నిర్గుణ – పరబ్రహ్మముగా భావించు టయే, ప్రత్యగాత్మను,|పరమాత్మయందు హోమముచేయుటనబడును. కావున బ్రహ్మాత్మైకత్వదర్శననిష్ఠులగు బ్రహ్మవేత్తలు, అనగా తమ ప్రత్యగాత్మయు పరమాత్మయు, రెండును ఒక్కటియే అని రెండింటిని ఒక్కటిగానే చూచుటయందు నిష్ఠ(దృఢయత్నము] గలవారు అట్లు చూతురు. భావనచేయుదురు. దీనినే పరబ్రహ్మమందు ప్రత్యగాత్మ యొక్క హోమమని బ్రహ్మవిదులందురు. ఇదియే జ్ఞానయజ్ఞము. "ఇదమహం మామమృతయోనౌ సత్యే జ్యోతిషి జుహోమి స్వాహా" అను వాక్యము, జ్ఞానయజ్ఞమునే చెప్పుచున్నది. నిశ్చలమైన బుద్ధితో రెండింటిని ఒక్కటిగా ఒక్క నిమిషముసేపు చూచినను చాలును. వాని పాపములు దగ్ధమైపోవును. "జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతేఽర్జున!" అనికదా! గీతావచనము. త్రిసంధ్య లందును అభ్యుక్షణముచివర"స్వాహా" అనునప్పుడిట్లు భావింపవలెను.

## ప్రాతఃకాలాభ్యుక్షణమంత్రార్థము

సాయంప్రాతఃకాలాభ్యుక్షణమంత్రములు రెండును, మూడే

చోటులందు తప్ప, మిగిలిన దంతయును సమానముగనే యుండును. ఐనను, చక్కగ తెలియుటకొరకు పూర్తిగ మంత్రమునకర్థమును, అర్థము వ్రాయబడును.

మంత్రము. "సూర్యశ్చ మా మన్యుశ్చ మన్యుపతయశ్చ మన్యుకృతేభ్యః పాపేభ్యో రక్షంతాం॥

అర్థము. సూర్యః+చ సూర్యః=జ్ఞానేంద్రియమగు కంటికి అధిదేవత యగు సూర్యుడును, చ=మిగిలిన పది యింద్రియముల అధిదేవతలును, మన్యుః+చ మన్యుః = క్రోధాధిదేవతయును, చ = కామాధిదేవతయును (ఈ పదుముగ్గురు దేవతలును) మన్యుపతయః + చ మన్యుపతయః=నా క్రోధమునకు, చ=కామమునకును ప్రభువులై (నా క్రోపమును కామమునున్నూ తమ వశములో ఉంచుకొనిన వారై) మన్యుకృతేభ్యః=కోపముచేతను అట్లే కామము చేతను ప్రేరేపింపబడి నేను చేసిన పాపేభ్యః=పాపములనుండి, మా=నన్ను రక్షంతాం=రక్షించెదరు గాక!

మంత్రము. యద్రాత్రియా పాపమకార్షం, మనసా, వాచా హస్తాభ్యాం,పద్భ్యాముదరేణ శిశ్నా, రాత్రి స్తదవలుంపతు,యత్కించ దురితం మయి.

అర్థము. రాత్రియా=గడచిన రాత్రియందు, మనసా=మనస్సు చేతను, వాచా = వాక్కుచేతను, హస్తాభ్యాం = చేతులచేతను, పద్భ్యాం=పాదములచేతను, ఉదరేణ=కడుపుతోను, శిశ్నా = జననేంద్రియము చేతనున్ను, యత్ పాపం=ఏ పాపమును, అకార్షం= (కామక్రోధములచేత ప్రేరేపింపబడిన వాడనై) చేసితినో తత్=ఆ పాపమును, రాత్రిః=రాత్రియొక్క అధిదేవత యగు వరుణుడు (పైన చెప్పిన పదుముగ్గురు అధిదేవతలతో కూడుకొని), అవలుంపతు= నాశము చేయుగాక!, యత్ కించ=ఏ కొంచెమైనను, దురితం=పాప లేశము, మయి=నాయందు (మిగిలి యున్నయెడల) ఆ పాపమును గూడ, అవలుంపతు=నాశము చేయుగాక!

మంత్రము. ఇదమహం మామమృతయోనౌ, సూర్యే జ్యోతిషి జుహోమి స్వాహా.

అర్థము. అహం=నేను, ఇదం=ఈ నా చేతియందు జలరూపముతో ఉన్న, మాం=నన్ను (ప్రత్యగాత్మను) జీవుని, అమృత=నాశము లేనట్టియు, యోనౌ=జగత్కారణమైనట్టియు, సూర్యే=సూర్యుని ద్వారా జగత్తును ప్రకాశింపజేయునట్టి, జ్యోతిషి=జ్యోతీరూపమైన పరబ్రహ్మమునందు, జుహోమి = హోమమును చేయుచున్నాను, స్వాహా=చక్కగ హుతమగు గాక!

తాత్పర్యము. జ్ఞానేంద్రియమగు కంటికి అధిదేవత యగు సూర్యుడును, మిగిలిన పది ఇంద్రియాధిదేవతలును, కామక్రోధాధిదేవతలును మొత్తము పదుముగ్గురు దేవతలును నా కామక్రోధములను తమ వశమునందు ఉంచుకొనినవారై, నేను నా కామక్రోధములచేత ప్రేరేపింపబడి ఇంతకుముందు అనగా గత రాత్రియందు చేసిన పాపముల నన్నిటినుండి నన్ను రక్షించెదరు గాక! నేను గడచిన రాత్రియందు నాయొక్క మనస్సు వాక్కు చేతులు కాళ్ళు కడుపు జననేంద్రియము మొదలగు వానిచేత చేసిన పాపములను రాత్ర్యభిమాని దేవతయగు వరుణదేవుడు, పైన చెప్పిన పదుముగ్గురు దేవతలతో కూడుకొన్నవాడై నశింపజేయుగాక! నా చేతిలో జలరూపముతో ఉన్న నా జీవాత్మను (ప్రత్యగాత్మను) నాశము లేనట్టియు జగత్కారణమైనట్టియు, సూర్యుని ద్వారా జగత్తును ప్రకాశింపజేయునట్టి జ్యోతీరూపమైన ఆ పరమాత్మయందు హోమము చేయుచున్నాను. చక్కగ హుతమగు గాక! అని భావించుచు మంత్రమును పూర్తిచేసి "స్వాహా" అనునప్పుడు చేతిలోని జలమును త్రాగవలెను. జీవుడు పరమాత్మయందు ఐక్యమును జెందినట్లు భావింపవలెను. సాయంకాలాబ్భక్షణమంత్రమున చెప్పిన జ్ఞానయజ్ఞమును, ఇచ్చట భావింపవలెను.

# మధ్యాహ్నాఽబ్భక్షణమంత్రార్థము

మంత్రము. "ఆపః పునంతు పృథివీం, పృథివీ పూతా పునాతు మాం, పునంతు బ్రహ్మణ స్పతిర్బ్రహ్మ పూతా పునాతు మామ్.

అర్థము. ఆపః="ఆపో వై సర్వా దేవతాః" అను శ్రుతి చెప్పుచున్నట్లు, సర్వదేవతాస్వరూపములైన జలములు పృథివీం= పృథివీభాగ మధికముగా గల నా స్థూలశరీరమును, లేక భూమిని పునంతు=పవిత్రము చేయుగాక!, పూతా=అట్లు పవిత్రము చేయ బడిన, పృథివీ=భూమ్యభిమాని దేవతయగు భూదేవి, మాం=ఉపాసకు డనగు నన్ను, పునాతు=పవిత్రము చేయుగాక? ఎట్లు? ఓర్పే ప్రధాన ముగా గల భూదేవి నాకు ఓర్పును కలుగజేసి కోపము కలుగకుండ చేయుగాక! అని భావము,

బ్రహ్మణః=హిరణ్యగర్భునకు, పతిః=నియామకుడగు పరమే శ్వరుడు, పునంతు=నన్ను పవిత్రము జేయుగాక, లేక బ్రహ్మణః= వేదమునకు, పతిః=పతిం=సంరక్షకుడగు నా యాచార్యుని, పునంతు= పవిత్రుని జేయు గాక!, బ్రహ్మ=ఆచార్యునిచేత ఉపదేశింపబడిన వేదము, పూతా=స్వయముగ పవిత్రమైనదై, మాం=నన్ను, పునాతు =పవిత్రుని జేయుగాక!

మంత్రము."యదుచ్ఛిష్టమభోజ్యం, యద్వా దుశ్చరితం మమ. సర్వం పునంతు మామాపోఽసతాం చ, ప్రతిగ్రహగ్ం స్వాహా॥

ఉచ్ఛిష్టం=ఎంగిలి భోజనమువలన గలిగినట్టియు, [ఉచ్ఛిష్ట మనగా—ఒకే పంక్తిలో భోజనము చేయుచున్నవారిలో నొక అవి వేకియైనవాడు ఇతరుల భోజనము పూర్తి కాకముందే మధ్యను లేచి పోయిన యెడల మిగిలినవారి యన్నము ఎంగిలిదే యగును. దానిని తినుటవలన ఎంగిలియన్నము తిన్నపాపము వచ్చును. ఇంకను ఎడమ పాదముమీద చేతినుంచుకొని భుజించిన యెడల నదియును ఉచ్ఛిష్ట

భోజనమే యగును. ఒకరి ఎంగిలి యన్నము తినినను పాపము వచ్చును.] అభోజ్యం=భుజింప తగనిదానిని తినుటవలన కలిగినదియు, (వెంద్రుకలు, పురుగులు మొదలగువానితో గూడిన వస్తువు భుజింప తగనిదియే) అసతాం = దుర్జనుల (యొక్క)నుండి, ప్రతిగ్రహం= దానము పట్టుటవలన కలిగినదియు, యద్వా=మరేవిధమైన, మమ= నాదగు, దుశ్చరితం=పాపము కలదో, సర్వం=ఈ యన్నివిధములైన పాపములను (పాపములనుండి) ఆపః = జలములు, మాం=నన్ను, పునంతు=శుద్ధుని జేయుగాక! ఇచ్చట ముందు జెప్పిన ప్రాతః సాయం మంత్రములందు వలె "జీవుడనగు నన్ను జ్యోతీరూపమగు పర బ్రహ్మమునందు హోమము చేయుచున్నాను." అను భావము స్పష్ట ముగ జెప్పబడక పోయినను, తెచ్చి పెట్టుకొనవలెనని "స్వాహా" యను పదము సూచించుచున్నది. అట్లు తెచ్చిపెట్టుకొన్న పై భావ ముతో "స్వాహా"యనుచు చేతియందలి నీటిని త్రాగవలెను. తన జీవుడు పరబ్రహ్మమునందు ఐక్యమును పొందినట్లు భావింపవలెను.

తాత్పర్యము. సర్వదేవతాస్వరూపములగు ఈ జలములు త్రాగబడినవై నాయొక్క స్థూలశరీరమును శుద్ధము జేయు గాక. ఈ ప్రదేశమును శుద్ధము జేయు గాక! స్వతః శుద్ధమైన యీ భూమి దేవి నాకు ఓర్పుగుణమును కలిగించి, కోపము కలుగకుండ జేసి, నా సూక్ష్మశరీరమును శుద్ధము జేయు గాక. హిరణ్యగర్భునకు గూడ నియామకుడగు పరమేశ్వరుడు (మంత్రము చివర జేయబోవు జీవ బ్రహ్మైక్యానుసంధానార్థ్హాతకొరకు) నన్ను శుద్ధుని జేయు గాక. ఎంగిలి యన్నము తినుట, తినకూడని దానిని తినుట, కూడని వారి నుండి దానము పట్టుట ఈ మొదలగు వాటివలన కలిగిన సమస్త పాపములను పోగొట్టి ఈ జలములు నన్ను శుద్ధుని చేయుగాక. నా జీవుని పరమాత్మజ్యోతియందు హోమము చేయుచున్నాను. బాగుగా హుతమగుగాక. అని భావించుచు చేతిలోని నీటిని త్రాగి, జీవ బ్రహ్మములు ఏకమైనట్లును, సమస్తపాపములు భస్మమైనట్లున్నూ,

తలంచవలెను. ఈ అభిమంత్రితజలపానమువలన ఆంతర (లోపలి) శుద్ధి కలుగును.

తరువాత రెండు స్మృత్యాచమనములను చేసి, పునర్మార్జనమును చేయవలెను. ఈ పునర్మార్జనము రెండవసారి బాహ్యశోధనమగును.

## ద్వితీయమార్జనమంత్రార్థము

మంత్రము. "దధిక్రావ్ణ్ణో అకారిషం, జిష్ణోరశ్వస్య వాజినః॥

ఈ మంత్రవాక్యమున నున్న పదములు పరమాత్మను చెప్పుచున్నవి.

ఎట్లనగా—

"దధిక్రావ్ణ్ణః = దధి యనగా. పెరుగు. పెరుగొకప్పుడు హోమము చేయదగిన వస్తువగును. కావున నిచ్చట "దధి" అనగా హోమముచేయదగు వస్తువని లక్షణచేత అర్థము చేయవలెను.

క్రావ్ణ్ణః = అనగా—"భుజించునట్టి" అని అర్థము. కాగా—హోమము చేయబడిన వస్తువును భుజించునట్టి అని అర్థము. అది "అగ్ని" అగును. ఇచ్చట హోమముచేయదగువస్తువును అగ్నిరూపముతో భుజించునది పరమాత్మ. జిష్ణోః = జయించుస్వభావము కలది. అనగా— మాయను జయించునది. పరమాత్మ. అశ్వస్య = అంతట వ్యాపించి యున్నది. పరమాత్మయే. వాజినః = వాజ మనగా—అన్నము. వాజి = దానిని తినునది, అని అర్థము. జీవరూపముతో అన్నమును తినునది పరమాత్మయే. ఇట్లీ నాలుగు పదములును పరమాత్మపరములు. అట్టి పరమాత్మకు సంబంధించిన దానిని, అనగా—ఉపాసనను = అకారిషం జేసెదను. (భూతకాలక్రియ భవిష్యత్కాలమును చెప్పెను.)

మంత్రము. సురభి నో ముఖా కరత్ । ప్ర ణ ఆయూగ్ంషి తారిషత్ ॥

కావున అట్టి పరమాత్మ, నః=మాయొక్క, ముఖా=శరీరావయవములను, సురభి=శుద్ధముగా, కరత్=(కరోతు) చేయుగాక! "ప్రణ" అను చోట "ప్ర" "నః" అని విడదీయవలెను. కాగా—నః=మాయొక్క, ఆయూగ్ంషి = ఆయుస్సులను ప్రతారిషత్ = వృద్ధిని చేయుగాక!

తాత్పర్యము. హోమము చేయదగు వస్తువులను అగ్నిరూపముతో భుజించునట్టియు, మాయనువశమునందుంచుకొన్నట్టియు, అంతట వ్యాపించునట్టి ఆ పరమాత్మయొక్క ఉపాసనను చేసెదను. కాన ఆ పరమాత్మ నాయొక్క శరీరమునంతను శుద్ధము చేసి, నా ఆయుస్సును వృద్ధిజేయు గాక! అని అర్థమును తలంచుచు మంత్రము చివరను నీటిని తలమీాద చల్లుకొనవలెను. ఇప్పుడు మరల ఆపోహిష్ఠాదిమంత్రములచే మార్జనము చేసికొనవలెను. ఆ మంత్రముల అర్థతాత్పర్యాదులు వెనుక వ్రాయబడినవి.

## హిరణ్యవర్ణీయార్థము

మంత్రము-(1) "హిరణ్యవర్ణాః శుచయః పావకాః, యాసు జాతః కశ్యపో యాస్వింద్రః । అగ్నిం యా గర్భం దధిరే విరూపా,స్తా న ఆపః శగ్ం స్యోనా భవంతు॥

హిరణ్యవర్ణాః=బంగారు రంగు గలవి, శుచయః=స్వతః శుద్ధమైనవి. పావకాః = ఇతరులను గూడ శుద్ధిజేయ శక్తి గలవి ఈ అర్థమే తర్వాతి విశేషణములచేత వివరింపబడుచున్నది. యాసు=ఏ జలములందు, కశ్యపః=కశ్యపబ్రహ్మ, జాతః=పుట్టెనో, యాసు=ఏ జలములందు, ఇంద్రః=ఇంద్రుడు, జాతః = పుట్టెనో, విరూపాః=వివిధ రూపములుగల, యాః = ఏ జలములు, అగ్నిం=సర్వలోకపావనుడగు అగ్నిని, గర్భం = బడబాగ్నిరూపముతో గర్భస్థశిశువుగా, దధిరే=

ధరించినవో, తాః=అట్టి, స్యోనాః=సుఖహేతువులగు, ఆపః=జలములు, నః=మాకు, శం=సుఖమును, అనగా— సుఖమునిచ్చునవి, భవంతు=అగుగాక.

తాత్పర్యము. కశ్యపబ్రహ్మయును, ఇంద్రుడును ఒకానొక తీర్థజలములలో స్నానము చేయుటవలన బ్రహ్మపదవిని ఇంద్రపదవిని పొందినారు. వారి కంతలేసి పదవుల నిచ్చినది జలములే కదా! సర్వలోకపావనుడగు అగ్నిని బడబాగ్నిరూపముతో సముద్రజలములు తమలో నుంచుకొనినవి. ఈ జలములు వడగండ్లు, మంచు మొదలగు నానారూపములను ధరించునవి. స్వతః శుద్ధములై యితరులను గూడ శుద్ధము చేయగలట్టివి. బంగారురంగు గలవి. అనగా—ప్రశస్తమైన రంగు గలవి. ఇట్టి యీ జలములు నన్ను శుద్ధుని జేసి, నాకు సుఖమును కలిగించు గాక!

మంత్రము-(2) యాసాగ్ం రాజా వరుణో యాతి, మధ్యే సత్యానృతే అవపశ్యన్ జనానాం। మధుశ్చ్యుతః శుచయో యాః పావకా,స్తా న ఆపః శగ్ం స్యోనా భవంతు॥

రాజా=జలాధిదేవతయగు, వరుణః=వరుణదేవుడు, యాసాం=ఏ జలములయొక్క, మధ్యే = మధ్యను (ఉండుచు) జనానాం=జనుల యొక్క, సత్యానృతే = సత్యమును అసత్యమునున్నూ అనగా పుణ్యపాపములను, అవపశ్యన్ =వివేచన చేయుచు, యాతి=(నిగ్రహానుగ్రహములను చేయుటకు ఆకర్తను) పొందుచున్నాడో, యాశ్చ=ఏ జలములు, మధుశ్చ్యుతః = మధురరసమును స్రవించునట్టివో, శుచయః = స్వతః శుద్ధమైనవో, పావకాః=కావుననే యితరులను గూడ శుద్ధమైనవారినిగా జేయ శక్తికలవో, స్యోనాః=సుఖహేతువులగు, ఆపః= జలములు, నః=మాకు, శం=సుఖము నిచ్చునవిగా భవంతు=అగుగాక.

తాత్పర్యము. జలరాజగు వరుణదేవుడు ఈ జలమధ్యమున నివసించుచు (జనులు స్నానముచేయునప్పుడు) జనుల పుణ్యపాపము

లను తెలిసికొని, పుణ్యాత్ములను రక్షించుటకును, పాపాత్ములను దండించుటకును, ఈ యుదకముల ద్వారా ఆ జనులను పొంది, వారిని రక్షించుటయో, లేక శిక్షించుటయో జేయుచున్నాడు. ఈ జలములు మధురమైన రసమును స్రవించునవి. స్వతః శుద్ధమైనవి. కావుననే యితరులను గూడ పవిత్రులనుగా జేయునవి. కాన సుఖహేతువులగు ఈ జలములు నన్ను శుద్ధునిగ జేసి, నాకు సుఖమును కలిగించుగాక!

మంత్రము. (3) యాసాం దేవా దివి కృణ్వంతి, భక్షం, యా అంతరిక్షే బహుధా భవంతి। యాః పృథివీం పయసోందంతి, శుక్రాస్తా న ఆపః శగ్ం స్యోనా భవంతు॥

దేవాః=ఇంద్రాది దేవతలు, దివి=ద్యులోకమున, యాసాం=ఏ జలములయొక్క, భక్షం=భక్షణమును, కృణ్వంతి=చేసెదరో, యాః=ఏ జలములు, అంతరిక్షే=క్రింది ఆకాశమున, బహుధా=పలు విధములైనవిగా, భవంతి=అగుచున్నవో, యాః=ఏ జలములు, పయసా=వర్ష రూపజలముచేత, పృథివీం=భూమిని, ఉందంతి=(సకల ప్రాణులయొక్క జీవనమునకు కారణమైన ఓషధుల వృద్ధికొఱకు) తడుపుచున్నవో, శుక్రాః=శుభ్రమైనట్టియు, స్యోనాః=సుఖహేతువులగు, తాఃఆపః=ఆ జలములు, నః=మాకు, శం=సుఖమును కలిగించునవి, భవంతు=అగుగాక!

తాత్పర్యము. ఇంద్రాది దేవతలు పైద్యులోకమున ఈ జలమును భక్షింతురు. ఈజలములు మేఘసంబంధమైనవి కావు. ఈ జలములే వర్షరూపములో భూమిని బాగుగా తడిపి సకలప్రాణిజీవన హేతువులగు ఓషధులను వృద్ధిపొందించుచున్నవి. ఈ విధముగా దేవ-మానవ-సర్వౌషధి-ప్రాణి-రక్షకములైనట్టివియు, శుద్ధమైనవియు సుఖహేతువులునగు జలములు మాకుశుద్ధి ద్వారా సుఖమును కలిగించుగాక!

మంత్రము. (4) శివేన మా చక్షుషా పశ్యతాఽఽపశ్శివయా తనువోపస్పృశత త్వచం మే। సర్వాగ్ం అగ్నీగ్ం రప్సుషదో హువే వో మయి వర్చో బలమోజో నిధత్త॥

హేఆపః=ఓ జలదేవతలారా! మా=(ఇట్లు ప్రార్థించుచున్న) నన్ను, శివేన=మంగళకరమైన, చక్షుషా=దృష్టితో, పశ్యత= చూడుడు, శివయా=మంగళకరమగు, తనువా=మీశరీరముతో, మే=నాయొక్క, త్వచం=చర్మమును, (శరీరమును) ఉపస్పృశత= తాకి శుద్ధముచేయుడు, హేఆపః=ఓ జలదేవతలారా! వః=మీ యొక్క, అప్సుషదః=జలములందున్న (మిమ్ములనాశ్రయించిన) సర్వాన్=సకలమైన, అగ్నీన్=అగ్నులను, హువే=పిలచుచున్నాను కాన, మయి=ప్రార్థించుచున్న నాయందు, వర్చః=దీప్తినిన్ని,బలం= శారీరకబలమునున్ను, ఓజః=ఉత్సాహమును లేక కాంతివిశేష మును, నిధత్త=ఉంచుడు. కలిగించుదురుగాక!

తాత్పర్యము. ఓ జలదేవతలారా! మిమ్ములను ప్రార్థించు చున్నట్టి నన్ను శాంతమంగళకరమైన దృష్టితో జూడుడు. శాంతి మంగళకరమగు మీశరీరముతో ప్రోక్షణసమయమున నా శరీరమును తాకి నన్ను శుద్ధుని జేయుడు. సుఖమును కలిగించుడు. ఓ జలము లారా! మిమ్ముల నాశ్రయించియున్న సర్వవిధములగు అగ్నులను పిలుచుచున్నాను. కాన మిమ్ముల నాశ్రయించిన నాకు దీప్తిని, శరీర బలమును ఉత్సాహమును కలిగించుడు.

## అఘమర్షణమంత్రార్థము

పాపములను పోగొట్టు మంత్రముయొక్క అర్థము.

మంత్రము ద్రుపదాదివ ముంచతు। ద్రుపదాదివేన్ముము చానః। స్విన్నః స్నాత్వీ మలాదివ। పూతం పవిత్రేణేవాజ్యం॥ ఆపః శుంధంతు మైనసః॥

హే ఆపః=ఓ జలములారా! ద్రుపదాదివ=ద్రుపదమనగా-

బొండకొయ్య. కాగా ఒక యధికారి, దోషిని శిక్షాకాలము పూర్తి యైనపిమ్మట, బొండకొయ్యనుండి విడిపించినట్లు, ముంచతు=మీరు నన్ను పాపమునుండి విడిపింపుడు. ద్రుపదాత్=బొండకొయ్యనుండి, ఉన్ముముచానఃఇవ=విడువబడినవానివలెనున్నా, స్విన్నః=చెమటచేత మలినమైనవాడు, స్నాత్వా=స్నానముచేసి, మలాత్ ఉన్ముముచానఇవ=శరీరమలమునుండి విడువబడినవానివలెనున్నా, పవిత్రేణ=దర్భపవిత్రముచేత, పూతం=పవిత్రమైన, ఆజ్యంఇవ=నేయివలెనున్న మా=నన్ను, ఏనసః=పాపమునుండి, శుంధంతు=(పాపమును పోగొట్టి) శుద్ధము చేయుదురు గాక!

తాత్పర్యము. ఒకానొక దోషి, యధికారిచేత బొండకొయ్య వేసి, శిక్షింపబడి, శిక్షాకాలమైనతర్వాత బొండకొయ్యనుండి విడిపింపబడును. అట్లే ఓ జలములారా! బొండకొయ్యనుండి మనుజుడు విడువబడినట్లును, చెమట పోసినవాడు స్నానము చేత మురికినుండి విడువబడినట్లును, దర్భపవిత్రముచేత, నేయి అశుచిత్వమునుండి విడునబడినట్లును, మీరు నన్ను పాపమునుండి విడిపించి శుద్ధము జేయుడు.

ఇచ్చట చెప్పిన మూడు ఉపమానములలో, మొదటిది పంచభూతములలో మొదటిదగు భూమికి సంబంధించినది. రెండవది రెండవదగు జలమునకు సంబంధించినది. మూడవది, మూడవదగు తేజస్సునకు సంబంధించినది. నేయి తేజస్సునకు సంబంధించినదని తర్కశాస్త్రసిద్ధాంతము. మూడును వరుసగా మూడు భూతములకు సంబంధించినవి. చమత్కారముగనున్నది.

ఇచ్చట పునర్మార్జనము ఉపాసకునకు రెండవసారి బాహ్యశుద్ధిని చేయును. అట్లే అఘమర్షణమంత్రము రెండవసారి ఆంతర (లోపలి) శుద్ధిని చేయును. కాగా- లోకములో నొక మురికి పాత్రను రెండు సారులు పైన, లోపల రెండు రెండుసారులు, తోమి కడిగి శుభ్రము చేయునట్లు ఉపాసకుడు తన యశుభ్రశరీరమును పైన

వర్ణించిన నాలుగు మంత్రప్రయోగములచేత పైన, లోపలనుకూడ రెండు రెండు సారులు శుద్ధము చేసుకొనుచున్నాడు. అటు తర్వాత నే సూర్యమండలమునకు ఉపద్రవమును కలిగించు మందేహారాక్షసులను గాయత్రీమంత్రముచే అభిమంత్రించబడి బ్రహ్మాస్త్రముతో సమానమైన అర్ఘ్యజలములచేత నాశముచేయుటకు అర్హుడగుచున్నాడు.

## అర్ఘ్యప్రక్షేపము

నే రచించిన సంధ్యాతత్త్వసుబోధినియందును, త్రికాలసంధ్యావందనప్రయోగమునందును వివరింపబడిన విధముగ గాయత్రీ మంత్రముచేత మూడర్ఘ్యముల నీయవలెను. గాయత్రీమంత్రార్థము ప్రాణాయామమంత్రార్థమును వివరించినపుడే వివరింపబడినది. అర్ఘ్యప్రదానమైన తర్వాత రాక్షసహింసవలన కలిగిన పాపనివృత్తికొఱకు ప్రణవవ్యాహృతులను 'ఓం భూర్భువస్సువః' అని చెప్పుచు చేతిలోని జలమును క్రిందకు ధారగా విడుచుచు ఒక్క ఆత్మప్రదక్షిణమునుచేసి (ముమ్మారుగాదు. "సకృత్" అని శాస్త్రము చెప్పుచున్నది.) కూర్చొని ఒక స్మృత్యాచమనమును చేయవలెను. దానివలన శుద్ధుడగును. తర్వాత మందేహారాక్షసనాశముచేత, నిరుపద్రవస్వస్థమైన సూర్యమండలమునందు "అసావాదిత్యో బ్రహ్మ। నాఽహమస్మి" యను మంత్రముతో సంధ్యోపాసనమును చేయవలెను. ఉపాసనమునకు ముందు మూడు ప్రాణాయామములు చేయవలెను.

## సంధ్యోపాసనము

సంధ్యోపాసనావిధానము సంధ్యాతత్త్వసుబోధినియందును త్రికాలసంధ్యాప్రయోగమునందును వివరింపబడినది. ఆ ప్రకారము వారి వారి అధికారానుసారముగ "అసావాదిత్యో బ్రహ్మ। సాఽహమస్మి" యను మంత్రముచేత సంధ్యోపాసనము చేయవలెను. అందు నిరుపాధిక నిర్గుణోపాసనము చేయువారు ఉపాసనకు ముందు "ఓ

మిత్యేకాక్షరం బ్రహ్మ'' అను అనువాకమును అర్థభావనాపురస్సరముగ పఠింపవలెను. కావున ఆ అనువాకమునకు అర్థము ఇచ్చట వ్రాయబడుచున్నది.

## ఓమిత్యేకాక్షరమను అనువాకార్థము

మంత్రము. ఓమిత్యేకాక్షరం బ్రహ్మ। అగ్నిర్దేవతా బ్రహ్మ ఇత్యార్షం। గాయత్రం ఛందం పరమాత్మం సరూపం। సాయుజ్యం వినియోగమ్॥

ఓమ్+ఇతి=ఓంకారమను సాధనముచేత, (మంత్రముచేత) (అనగా ప్రణవమును ఉచ్చరించుచు) ఏక+అక్షరం=మాయాసంబంధము లేక యద్వితీయమైనదియు, నాశములేనట్టి, బ్రహ్మ=నిర్గుణపరబ్రహ్మను ఉపాసింపలెను. ఓంకారమంత్రమునకు దేవతా ఋష్యాదులు చెప్పబడుచున్నవి. అగ్నిః = నిర్గుణపరబ్రహ్మమే, అంగతి=సర్వం జగత్ వ్యాప్నోతీత్యగ్నిః=సర్వజగత్తును వ్యాపించియున్నది. కాన అగ్ని=అని చెప్పబడుచున్నది. ఇట్లు అగ్నిశబ్దమునకు పరబ్రహ్మ మర్థమగుచున్నది.) దేవతా=దేవత. అనగా మంత్రమునకర్థము. బ్రహ్మ+ఇతి=ఆ పరబ్రహ్మమే, ఆర్షం=ఋషిః=మంత్రద్రష్ట (మంత్రమును కనిపెట్టినవారు) గాయత్రం=గాయత్రి, ఛందం=ఛందస్సు, పరమాత్మం=పరబ్రహ్మముతో, సరూపం = సమానరూపము కలది. అనగా సమానమైనది ఓంకారము. సాయుజ్యం=సాయుజ్యముక్తి(జీవబ్రహ్మైక్యము), వినియోగం=ఈ నిర్గుణోపాసనకు ఫలము.

తాత్పర్యము. త్రిమాత్రమగు ఓంకారమును ఉచ్చరించుచు దాని యర్థమగు మాయాతీతమైన నిర్గుణపరబ్రహ్మతత్వమును ఉత్తమాధికారి ఉపాసింపవలెను. ఉపాసకుడు మంత్రముయొక్క ఋషిచ్ఛందోదేవతావినియోగాదులను తెలిసికొనవలెను. కాని, ఏమంత్రమునకు ఋషిచ్ఛందోదేవతాదులు వేదమున చెప్పబడునో, ఆమంత్రమునకే ఋషిచ్ఛందోదేవతాదులను తెలిసికొనవలెను. ఏ మంత్ర

మునకు చెప్పబడవో ఆ మంత్రమునకు తెలిసికొనన వసరము లేదని శ్రీశంకరభగవత్పాదులవారు ఉపనిషద్భాష్యమునందు సిద్ధాంతీకరించినారు. కావున ఓంకారమంత్రమునకు ఋషిచ్ఛందో దేవతాదులు చెప్పబడినవి కనుక, ఆ మంత్రమునకు తెలిసికొనవలెను. కాని సంధ్యోపాసనమంత్రమునకు ఋష్యాదులు చెప్పబడనందున ఆ మంత్రమునకు ఋష్యాదులను తెలిసికొనన అవసరము లేదు. ఇచ్చట ఓంకారమంత్రమునకు నిర్గుణపరబ్రహ్మమే అర్థము. కాన ఆ నిర్గుణపరబ్రహ్మమే మంత్రమునకు దేవతఅగును. ఆ యా మంత్రములయొక్క అర్థమే ఆ యా మంత్రములకు దేవత యగును. ఆ పరబ్రహ్మమే ఋషికూడ అగును. ఋషి యనగా మంత్రద్రష్ట. మంత్రమును కనుగొనిన యాతడు. శంక–సాధారణముగ మంత్రార్థమగు దేవత వేరు. మంత్రద్రష్ట వేరుగ నుండును గదా! ఇచ్చట రెండును ఒక్కటి ఎట్లగును? సమాధానము. ''సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్। తదైక్షత, బహుస్యాం ప్రజాయాయేతి'' అను శ్రుతి పరబ్రహ్మకు ఈక్షణమును చెప్పుచున్నది. ఇచ్చట ఈక్షణమన నేమి? స్వస్వరూపమగు ప్రణవమును సందర్శించుటయే ఈక్షణము. కాన పరబ్రహ్మ, ప్రణవమంత్రమునకు ద్రష్టఅయ్యెను. గాయత్రి ఛందస్సు. ఓంకారము పరమాత్మతో సమానము. ఈ నిర్గుణోపాసనకు ఫలము సబీజనిర్బీజధ్యానక్రమమున బ్రహ్మసాక్షాత్కారమగును గాన, సాయుజ్యముక్తియే (జీవబ్రహ్మైక్యమే) ఫలమగును.

ఈ విధముగ నిర్గుణోపాసనసాధనమగు ఓంకారమునకు ఋష్యాదిప్రతిపాదకమగు ఈ యనువాకము గాయత్రీహృదయములో ఎట్లు చేరును? చేర నేరదు.

ఈ నిరుపాధిక–నిర్గుణోపాసనానంతరము ప్రధమోత్తరాంగమగు గాయత్రీజపమునకు పూర్వాంగమగు గాయత్రీహృదయమును అర్థభావనాపురస్సరముగ పఠింపవలయును. కాన గాయత్రీహృదయముయొక్క అర్థతాత్పర్యములువ్రాయబడుచున్నవి.

## గాయత్రీహృదయమంత్రార్థము

గాయత్రీహృదయము ఐదు భాగములుగ నున్నది.

(1) ఆహ్వానము, (2) స్తుతి, (3) ఆవాహనము, (4) ఛందర్షి దేవతాప్రదర్శనము, (5) ధ్యానము. అని.

అందు—(1) ఆయాతువరదా = మొదలు కొని ఆహ్వానము, (2) సర్వవర్ణే = మొదలు కొని స్తుతి. (3) "గాయత్రీమావాహయామి = మొదలుకొని ఆవాహనము. (4) గాయత్ర్యాగాయత్రీ= మొదలుకొని ఛందర్షి దేవతా ప్రదర్శనము. (5) అగ్నిర్ముఖం = మొదలుకొని, వినియోగః"వరకు ధ్యానము. ఈ ధ్యానము రెండు విధములు, (1) నామరూపాత్మకమగు జగత్తునంతను గాయత్రీశరీరముగా నొక ధ్యానము, (2) భక్తానుగ్రహముకొఱకు ధరించిన మూర్తిధ్యానము. అని.

ఈ యంశములన్నియును క్రమముగ వివరింపబడును.

## 1. ఆహ్వానము

మంత్రము. ఆయాతు వరదా దేవీ అక్షరం బ్రహ్మసంమితం।
గాయత్రీం ఛందసాం మాతేదం బ్రహ్మ జుషస్వ మే॥

వరదా = తనను భజించు వారికి వరముల నిచ్చునదియు, దేవీ = స్వయంప్రకాశమానమైనదియు, ఛందసాం = వేదములకు, మాతా=తల్లియైనట్టి, గాయత్రీం=గాయత్రీదేవి, (ఇచ్చట ప్రథమావిభక్త్యర్థమున ద్వితీయ వచ్చినది. ఛాందసప్రయోగము) ఆయాతు= నన్ననుగ్రహించుటకు వచ్చు గాక! వచ్చి, అక్షరం = నాశము లేనట్టియు, బ్రహ్మసంమితం = ఉపనిషత్తులచేత, పరబ్రహ్మస్వరూపమని బాగుగా నిర్ణయింపబడిన, ఇదం = ఈ నాచేత ఉపాసింపబడుచున్న, బ్రహ్మ=సంధ్యానామక బ్రహ్మమును, మే=నాకు, అనగా—నన్ను, జుషస్వ=పొందునట్లు నీవు చేయుము.

తాత్పర్యము. ఇది ఆహ్వానము. (పిలుపు) ఓ గాయత్రీదేవి! నీవు–నిన్ను భజించినవారికి వరముల నిచ్చుదానవు. పరబ్రహ్మ స్వరూపిణివి గాన స్వయంప్రకాశమానమైనదానవు. కావున నాశము లేని పరబ్రహ్మస్వరూపవు అని నిన్ను ఉపనిషత్తులు నిర్ణయించినవి. నీవు నాలుగు వేదములకు తల్లివి. అట్టి నీవు నిన్ను భజించుచున్నట్టి నా దగ్గరకు వచ్చి నాశము లేనట్టియు ఉపనిషత్తులచేత బ్రహ్మ రూపిణియని బాగుగ నిర్ణయింపబడినట్టియు ఈ నాచేత ఉపాసింప బడుచున్న సంధ్యానామకబ్రహ్మమును నన్ననుగ్రహించునట్లుగా చేయుము. నా అవిద్యను పోగొట్టి బ్రహ్మసాక్షాత్కారమగునట్లు అనుగ్రహించుము.

మంత్రము. యదహ్నాత్కురుతే పాపం, తదహ్నాత్ప్రతిముచ్యతే।
యద్రాత్రియాత్కురుతే పాపం, తద్రాత్రియాత్ప్రతి ముచ్యతే

అర్థము. అహ్నాత్ = పగటియందు, యత్ పాపం = ఏ పాప మును, కురుతే = చేయుచున్నాడో, తత్ = ఆ పాపము, అహ్నాత్ = ఆ పగటియందే, ప్రతిముచ్యతే = నీ మంత్రజపమును చేయువానినుండి నీచేత విడిపింపబడుచున్నది, రాత్రియాత్ = రాత్రియందు, యత్పాపం = ఏ పాపమును, కురుతే = చేయుచున్నాడో, తత్ = ఆ పాపము, రాత్రి యాత్ = ఆ రాత్రియందే, ప్రతిముచ్యతే = నీచేత విడిపింపబడుచున్నది.

తాత్పర్యము. బ్రహ్మజ్ఞానప్రాప్తికి ప్రతిబంధకమగు పాపము కూడ తనకు లేదని ఉపాసకుడు చెప్పుకొనుచున్నాడు. నేను పగలు చేసిన పాపము నీ మంత్రజపముచేతనే, ఆ పగలే నశించిపోవుచున్నది. రాత్రి చేసిన పాపము నీ మంత్రజపముచేతనే, ఆ రాత్రియందే నశించి పోవుచున్నది. ఇట్లు పాపములేని నాకు బ్రహ్మసాక్షాత్కారమగు నట్లు, సంధ్యాదేవి అనుగ్రహించునట్లు చేయుము. అని భావము.

## 2. స్తుతి

మంత్రము. "సర్వవర్ణే! మహాదేవి! సంధ్యావిద్యే! సరస్వతి! ఓజోఽసి సహోఽసి బలమసి భ్రాజోఽసి. దేవానాం ధామ నామాఽసి, విశ్వమసి విశ్వాయుః, సర్వమసి సర్వాయురభిభూరోమ్।

అర్థము. సర్వవర్ణే=సర్వమాతృకావర్ణస్వరూపిణి. (అకారము మొదలు క్షకారమువరకు గల అక్షరములు మాతృకావర్ణములని చెప్పబడును.) ఎల్లమాతృకావర్ణములును నీ స్వరూపములే. మహా+ దేవి= మహా=అనంతమగు, దేవి=స్వయంప్రకాశజ్ఞానస్వరూపురాలా! సంధ్యావిద్యే = సంధ్యావందనమున జపింపబడు మంత్రస్వరూపిణి, సరస్వతి=సర్వవాక్యస్వరూపిణి! ఓజః=శరీరమునకు కాంతిని, ఇంద్రియ ములకు బలమును ఇచ్చునట్టి అష్టమధాతుస్వరూపిణి; శుక్రము యొక్క సారము ఓజస్సని సుశ్రుతాచార్యులు చెప్పిరి. అసి = అగు చున్నావు. సహః=శత్రువులను అవమానించుటకు కావలసిన శక్తివి, అసి = అగుచున్నావు. బలం = శరీరశక్తివి, అసి = అగుచున్నావు. భ్రాజః = అతిదీప్తియు, అసి=అగుచున్నావు. దేవానాం = అగ్ని, సూర్యుడు మొదలగు దేవతలయొక్క, నామ = (ఉపనిషత్తులలో) ప్రసిద్ధమగు, ధామ = ప్రకాశహేతువగు ఏ బ్రహ్మతేజస్సు గలదో, ఆ తేజస్సు, అసి=అగుచున్నావు. విశ్వం=ఈ కనబడుచున్న ప్రపంచ మంతయు, అసి=నీవే యగుచున్నావు. విశ్వాయుః = అందరియొక్క ఆయుష్యము, అసి=నీవే యగుచున్నావు. సర్వంఅసి సర్వాయుః= ముందు చెప్పిన అర్థమే. దార్ఢ్యముకొరకు రెండు సారులు చెప్ప బడినది. అభిభూః = సర్వపాపనాశహేతువగునట్టి దానవు. ఓం= ప్రణవముచే నుపాసింపబడు బ్రహ్మవు నీవే.

తాత్పర్యము. గాయత్రిని స్తుతించుచున్నాడు. గాయత్రీదేవి విరాట్స్వరూపిణి గావున, అకారము మొదలు క్షకారమువరకు గల సర్వమాతృకావర్ణస్వరూపిణి. వర్ణమయమగు సర్వవాక్యస్వరూపిణి. బ్రహ్మజ్ఞానము మహావాక్యములవలన కలుగును. మహావాక్యములు వర్ణమయములు. కావున వర్ణవాక్యస్వరూపిణియగు గాయత్రి బ్రహ్మజ్ఞానహేతువు. గాయత్రి అనంతమగు స్వప్రకాశజ్ఞాన (బ్రహ్మచైతన్య) స్వరూపురాలు. సంధ్యాదేవతకు ముఖ్యమైన

యంతరంగ దేవత యగుటచేత (ఈ విషయము సంధ్యాగాయత్రీ స్వరూపనిర్ణాయక "విరాజి సృష్టికాలీనే"—ఇత్యాది శ్లోకార్థమున జూడనగును.) తనను ఆదరించని వారికి (తన మంత్రజపము జేయని వారికి) సంధ్యాబ్రహ్మము ప్రత్యక్షము కాకుండ నామెను ఆవరించు కొని యుండునది. "సంధ్యాఽవిద్యే"అనుపదము యొక్క తాత్పర్య మిది. లేక "సంధ్యావిద్యే" అనగ సంధ్యావందనమునందు జపింప బడు మంత్రస్వరూపిణి అనియును అర్థము. ఇంకను—శరీరమునకు సంబంధించిన ఇంద్రియశక్తియు శత్రువులను నాశము చేయగల సహనశక్తియు శారీరకశక్తియు నివియన్నియు గాయత్రీదేవియే— "తస్య భాసా సర్వమిదం విభాతి" ఆ పరబ్రహ్మ ప్రకాశముచేతనే ఈ సూర్యచంద్రనక్షత్రాదులన్నియును ప్రకాశించుచున్నవి. అను శ్రుతి చెప్పినట్లు సూర్యచంద్రాదుల ప్రకాశింపజేయు బ్రహ్మతేజస్సు గాయత్రియే. ఇంతయేల? ఈ కనబడుచున్న ప్రపంచమంతయు గాయత్రియే. అనగా గాయత్రీస్థూలశరీరమే. సర్వప్రాణులయొక్క ఆయుస్సు కూడ గాయత్రియే. ఈ విషయమే ఆవరముతో రెండు సారులు చెప్పబడినది. గాయత్రి మహావిరాట్స్వరూపిణి గావున ఆమెను శారీరకశక్తి స్వరూపిణిగ ధ్యానించువారికి అపరిమితబలము లభించును. ఆయుఃస్వరూపిణిగ ధ్యానించువారికి దీర్ఘాయువు కలు గును. ఈ మొదలగు భావములను ఊహించునది. గాయత్రియే సర్వవిధపాపములను నాశము చేయగలది. ఓంకారముచేత ఉపా సింపబడు పరబ్రహ్మచైతన్యము గాయత్రియే. ఇట్లు స్తుతిని పూర్తి చేసి గాయత్రిని తనయందు ఆవహింప చేసికొనవలెను.

## 3. ఆవాహనము

మంత్రము. గాయత్రీమావాహయామి. సావిత్రీమావాహ యామి. సరస్వతీమావాహయామి. ఛందర్షీ నావాహయామి. శ్రియ మావాహయామి.

అర్థము. గాయత్రీం = గాయత్రీదేవిని ఆవాహయామి = నాయందు ఆవహింప జేసికొనుచున్నాను. సావిత్రీం=సవిత యనగా సూర్యుడు. గాయత్రీమంత్రమునకు సవిత దేవత. కాన గాయత్రికి సావిత్రి అని పేరు. అట్టి సావిత్రిని ఆవాహయామి=నాయందు ఆవహింప జేసికొనుచున్నాను. సరస్వతీం=సర్వవాక్యస్వరూపిణి యగుట చేత సరస్వతియను పేరుకల గాయత్రిని ఆవాహయామి=నాయందు ఆవహింప జేసికొనుచున్నాను. ఛందర్షీన్ = ఛందస్సును ఋషిని ఆవాహయామి=నాయందు ఆవహింప జేసికొనుచున్నాను. శ్రియం= గాయత్రీమంత్రజపమునకు పరంపరాసంబంధముచేత ఫలమగు మోక్షశ్రీని ఆవాహయామి = నాయందు ఆవహింప జేసికొనుచున్నాను.

తాత్పర్యము, మహాగణపతి బాల మొదలగు మహామంత్రముల జపమునకు ముందు, జపము చేయునాతడు ఋషిని ఛందస్సును దేవతను తన శరీరమున ఆ యా అవయవములందు న్యాసమును (ఉంచుట) చేసికొనవలెను. తర్వాత మూలమంత్రమును తన శరీరము నందంతటను వ్యాపనము చేసికొనవలెను॥అట్లేవిని యోగమును (ఫలమును) కూడ న్యాసము చేసికొనవలెను. అట్లే ఈ వైదిక గాయత్రీమంత్రమునకు గూడ పైన పేర్కొనిన ఋష్యాదులను ఆ యా అవయవములకు బదులుగా శరీరమునందంతటను ఆవహింపజేసికొనవలెనని శ్రుతి చెప్పుచున్నది. "గాయత్రి" అని దేవతయొక్క ముఖ్యమగు నామము. ఇట్లు గాయత్రీ సావిత్రీ సరస్వతీ నామములతో విరాజిల్లు గాయత్రీదేవతను నాయందావహింపజేసికొనుచున్నానని భావము. ఆవాహన మనగా—ఉత్కృష్ట వస్తువు అల్పవస్తువు నందు ప్రవేశించినట్లు తలచి రెండింటికిని అభేదమును భావించుట. అట్లే ఛందస్సును ఋషిని తనయందావహింప జేసికొనవలెను. ఋషి యనగా—మంత్రద్రష్ట. అనగా=ఆ మంత్రమును కని పెట్టిన యాతడు. లేక ఆమంత్రసిద్ధిని పొందిన యాతడును ఋషి

యనబడును. (శ్రీ) అనగా జపఫలమగు మోక్ష లక్ష్మి అని అర్థము. ఈ ఫలమునకే వినియోగమని పేరు. వెనుక—"సాయుజ్యం విని యోగం" అని వచ్చినది కదా! ఈ ఫలమును గూడ తన యందా వహింప జేసికొను చున్నాడు.

## 4. ఋషిచ్ఛందోదేవతాప్రతిపాదనము

పై యావాహనమున ఋషిచ్ఛందోదేవతలు సామాన్య రూపముగా చెప్పబడిరి. ఈ సందర్భమున విశేషముగా పేర్కొన బడుదురు.

మంత్రము. "గాయత్ర్యా గాయత్రీ ఛ్ఛందో, విశ్వామిత్ర ఋషిః సవితా దేవతా.

గాయత్ర్యాః=గాయత్రీమంత్రమునకు, ఛందః = ఛందస్సు, గాయత్రీ=గాయత్రి యను పేరుగలదే. ఋషిః=ఋషి=విశ్వామిత్రః= విశ్వామిత్రుడను పేరుగల ప్రజాపతి. దేవతా=దేవత, సవితా= సూర్యుడు. ఇచ్చట విశ్వామిత్రపదమునకు విశ్వామిత్రుడను పేరు గల యొకానొక ప్రజాపతి యని తారానాథతర్కవాచస్పతులు స్వకృతగాయత్రీవ్యాఖ్యానమను పేరుగల గ్రంథమున వ్రాసిరి. కాన విశ్వామిత్ర పదమునకు అర్థము పురాణప్రసిద్ధుడగు విశ్వామిత్ర మహర్షి కాదు. మిగిలిన తాత్పర్యము సులభము.

## 5. ధ్యానము

మంత్రము, "అగ్నిర్ముఖం, బ్రహ్మా శిరః, విష్ణుర్హృదయగ్ం రుద్రశ్శిఖా, పృథివీ యోనిః, ప్రాణాపానవ్యానోదానసమానా స ప్రాణా, శ్వేతవర్ణా, సాంఖ్యాయనసగోత్రా గాయత్రీ చతుర్విగ్ం శత్యక్షరా, త్రిపదా, షట్కుక్షిః, పంచశీర్షోపనయనే వినియోగః.

ముందటి 4 వ భాగమందలి "గాయత్ర్యాః" అను పదమును ఇచ్చటికి తెచ్చుకొనవలెను. కాగా=గాయత్ర్యాః = గాయత్రీదేవి యొక్క, ముఖం=ముఖము, అగ్నిః=ప్రజ్వలించుచుండు అగ్నియే.

శిరః = తల, బ్రహ్మ = సృష్టికర్తయగు బ్రహ్మ, హృదయం = హృదయము, విష్ణుః = జగద్రక్షకుడగు విష్ణుమూర్తి, శిఖా = సర్వావయవాతీతమైన సిగ, రుద్రః = లయకారకుడగు రుద్రుడు, యోనిః = ప్రాణుల ఉత్పత్తి స్థానమగు గర్భము, పృథివీ = ప్రాణులు జీవించు భూమి. ఇట్లు చెప్పుటచేత మిగిలిన బ్రహ్మాండమంతయును గాయత్రీ దేవియొక్క మిగిలిన యవయవములనుగా ధ్యానింపవలెననుటకు సూచన. గాయత్రీ = గాయత్రీదేవి, ప్రాణాపాన...సప్రాణా = ఇచ్చట ప్రాణాదిపంచశబ్దములు ఆయా పేర్లు గల పంచవాయువులతో గూడిన లింగ (సూక్ష్మ) శరీరమును సూచించుచు, తద్వారా-లింగ శరీరసమష్ట్యభిమానియగు హిరణ్యగర్భుని లక్షణాశక్తిచే చెప్పెను. అట్టి హిరణ్యగర్భుడు గాయత్రీదేవికి ప్రాణ (లింగశరీర) మయ్యెనని భావము. "ప్రాణ" మనగా లింగశరీరమని వేదాంతశాస్త్రమున అర్థము గలదు. శ్వేతవర్ణా = తెల్లని రంగు గల శరీరము గలది. సాంఖ్యాయనసగోత్రా = సాంఖ్యాయనమహాముని గోత్రముతో సమానమైన గోత్రము కలది. చతుర్వింశత్యక్షరా = ఇరువది నాలుగక్షరములు గల మంత్రస్వరూపిణి, షట్కుక్షిః = తూర్పు, పడమర, దక్షిణము, ఉత్తరము, పైదిక్కు, క్రింది దిక్కు యను నారు దిక్కులనెడు, ఆరు కుక్షులు (కడుపులు) కలది. పంచశీర్షా = ఐదు రంగులు గల యైదు ముఖములు గలది. ఉపనయనే = ఉపనయనకర్మయందు, వినియోగః = ఈ గాయత్రీ మంత్రమునకు ఉపదేశము జరుగును.

తాత్పర్యము. గాయత్రీదేవికి రెండు శరీరములున్నవి. ఒకటి విరాట్ఛరీరము. నామరూపాత్మకములగు జగత్తులన్నియును గాయత్రీ దేవియొక్క స్థూలశరీరమని ముందొకసారి చెప్పబడెను. రెండవ శరీరము భక్తులను అనుగ్రహించుటకొరకు, సాంఖ్యాయనమహర్షి చేత చిరకాలము ఉపాసింపబడి ఆతని కుమార్తెయై యైదు ముఖములు పదిచేతులు గల మూర్తి (శరీరము) గలది. ఈ రెండు

విధములగు మూర్తులును ఈ గాయత్రీహృదయమున, ధ్యానము కొఱకు మిశ్రమముగా వర్ణింపబడినవి. అందు తొలుత విరాట్ఛరీరము వర్ణింపబడుచున్నది. గాయత్రీదేవియొక్క ముఖము ప్రసిద్ధముగు అగ్నియే. శిరస్సు, సృష్టికర్తయగు బ్రహ్మ. జగద్రక్షకుడగు విష్ణువు ఆమె హృదయము. సంహారకర్తయగు శివుడు, అన్ని యవయవముల కును పైనున్న సిఖ, సమస్తప్రాణికోటికిని జన్మభూమియగు భూమి, ప్రాణ్యుత్పత్తిస్థానమగు నామె గర్భము. ఇది యంతయును నామె విరాట్ఛరీరవర్ణనము. ఇచ్చట కొన్ని ముఖ్యావయవములు మాత్రము వర్ణింపబడినవి. మిగిలిన జగత్తంతయు నామె మిగిలిన కరచరణాద్యవయవములుగా ధ్యానింపవలెను. ఉదా—''చంద్రసూర్యులను ఆమె నేత్రములుగను, నక్షత్రముల నామె ఆభరణములు గను,'' ఈ విధముగ నూహించి ధ్యానింపవలెను. ఇంతటితో చాలమట్టుకు స్థూలశరీర వర్ణనమైనది. ఇక సూక్ష్మ (లింగ) శరీరవర్ణనము. ''ప్రాణాపాన=సప్రాణా = పంచ ప్రాణములు, పంచజ్ఞానేంద్రియములు, పంచ కర్మేంద్రియములు, మనోబుద్ధులను పదునేడింటితో కూడుకొనినది లింగశరీరము. అట్టి లింగశరీరసమష్టికి (మొత్తమునకు) హిరణ్యగర్భుడని పేరు. ఆ హిరణ్యగర్భుడు గాయత్రికి ప్రాణము. అనగా—లింగశరీరము. (వ్యావహారికమైన ప్రాణమని అర్థముకాదు.) ఇంతతో విరాట్ఛరీరవర్ణనము చాలమట్టుకయ్యెను. ఇక రెండవదగు మూర్తివర్ణనము చేయబడుచున్నది. సాంఖ్యాయన మహర్షి కుమార్తె అగుటచేత ఆతని గోత్రము కలది. ఆమె తెల్లని రంగుగల శరీరము గలది. ఇరువదినాలుగక్షరములు, మూడు వేదముల సారములగు మూడు పాదములు గలది, గాయత్రీమంత్రము. కాని యిచ్చట మంత్రమునకును, దేవతకును అభేదము చెప్పబడినది. కాన అట్టి మంత్రస్వరూపిణి. ఆరు దిక్కులనే ఆరు కుక్షులుగా గలది గాయత్రీవిరాట్ఛరీరము. ''ముక్తావిద్రుమహేమనీలధవళచ్ఛాయైః'' అనునట్లు ఐదు రంగులుగల యైదు ముఖములు గలది మూర్తి. వివిధాయుధములు గల పది చేతులు గలది అనుటకిది

సూచనము. ఇట్లు ధ్యానశ్లోకమున వర్ణింపబడిన రూపము వర్ణింప బడినది. కాన వేరే ధ్యానశ్లోకపఠన మక్కఱ లేదని కొందరు పెద్ద లందురు. కాని ఇచ్చట పూర్తి వర్ణనము లేదు. కాన ధ్యానశ్లోక మును పఠింపవలయును. ఈ మంత్రమునకు వినియోగము అనగా— ఉపదేశము ఉపనయనమున జరుగును. ఉపనయనము సర్వవేదా ధ్యయనాంగము. గాయత్ర్యుపదేశము ఆ యుపనయనమున జరు గును. గాయత్రీమంత్రోపదేశము కానిది యే వేదమంత్రమును నేర్చుకొనగూడదు. కాన గాయత్రీమంత్రము అన్ని మంత్రములకంటె గొప్పదగు మంత్రరాజము. కావుననే–“న గాయత్ర్యాః పరో మంత్రః” అని మనుస్మృతి చెప్పినది. కావున త్రిపాదగాయత్రీ మంత్రముచేత గాయత్రీదేవిని ప్రసన్నురాలినిగా చేసికొని, తద్వారా సంధ్యాదేవతానుగ్రహమును పొంది ఉపాసకుడు బ్రహ్మజ్ఞానమును పొందగలుగునని భావము.

ఇది గాయత్రీహృదయముయొక్క మొదటిభాగము. రెండవ భాగము “ఓంభూః ఓంభువః = మొదలు, భూర్భువస్సువరోమ్” అను నంతవరకు గల, తొలుత జెప్పిన ప్రాణాయామమంత్రమే. మొదటి భాగమును పఠించి, తర్వాత రెండవభాగముతో, మూడు ప్రాణా యామములు చేయవలెను. ఈ ప్రాణాయామమంత్రమునకు అర్థ తాత్పర్యములు వెనుక జెప్పినవే. మూడు ప్రాణాయామములను చేసి యథావిధిగ యథాశక్తి, జపమును అర్థభావనతో చేసి, ఆ జపమును పరబ్రహ్మమునకు సమర్పించునది.

గాయత్రీమంత్రముయొక్క అర్థము, ఇప్పుడే ధ్యానశ్లోకార్థ మును వ్రాసినతర్వాత వ్రాయబడును.

గాయత్రీహృదయమున గాయత్రీదేవియొక్క మూర్తిధ్యానము కూడ వర్ణింపబడుటవలన ప్రత్యేకముగ మూర్తిధ్యానశ్లోకమును పఠింపనక్కఱ లేదని కొందరందురు. కాని హృదయమున “పంచ శీర్షా” “శ్వేతవర్ణా” అని మాత్రమే చెప్పబడినది. అది చాలదు.

కావున పూర్ణాంశములతో కూడియున్న ధ్యానశ్లోకమును తప్పక పఠింపవలెను. అని పెద్దలందురు. కాన, ధ్యానశ్లోకమును దాని అర్థ తాత్పర్యములను వివరింతును.

## ధ్యానశ్లోకము

"ముక్తావిద్రుమహేమనీలధవళచ్ఛాయైర్ముఖై స్త్రీక్షణైః
యుక్తామిందునిబద్ధరత్నమకుటాం తత్త్వార్థవర్ణాత్మికాం।
గాయత్రీం వరదా ఉభయాంకుశకశాః శుభ్రం కపాలం గదాం
శంఖం చక్రమథారవిందయుగళం హస్తైర్వహంతీం భజే॥

అర్థము. "ముక్తా=ఛాయైః" ముక్తా=ముత్తెము, విద్రుమ=పగడము, హేమ=బంగారము, నీల=ఇంద్రనీలమాణిక్యము, ధవళ=తెల్లని తెలుపు, ఛాయైః=రంగులు గలిగినదియు, త్రీక్షణైః=మూడేసి కండ్లుగల, ముఖైః=ఐదు ముఖములతో, యుక్తాం=కూడియున్నదియు, ఇందు——మకుటాం=ఇందు=చంద్రరేఖతో, నిబద్ధ=కూడియున్న, రత్నమకుటాం=రత్నకిరీటములు గలదియును, తత్త్వా=త్మికాం=తత్త్వార్థ=బ్రహ్మతత్త్వము అర్థముగాగల, వర్ణ=అక్షరముల (పదముల)తో కూడిన మంత్రమే, ఆత్మికాం=స్వరూపముగా గలదియును, (బ్రహ్మతత్త్వమర్థముగల ఓంకారవర్ణమే స్వరూపముగాగలది అని కొందరర్థమును చెప్పుదురు.) హస్తైః=తన పది చేతులతో, శాస్త్రమున చెప్పిన ప్రకారము, క్రిందనుండి మీదికి ఎడమకుడి పర్యాయముగ అనగా——తొలుత ఎడమ, తర్వాత కుడి, మరల ఎడమ, తర్వాత కుడి, ఈ విధముగ, వరద=వరదముద్ర, అభయ=అభయముద్ర, అంకుశ=అంకుశము, కశాః=చబుకులను, (కొరడా), శుభ్రం=శుద్ధమైన (తెల్లని), కపాలం=తలపుర్రె పై భాగమును, గదాం=గదను, శంఖం=శంఖమును, చక్రం=చక్రాయుధమును, అథ=తర్వాత, అరవిందయుగళం=పై రెండు

చేతులందును రెండు తామరపూవులను, వహంతీం = ధరించుచున్న, గాయత్రీం = గాయత్రీదేవిని, భజే = సేవింతును, ధ్యానింతును.

తాత్పర్యము. గాయత్రీదేవిని సూర్యమండలమునందుగాని, లేక తన హృదయపద్మమున గాని ధ్యానింపవలెనని బాలంభట్టీయ గ్రంథమున చెప్పబడినది. సాన్నిధ్యమెక్కువగ నుండును. కాన తన హృదయపద్మమున ధ్యానించుట శ్రేష్ఠము. అట్లు ధ్యానింపలేనివారు, సూర్యమండలమున ధ్యానింపవచ్చును.

శ్రీమద్భాగవతమున హృదయపద్మమున ధ్యానించు విధము చెప్పబడినది.

ముందుగా దేవియొక్క ఐదుముఖములను, మనకెదురుగ కూర్చున్న దేవియొక్క కుడివైపునుండి ఎడమవైపునకు ధ్యానింపవలెను. మొదటి ముఖము ముత్తెపురంగులో నుండును. ముత్తెపురంగు తెల్లని తెలుపుగాక, కొంచెము మ(త)గ్గిన తెలుపు. రెండవ ముఖము పగడమువలె ఎఱ్ఱగనుండును. మూడవది, మధ్యది, బంగారు రంగుగలది. నాలవది ఇంద్రనీలమాణిక్యపురంగు గలది. ''రామం దూర్వాదళశ్యామం'' అని చెప్పినట్లు గఱికపోచరంగుకూడ నీలపదమునకు అర్థము చెప్పుట కలదు. ఇక ఐదవ ముఖము, తెల్లని తెలుపురంగు గలది. ఐదు ముఖములందును మామూలు రెండేసి కండ్లు మాత్రమేకాక, నుదుటిమీద కూడ ఈశ్వరునకువలె మూడవ కన్నుండును. అట్లే చంద్రరేఖతో నొప్పారు రత్నకిరీటములుండును. గాయత్రీహృదయమున ''శ్వేతవర్ణా'' యని చెప్పినట్లు దేవిశరీరపు రంగు తెల్లగనుండును. దేవిశరీరము ఓంకారముమధ్య నుండునని కొందరందురు. ఇక హస్తములందలి వస్తువులు. ''పర్యాయతో భావయేత్తత్ వామదక్షిణహస్తయోః'' అన్నట్లు ఒక యెడమచేయి, ఒక కుడిచేయి క్రమముతో, క్రిందినుండి మీదికి చేతులయందలి వస్తువులను భావింపవలెను. కాని వరదాఽభయహస్తములు ప్రక్కలయందుండక, కుడియెడమప్రక్కలకు మధ్యను ఉండును. అమెకు ముందు

ఉండును మధ్యనున్న రెండుచేతులలో ఎడమచేయి, వరదముద్రతో క్రిందుగా నుండును. కుడిచేయి అభయముద్రతో పైగా నుండును. ఎడమ ప్రక్కనున్న నాలుగు చేతులలో క్రింది చేతిలో అంకుశముం డును. దానికెదురుగనున్న కుడి క్రింది చేతియందు చబుకు, (అనగా కొరడా) క్రిందనుండి రెండవ ఎడమచేతియందు తెల్లని తలపుర్రెపై భాగము, దానికెదురుగనున్న కుడిచేతియందు గద, ఎడమ మూడవ చేతియందు శంఖము, దానికెదురుగ నున్న కుడిచేతియందు చక్రము, మిగిలిన పై రెండు చేతులందును రెండు తామరపూవులును ఉండును. వానిని భావింపవలెను. ఇట్లు విరాజిల్లుచున్న గాయత్రీదేవిని తన కెదురుగ ప్రత్యక్షముగ నున్నట్లు, నిశ్చలమనసుతో, శ్రద్ధతో ధ్యానింపవలెను. ఇట్లు ధ్యానించినయెడలనే ధ్యానఫలము లభించును. ఇట్లు ధ్యానింపక, ధ్యానశ్లోకమును మాత్రము పఠించినయెడల ఏమి ఫలము గలుగునో దేవునకే ఎరుక.

## గాయత్రీమంత్రార్థము

ఇట్టి గాయత్రీదేవియొక్క మంత్రముయొక్క అర్థము జపసమ యమున, భావించుటకొరకు, వ్రాయబడుచున్నది.

గాయత్రీమంత్రమున "సవితుః" అను పదమున్నది. ఆ సవితృ శబ్దమునకు యోగార్థమొకటి యోగరూఢ్యర్థమొకటియు కలవు. అందుయోగార్థము, "సూతే ప్రపంచమితి సవితా" ప్రపంచమును సృష్టించువాడు సవిత అని యోగార్థము. ఈ వ్యుత్పత్తిని [సమాస మును) అనుసరించి; తనను ఆశ్రయించిన, మాయాద్వారా ప్రపం చమును సృష్టించునది, పరబ్రహ్మమే. అనగా- ప్రపంచమునకు ఉపాదానకారణము (మూలకారణము) ఐన. మాయకు అధిష్ఠానము (ఆశ్రయము) ఐన పరబ్రహ్మము సవితృశబ్దమునకు యోగార్థమగును. కాని రూఢి (ప్రసిద్ధి) చేత ఈ సవితృశబ్దము, ఆకాశమున ప్రకాశిం చుచు, ప్రాణులకు ప్రత్యక్షమగుచున్న "సూర్యుడు" అను అర్థమును చెప్పును, ఇట్లు సవితృశబ్దమునకు రెండర్థములు కలవు. అందులో

యోగరూఢ్యర్థమును తీసికొని విశ్వామిత్రమహర్షి మందాధికారులకు శ్లోకరూపముగ గాయత్రీమంత్రార్థమును తెలిపెను.

అత్యంతసూక్ష్మమైన యోగార్థమును తీసికొని, శ్రీమచ్ఛంకరభగవత్పాదులవారు ఉత్తమాధికారులకొరకు గాయత్రీమంత్రమునకు పరబ్రహ్మపరముగ భాష్యమును వ్రాసిరి. [ఈగ్రంథము మద్రాసు అడయారుగ్రంథాలయమున లభించినది.] జపించువారి ఉపయోగార్థము రెండర్థములును వివరింపబడుచున్నవి.

ముందు విశ్వామిత్రకృతి గాయత్రీమంత్రార్థము తెలుపబడుచున్నది.

## గాయత్రీమంత్రము

"తత్సవితుర్వరేణ్యం। భర్గో దేవస్య ధీమహి। ధియో యో నః ప్రచోదయాత్"

ఈ మంత్రములోని పదములు అర్థమును చెప్పుకొనుటకు వీలుగా, తెలుగు పద్యమునందువలె అన్వయక్రమమున (వరసగ) లేవు. అచ్చట నిచ్చట చెదిరి యున్నవి. అందువలన విశ్వామిత్ర మహర్షి తాను కొన్ని పదములు చేర్చి, మంత్రములోని పదములతోనే, అన్వయక్రమమున తేలిక పదములతో గాయత్రీమంత్రార్థమును మందాధికారులకు తెలియునట్లు శ్లోకరూపమున వ్రాసెను. దానిని క్రింద వ్రాయుచున్నాను,

"యో దేవః సవితాఽస్మాకం, ధియో ధర్మాదిగోచరాః।
ప్రేరయేత్తస్య యద్భర్గః, తద్వరేణ్యముపాస్మహే॥" అని.

గాయత్రీమంత్రమున ముందు మూడవపాదము యొక్క అర్థమును చెప్పుకొని, తర్వాత ఒకటి రెండు పాదముల అర్థమును చెప్పుకొనవలెను. ఆ మంత్రము అట్లు ఏర్పడినది. కావున, "గాయత్రీ" మంత్రార్థము మూడవపాదమునుండి, విశ్వామిత్రులవారు వివరించిన ప్రకారము, వివరింపబడుచున్నది,

యః = ఏ సూర్యభగవానుడు, నః = మనకు, ధియః = ధర్మా ధర్మ విషయకములగు బుద్ధులను, ప్రచోదయాత్ = ప్రేరేపించునో, (కలిగించునో), దేవస్య = స్వయంప్రకాశమానుడైన, సవితుః = ఆ సూర్యభగవానుని యొక్క, తత్ = వేదశాస్త్రపురాణములందు ప్రశంసింపబడి, ప్రసిద్ధమైనదియు, వరేణ్యం = అందరిచేత కోరదగినట్టి భర్గః = తేజస్సును, ధీమహి, ధ్యాయేమహి = మనము ధ్యానింప వలెను.

తాత్పర్యము. సూర్యభగవానుడు స్వయముగ ప్రకాశించు వాడు. ఇతరగ్రహములన్నియో—ఈ సూర్యుని ప్రకాశమువలన ప్రకా శించునవి. వానికి స్వయంప్రకాశము లేదు. సూర్యుని తేజస్సు సర్వ ప్రాణులకును ఆరోగ్యమును సుఖమును ఆనందమును కలిగించును. ఇది అందరకును తెలిసిన విషయమే. ఎప్పుడైన మూడు నాలుగు రోజులు వరుసగ మబ్బు పట్టి, సూర్యకాంతి లేని యెడల, జనులంద రును "అయ్యో! ఎండ లేదే! అని ఎంతయో బాధపడుట మన మందర మెరిగినదే. అందువలన సూర్యతేజస్సును అందరును ఎల్లప్పు డుండవలెనని కోరుదురు. అట్టి సూర్యభగవానుడు, తాను ఉద యించుచు అందరిని మేలుకొలుపును. అట్లు మేలుకొనిన జనులు వారి వారి ధర్మాధర్మకార్యములందు ప్రవర్తిల్లుదురు. అట్లు సర్వ జనప్రవర్తకుడగు సూర్యభగవానునియొక్క, అందరి జనులచేత ప్రార్థింపబడుచున్నదియు, సుఖారోగ్యముల నిచ్చునట్టి, తేజస్సు మనకు ఎల్లప్పుడును సుఖారోగ్యములను కలిగించుగాక! అని మనము ధ్యానింపవలెను. అనగా ధ్యానింతుము గాక! అని.

ఇంతవరకును అర్థక్రమమును అనుసరించి, మంత్రమునకు అర్థము వ్రాయబడినది. జపము చేయునప్పుడు ఈ క్రమముతో అర్థ మును భావించుటకు వీలుండదు గదా! కావున జపము చేయునప్పుడు అర్థమును భావించుటకు వీలగునట్లు, మంత్రములోనున్న క్రమము ననుసరించియే, అర్థము వ్రాయబడుచున్నది. జపించువారి భావన

సౌకర్యముకొరకు, శాస్త్రపద్ధతి కొంచెము సడలింపబడినది. "తత్ = వేదశాస్త్రములందు వర్ణింపబడి ప్రసిద్ధమైనదియును, సవితుః = సూర్యునిదైనట్టియు, వరేణ్యం = అందరిచేత కోరబడదగినట్టి, భర్గో దేవస్య = స్వయంప్రకాశమానుడైన ఆ సూర్యుని తేజస్సును, ధీమహి = (మనకు సుఖారోగ్యములు కలిగించుగాక! యని) మనము ధ్యానింపవలెను. (ధ్యానింతుము గాక!) ధియో = ధర్మాధర్మబుద్ధులను, యః = పూర్వోక్తమైన ఆ తేజస్సే, నః = మనకు, ప్రచోదయాత్ = ప్రేరేపించును. కలిగించుచున్నది, అని అర్థమును భావింపవలెను.

## ఉత్తమాధికారులకు శాంకరభాష్యము

"తృతీయపాదార్థః. యః = ప్రత్యగాత్మా, నః = అస్మాకం, ధియః = బుద్ధివృత్తీః. ప్రచోదయాత్ = ప్రేరయేత్. ఇతి తృతీయపాదేన సర్వబుద్ధిసంజ్ఞకాంతఃకరణప్రకాశకః, సర్వసాక్షీ, ప్రత్యగాత్మా ఉచ్యతే. తస్య యచ్ఛబ్దనిర్దిష్టస్య ఆత్మనః స్వరూపభూతం పరం బ్రహ్మ, తత్ -సవితృ-వరేణ్యాది (ఆదిశబ్దేన భర్గ దేవపదేచ గృహ్యేతే) పదైః నిర్దిశ్యతే.

అనగా—

మంత్రముయొక్క మూడవ పాదము, బుద్ధియను పేరుగల అంతఃకరణమును ప్రకాశింపజేయునట్టియు, (అంతఃకరణావచ్ఛిన్నమైన చైతన్యరూపమగు) సర్వసాక్షీభూతుడగు మన ప్రత్యగాత్మను చెప్పుచున్నది, అట్టి ప్రత్యగాత్మకు స్వరూపమైన పరబ్రహ్మమును గాయత్రీమంత్రములోని ఒకటిరెండు పాదములలోని. తత్, సవితుః, వరేణ్యం, భర్గః, దేవస్య, అను ఐదు పదములును చెప్పుచున్నవని భావము.

ఎట్లనగా—

1. తత్ర "ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణస్త్రివిధః స్మృతః"

ఇతి స్మృతేః, తచ్ఛబ్దేన ప్రత్యగాత్మభూతం స్వతస్సిద్ధం పరంబ్రహ్మ ఉచ్యతే.

1. అనగా—

ఆ యైదు పదములలో మొదటిదగు పదము "తత్" అను పదము. "ఓం, తత్, సత్," అను మూడు పదములు పరబ్రహ్మమును చెప్పునవి. అను గీతా వచనము ప్రకారము మంత్రములోని ఆ తత్ పదము, ప్రత్యగాత్మగా నైనట్టియు, స్వయంసిద్ధమైన (స్వమహిమయందున్న) పరబ్రహ్మమును చెప్పును.

2. సవితురితి సృష్టిస్థితిలయ లక్షణ—సర్వప్రపంచస్య, సర్వ ద్వైతభ్రమస్య అధిష్ఠానం లక్ష్యతే.

2. అనగా—

"సవితుః" అను పదము సృష్టిస్థితిలయస్వరూపమైన సర్వ ప్రపంచమునకును, అన్ని విధములైన ద్వైతభ్రమలకున్ను, అధిష్ఠానమైన పరబ్రహ్మమును లక్షణచేత చెప్పును. (ఏలననగా సవితృ శబ్దమునకు లోకమున సూర్యుడని అర్థము. ఈ యర్థమునకు మంత్రములోని ఏ పదముయొక్క అర్థముతోనూ సంబంధము కుదరక పోవుటచేత, ఆ యర్థమును విడిచి, పై యర్థమును చెప్పుటకు లక్షణను ఆశ్రయించవలసి వచ్చెను.)

3. వరేణ్యమితి, సర్వవరణీయం నిరతిశయమానందరూపం. అన్లే— వరేణ్యం అను పదము, అందరిచేత కోరదగినదియును, తనకు మించినది లేని శుద్ధానందమును (బ్రహ్మానందమును) చెప్పును.

"భర్గ" ఇతి, అవిద్యాదిదోష భర్జనాత్మక జ్ఞానవిషయత్వం.

4. "భర్గ" అను పదముచేత ("భర్జతే" ఇతి భర్గః వేచుచున్నది అనగా దహించుచున్నది. కాన భర్గః అని చెప్పబడుచున్నది.) అవిద్య, మాయ, మొదలగు దోషములను దహించి భస్మము చేయునట్టి బ్రహ్మజ్ఞానమున విషయమైనది, [బ్రహ్మమే] యని అర్థము.

5. "దేవస్య" ఇతి, సర్వద్యోతనాత్మకం-అఖండచిదేకరసము చ్యతే, "దేవస్య"అను పదము "తస్య భాసా సర్వమిదం విభాతి" ఆ పరబ్రహ్మప్రకాశముచేతనే- ఈ సూర్యచంద్రనక్షత్రాగ్న్యాదు లన్నియును ప్రకాశించుచున్నవి, అను శ్రుతిచెప్పునట్లు సర్వమును ప్రకాశింపజేయునట్టి అఖండమైన అద్వితీయమైన బ్రహ్మచైతన్య మును చెప్పును,

"సవితుః దేవస్యేత్యత్ర షష్ఠ్యర్థః "రాహోశ్శిరః" ఇత్యాదా విన ఔపచారికః॥ "సవితుః దేవస్య" అనునవి విశేషణములు గదా! తత్, వరేణ్యం, మొదలగునవి వలె ప్రథమావిభక్తియందుండక, షష్ఠీవిభక్తి యేల వచ్చెను? అను, శంక రాగా సమాధానము చెప్పబడుచున్నది.

"సవితుః దేవస్య" అను చోటున షష్ఠీవిభక్తియొక్క అర్థము "రాహోః శిరః" అను చోటునందు ఔపచారికషష్ఠీ విభక్తి వచ్చినట్లే చెప్పుకొనవలెను అని భావము.

తథాచ—బుద్ధ్యాదిసర్వసాక్షిలక్షణం, యస్మే స్వరూపం, తత్, సర్వాధిష్ఠానభూతం పరమానందం నిరస్తసమస్తానర్థరూపం, స్వప్రకాశచిదాత్మకం, బ్రహ్మైవ ఇత్యేవం, ధీమహి = ధ్యాయేమహి, ఇత్యర్థః" అని.

కాగా—జపసమయమున గాయత్రీమంత్రార్థమును ఈ క్రింది విధముగ అనుసంధానింపవలెను.

తత్ = సర్వస్థూలసూక్ష్మాదులకును సాక్షియైన నాప్రత్యగాత్మ (యేది గలదో) అది సవితుః = సృష్టిస్థితిలయరూపమైన మిథ్యా ద్వైతప్రపంచమునకు అధిష్ఠానమైనదియు, వరేణ్యం = సర్వావర ణీయ - నిరతిశయానందరూపమైనదియును, భర్గో = మాయాఽ విద్యాదిసర్వదోషవినాశక-బ్రహ్మజ్ఞానవిషయమైనదియు, దేవస్య = స్వయంప్రకాశ-అఖండ-చిదేకరసమైన పరబ్రహ్మమే యని, ధీమహి

మనము ధ్యానింపవలెను. ధియో=ధర్మాఽధర్మవిషయక అంతః కరణవృత్తులను, యః=ఈ నా ప్రత్యగాత్మయే, నః=మనకు, ప్రచోదయాత్=ప్రేరేపించునో, అనగా—ప్రేరేపించును. కలిగించును. అని,

ఇటువంటి ఈ భావనాపరంపరను బాగుగ అభ్యసించిన యెడల అహంగ్రహోపాసనయగు సంధ్యోపాసనకు మిక్కిలి ఉపయోగపడును.

ఇచ్చట "ధీమహి" అనుపదము విధాయకలిఙ్‌రూపమున ఉండుటవలన ఇది ఉపాసనమెంతమాత్రము కానేరదు. ఈ అర్థము ఉత్తమాధికారులకు మాత్రమే.

చాలమంది మహర్షులును, శ్రీ శంకరాచార్యాదిమహోత్తములును, గాయత్రీమంత్రమునకు అర్థమును వ్రాయునప్పుడు ప్రణవమును, మూడువ్యాహృతులను విడిచిపెట్టి కేవల త్రిపాదమంత్రమునకే వ్యాఖ్యానములను చేసిరి. కాన గాయత్రీజపసమయమున ప్రణవవ్యాహృతుల అర్థమును అనుసంధానింప నక్కర లేదని తోచెడిని. అవి తమ ఉచ్చారణమాత్రము చేతనే జపించువానిని పవిత్రము చేయును. అని యెఱుంగునది.

ఇట్లు యథాశక్తి మంత్రమును జపించి, జపమును పరబ్రహ్మమునకు సమర్పించునది.

జపవిధానము సమాప్తము.

## గాయత్ర్యుద్వాసనమంత్రార్థము

జపానంతరము గాయత్రీదేవికి ఉద్వాసమును చెప్పవలెను.

1వ మంత్రము

"ఉత్తమే శిఖరే జాతే భూమ్యాం పర్వతమూర్ధని।
బ్రాహ్మణేభ్యోఽభ్యనుజ్ఞాతా గచ్ఛ దేవి యథాసుఖమ్॥

అర్థము. భూమ్యాం = భూమిమీద. పర్వతమూర్ధని = పర్వత శ్రేష్ఠమగు మేరుపర్వతమునందు, ఉత్తమే = శ్రేష్ఠమగు, శిఖరే = శిఖరమున, జాతే = ఉన్నట్టి దేవి! = ఓ గాయత్రీదేవి! బ్రాహ్మణేభ్యః = భక్తులగు బ్రాహ్మణులనుండి, అనుజ్ఞాతా = అనుమతినిపొందిన దానవై, యథాసుఖం = సుఖముగ గచ్ఛ = ఆ యుత్తమశిఖరమునందలి స్వస్థానమును పొందుము.

2వ మంత్రము

స్తుతో మయా వరదా వేదమాతా, ప్రచోదయంతీ పవనే ద్విజాతా। ఆయుః పృథివ్యాం ద్రవిణం బ్రహ్మవర్చసం, మహ్యం దత్వా ప్రయాతుం బ్రహ్మలోకమ్॥

అర్థము. ద్విజాతా = ద్విజుల సమూహమును పవనే = (పావనే) పవిత్రమగు ఉపాసనాకర్మయందు, ప్రచోదయంతీ = ప్రేరేపించుచున్నట్టియు, వరదా = భక్తులకు వరములను ఇచ్చునట్టియు, వేదమాతా = వేదజననివగు ఓ గాయత్రీదేవి! మయా = నాచేత స్తుతః = స్తుతా = స్తుతింపబడినదానివై మహ్యం = ఉపాసకుడనగు నాకు ఆయుః = దీర్ఘాయుస్సును, పృథివ్యాం = భూమిమీద (ఉన్నంతకాలము) ద్రవిణం = ఆవశ్యకధనమును బ్రహ్మవర్చసం = బ్రహ్మవర్చస్సునుమా, బ్రహ్మలోకం = బ్రహ్మజ్ఞానమును ప్రయాతుం = పొందుటకు (అనగా పొందువరకును) దత్వా = ఇచ్చి గచ్ఛ = నీ స్వస్థానమును పొందుము అని.

తాత్పర్యము. ఓ గాయత్రీదేవి! నీ భక్తులగు ద్విజుల అనుమతిని పొంది ఈ భూమిమీద పర్వతశ్రేష్ఠమగు మేరు పర్వతమునందలి నీ స్వస్థానమగు ఉత్తమ శిఖరమును సుఖముగా పొందుము. ద్విజులను పవిత్రమగు ఉపాసనకర్మయందు ప్రేరేపించుచున్న నీవు నాచేత స్తుతింపబడినదానవై వరదురాలవై ఉపాసకుడనగునాకు ఉపాసన సిద్ధించువరకును దీర్ఘాయుస్సునిచ్చి, భూమిమీద బ్రతికియున్నంత కాలము, ధనమును బ్రహ్మవర్చస్సును ఇచ్చి స్వస్థానమును పొందుము.

ఇట్లుద్వాసన చెప్పి, తర్వాత సూర్యోపస్థానమును (సూర్య స్తుతిని) చేయవలెను. కాన త్రికాలసూర్యోపస్థానమంత్రములకును క్రమముగా అర్థతాత్పర్యములు వ్రాయబడుచున్నవి.

## ప్రాతఃకాలసూర్యోపస్థానమంత్రార్థము

మంత్రము. మిత్రస్య చర్షణీధృతః శ్రవో దేవస్య సానసిం. సత్యం చిత్రశ్రవ స్తమం॥

హేమిత్ర! ఓ సూర్యదేవ! (అని చేర్చుకొనవలెను. చర్షణీ ధృతః = (వర్షములద్వారా పంటల నధికముగా పండించుటచేత) ప్రజలను పోషించుచున్నట్టియు, మిత్రస్య = కావుననే సర్వప్రాణులకును మిత్రుడవైనట్టియు. దేవస్య = జగత్తును ప్రకాశింపజేయునట్టి, నీయొక్క, శ్రవః = కీర్తి, సానసిం = బాగుగా సేవింపతగినది. ఏల? సత్యం = (ఆకీర్తి) సత్యమైనదియు, చిత్రశ్రవ స్తమం = చిత్ర విచిత్రముగా వినదగిన కథలు కలది కావున.

మంత్రము. మిత్రో జనాన్ యాతయతి ప్రజానన్, మిత్రో దధార పృథివీముత ద్యాం। మిత్రః కృష్టీరనిమిషా భిచష్టే. సత్యాయ హావ్యం ఘృతవద్విధేమ. సూర్యదేవుడు, మిత్రః = సర్వప్రాణి మిత్రుడైనందున, ప్రజానన్ = ఎవరెవరికి నేయే కార్యము కలదో చక్కగా తెలిసికొనుచున్నవాడై, జనాన్ = జనులను, యాతయతి = వారి వారి పనులయందు నియోగించుచున్నాడు.

అందువలన సూర్యుడు (1) సర్వాంతర్యామిగను (2) సర్వజ్ఞుడుగను ఉన్నాడని భావము.

మిత్రః = మిత్రుడైన సూర్యుడు, పృథివీం = భూమిని, ఉత = ఇంకను, ద్యాం చ = ఆకాశమునున్ను, ఇచ్చట భూమిశబ్దముచేత భూమిక్రిందనున్న ఆరు లోకములున్ను "ద్యాం" శబ్దముచేత, పైయేడు లోకములున్ను. భూమితో కలిపి, పదునాల్గు లోకములని భావము. దధార = ధరించెను. ఇట్లు సకలబ్రహ్మాండమును ధరించుటచేత సూర్యు

నకు (3) సర్వాత్మకత్వము సిద్ధించుచున్నది. మిత్రః = మిత్రుడైన సూర్యుడు కృష్టీః = మనుష్యులనున్నూ అనిమిషా = దేవతలనున్ను అభిచష్టే = అన్ని వైపులనుండియు చూచుచున్నాడు. (4) సర్వకర్మసాక్షి యని భావము. సత్యాయ = సత్యస్వరూపుడవైనట్టి, (ఇంతవరకు చెప్పినట్లు సర్వాంతర్యామి, సర్వజ్ఞుడు, సర్వాత్మకుడు సర్వకర్మసాక్షియునైన)నీకు, ఘృతవత్ = నేతితోగూడిన, హవ్యం = హవిస్సును, విధేమ = ఇచ్చెదము. [కావున నాస్తోత్రమును విని నాచే ఉపాసింపబడు పరబ్రహ్మమును సాక్షాత్కారము చేసి కొనుటకు కావలసిన ఆరోగ్యాదులను అనుగ్రహింపుమని భావము.]

మంత్రము, ప్ర స మిత్ర! మర్తో అస్తు ప్రయస్వాన్, యస్త ఆదిత్య! శిక్షతి వ్రతేన. న హన్యతే న జీయతే, త్వోతో, నైనమగ్ం హో అశ్నోత్యంతితో న దూరాత్ ॥

హేమిత్ర! ఆదిత్య! ఓ సూర్యదేవా! యః = ఏయుపాసకుడు, తే = నీయొక్క, వ్రతేన = ఉపస్థానరూపమగు కర్మను, శిక్షతి = అభ్యసింపుచున్నాడో, ప్రతిదినము చేయుచున్నాడో, సః మర్తః = ఆ మనుజుడు (ఉపాసకుడు) ప్రయస్వాన్ = అధికమైన యన్నమును పొందువాడు, ప్ర+అస్తు = బాగుగా, తప్పక యగుగాక!-[సూర్యుడు కర్మఫలదాత] త్వోతః = ఇట్లు నీచేత రక్షింపబడిన యుపాసకుడు, న హన్యతే = ఎవ్వరిచేతను పీడింపబడడు, న జీయతే = రోగములచే గాని శత్రువులచే గాని జయింపబడడు. [సూర్యుడు సర్వరోగ శత్రునాశకుడు.] ఏనం = ఇట్టియుపాసకుని అంతితః = దగ్గరగా నున్న సంచితపాపముగాని దూరాత్ = దూరముగా నున్న ఆగామియైన, అంహః = పాపము గాని. న అశ్నోతి = ఎంతమాత్రము దరికి చేరదు. [సూర్యుడు సర్వపాపనాశకుడు.]

తాత్పరము. ఓ సూర్యభగవానుడా! నీవు వర్షములద్వారా పంటలను పండించి, ప్రజలను పోషించుచున్నావు. కావుననే ప్రపంచ

మున కంతకును మిత్రుడవైతివి. సకలజగత్తును ప్రకాశింప జేయుచున్నావు. ఇట్టి నీకీర్తి యందరిచేతను బాగుగ సేవింపవగినది. నీకీర్తి సత్యమైనది, మిక్కిలి ఆశ్చర్యకరమైనదియును. ఏవిధముగ ననగా–
1. నీవు జగన్మిత్రుడవు, 2. మహాకీర్తిమంతుడవు, 3. సర్వాంతర్యామివి, 4, సర్వజ్ఞుడవు, 5. సర్వప్రవర్తకుడవు, 6. సర్వాధ్యాపకుడవు, 7. సర్వకర్మసాక్షివి, 8. కర్మఫలదాతవు, 9. సర్వరోగశత్రునాశకుడవు, 10. సర్వపాపనాశకుడవు.

ఈ విధముగ అనితరసాధారణగుణములు కలవాడవు. ఈ గుణములన్నియును ఆయా సందర్భములందు వివరింపబడినవి. మిత్రుడవగు నీవు క్రింది యేడు లోకములను పై యేడు లోకములను నీ యాకర్షణశక్తిచేత ధరించుచున్నావు. సత్యస్వరూపుడవగు నీకు ప్రతి ఉదయాస్తమయానంతరమునందునను నేతితో గూడిన హవిస్సును హోమము చేయుదుము. సంధ్యోపాసనమున ఇతరాంగములతో బాటు నీ యుపస్థానమును శ్రద్ధతో ప్రతిదినము చేయు నుపాసకులకు అధికమగు అన్నమును అనుగ్రహింపుచు. (ధర్మరాజు సూర్యోపాసన జేసి అన్నముకొఱకు అక్షయపాత్రను సూర్యునివలననే కదా! పొందెను.) ఇట్లు నీచేత రక్షింపబడిన యుపాసకుడు రోగాదులచే గాని శత్రువులచే గాని జయింపబడడు. ఇంతియే గాదు. వానిని సంచితపాపము గాని ఆగామిపాపము గాని అంటదు. అని భావము.

## మాధ్యాహ్నికోపస్థానమంత్రార్థము

మంత్రము. ఆ సత్యేన రజసా వర్తమానో నివేశయన్నమృతం మర్త్యం చ, హిరణ్యయేన సవితా రథేనా దేవో యాతి భువనా విపశ్యన్ ॥

సవితా = సూర్యభగవానుడు, రజసా = రజోగుణముతో కూడిన, ఇది క్రింది అర్థమునకు సూచకము. సత్వరజస్తమోగుణాత్మకమగు మాయను ఉపాధిగా కలిగినట్టియు, సత్యేన = త్రికాలము

లందును ఉన్నట్టి పరబ్రహ్మముచేత, వర్తమానః = ప్రేరేపింపబడిన వాడై, మర్త్యం = మానవులను, అమృతం = దేవతలనున్నూ, చ = ఇతర ప్రాణులనున్నూ, నివేశయన్ = ప్రాతరుపస్థానమంత్రమున చెప్పి నట్లు, వారి వారి పనులందు ప్రవర్తింపజేయుచు, హిరణ్యయేన = బంగారుమయమైన రమణీయమైన, రథేన = రథముతో, దేవః = ప్రకాశించుచున్నవాడై, భువనా = లోకములను, విపశ్యన్ = విశేష దృష్టితో చూచుచు, తెలిసికొనుచున్నవాడై, ఆయాతి = వచ్చు చున్నాడు.

తాత్పర్యము. సత్వగుణము, రజోగుణము, తమోగుణము అను మూడుగుణములతో నిండిన మాయను ఉపాధిగా గలిగినట్టియు, త్రికాలములందున్నట్టి పరబ్రహ్మముచేత, అంతర్యామిగానుండి లోక సంరక్షణకొరకు ప్రవర్తింపచేయబడినవాడై, సూర్యభగవానుడు తన కిరణములచేత చీకట్లను పోగొట్టి, పగటిని కలిగించి, మానవు లను అగ్నిహోత్రాదికర్మలందును, దేవతలను హవిస్సును భక్షిం చుట, మానవుల కుపకారము చేయుట మొదలగు పనులందును, ఇతర ప్రాణులను వారివారి యాకలిదప్పులను పోగొట్టుకొను పను లందును ప్రవర్తింపజేయుచు, రమణీయమగు బంగారురథమున మిక్కిలి ప్రకాశించువాడై లోకములను ప్రత్యేకమైన విశేష దృష్టితో జూచుచు, పైకి యుదయించుచున్నాడు. శ్రుతియు నిట్లే చెప్పుచున్నది. "భీషాఽస్మాద్వాతః పవతే, భీషోదేతి సూర్యః॥అని. ఆ పరమాత్మనుండి భయపడి గాలి వీచుచున్నది. సూర్యుడును భయ పడియే యుదయించుచున్నాడు. అని.

మంత్రము. "ఉద్వయం తమసస్పరి।పశ్యంతో జ్యోతిరుత్తరం। దేవం దేవత్రా సూర్యమగన్మ జ్యోతిరుత్తమమ్॥

దేవత్రా = దేవతలలో, ఉత్తమం = ఉత్తమమైనట్టియు, దేవం = కాంతిమంతమైనట్టియు, జ్యోతిఃస్వరూపమైన, సూర్యం = సర్వప్రేరకుడవగు నో సూర్యభగవానుడా! నిన్ను, వయం = మేము,

తమసః = చీకటికి, అజ్ఞానమునకు, పరి = విరోధియైనట్టియు, ఉత్తరం = నిరతిశయమైన, జ్యోతిః = జ్యోతిఃస్వరూపమైన పరబ్రహ్మను, ఉత్పశ్యంతః = సాక్షాత్కారము చేయ గోరుచున్నవారమై, అగన్మ = శరణు పొందితిమి. ఆశ్రయించితిమి.

తాత్పర్యము. దేవతలలో నుత్తముడవైనట్టియు, ప్రకాశవంతమైనట్టియు, జ్యోతిఃస్వరూపమైనట్టియు, సర్వప్రేరకుడవైన నిన్ను, మేము, అజ్ఞానమునకు విరోధి యైనట్టియు, నిరతిశయమైన, జ్యోతీరూపపరబ్రహ్మమును సాక్షాత్కరింప గోరుచున్నవారమై ఆశ్రయించితిమి. కాన నిన్ను ప్రవర్తింపజేయు ఆ బ్రహ్మమును సాక్షాత్కరింపజేయుము.

ఇచ్చట చెప్పబడిన సూర్యవిశేషణములచేత, సూర్యుడు పరబ్రహ్మకు సమానుడుగా నున్నాడు. కావుననే, దేవతలలో నుత్తముడయ్యెను. పరబ్రహ్మసాక్షాత్కారము కోరువారిచే నాశ్రయింపదగినవాడయ్యెను. సూర్యుడే సంధ్యోపాసనాదిసకలోపాసనలకును నాధారమైనవాడు.

ఉదాహరణము. "భానుమండలమధ్యస్థా" అని శ్రీలలితాంబికకు ఒక నామరాజము గలదు. శ్రీలలితాదేవిని సూర్యమండలముమధ్య యందు ధ్యానింతురు.

మంత్రము. ఉదుత్యం జాతవేదసం దేవం వహంతి కేతవః। దృశే విశ్వాయ సూర్యం, చిత్రం దేవానాముదగాదనీకం, చక్షుర్మిత్రస్య వరుణస్యాగ్నేః॥

ఉదుత్యం = అను చోటున, ఉద్ + ఉ+త్యం = అని పదచ్ఛేదము. అందు 'ఉ' అనునది సంబోధనార్థకము. కాగా = ఉ! = ఓ సూర్యభగవానుడా!, సూర్యం = సర్వప్రేరకుడవగు, త్యం = నిన్నును, జాతవేదసం = అగ్నిని, దేవం (ఇచ్చట షష్ఠ్యర్థమున ద్వితీయ) స్వయంప్రకాశరూపమైన ఆ పరబ్రహ్మ తేజస్సుయొక్క, కేతవః =

కిరణములు, విశ్వాయ = అందరియొక్క, దృశే = దర్శనశక్తికొఱకు, ఉద్ + వహంతి = ధరించుచున్నవి. అనగా — మిమ్ములనిద్దరిని, లోకమును ప్రకాశింపజేయ సమర్థులనుగా చేయుచున్నవి. దేవానాం = ఇంద్రాది దేవతలమధ్య, (నీవే), అనీకం = చీకట్ల సమూహమును, (నుదన్ = పోగొట్టుచు, అని చేర్చుకొనవలెను). చిత్రం = ఆశ్చర్యముగా, ఉదగాత్ = ఉదయించుచున్నావు. మిత్రస్య = లోకమిత్రుడవైన నీకున్ను, వరుణస్య = వరుణదేవునకున్నూ, అగ్నేః = అగ్నిదేవునకున్ను, చక్షుః = నేత్రమైన. (ఆ బ్రహ్మతేజస్సును నాకు సాక్షాత్కారము చేయించుమని భావము.)

తాత్పర్యము. ఓ సూర్యభగవానుడా! స్వయంప్రకాశమైన ఆ బ్రహ్మతేజస్సుయొక్క కిరణములు నిన్నును అగ్నిని లోకమును ప్రకాశింపచేయ సమర్థులనుగా చేయుచున్నవి. "తస్య భాసా సర్వమిదం విభాతి" ఆ పరబ్రహ్మయొక్క ప్రకాశము (కిరణముల) చేతనే ఇదంతయు (సూర్యచంద్రాగ్న్యాదులు) ప్రకాశించుచున్నవి" అని కదా! శ్రుతి చెప్పుచున్నది. ఇంద్రాదిదేవతలలో నీవొక్కడవే చీకట్ల సమూహమును పోగొట్టుచు ఆశ్చర్యముగా నుదయించుచున్నావు. నీకును, వరుణదేవునకును, అగ్నిదేవునకును కన్ను వలెనున్న ఆ బ్రహ్మతేజస్సును నాకు సాక్షాత్కరింపజేయుము.

మంత్రము. ఆ ప్రా ద్యావాపృథివీ అంతరిక్షగ్ం సూర్య ఆత్మా జగతస్తస్థుషశ్చ। తచ్చక్షుర్దేవహితం పురస్తాచ్ఛుక్రముచ్చరత్ ॥

"తచ్చక్షుః" అనుచోట "తత్" శబ్దముండుటచేత, 'యత్' శబ్దమును తృతీయావిభక్తితో తెచ్చిపెట్టుకోవలెను. కాగా— సూర్య! = ఓ సూర్యభగవానుడా! నీవు, యేన = అంతర్యామియగు ఏ బ్రహ్మజ్యోతితో కూడినవాడవై, జగతః = జంగమరూపమైనట్టియు, తస్థుషశ్చ = స్థావరరూపమగు ఈ ప్రపంచమునకు, ఆత్మా = ఆత్మవయి, ద్యావాపృథివీ + అంతరిక్షం = భూమ్యాకాశములను వాని మధ్యప్రదేశమును, ఆప్రాః = వ్యాపించియున్నావో, శుక్రం = నిర్మల

మైనట్టియు, చక్షుః = నేత్రములకు గ్రహణశక్తి నిచ్చునట్టియు, దేవం = స్వప్రకాశమైనట్టియు, హితం = హితమైన, తత్ = ఆబ్రహ్మ తేజస్సు, పురస్తాత్ = నాముందు, ఉచ్చరత్ = సాక్షాత్కరించుచు గాక !

తాత్పర్యము. ఓ సూర్యభగవానుడా! నీవు అంతర్యామి యగు ఏ పరబ్రహ్మజ్యోతితో కూడుకొన్నవాడవై జంగమస్థావ రాత్మకమగు ఈ ప్రపంచమునకు ఆత్మవగుచు, భూమ్యాకాశము లను, వానిమధ్య ప్రదేశమును వ్యాపించియున్నావో, నిర్మలమై నట్టియు (మాయాసంబంధములేని యని అర్థము) నేత్రమునకు దర్శన శక్తి నిచ్చునట్టియు ("శ్రోత్రస్య శ్రోత్రం, చక్షుషశ్చక్షుః" కంటికి కన్ను యైనది, చెవికి చెవి యైనది" అనగా — రెంటికిని గ్రహణశక్తి నిచ్చునది పరబ్రహ్మము అని, భావము) స్వప్రకాశమై లోకహితకరమైన ఆ యాత్మతేజస్సు నాకు సాక్షాత్కరించునట్లు చేయుము.

ఇచ్చట నొక విశేషము:—

మాయాసంబంధము లేని శుద్ధనిష్పత్పరబ్రహ్మచైతన్యమే సూర్యునియందు అంతర్యామియై యున్నది. సూర్యునియందున్న ఆ బ్రహ్మచైతన్యమే స్థావరజంగమము లన్నింటియందున్న ఆత్మ. అట్టి అస్మదాదులయందున్న ఆత్మయును. ఆ నిర్గుణపరబ్రహ్మమే, సూర్యునియందు సగుణమై సంధ్యాదేవత అను పేరుతో నొప్పారుచు, అస్మదాదులయందు ప్రత్యగాత్మ అను పేరుతో నున్నది. ఇదియే సంధ్యోపాసనము. సంధ్యోపాసనమే సూర్యోపస్థానముగ ప్రసిద్ధమై యున్నది. ఇది రహస్యార్థము. ఈ రహస్యము నెరిగి అనుసంధానము నకు తెచ్చుకొన్నవాడు జీవన్ముక్తుడు. సందియము లేదు. దీనినే శ్రీభట్టభాస్కరులు విశదీకరించిరి.

ఈ తాత్పర్యమున చివరి వాక్యము "ఆ యాత్మతేజస్సును నీయందంతర్యామియై యున్న దానిని, నాకు సాక్షాత్కరించునట్లు

చేయుము'' అనునది కదా! సూర్యుని యందంతర్యామిగ నున్న ఆ బ్రహ్మతేజస్సు అనగా చైతన్యమే సంధ్యాదేవత. ఆ దేవత నాకు సాక్షాత్కరించునట్లు చేయుము'' అని ప్రార్థించుచున్నాడు. అనగా సంధ్యోపాసనకు ఆధారభూతమైన సూర్యుని, సంధ్యాదేవత సాక్షాత్కారము, అనగా సంధ్యోపాసనలో- ''సాఽహమస్మి'' యనుచు చేయుచున్న యుపాసనము ఫలించి జీవబ్రహ్మైక్యము, కలుగునట్లు అనుగ్రహించుమని ప్రార్థించుచున్నాడు.

మంత్రము. ''పశ్యేమ శరదశ్శతం, జీవేమ శరదశ్శతం, నందామ శరదశ్శతం, మోదామ శరదశ్శతం. భవామ శరదశ్శతగ్ం శృణవామ శరదశ్శతం, ప్రబ్రవామ శరదశ్శతమజీతాస్స్యామ శరదశ్శతం. జ్యోక్చ సూర్యం దృశే॥

శతం=అపరిమితమగు, (ఇచ్చట శతశబ్దమునకు ''నూరు''అని గాక అపరిమితము అని యర్థము) శరదః=సంవత్సరములు, పశ్యేమ= ఆ సాక్షాత్కరించిన తేజస్సును చూచెదము గాక! శతం శరదః= అపరిమితమగు సంవత్సరములు, జీవేమ=ఆ తేజస్సును చూచుచు జీవించెదము గాక! శతం శరదః నందామ=అపరిమితమగు సంవత్సరములు ఆ బ్రహ్మానందముతో జీవించియుందుము గాక! శతం శరదః మోదామ=అధిక ఆదరముచేత నదియే యర్థము మరియొక పదముచేత మరల చెప్పబడెను. (మంత్రార్థచంద్రోదయవ్యాఖ్య యను గ్రంథమున నిట్లువ్రాయబడినది. ''అత్ర పునరుక్తిః ఆదరాతిశయ ద్యోతనాయ'' ఇచ్చట పునరుక్తి అత్యధిక-ఆదరము తెలియుటకొఱకు చేయబడినదని. వేదార్థమును వ్రాసిన శ్రీయాస్కమునివర్యు లిట్లు వ్రాసిరి. ''అభ్యాసే భూయాంసమర్థం మన్యన్తే'' ఇతి, అని. పునరుక్తియందు చాల యధికార్థముండునని తలంతురు, అని. ఈపునరుక్తి, శబ్దపునరుక్తి యని, అర్థపునరుక్తి'' యని రెండువిధములు. ఇచ్చట అర్థపునరుక్తి చేయబడినది. ఇచ్చట చాల అర్థము కలదు. గ్రంథవిస్తరభీతిచే వ్రాయలేదు. శతం శరదః భవామ=అపరిమితమగు

సంవత్సరములు స్వస్వరూపమున ప్రతిష్ఠితులమై విశ్రాంతిధామమున నుందుముగాక! [అనగ, జీవబ్రహ్మైక్యమునుపొంది, విదేహకైవల్యము కలుగునంతవరకు, బ్రహ్మానందమునను భవింతుము గాక!] శతం శరదః శృణవామ = అపరిమితసంవత్సరములు "ఈయన బ్రహ్మవేత్త". యను మాటను వినెదము గాక! శతం శరదః ప్రబ్రవామ= అపరిమితసంవత్సరములు, దగ్గరకువచ్చిన శిష్యులకు బ్రహ్మతత్త్వము నుపదేశింతుము గాక; శతం శరదః అజీతాః స్యామ=అపరిమితి సంవత్సరములు వెలుపలి శత్రువులచేతను గాని లోపలి శత్రువుల చేతను గాని జయింపబడని వారమయ్యెదము గాక! జ్యోక్చ=చిర కాలము, సూర్యం=జగత్ప్రేరకుడవగు నిన్ను, దృశే=కృతజ్ఞతా బుద్ధితో చూచెదము గాక!

తాత్పర్యము. పూర్వమంత్రముయొక్క చివర కోరిన ప్రకారము సాక్షాత్కరించిన యా బ్రహ్మతేజస్సును (చైతన్యమును) చూచుచు, అపరిమితమగు సంవత్సరములు జీవించెదము గాక. అట్లే యానందామోదములతో స్వస్వరూపమున ప్రతిష్ఠితులమై "యీయన బ్రహ్మవేత్త" యను మాటలను వినుచు, దగ్గరకు వచ్చిన యుత్తమ శిష్యులకు బ్రహ్మతత్త్వము నుపదేశించుచు, బాహ్యాభ్యంతరశత్రువులచేత జయింపబడని వారమై యుపకారి వైన నిన్ను కృతజ్ఞతా బుద్ధితో చిరకాలము చూచెదము గాక!

ఇచ్చట నొక శంక. బ్రహ్మసాక్షాత్కారమైన తర్వాతను గూడ, ఇంకనూ జీవించవలెను. "ఈయన బ్రహ్మవేత్త" యను మాటలను విని యానందించవలెను. బాహ్యాభ్యంతరశత్రువులు పీడింపకుండ నుండవలెను. "ఈ మొదలగు కోరిక లుండునా? అట్లతడు నడచుకొనునా? ఇది యసంగతముగా నున్నది కదా! యని.

సమాధానము. ఈ యుపాసకుడు ప్రస్తుతమున పామరత్వమును పూర్తిగ వదలలేదు. కనుక ఈ ద్వైతప్రపంచమున నున్నప్పు

డాతని కిట్టి కోరిక లున్నవి. కాని నిజముగ అద్వైతి యైన. తర్వాత నిట్లుండ మనినను ఉండడు. అని.

మంత్రము. య ఉదగాన్మహతోఽర్ణ వాద్విభ్రాజమానస్సరి రస్య మధ్యాత్ । స మా వృషభో లోహితాక్షః, సూర్యో విపశ్చి న్మనసా పునాతు.

వృషభః=వర్ష ప్రదాత యైనట్టియు, విపశ్చిత్ =సర్వజ్ఞుడై నట్టి. యః సూర్యః=ఏ సూర్యుడు, లోహితాక్షః=ఎఱ్ఱని కిరణములు కల వాడై, విభ్రాజమానః=మిక్కిలి ప్రకాశించుచున్న వాడై, ఉదగాత్ = ఉదయించెనో, సః=ఆ సూర్యుడు, మహతః=అపారమైనట్టియు, అర్ణ వాత్ =సముద్రము వలె దాట శక్యముకాని, సరిరస్య=సలిలస్య= ఇచ్చట సలిల మనగా-నీరు. పంచభూతములలో నొకటి. "అప ఏవ ససర్జాదౌ" బ్రహ్మ ముందుగా జలములనే సృష్టించెను. అను దాని ననుసరించి, సలిలమునకు ప్రాధాన్యము. పంచభూతములు తొలుత అపంచీకృతములుగా పుట్టి, తర్వాత పంచీకృతములయ్యెను. ఇచ్చటి సలిలశబ్దము అట్టి అపంచీకృతపంచభూతములకు కారణమగుమాయను చెప్పెను. కాగా - సరిరస్య=మాయయొక్క, మధ్యాత్ =నడుమ నుండి, మా=నన్ను (ఉద్ధరించి), మనసా=అత్యాదరముతో, పునాతు= శుద్ధునిగా జేయు గాక. ఉపాసింపబడుచున్న సంధ్యాబ్రహ్మయొక్క- సాక్షాత్కారమునకు యోగ్యునిగా జేయుగాక!

తాత్పర్యము. వర్షప్రదాతయు, సర్వజ్ఞుడు నగు ఏ సూర్యుడు ఎఱ్ఱని కిరణములతో మిక్కిలి ప్రకాశించుచు ఉదయించునో, ఆ సూర్యుడు అపారమగు సముద్రమువలె దాటశక్యము కాని మాయ యొక్క- మధ్యనుండి యుద్ధరించి, నన్నాదరముతో శుద్ధునిగా జేసి, నాచే నుపాసింపబడుచున్న బ్రహ్మయొక్క- సాక్షాత్కారమును పొందుటకు యోగ్యునిగా జేయు గాక యని భావము.

## సాయంకాలసూర్యోపస్థానమంత్రార్థము

మంత్రము. ఇమం మే వరుణ శ్రుధీ హవమద్యా చ మృడయ। త్వామవస్యురాచకే॥

హేవరుణ!=ఓ వరుణదేవా! మే=నాయొక్క. ఇమం=ఈ హవం=పిలుపును, ప్రార్థనను, ఉపస్థానమును, శ్రుధీ=వినుము. ఆ ప్రార్థన ఏమనగా— అద్య=ఇప్పుడు. (ఈ యుపస్థానమైన పిమ్మట), మృడయ=నన్ను సుఖపెట్టుము. (అనగా— ఉపాసనాఫలప్రాప్తికి విఘ్నము చేయకుమని భావము.) అవస్యుః=రక్షణను కోరుచున్న వాడనై, త్వాం=నిన్ను, ఆచకే=కోరుచున్నాను.

మంత్రము. "తత్త్వా యామి బ్రహ్మణా వందమానః। తదా శాస్తే యజమానో హవిర్భిః। అహేడమానో వరుణేహ బోధ్యురు శగ్ంస మా న ఆయుః ప్రమోషీః॥

యజమానః=యాగము చేయువాడు, హవిర్భిః = నేయి మొదలగు హవిస్సులచేత, యత్=ఏ బ్రహ్మమును (పొందుటకు) ఆశాస్తే= కోరునో, తత్=ఆ బ్రహ్మమును (సాక్షాత్కరించుటకు), త్వా=నిన్ను, బ్రహ్మణా = వేదమంత్రములచేత, వందమానః = నమస్కరించుచు, స్తుతించుచు, తత్ = అట్టిరక్షకునిగా, యామి=నిన్ను వేడు చున్నాను. హే వరుణ! ఓ వరుణదేవా! అహేడమానః = నన్ను అనాదరించకుండ, ఇహ=ఇప్పుడు, బోధ=నన్ను తెలిసికొనుము. అనగా—జ్ఞానార్థినిగా తెలిసికొనుము. ఉరుశంస = మంత్రములచే నధికముగా స్తుతింపదగినవాడా!, నః = మాయొక్క, ఆయుః=ఆయుస్సును, మా ప్రమోషీః=లోపింప జేయకుము. (నాకు బ్రహ్మజ్ఞానము కలుగువరకును నా యాయుస్సును తగ్గకుండ చేయుమని భావము.)

మంత్రము. యచ్చిద్ధి తే విశో యథా ప్ర దేవ వరుణ వ్రతం, మినీమసి ద్యవి ద్యవి॥

హే దేవ! వరుణ! ఓ వరుణదేవా!, తే = నీయొక్క, యత్ చిత్ =(కించిత్ వలె) ఏ, వ్రతం హి = ఉపస్థానరూపమగు వ్రతము

కలదో, తత్ = దానిని, ద్యవి ద్యవి = ప్రతిదినమునందును, విశః యథా = వణిజులు తమ వ్యాపారమును వలె, ప్రమినీమసి = మిక్కిలి యాదరముతో చేయుచున్నాను.

మంత్రము. "యత్కించేదం వరుణ దైవ్యే జనేఽభిద్రోహం మనుష్యాశ్చరామసి, అచిత్తీ యత్తవ ధర్మా యుయోపిమ, మా నస్తస్మాదేనసో దేవ రీరిషః॥

హే వరుణ! ఓ వరుణదేవా!, దైవ్యే = దేవభక్తుడగు అనగా-ఉపాసకుడగు, జనే జనునివిషయమున, యత్కించిదిదం = ఏ స్వల్పమైనది కాని, అపరాధమును, మనుష్యాః = పామరజనుల మగు మేము, చరామసి = చేయుదుమో, అచిత్తీ = అజ్ఞానముచేత, తవ = నీయొక్క, ధర్మా = ఇతరులుచేయు ఉపస్థానాదిధర్మకర్మను, యుయోపిమ = కలహాదులచే కాల మతిక్రమింప జేసి, నాశము చేయుదుమో, హే దేవ! = ఓ వరుణదేవా!, తస్మాత్ ఏనసః = ఆ పాపమునుండి, నః = మమ్ములను, మారీరిషః = హింసించకము. (తెలివితక్కువతనము (అజ్ఞానము)వలన గదా! మేము అట్లు చేయుట.)

మంత్రము. "కితవాసో యద్రిరిపుర్న దీవి, యద్వాఘా సత్యముత యన్న విద్మ।సర్వా తా విష్య శిథిరేవ దేవాఽథా తే స్యామ వరుణ ప్రియాసః॥

కితవాసః = స్వార్థపరులైన ధూర్తులమై, దీవి = దివి = బాగుగా వ్యవహరించుటయందు, న = చేతకానివారమై, యత్ = ఏ కర్మాంగమును. రిరిపుః = నాశము చేసితిమో, ఉత+యద్వా = లేక, యత్ = మరేదయిన, అఘా = అఘం = పాపమును, సత్యం = నిజముగా, న విద్మ = తెలిసికొనకున్నామో, అన్యాయత్తచిత్తులమై మరచితిమో, తాః + సర్వాః = ఆ పాపములనన్నింటిని, హే దేవ = ఓ వరుణదేవా!, శిథిరా ఇవ = శిథిలమైన వాటినిగా, విష్య = నాశము చేయుము. అథా = అథ = ఆ పాపములను పోగొట్టిన తర్వాత, హే వరుణ! = ఓ వరుణదేవా!, తే = నీకు, ప్రియాసః = ప్రియమైనవారము, స్యామ = అయ్యెదము.

తాత్పర్యము. (1) ఓ వరుణదేవా! నేనిప్పుడు చేయు ఉప స్థానరూపమగు ఈ నా ప్రార్థనను వినుము. ఈ యుపస్థాన మైనస పిమ్మట నన్ను సుఖపెట్టుము. రక్షణను కోరుచున్నవాడనై నిన్ను ప్రార్థించుచున్నాను.

(2) యాగము చేయునతడు నేయి మొదలగు హవిస్సులచేత ఏ బ్రహ్మమును పొందగోరునో, ఆ బ్రహ్మమును నీయనుగ్రహముచే సాక్షాత్కరించుటకు, వేదమంత్రములచే నిన్ను స్తుతించుచున్నాను. అట్టి రక్షకునిగా నిన్నాశ్రయించుచున్నాను. ఓ వరుణదేవా! నన్ను అనాదరించకుండ ఇప్పుడు జ్ఞానార్థినిగా నన్ను తెలిసికొనుము. నాకు బ్రహ్మజ్ఞానము కలుగువరకును నా యాయువును తగ్గించకుండ పెంచుము. ఏలననగా– "ఇహ చేదవేదీదథ సత్యమస్తి। న చేది హావేదీన్మహతీ వినష్టిః॥" ఈ జన్మలోనే బ్రహ్మను తెలిసికొనగలిగిన యెడల నాతడు ధన్యుడగుచున్నాడు. లేక ఈ జన్మలో బ్రహ్మను తెలిసికొనని యెడల వాని జన్మము వ్యర్థమగుటయే కాక, గొప్ప నష్టము కూడ కలుగును. ఎట్లన—ఈ ద్విజజన్మము నెత్తుటకు ఎంత పూర్వపుణ్యము ఖర్చయ్యెనో, ఆ పుణ్యమంతయు నష్టమై పోవును గదా! అని ఉపనిషత్తు చెప్పుచున్నది.

(3) వణిజులు (కోమట్లు) వారి సొంత వ్యాపారమును ఎట్లు ఆలస్యము (సోమరితనము) లేకుండ మిక్కిలి శ్రద్ధతో చేసి కొందురో, అట్లే నేను ఈ యుపస్థానమనెడు వ్రతమును ప్రతిదినమును మిక్కిలి శ్రద్ధతో చేయుచున్నాను. నీ స్తుతికంటె నాకు వేరు ముఖ్యకార్యము లేదని భావము.

(4) నీ యుపాసకునకు, పామరుడ నగు నేను చేయు నప రాధములవలనను, లేక ఇతరులు చేయు నీయుపస్థానమును అజ్ఞానము చేత కలహాదులతో కాలము నతిక్రమింపజేసి చెడగొట్టుటవలనను, కలుగు పాపముచేత మమ్ము హింసింపకుము. ఏలనన—అట్లు చేయుటకు మా యజ్ఞానము గదా! కారణము.

(5) ఇంకను స్వార్థపరులైన ధూర్తులమై బాగుగా వ్యవహ రించుటకు చేతకాని వారమై, యితరులు చేయు నీ యుపస్థానమును చెడగొట్టుటవలన కలిగిన పాపమును కాని, లేక నాకు తెలియని పాపము లెవ్వియైన నున్నను, అవి పెద్దవియైనను, చిన్నవిగా తలచి వానిని నాశము చేయుము. ఆ పాపములను నాశము చేసిన తర్వాత, నిష్పాపుల మగు మేము నీకు ప్రియమైన వారమగుదుము.

## పై యుపస్థానమంత్రములందలి కొన్ని ముఖ్యవిశేషములు

(1) ప్రాతరుపస్థానమంత్రమున సూర్యునకు వాడిన పదము లన్నియును "మిత్ర" పదములే. సూర్యుడు సకల–చరాచర–దేవ–మనుష్య–తిర్యగాది–ప్రాణిజాతమునకు మిత్రుడే గదా! ప్రాతరుపస్థాన మంత్రమున వర్ణింపబడిన సూర్యుని కార్యము లన్నియును సర్వ జగత్ప్రాణిమిత్రభావమునే చాటుచున్నవి. సమస్తప్రాణులందలి మిత్రభావముచే సూర్యునకు గలిగిన యశస్సును వేయి ముఖముల వానికి గూడ వర్ణింప నలవి కాదు గదా! తన కిరణప్రసారములచే తనే ప్రాణుల సమస్తరోగముల పోగొట్టి, పాపములను నాశము చేసి బ్రహ్మజ్ఞానమును పొందుటకు ఉపాసకులను దీర్ఘాయుష్మంతులను జేయుచున్నాడు. కావుననే వేదమే సూర్యునకు "మిత్ర" బిరుదము నిచ్చి, యీ పదముచే వ్యవహరించినది. ప్రొద్దున మేలుకొనగనే మిత్రసందర్శనము గదా! కోరదగినది.

(2) మాధ్యాహ్నికోపస్థానమంత్రమున అధికముగ ముఖ్య ముగ "సూర్య" పదము వాడబడినది.

"సువతి ప్రేరయతి ప్రాణినః స్వస్వవ్యాపారేష్వితి సూర్యః"

ప్రాణులను తమ తమ పనులందు ప్రేరేపించువాడు సూర్యుడు. ఉదా: ఓహో! సూర్యోదయ మైపోయినదే! నేనింకను పక్కలో [illegible] కొనకుండ, మాటలాడుచునేయుంటినే [illegible], 'అయ్యో! జాము ప్రొద్దెక్కి–పోయినది. [illegible]

నని'' యొక రైతు, ''అప్పుడే ప్రొద్దు వ్రాలిపోయెను. పురాణము చెప్పు టకు బోవలెను'' అని యొకడు. ''గడియ ప్రొద్దుకంటె ఎక్కువ లేదు. సాయంసంధ్యను వార్చవలెను'' అని యొకసంధ్యోపాసకుడు. ఇట్లి దరిని సూర్యుడు ప్రేరేపించుచున్నాడు. ప్రభాతమున మేలుకొని, నిత్యకృత్యములను తీర్చుకొనని ప్రాణుల సోమరితనమును పోగొట్టి వారి వారి పనులందు ఉత్సాహముతో ప్రేరేపించువాడు సూర్యుడే గదా! ''సూర్య ఆత్మా జగతస్తస్థుషశ్చ'' జంగమస్థావరములు కన్నింటికిని సూర్యుడే యాత్మ యని వేదము చెప్పుచున్నది. కావున సూర్యుడు ప్రాణులను ప్రేరేపించుట సహజము. ''నివేశయన్న మృతం మర్త్యం చ'' దేవతలను మానవులను వారి వారి పనులందు ప్రేరేపించుచున్నాడు'' అను మంత్రవాక్య మీయర్థమునే స్పష్ట పరచుచున్నది.

(3) ''వృణోతి వరానముపాసక ఇతి'' ''వరుణః'' ఉపాసకునిచేత వరములు కోరబడువాడు వరుణుడు. ఇట్టి ''వరుణ'' పదము సాయముపస్థానమంత్రమున పూర్తిగ వాడబడినది. ఏల ననగా—మనుజులు పగటివేళ తమ తమ పనులయందు తెలిసియో. తెలియకయో వివిధములగు పాపములను చేయుదురు. ఆ పాపము లను పోగొట్టుకొనవలయును. కాని ఉపాసకుడు తాను యీనాడు కావు నట్టియు, తను జేయనగునట్టి వివిధపాపములను వివరించి, ''ఆయా పాపములను పోగొట్టి తనను ప్రీతిపాత్రునిగా చేసికొమ్మని వరుణుని పలు వరములను గోరుచున్నాడు. ఈ వరముల నన్నింటిని ఉపస్థాన మంత్రార్థమున స్పష్టముగ తెలిసికొనవచ్చును. ఒకానొక గ్రంథ మందు ''సాయంకాలమున సూర్యునకు వరుణపదము వాడబడును'' అని చెప్పబడుచున్నది. ఋగ్వేదీయులు దీనిని వరుణదేవతాక మంత్రమని చెప్పుదురు. బాలంభట్టీయమున ఈ వరుణ దేవతా కమంత్రములకు సూర్యోపస్థానమున వినియోగమని వ్రాయబడినది.

(4) ఇంకొక విశేషము. మూడుపస్థానమంత్రములును గంభీ

రార్థప్రతిపాదక ములై ఉపాసకుని భక్తిశ్రద్ధలకు తావలములై మిక్కిలి మిన్నగానున్నవి. కాని ఈ మూడింటిలో మాధ్యాహ్నికోపస్థాన మంత్రము కిరీటముపై నున్న నలుదిక్కుల కాంతులీను వజ్రమణివలె, కాదుకాదు నభోమణి వలెనే విరాజిల్లుచున్నది. ఆహా! ఎన్ని సారులు పఠించినను, ఇంకను పఠింపవలె ననియే తోచెడిని. ఉపస్థానమంత్ర రాజమని నామనసునకు గోచుచున్నది. లోకో భిన్నరుచిః ఖలు.

(5) సూర్యభగవానుడు తొలుత మిత్రుడుగ దర్శనమొసగి తర్వాత, ప్రాణులను వారి వారి పనులందు ప్రోత్సాహపరిచి, చివర వారి తప్పులను మన్నించి పాపములను పోగొట్టి, తనకు ప్రీతి పాత్రులనుగ చేయుచున్నాడు. కావున సూర్యోపస్థానములవశ్యా చరణీయములు.

(6) భూమి సౌరకుటుంబములోనిది. అనగా సూర్యమండలము నుండి విడివడి చల్లారిన యొక ముద్ద. అని ఆధునిక వైజ్ఞానికు లను చున్నారు. సూర్యమండలము సూర్యభగవానునియొక్క స్థూల శరీరము. భూలోకవాసుల స్థూలశరీరములన్నియును పార్థివములే. భౌమములే. కాన ఈ స్థూలశరీరములందలి ఆత్మ సూర్యాత్మయే. అనగా రెండును ఒకటియే. కాబట్టియే, ''సూర్య ఆత్మా జగతస్తస్థు షశ్చ'' సకల జంగమ-స్థావరములకును, సూర్యుడే ఆత్మ. అనగా— సకలస్థావరజంగమములయొక్క ఆత్మలును సూర్యుని ఆత్మయున్నూ అన్నియును ఒకటియే. అను ఔపనిషదసిద్ధాంతము, ఆధునికసిద్ధాం తానుసారముగ కూడ సమంజసముగనే యున్నది. కాని ఆధునిక వైజ్ఞానికులు సూర్యమండలములో ఆత్మయున్నట్లు ఇంకనూ తెలిసి కొనలేదు. ఆ తెలిసికొను రోజు దగ్గరలోనే ఉన్నదని ఆశింతము. సంధ్యోపాసనము యొక్క తత్త్వము ఇదియే కదా! సూర్యునిలోని బ్రహ్మచైతన్యము, మనలోని ప్రత్యక్చైతన్యము ఈ రెండు నొక్క టియే అని ధ్యానించుటే కదా! సంధ్యోపాసనము.

7. ఈ యుపస్థానమంత్రములందు మరియొకవిచిత్రమైన విశేషము తెలియుచున్నది. ఏమనగా-ప్రొద్దున చేయు ఉపస్థానమంత్రము నందు వాడబడిన మిత్రపదములు ఐదే ఉన్నవి. అట్లే మధ్యాహ్నసూర్యోపస్థానమంత్రము నందలి సూర్యపదములు గూడ ఐదే యున్నవి. అట్లే సాయముపస్థానమంత్రమునందలి "వరుణ" పదములు కూడ ఐదే యున్నవి. ఇట్లు మూడు ఉపస్థానమంత్రములందును వరుసగా మిత్ర-సూర్య-వరుణ-పదములే కదా సూర్యునకు ముఖ్యముగ వాడబడినవి. వ్యాఖ్యానమునందు ఆ పదములే కదా ముఖ్యముగా వ్యాఖ్యానింపబడినవి. ఇట్లు మూడుపస్థానమంత్రములందును ముఖ్యములగు మూడు పదములును ఐదేసియే యుండుట విచిత్రముగ ఉన్నది కదా! వేదపురుషుడు ఈ మూడు మంత్రములందును ముఖ్యపదములను సమమైన సంఖ్యలో వాడుట వింత గొలుపుచున్నది.

## దిఙ్నమస్కారమంత్రార్థము

మంత్రము. "ఓం నమః ప్రాచ్యై దిశే, యాశ్చ దేవతా ఏతస్యాం ప్రతివసంత్యేతాభ్యశ్చ నమః। ఓం నమో దక్షిణాయై దిశే, యాశ్చ దేవతా ఏతస్యాం ప్రతివసంత్యేతాభ్యశ్చ నమః। ఓం నమః ప్రతీచ్యై దిశే యాశ్చ దేవతా ఏతస్యాం ప్రతివసంత్యేతాభ్యశ్చ నమః। ఓం నమ ఉదీచ్యై దిశే యాశ్చ దేవతా ఏతస్యాం ప్రతివసంత్యేతాభ్యశ్చ నమః। ఓం నమ ఊర్ధ్వాయై దిశే, యాశ్చ దేవతా ఏతస్యాం ప్రతివసంత్యేతాభ్యశ్చ నమః। ఓం నమోఽధరాయై దిశే, యాశ్చ దేవతా ఏతస్యాం ప్రతివసంత్యేతాభ్యశ్చ నమః। ఓంనమోఽవాంతరాయై దిశే, యాశ్చ దేవతా ఏతస్యాం ప్రతివసంత్యేతాభ్యశ్చ నమః.

అర్థము. ప్రాచ్యై దిశే=తూర్పుదిక్కునకు (ఆ దిక్కుయొక్క అధిదేవతకు), నమః=నమస్కారము, ఏతస్యాం=ఈ దిక్కునందు యాశ్చ=ఏ, దేవతాః=దేవతలు, అనగా ఆ దిక్పాలకుడు అతని పరి

వారములును, ప్రతివసంతి=నివసించుచున్నారో, ఏతాభ్యశ్చ=వీరికిని, నమః=నమస్కారము అగుగాక! అని భావము. ఇచ్చట దిక్కుల యొక్క అధిదేవతలకును దిక్పతులకును నమస్కారము చేయబడు చున్నది. దిగధిదేవతలును దిక్పతులును ఉపాసకుని అనుగ్రహించి ఎట్టి విఘ్నములును చేయక బ్రహ్మసాక్షాత్కారమునకు కూడ తోడ్పడుదురని భావము.

ఇట్లే దక్షిణము పడమర ఉత్తరము, పై దిక్కు, క్రింది దిక్కు భూమ్యాకాశముల మధ్యనుండు అవాంతరదిక్కున్నూ. ఈ దిగధి దేవతలకున్నూ ఆ యా దిక్పతులకును ఆ యా దిక్కుల వైపు తిరు గుచు నమస్కారము చేయవలెను. ఈ దిఙ్నమస్కారమంత్రముల భాష యంతయును ఒక్కవిధముగనే ఉండుటచేతను సులభముగ ఉండుటచేతను, అర్థము వ్రాయబడలేదు.

దిగధిదేవతలవలన మనకు ఉపకారము కలుగుటకు అవ కాశము ఉన్నది. అది ఏ రూపమున ఎప్పుడు కలుగునో చెప్పుటకు సాధ్యము కాదు. ఒక పురాణమున ఒక మునీశ్వరుడు తనకు కాబోవు అల్లుని శీలపరీక్షను ఉత్తరదిగధిదేవతచేత చేయించెను. అను కథను నేను చదివితిని. గ్రంథవిస్తరణభీతిచేత వ్రాయలేదు. చక్కని కథ. దిక్పతులందరును బ్రహ్మజ్ఞానసంపన్నులే. అని ఉపనిషత్తులు చెప్పు చున్నవి. ఇంద్రుడు బ్రహ్మవలన బ్రహ్మతత్వమును తెలిసికొనెనని ఛాందోగ్యోపనిషత్తు చెప్పుచున్నది. యముడు బ్రహ్మవేత్త యని కఠోపనిషత్తు చెప్పుచున్నది. ఇట్లే దిక్పతులందరును బ్రహ్మవేత్తలే. మనచే భక్తితో నమస్కరింపబడినవారై మనకు బ్రహ్మసాక్షాత్కా రము కలుగుటలో తప్పక ఉపకారమును చేయుదురు. ఎట్లు చేయు దురు? అది మనకెట్లు తెలియును? మనకు వారు అదృశ్యులై అనేక సౌకర్యములు చేయుదురు. అనేక పురాణగాథలు దృష్టాంతములుగ ఉన్నవి.

గంగాయమునానదులకు మధ్యప్రదేశమున ఉన్న మును లకు నమస్కారము.

మంత్రము. "ఓం నమో గంగాయమునయోర్మధ్యే యే వసంతి, తే మే ప్రసన్నాత్మానః చిరం జీవితం వర్ధయంతి. నమో గంగాయమునయోర్మునిభ్యశ్చ నమో, నమో గంగాయమునయో ర్మునిభ్యశ్చ నమః॥

అర్థము. "గంగాయమునయోః = గంగాయమునానదుల యొక్క-మధ్యే=మధ్యప్రదేశమునందు, యే=ఏ, మునులు వసంతి=నివ సించుచున్నారో, తే=ఆ మునులు, మే=నాకొరకు, ప్రసన్నాత్మానః= అనుగ్రహముగలబుద్ధికలవారై మే=నాయొక్క- ("మే" అనుపదమును రెండుసారులు చెప్పుకొనవలెను) జీవితం=ఆయుస్సును, చిరం=చాల కాలము, ఇచ్చట ఇంతకాలమని (నూరు మొదలగు సంఖ్యలతో) హద్దును చెప్పకపోవుటవలన తనకు బ్రహ్మసాక్షాత్కారము కలుగు వరకును అని భావము. వర్ధయంతి=వృద్ధిని పొందింతురు గాక. లట్కు లోట్ అర్థము. గంగాయమునయోః=కావున గంగాయమునా నదుల మధ్యనున్న, మునిభ్యశ్చ మునులకు నమః=నమస్కారము అగుగాక! గంగాయమునయోః=గంగాయమునానదుల మధ్యనున్న మునిభ్యశ్చ=మునులకు నమః=నమస్కారము అగుగాక! గంగా యమునాతీరములు వాని మధ్యప్రదేశము మహాపవిత్రమైనవగుట చేత అచ్చట మహాత్ములగు మునులు లోకహితముకొరకే నివసించి యుందురని పురాణములు వర్ణించుచున్నవి. ఇట్టి లోకహితమును కోరు మహామునుల అనుగ్రహముచేత దీర్ఘాయురారోగ్యసంపదలను పొందుటకొరకు ఆమునులకు నమస్కరించుట శిష్టసంప్రదాయము.

ఇట్లు రెండు సారులు నమస్కారము చెప్పుట భక్త్యాదరాతి శయముచేత. మాధ్యాహ్నికసూర్యోపస్థానమంత్రార్థమున ఉదహ రించిన యాస్కమునివచనమును ఇచ్చట జ్ఞాపకమునకు తెచ్చుకొన వలెను. కావున ఉపాసకుడు విశేషార్థమును మనసున ఉంచుకొని

ఇట్లు పునరుక్తిని చెప్పినట్లు గ్రహించునది. బ్రహ్మసాక్షాత్కార మగునంతవరకును దీర్ఘాయుస్సు సంపూర్ణారోగ్యము అనుగ్రహింప బడవలెనని మరల మరల ప్రార్థించుచున్నాడని భావము.

ఇటు తర్వాత మంత్రమునొకసారి, తర్వాత ప్రతిపదార్థమును, వ్రాయకుండ ప్రతిపదార్థమునే వ్రాయుదును.

"సంధ్యాయై నమః=సంధ్యాదేవతకు నమస్కారము, సావిత్ర్యై నమః=సావిత్రియను పేరుగల మధ్యాహ్నసంధ్యాదేవతకు నమస్కారము. గాయత్ర్యై నమః=గాయత్రి యను పేరుగల ప్రాతస్సంధ్యాదేవతకు నమస్కారము. సరస్వత్యై నమః=సరస్వతి యను పేరుగల సాయంసంధ్యాదేవతకు నమస్కారము. సర్వాభ్యోదేవతాభ్యో నమః=అందరు దేవతలకును నమస్కారము. దేవేభ్యో నమః=దేవతలకు నమస్కారము. ఋషిభ్యోనమః=ఋషులకు నమస్కారము. మునిభ్యోనమః=మునులకు నమస్కారము. గురుభ్యో నమః=గురువులకు (పెద్దలకును) నమస్కారము. పితృభ్యోనమః = పితృదేవతలకు నమస్కారము.

కామః=నా కోరికయే అకార్షీత్=ఈ పాపముల నన్నింటినీ చేసినది. అనగా-నన్ను ప్రేరేపించి నాచేత చేయించినది. నమోనమః=ఆ కామాధిదేవతకు అనేక నమస్కారములు, చేయుచున్నానని భావము. మన్యుః=నా క్రోధమే, అకార్షీత్=ఈ పాపపుపనుల నన్నింటిని చేసినది. అనగా-నన్ను ప్రేరేపించి నాచేత చేయించినది. నమోనమః=ఆ క్రోధాధిదేవతకు అనేక నమస్కారములు. నమోనమః యని రెండు సారులు నమస్కరింపబడినవారై ఆ కామక్రోధాధిదేవతలు నన్ననుగ్రహించి నాచేత పాపపుపనులు చేయించకుందురు గాక! కామక్రోధములే యన్ని పాపములకు కారణములని తొలుత నొకసారి చెప్పబడినది.

# పంచభూతనమస్కారము

మంత్రము. పృథివ్యాపస్తేజోవాయురాకాశాత్ ॥

ఇచ్చట పృథివీ, ఆపః, తేజః, వాయుః, ఈ నాలుగు పదములును ప్రథమావిభక్తిలో నున్నవి. ఆకాశాత్ = ఇది పంచమీ విభక్తిలో నున్నది. కాన ముందు, ఆకాశాత్ = ఆకాశమునుండి, పైన చెప్పిన, పృథివీ = భూమి, ఆపః = జలములు, తేజః = తేజస్సు, అనగా సూర్య, అగ్న్యాదులు, వాయుః = గాలి, ఇవి నాలుగును ఆకాశము నుండి, పుట్టినవి అని చెప్పుకొనవలెను. కాని వేదమున వీటి పుట్టుక ఇట్లు చెప్పబడలేదు. మరి ఎట్లనగా—ఆకాశమునుండి గాలి మాత్రము పుట్టినది. గాలినుండి తేజస్సు, తేజస్సునుండి, జలములు, జలములనుండి పృథివి పుట్టినది. కాని యిచ్చట ఆకాశమునుండియే మిగిలిన నాలుగును పుట్టినట్లు చెప్పబడినది. కాని ఇది పూర్తిగా తప్పనుటకు వీలులేదు. చివర కివి యన్నియును ఆకాశమునుండి పుట్టినట్లే గదా!

మనుజుని ఉత్పత్తికి పంచభూతములును కారణము. ఎట్లనగా "ఆత్మన ఆకాశః సంభూతః. ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః, అగ్నేరాపః, అద్భ్యః పృథివీ, పృథివ్యా ఓషధయః, ఓషధీభ్యోఽన్నం, అన్నాత్పురుషః." అను శ్రుతి, మనుజుని ఉత్పత్తికి పంచభూతములు కారణములని చెప్పినది. ఇది నమస్కారప్రకరణము గాన ఉపాసకుడు తన ఉత్పత్తికి కారణమైన పంచభూతములకు నమస్కారము చేయుచున్నాడు.

## పరమాత్మ నమస్కారము

ఓం నమో భగవతే వాసుదేవాయ.

ఓం = ఓంకారమునకు అర్థమైనట్టియు, భగవతే = భగవంతుడైన, వాసుదేవాయ = సర్వవ్యాపకుడును, స్వయంప్రకాశకుడునగు పరమాత్మకు, నమః = నమస్కారము.

## సంధ్యావందనము

యాగ్ం సదా సర్వభూతాని చరాణి స్థావరాణి చ।
సాయం ప్రాతర్నమస్యంతి, సా మా సంధ్యాఽభిరక్షతు॥

అర్థము. చరాణి=కదలునట్టివి (జలము, తేజస్సు, వాయువును), స్థావరాణి=కదలనట్టివి (పృథివి, ఆకాశము.) (ఇచ్చట బహువచన మార్షము) యగు, సర్వభూతాని=పంచభూతములును, సదా=ఎల్లప్పుడును, సాయం=సాయంసంధ్యాకాలమునను, ప్రాతః=ప్రాతః సంధ్యాకాలమునను, యాం = ఏ సంధ్యాదేవతను, నమస్యంతి = నమస్కరించునో, సా సంధ్యా=అట్టి సంధ్యాదేవత, మా=నన్ను, అభిరక్షతు=అన్ని వైపులనుండి రక్షించు గాక!

తాత్పర్యము. నమస్కారము శరీరముచే చేయదగినది. శరీరము పంచభూతనిర్మితము. కాన పంచభూతములును తమకు శరీరములు లేనందున ఉపాసకుని శరీరముద్వారా సదాత్రిసంధ్యలందును, మాయాద్వారా పంచభూతసృష్టికి కారణమగు, సంధ్యానామక పరబ్రహ్మమును నమస్కరించుచున్నవి. అట్టి సంధ్యాదేవత నన్ను అన్ని వైపులనుండి రక్షించు గాక!

## శివవిష్ణ్వభేదనిరూపణము

శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే!
శివస్య హృదయం విష్ణుర్విష్ణోశ్చ హృదయగ్ం శివః॥
యథా శివమయో విష్ణురేవం విష్ణుమయశ్శివః।
యథాంతరం న పశ్యామి తథా మే స్వస్తిరాయుషి॥

అర్థము. విష్ణురూపాయ=విష్ణురూపముతోనున్న, శివాయ=శివునకు నమస్కారము. శివరూపాయ=అట్లే శివరూపముతోనున్న, విష్ణవే=విష్ణువునకు నమస్కారము. శివస్య=శివునియొక్క, హృదయం=హృదయము, విష్ణుః=విష్ణువే. విష్ణోశ్చ=అట్లే విష్ణువుయొక్క,

హృదయం=హృదయము, శివః=శివుడే. విష్ణుః=విష్ణువు; యథా=ఏ విధముగా, శివమయః=శివమయుడో, ఏవం=ఈ విధముగనే, శివః= శివుడును, విష్ణుమయః=విష్ణుమయుడే. యథా=ఎంత యధికముగ, నఅంతరం=శివకేశవులకు అభేదమును, పశ్యామి=చూతునో, తథా= అంతయధికముగ, మే=నాకు, స్వస్తిః=జీవితమున క్షేమము. ఆయుషీ=దీర్ఘాయుస్సున్నూ కలుగుగాక! యని భావము.

తాత్పర్యము. "ఏకైవమూర్తిర్బిభిదే త్రిధా సా" యని కాళిదాసమహాకవి కుమారసంభవమున చెప్పినట్లు, ఒకే మూలమూర్తి, బ్రహ్మ, విష్ణువు, శివుడు అను ముమ్మూర్తులను ధరించినది. వారిలో వారికి భేదము లేదు, కావున శివకేశవులకు ఏ విషయమునను భేదము లేదు. కాన ఉపాసకుడు శివకేశవుల విషయమున ఎంత యధికముగా అభేదమును తలంచునో. అంత యధికముగా క్షేమమును, ఆయురభివృద్ధిని పొందునని భావము.

## గోవిందప్రణామము

నమో బ్రహ్మణ్యదేవాయ, గోబ్రాహ్మణహితాయ చ।
జగద్ధితాయ కృష్ణాయ గోవిందాయ నమో నమః॥

అర్థము. బ్రహ్మణ్యదేవాయ=బ్రాహ్మణరక్షకుడగు దేవుడైనట్టియు, గోబ్రాహ్మణహితాయ చ=గోవులకును బ్రాహ్మణులకును మేలు చేయునట్టియు, జగద్ధితాయ=జగములన్నింటికిని మేలు చేయునట్టియును, గోవిందాయ=వేదములచే తెలియదగిన, కృష్ణాయ=భక్త పాపనాశకుడగు శ్రీకృష్ణపరమాత్మకు, నమో నమః=అనేక నమస్కారములు చేయుచున్నాను.

తాత్పర్యము. సాక్షాద్భగవంతుడగు శ్రీకృష్ణ పరమాత్మ సమస్తప్రాణికోటిలో విశేషముగ "గోబ్రాహ్మణహితాయ" అని చెప్పబడినాడు. ఎల? ఆదిశంకరులు తమ గీతాభాష్యారంభమున "బ్రాహ్మణుని రక్షించిన యెడల అంతయును రక్షింపబడినట్లే యగు

ననిరి. ఎల? కర్మభూమియగు భారతభూమిమీద కర్మకాండను, జ్ఞానకాండను చక్కగా నడిపించుటకు బ్రాహ్మణుడే యర్హుడు కాన, బ్రాహ్మణుని రక్షించిన అంతయును రక్షింపబడినట్లే యని ఆదిశంకరులు వ్రాసినది మిక్కిలి సమంజసము. ఇక గోవుయొక్క మహిమ గూర్చియు, గోవు ప్రాధాన్యమునుగూర్చియు ఒక గ్రంథమునే వ్రాయ వలసియుండును. భారతీయ జీవితమునకు గోవెంతో ప్రధానమైనది. ఈ విషయమున ఆధునిక వైజ్ఞానికులు ఏమనినను మనకేమి? కావుననే ద్విజుడు తను ఏ వైదికకర్మ చేసినను ఆ కర్మాంతమున ప్రవర చెప్పి అభివాదనము చేయును. అప్పుడు మునుముందుగ ఏమనుచున్నాడు? "చతుస్సాగరపర్యంతం గోబ్రాహ్మణేభ్యః శుభం భవతు" అని కదా! సమస్తభూతలమునను గోవులును ద్విజులును క్షేమముగ నుందురు గాక! యని ప్రార్థించుచున్నాడు. ఇట్లే పురాణప్రవచనము వ్రతకథోపన్యాసములు మొదలగు ప్రవచనముల చివర అనేక భక్త జనసమూహము ఎదుట "స్వస్తి ప్రజాభ్యః, పరిపాలయంతాం న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః। గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం, లోకాః సమస్తాః సుఖినో భవంతు." అని గోబ్రాహ్మణ క్షేమము తలంచబడుచున్నది. ఆధ్యాత్మికభావములతో ప్రపూర్ణ మగు భారతావనికి ఈ రెండే ముఖ్యము. కావున అట్టి బ్రాహ్మణ హితకరుడగు గోవిందునకు నమస్కారసహస్రములు.

"అనాయాసేన మరణం వినా దైన్యేన జీవనం।
అనారాధితగోవిందపదాబ్జస్య కథం భవేత్॥

గోవిందుని పాదపద్మార్చన సేయని వానికి, మిక్కిలి దుర్లభములగు అనాయాసమరణము దైన్యమెఱుగని జీవితము ఎట్లు కలుగును? కలుగవు. అనగా—గోవిందపాదార్చన చేసినవానికే అనాయాసమరణము దైన్యములేని జీవనము కలుగునని భావము.

## విరాట్పురుషప్రణామము

నమోఽస్త్వనంతాయ సహస్రమూర్తయే
సహస్రపాదాక్షి శిరోరుబాహవే।
సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే
సహస్రకోటీయుగధారిణే నమః॥

"సహస్రశీర్షా పురుషః" అను పురుషసూక్తప్రథమ మంత్రమునందలి సహస్రశబ్దమునకు వలె ఈ శ్లోకమున ఉన్న సహస్రశబ్దమునకు, "అపరిమితము" అని అర్థము.

అర్థము. అనంతాయ = నాశములేనట్టియు, సహస్రమూర్తయే = ఈ చరాచరప్రపంచమంతయును విరాట్పురుషుని శరీరమగుటచేత, ప్రపంచమునందలి శరీరములన్నియును విరాట్పురుషుని శరీరములే. కావున "అపరిమితశరీరములను ధరించినవాడు" అని భావము. కావుననే, సహస్ర = అపరిమితమైన, పాద = పాదములు, అక్షి = కన్నులు, శిర = తలలు, ఊరు = తొడలు, బాహవే = చేతులును కలవాడు. ఇచ్చట శిరస్ శబ్దమును అకారాంతముగా ప్రయోగించుట ఆర్షము. శాశ్వతే = శాశ్వతమైనవాడును, ఇచ్చట అకారాంతమగు శాశ్వతశబ్దమును తకారాంతముగా వాడుటయును ఆర్షము. సహస్ర = అపరిమితమైన, కోటీ = కోట్లకొలది, యుగ = యుగములకాలము, ధారిణే = ధరించిన వాడు, అనగా— కోటానుకోట్లయుగములనుండి యున్నవాడు. కాలముచేత కొలవశక్యము కానివాడు, అయినట్టి పురుషాయ = విరాట్పురుషనామముచే నొప్పారు పరమాత్మకు, నమః = నమస్కారమును చేయుచున్నానని భావము. ఇచ్చట "కోటి" శబ్దము ఛందస్సు కొరకు "కోటీ" యని వాడబడినది.

తాత్పర్యము. సులభము. ఈ చరాచరప్రపంచమంతయును విరాట్పురుషశరీరమే యని ధ్యానింపవలెను.

# భూమ్యాకాశవందనము

మంత్రము: "ఇదం ద్యావాపృథివీ సత్యమస్తు, పితర్మాతర్యది హోప బ్రువే వామ్। భూతం దేవానామవమే అవోభిః, విద్యామేషం వృజనం జీరదానుమ్".

అర్థము. పితః!=తండ్రివగు ఓ ద్యులోకమా! ద్యులోకమనగ పై యాకాశము. మాతః=తల్లివగు ఓ భూదేవి!, వాం=మిమ్ములను గూర్చి, ఇహ=ఇప్పుడు, ఈ సంధ్యావందనసమయమున, యత్=ఏ మాటను, ఉపబ్రువే=పలికెదనో, ద్యావాపృథివీ=ఓ భూమ్యాకాశము లారా! ఇదం=ఈ నామాట, సత్యం అస్తు=నిజమగు గాక! ఆమాట యేదనగా—అవోభిః = రక్షణలచేత, (అనగా—ఎల్లప్పుడు పలు మార్లు రక్షించుటచేత), దేవానాం= దేవతలకు, ఇది—మనుష్య పశుపక్ష్యాది సకలప్రాణులకును సూచనము. అవమే=రక్షకులుగా, భూతం=భవతం=అగుడు, కండు. మేము కూడ మీ యనుగ్రహము వలన, వృజనం=తాపమును పోగొట్టునట్టియు, జీరదానుం=జీవనదాత యగు, ఇషం=అన్నమును, విద్యామ=పొందెదము.

తాత్పర్యము. తల్లిదండ్రులగు ఓ భూమ్యాకాశములారా! (సమస్త ప్రాణులకును భూమ్యాకాశములు తలిదండ్రుల వంటివని వేదములందు చాల చోటుల చెప్పబడినది) మీరు దేవమనుష్యపశు పక్ష్యాది సమస్తప్రాణులకును అన్ని విధములైన రక్షణలచేత రక్షకులుగా నుందురు గాక! యని మిమ్ములను గూర్చి ఇప్పుడు నేను పలుకుచున్నాను. ఈ నాపలుకులు సత్యములగు గాక ఇట్లు ఉపాసకుడు తన క్షేమమును గురించి మాత్రము గాక, సమస్తప్రాణి క్షేమమును గోరుచున్నాడు. ఇంకను—మీ యనుగ్రహమువలన భుజించువారి తాపమును పోగొట్టు నటునంటియు, మాకు జీవనోపాధి -యునగు నన్నమును (ఆహారమును) తప్పక పొందెదము. ఏ ప్రాణికి

నైన యాహారము పుట్టనలెననిన భూమ్యాకాశముల యనుగ్రహము తప్పక యుండవలెను. ఎట్లన—భూమి యోషధుల ద్వారా మన కాహారము నిచ్చును. "పృథివ్యా, ఓషధయః, ఓషధీభ్యోఽన్నం, అన్నాత్పురుషః" అని ప్రాణ్యుత్పత్తిక్రమమును తైత్తరీయోప నిషత్తు చెప్పుచున్నది. ఇక ఆకాశము, మనము సంచరించుటకును, మనకు జీవనాధారమగు వాయుసంచారమునకును అవకాశము నిచ్చి రక్షించుచున్నదని భావము.

## విష్ణుస్తుతి

"ఆకాశాత్పతితం తోయం, యథా గచ్ఛతి సాగరం।
సర్వదేవనమస్కారః కేశవం ప్రతి గచ్ఛతి॥

అర్థము. ఆకాశాత్ = ఆకాశమునుండి, పతితం=వర్షరూప ముగా భూమిమీద పడిన, తోయం=నీరు, యథా=ఏ విధముగా. సాగరం=(తుదకు) సముద్రమును, ప్రతి గచ్ఛతి=చేరునో. ఆ విధము గనే, సర్వదేవనమస్కారః=ఎల్ల దేవతలకును చేసిన నమస్కారము కేశవం=(శ్రీ) విష్ణువును, ప్రతిగచ్ఛతి=చేరును.

### తాత్పర్యము సులభము

సర్వవేదేషు యత్పుణ్యం, సర్వతీర్థేషు యత్ఫలం।
తత్ఫలం పురుష ఆప్నోతి, స్తుత్వా దేవం జనార్దనమ్॥

అర్థము. సర్వవేదేషు = అన్ని వేదములను చదువుటవలన, యత్పుణ్యం=ఏ పుణ్యము కలుగునో, సర్వతీర్థేషు=ఎల్ల తీర్థములను సేవించుటవలన, యత్ఫలం=ఏ ఫలము కలుగునో, తత్ఫలం=[illegible] మును, పుణ్యమును, పురుషః = భక్తుడగు మానవుడు, దేవం= దేవుడగు, జనార్దనం=(శ్రీ) మహావిష్ణువును, స్తుత్వా=స్తుతించి, ఆప్నోతి=పొందుచున్నాడు.

తాత్పర్యము సులభము

## పరమాత్మనమస్కారము

వాసనాద్వాసుదేవస్య వాసితం తే జగత్త్రియం।
సర్వభూతనివాసోఽసి, వాసుదేవ నమోఽస్తు తే॥

అర్థము. వాసుదేవస్య = సర్వవ్యాపకుడును, స్వయంప్రకాశమానుడునగు, తే=నీయొక్క, వాసనాత్ =నివాసమువలన [వ్యాపించియుండుటవలన.] జగత్త్రియం= ఈ మూడుజగములును, వాసితం= లోపలను వెలుపలను నీచేత పూర్తిగ వ్యాపింపబడినది. సర్వ=ఎల్ల, భూత=ప్రాణులందును, నివాసః=వసించువాడవు (వ్యాపించువాడవు) అసి=అగుచున్నావు. వాసుదేవ! ఓ పరమేశ్వరుడా! తే=నీకు,నమః= నమస్కారము, అస్తు=అగుగాక!

తాత్పర్యము సులభము

## అభివాదనవాక్యార్థము

చతుస్సాగరపర్యంతం గోబ్రాహ్మణేభ్యః శుభం భవతు.

చతుః = నాలుగు, సాగరపర్యంతం = సముద్రముల వరకు వ్యాపించియున్న భూమిమీదనున్న, గోబ్రాహ్మణేభ్యః = గోవులకును బ్రాహ్మణులకును, శుభం= క్షేమము, భవతు=కలుగుగాక!

ఆంగీరస - బార్హస్పత్య - భారద్వాజ-త్ర్యార్షేయ - ప్రవరాన్విత-భారద్వాజసగోత్రః యజుర్వేదీ తైత్తరీయశాఖాధ్యాయీ, ఆపస్తంబసూత్రో వేంకటాచలశర్మా అహం భో అభివాదయే॥

ఆంగీరస=ఆంగీరస మహాముని, బార్హస్పత్య = బార్హస్పత్య మహాముని, భారద్వాజ=భారద్వాజమహాముని అను త్ర్యార్షేయ= ముగ్గురు ఋషులకు సంబంధించిన, అనగ పైముగ్గురు ఋషులచేత అవిచ్ఛిన్నముగ వృద్ధిచేయబడిన, ప్రవర=గోత్ర (వంశము) ప్రవర్తక ఋషిపరంపరతో. అన్విత=కూడిన, భారద్వాజ= భారద్వాజమహా

బ్రహ్మము. అనియును, ఆ పరబ్రహ్మమే పైన పేర్కొనిన శరీర ములలోపల దూరి యుండుటచేత "ప్రత్యక్చైతన్య మనియును, (పారమార్థికజీవుడనియును) శాస్త్రములచేత వివరింపబడియున్నది" ఈ వివరములు బాగుగ తెలిసిన యుపాసకుడు భగవద్గీతయందు చెప్పబడిన కర్మయోగపద్ధతిని అనుసరించి ఎట్టి ఫలములను ఆసింపక పుణ్యాపాపకర్మల నన్నింటిని బ్రహ్మార్పణము చేయుచున్నాడు. అట్లు చేసి పరిశుద్ధాంతఃకరణుడై అచిరకాలముననే బ్రహ్మసాక్షాత్కార మును అందగలడని భావము:

ఓం తత్ సత్

బ్రహ్మార్పణమస్తు.

ఓమ్, తత్, సత్, అను మూడు పదములును పరబ్రహ్మ మును చెప్పునవి అని శ్రీకృష్ణభగవానుడు చెప్పినట్లు వెనుక వ్రాయ బడినది. ఏ శుభకార్యములు చేసినను ఈ మూడు పదములను చేర్చి పలికినయెడల, ఆ కార్యము పరిపూర్ణముగ చేయబడినదగునని ప్రాచీన సంప్రదాయము.

"బ్రహ్మార్పణమ్" ఈ చేసినపంతయును పరబ్రహ్మమునకు అర్పింపబడినది అస్తు=అవుగాక!

సోమయాజులవంశ్యేన వేంకటాచలశాస్త్రిణా।
రచితాఽఽంధ్రీమయీ జీయాత్, సంధ్యామంత్రార్థబోధినీ॥

యజుర్వేదీయ
సంధ్యామంత్రార్థబోధిని
సమాప్తము
శివమ్.

ఓమ్

''యత్సంధ్యాముపాసతే బ్రహ్మైవ తదుపాసతే''

ఇతి శ్రుతిః

# యజుర్వేదీయ

## త్రికాలసంధ్యావందనప్రయోగము

ఉషఃకాలమున మేలుకొని దైవప్రార్థనము చేసి, తరువాత దంతధావనము మొదలగు ప్రాతఃకాలకృత్యములను తీర్చుకొని, అరుణోదయకాలమున అఘమర్షణస్నానమును చేసి శిఖను ముడివేసికొని ఎండవేసిన మడిబట్టను కట్టుకొని శుద్ధమైన ప్రదేశమున తూర్పు కొనలుగల దర్భలమీద గాని దర్భాసనమున గాని, తూర్పుముఖముగ కాని, ఉత్తరముఖముగ కాని కూర్చొని పవిత్రమును ధరించి, సంధ్యా కాల మారంభమైన పిమ్మట

శ్లో. ''అపవిత్రః పవిత్రో వా, సర్వావస్థాం గతోఽపి వా।
యః స్మరేత్పుండరీకాక్షం, స బాహ్యాభ్యంతరే శుచిః''॥

అని పఠించి, పుండరీకాక్ష! పుండరీకాక్ష! పుండరీకాక్ష! అని ముమ్మారు ఉచ్చరించి తాను పవిత్రమైన వాడుగ తలంచి, రెండు మోకాళ్ళను ఎత్తి పాదములను భూమిమీద ఉంచి దేనికిని చేరబడక, వడబోసిన నీటితో నింపిన పంచపాత్రలను, ఉద్ధరిణిని పళ్ళెములో పెట్టి, ముందుంచుకొని నీటితోనింపిన ఒక పెద్దపాత్రను కూడ దగ్గరనుంచుకొని, రెండు చేతులను మోకాళ్ళమధ్యనుంచి, తొలుత శుద్ధికొరకు ఒక పురాణాచమనమును చేయవలెను.

గోకర్ణాకృతిగల చేతియందు ఉద్ధరిణితో నిండుగ నీటిని తీసి

కొని మధ్యనుండు మూడు వ్రేళ్ళను తిన్నగ నిలబెట్టి, చిటికెన వ్రేలును, బొటనవ్రేలును, దూరముగ విడదీసిన యెడల, ఆ వ్రేళ్ళసందులగుండా కొంత నీరు కారిపోవును. అట్లు కారిపోగా మిగిలిన నీటిని బ్రహ్మ తీర్థముగుండా, ఆచమింపవలెను. ఇట్లే అన్ని ఆచమనములను చేయ వలెను.

## పురాణాచమనము

1. ఓం కేశవాయ స్వాహా 2. ఓం నారాయణాయ స్వాహా 3. ఓం మాధవాయ స్వాహా. అనుచు మూడు సారులు, స్వాహా అను నప్పుడు నీటిని త్రాగవలెను.

4. ఓం గోవిందాయ నమః, 5. ఓం విష్ణవే నమః, అనుచు చేతులను కడుగుకొనవలెను.

6. ఓం మధుసూదనాయ నమః. 7. ఓం త్రివిక్రమాయ నమః. మూడు నడిమి వ్రేళ్ళ కొనలతో పెదవులను కొంచెము లోపలికి ముడిచి, వెంద్రుకలు గల చోటును తుడవవలెను.

8. ఓం వామనాయ నమః. 9. ఓం శ్రీధరాయ నమః. తలమీద నీళ్ళను రెండునామములతో ప్రత్యేకముగ చల్లుకొనవలెను.

10. ఓం హృషీకేశాయ నమః, కుడిచేతితో ఎడమచేతిమీద నీళ్ళను చల్లవలెను.

11. ఓం పద్మనాభాయ నమః, పాదములమీద నీళ్ళను చల్ల వలెను.

12. ఓం దామోదరాయ నమః, మరల తలను ప్రోక్షింప వలెను.

13. ఓం సంకర్షణాయ నమః, 4 వ్రేళ్ళయొక్క మొనళ్ళచేత గడ్డమును తాకవలెను.

14. ఓం వాసుదేవాయ నమః. చూపుడుప్రేలు బొటనప్రేళ్ల కొనలు కలిపిన ముద్రతో ముక్కు కుడిచెరమను తాకవలెను.

15. ఓం ప్రద్యుమ్నాయ నమః. పై ముద్రతోనే ముక్కు నెడమ చెరమను తాకవలెను.

16. ఓం అనిరుద్ధాయ నమః, ఉంగరపుప్రేలు బొటనప్రేళ్ళ కొనలను కలిపిన ముద్రతో కుడి కంటిని తాకవలెను.

17. ఓం పురుషోత్తమాయ నమః. పై ముద్రతోనే ఎడమ కంటిని తాకవలెను.

18. ఓం అధోక్షజాయ నమః. పై ముద్రతోనే కుడి చెవిని తాకవలెను.

19. ఓం నారసింహాయ నమః. పై ముద్రతోనే ఎడమ చెవిని తాకవలెను.

20. ఓం అచ్యుతాయ నమః. చిటికెన బొటనప్రేళ్ళ కొనలు కలిపిన ముద్రతో బొడ్డును తాకవలెను.

21. ఓం జనార్దనాయ నమః. అరచేతితో హృదయమును తాకవలెను.

22. ఓం ఉపేంద్రాయ నమః. మధ్య మూడు ప్రేళ్ళతో తలను తాకవలెను.

23. ఓం హరయే నమః. మొగ్గవలె దగ్గరకు చేర్చిన ప్రేళ్ళ కొనలతో కుడి భుజమును తాకవలెను.

24. ఓం కృష్ణాయ నమః. పై ముద్రతో ఎడమ భుజమును తాకవలెను.

ఇట్లు పురాణాచమనముచేసి సమంత్రకముగ భస్మ ధారణను చేయవలెను. తర్వాత సంధ్యావందనాంగమైన రెండు స్మృత్యాచమనములను చేయవలెను.

## స్మృత్యాచమనము

గోకర్ణాకృతిహస్తములోనికి ఉద్ధరిణితో నీటిని తీసికొని చిటికెనవ్రేలిని బొటనవ్రేలిని దూరము చేసి, కొంచెము నీరు కారిన తర్వాత మిగిలిన నీటిని (కేశవాదినామములతో గాని ఏ నామములును లేకుండ గాని) మూడుసారులు ఆచమింపవలెను. తర్వాత లోపలకు కొంచెము ముడుచుకొనిన పెదవులను బ్రహ్మతీర్థప్రదేశముతో రెండు సారులు తుడవవలెను. తర్వాత మధ్య మూడు వ్రేళ్ళతో లోపలకుముడిచిన పెదవులను ఒకసారి తుడవవలెను. తర్వాత కుడిచేతితో ఎడమ చేతిమీద నీళ్లు చల్లవలెను. తర్వాత పాదములమీదను తలమీదను నీళ్ళను చల్లవలెను. తర్వాత ఉంగరపువ్రేలు బొటనవ్రేళ్ళ కొనలు కలిపిన ముద్రతో ముందు, కుడికంటిని తర్వాత ఎడమకంటిని తాకవలెను, తర్వాత చూపుడువ్రేలు బొటన వ్రేళ్ళకొనలు కలిపిన ముద్రతో వరుసగ కుడి ఎడమ ముక్కు చెవులను తాకవలెను. తర్వాత చిటికెనవ్రేలు బొటనవ్రేళ్ళ కొనలు కలిపిన ముద్రతో వరుసగ కుడి యెడమ చెవులను తాకవలెను. తర్వాత చేతులను కడుగుకొనవలెను. ఇది స్మృత్యాచమనము. ఇట్లు రెండు స్మృత్యాచమనములను చేయవలెను. తర్వాత ఈ క్రింది శ్లోకమును పఠించి భూతోచ్చాటనమును చేయవలెను.

## భూతోచ్చాటనము

శ్లో. ఉత్తిష్ఠంతు భూతపిశాచాః, ఏతే భూమిభారకాః।
ఏతేషామవిరోధేన, బ్రహ్మకర్మ సమారభే॥

తర్వాత వారి వారి శక్త్యనుసారముగ ఈ క్రింది నాలుగు ప్రాణాయామమంత్రములలో ఒకదానితో ప్రాణాయామమును చేయవలెను. గృహస్థు ఐదు వ్రేళ్ళతోను ముక్కును గట్టిగా మూయవలెను. బ్రహ్మచారి చిటికెనవ్రేలు, ఉంగరపువ్రేలు, బొటన వ్రేళ్ళతో ముక్కును గట్టిగా మూయవలెను.

## 1. మొదటి ప్రాణాయామమంత్రము

ఓం భూః ఓం భువః ఓగ్ం సువః ఓం మహః ఓం జనః ఓం తపః ఓగ్ం సత్యం ఓం తత్సవితుర్వరేణ్యం, భర్గో దేవస్య ధీమహి।, ధియో యో నః ప్రచోదయాత్. ఓమాపో జ్యోతీ రసో ఽమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్. 61 అక్షరములు.

## రెండవ ప్రాణాయామమంత్రము

ఓం భూర్భువస్సువర్మహర్జన స్తపస్సత్యం. తద్బ్రహ్మ. తదాప ఆపో జ్యోతీ రసోఽమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్. 36 అక్షరములు.

## మూడవ ప్రాణాయామమంత్రము

ఓం తద్బ్రహ్మ, ఓం తద్వాయుః, ఓం తదాత్మా, ఓం తత్సత్యం, ఓం తత్సర్వం, ఓం తత్పురోర్నమః. 26 అక్షరములు.

## నాలుగవ ప్రాణాయామమంత్రము

భూర్భువస్సువర్మహర్జన స్తపస్సత్యమ్. 13 అక్షరములు.

## సంకల్పము

మమోపాత్తదురితక్షయద్వారా శ్రీపరమేశ్వరప్రీత్యర్థం, ప్రాతః (మాధ్యాహ్నిక-సాయం) సంధ్యాముపాసిష్యే. అని సంకల్పము చేయవలెను. (ఉద్ధరిణిలోని నీటిని చేతిలో వేసికొని పళ్లెములో విడువవలెను.) తర్వాత పాత్రలలోని జలమును బ్రహ్మముఖమంత్రముతోను. శిరోమంత్రముతోను అభిమంత్రించి ఆపోహిష్ఠా మొదలగు తొమ్మిది మంత్రములతోను, దర్భలతో దేవతీర్థముతో అశుచి

ప్రదేశములో జలబిందువులు పడకుండ ఎనిమిదిసారులు తలమీాదను ఒకసారి పాదములమీాదను మార్జనము చేసికొనవలెను.

## బ్రహ్మముఖమంత్రము

ఓం భూర్భువస్సువః, తత్సవితుర్వరేణ్యం, భర్గోదేవస్య ధీమహి। ధియో యో నః ప్రచోదయాత్.

## శిరోమంత్రము

ఓమాపో జ్యోతీ రసోఽమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్.

అభిమంత్రించుట యనగా కుడిచేతిలో పాత్రను తాకుచు జలమును చూచుచు మంత్రమును పఠించుట.

## అపోహిష్ఠాదిమంత్రములతో మార్జనము

1. ఓమ్ ఆపోహి ష్ఠా మయో భువః, తలమీాద మార్జనము.
2. ఓం తా న ఊర్జే దధాతన, తలమీాద మార్జనము.
3. ఓం మహే రణాయ చక్షసే, తలమీాద మార్జనము.
4. ఓం యో వశ్శివతమో రసః, తలమీాద మార్జనము.
5. ఓం తస్య భాజయతేహ నః, తలమీాద మార్జనము.
6. ఓమ్ ఉశతీరివ మాతరః, తలమీాద మార్జనము.
7. ఓం తస్మా అరం గమామ వః. తలమీాద మార్జనము.

8. ఓంయస్య క్షయాయ జిన్వథ పాదములమీద మార్జనము.

9. ఓమ్ ఆపో జనయథా చ నః తలమీద మార్జనము.

## మంత్రాచమనము, లేక అబ్భక్షణము

గోకర్ణాకృతిహస్తముతో నీటిని తీసికొని మూడు సంధ్య లందును క్రమముగా ఈ క్రింది మంత్రములచేత అభిమంత్రించి స్వాహా అనుచు జలమును త్రాగవలెను.

## ప్రొద్దునమంత్రము

‘‘సూర్యశ్చ మా మన్యుశ్చ మన్యుపతయశ్చ మన్యుకృతే భ్యః, పాపేభ్యో రక్షంతాం, యద్రాత్రియా పాపమకార్షమ్. మన సా వాచా హస్తాభ్యామ్. పద్భ్యాముదరేణ శిశ్నా, రాత్రిస్తదవలుం పతు యత్కించ దురితం మయి, ఇదమహం మామమృతయోనౌ, సూర్యే జ్యోతిషి జుహోమి స్వాహా॥

## మధ్యాహ్నమంత్రము

ఆపః పునంతు పృథివీం. పృథివీ పూతా పునాతు మామ్. పునంతు బ్రహ్మణస్పతిర్బ్రహ్మ పూతా పునాతు మామ్. యదుచ్ఛిష్టమ భోజ్యం, యద్వా దుశ్చరితం మమ, సర్వం పునంతు మామాపోఽస తాం చ ప్రతిగ్రహగ్‍ం స్వాహా॥

## సాయంకాలమంత్రము

అగ్నిశ్చ మా మన్యుశ్చ మన్యుపతయశ్చ మన్యుకృతేభ్యః పాపేభ్యో రక్షంతామ్, యదహ్నా పాపమకార్షమ్, మనసా వాచా హస్తాభ్యామ్. పద్భ్యాముదరేణ శిశ్నా, అహస్తదవలుంపతు. యత్కించ దురితంమయి, ఇదమహం మామమృతయోనౌ సత్యే జ్యోతిషి జుహోమి స్వాహా॥

తర్వాత రెండు స్మృత్యాచమనములను చేసి, ఈ క్రింది 14 మంత్రములతో ద్వితీయమార్జనమును చేసికొనవలెను.

## ద్వితీయ (పునర్) మార్జన మంత్రములు

1. దధిక్రావ్ణ్ణో అకారిషమ్. జిష్ణోరశ్వస్య వాజినః సురభి నో ముఖా కరత్ ప్రణ ఆయూగ్ంషి తారిషత్. మార్జనము. 2. ఓం ఆపో హి ష్ఠా మయో భువః, 3, ఓం తా న ఊర్జే దధాతన, 4. ఓం మహే రణాయ చక్షసే, 5. ఓం యో వః శివతమో రసః, 6. ఓం తస్య భాజయతేహ నః, 7. ఓం ఉశతీరివ మాతరః, 8. ఓం తస్మా అరం గమామ వః, 9. ఓం యస్య క్షయాయ జిన్వథ, 10. ఓం ఆపో జనయథా చ నః, 11. ఓం హిరణ్యవర్ణాః శుచయః పావకాః. యాసు జాతః కశ్యపో యాస్వింద్రః. అగ్నిం యా గర్భం దధిరే విరూపాస్తాన ఆపః శగ్ం స్యోనా భవంతు. మార్జనము. 12. యాసాగ్ం రాజా వరుణో యాతి, మధ్యే సత్యానృతే అవపశ్యన్ జనానాం. మధుశ్చ్యుతః శుచయో యాః పావకా, స్తాన ఆపః శగ్ం

స్యోనా భవంతు. మార్జనము. 13. యాసాం దేవా దివి కృణ్వంతి, భక్షం యా అంతరిక్షే బహుధా భవంతి. యాః పృథివీం పయసోందంతి, శుక్రాస్తా న ఆపః శగ్‌ం స్యోనా భవంతు, మార్జనము. 14. శివేన మా చక్షుషా పశ్యతాఽఽపశ్శివయా తనువోపస్పృశత త్వచం మే. సర్వాగ్‌ం అగ్నీగ్‌ం రప్సు షదో హువే వో, మయి వర్చో బల మోజో, నిధత్త. మార్జనము.

## పాపపురుషదహనము

గోకర్ణాకృతి హస్తముతో నీటిని తీసికొని, "మనోవాక్కాయ ములచేత నేను చేసిన పాపమంతయును నల్లని రంగుగల చిన్న పురుషాకృతితో నా వామ (ఎడమ) కుక్షియందున్నది. అని భావించి, ద్రుపదామంత్రమును అర్థభావనతో పఠించి, చేతిలోని నీటిని అభి మంత్రించి, తర్వాత తన ఎడమదగు శ్వాసమార్గముగుండా ఆ పాప పురుషుని, శ్వాసతో కూడ చేతిలోని నీటిలో ప్రవేశించినట్లుభావించ వలెను. ఆ నీటిని చూడకుండ తన ఎడమ ప్రక్కన మండుచున్న పెద్ద వ్రజశిల యున్నట్లు భావించి, అటువైపు చూడకుండ చేతిలోని నీటిని ఆ పాపపురుషునితో గూడ, ఆవ్రజశిలమీాడ విసిరి కొట్టి, ఆ పాపపురుషుడు వేయి వ్రక్కలయి భస్మమయ్యెను. అని భావించి, తాను నిష్పాపుడైనట్లు భావింపవలెను. ఇట్లు ఐదు భావనలు.

## మంత్రము

"ద్రుపదాదివ ముంచతు. ద్రుపదాదివేన్మముచానః. స్విన్నః స్నాత్వీ మలాదివ, పూతం పవిత్రేణేవాజ్యం. ఆపఃశుంధంతు మైనసః.

## అర్ఘ్య ప్రక్షేపము

పాపపురుషదహనము తర్వాత అర్ఘ్యములను చిమ్మవలెను, కావున అర్ఘ్యము విడుచు చోటును నీటితో ప్రోక్షించి శుద్ధిచేసి, దోసిలి నిండ నీటిని పట్టుకొని, రెండు బొటనవ్రేళ్ళను దూరముచేసి ప్రొద్దున మధ్యాహ్నమునను తూర్పు ముఖముగ నిలబడియు, (ప్రొద్దున కొంచెము వంగి) మధ్యాహ్నమున నిట్ట నిలువుగ నిలబడి పాదములను సమముగ దగ్గరకు చేర్చి ప్రణవవ్యాహృతులతో గూడిన గాయత్రీమంత్రముచేత దోసిలిలోని నీటిని అభిమంత్రించి, కాలిమడమలను కొంచెమెత్తి దోసిలిని గోశృంగమంతమాత్రము (కనుబొమల మధ్యవరకు) ఎత్తి జలములున్న యెడల జలములోను, లేని యెడల నీటిని చల్లి శుద్ధపరచిన ప్రదేశమున గాని, పడునట్లు మూడర్ఘ్యములను గట్టిగా పైకి చిమ్మవలెను.

## అర్ఘ్య మంత్రము

ఓం భూర్భువస్సువః, తత్సవితుర్వరేణ్యం।

భర్గో దేవస్య ధీమహి। ధియో యో నః ప్రచోదయాత్

అందు మొదటి అర్ఘ్యమును చిమ్ముటకు ముందు ''ఈ యర్ఘ్యము సూర్యునితో యుద్ధము చేయుచున్న మందేహరాక్షసుల యొక్క ఆయుధములను నశింపజేయుగాక! అని అనుచు అర్ఘ్యమును పైకి చిమ్మవలెను. రెండవ అర్ఘ్యమును ఇచ్చుటకు ముందు ''ఈ యర్ఘ్యము సూర్యునితో యుద్ధము చేయుచున్న మందేహరాక్షసుల గుఱ్ఱములను నశింపజేయు గాక! అని అనుచు అర్ఘ్యమును పైకి చిమ్మవలెను. మూడవ యర్ఘ్యమును చిమ్ముటకు ముందు ''ఈ యర్ఘ్యము సూర్యునితో యుద్ధము చేయుచున్న మందేహరాక్షసులను ఎల్లరను నాశము చేయుగాక! అని చెప్పుచు అర్ఘ్యమును పైకి చిమ్మవలెను.

## ప్రదక్షిణము

ఇట్లు మూడర్ఘ్యములను చిమ్మిన తర్వాత కుడిచేతిలోనికి నీటిని తీసికొని "ఓం భూర్భువస్సువః" అని ప్రణవవ్యాహృతులను చెప్పుచు చేతిలోని నీటిని కొంచెము కొంచెముగా ధారగా పరిషేచనము వలె క్రిందికి వదలుచు ఒక ఆత్మప్రదక్షిణము చేసి తర్వాత కూర్చొని ఒక స్మృత్యాచమనమును చేయవలెను.

ఇంతటితో సంధ్యావందనాంగమగు అర్ఘ్యప్రదానము పూర్తి యైనది. కాలాతిక్రమణమైన యెడల ప్రాయశ్చిత్తము చేయవలెను.

## ప్రాయశ్చిత్తము

ఒక వేళ తాను సంధ్యావందనమారంభించునప్పటికి గౌణ కాలము కూడ (అనగా సూర్యోదయమైన తర్వాత సుమారు రెండు న్నర గంటల కాలము) దాటిన యెడల, ప్రాయశ్చిత్తమును చేయ వలెను. ఆ ప్రాయశ్చిత్తము రెండు విధములు. 1. అష్టోత్తరశత గాయత్రీజపము, లేక 2. అర్ఘ్యరూపప్రాయశ్చిత్తము. అని, ఈ రెండింటిలో ఏదియో ఒకదానినే చేయవలెను. రెండును చేయ నక్కరలేదు, అందు అర్ఘ్యరూపప్రాయశ్చిత్తమును ఆచరింపదలచిన యెడల, సంధ్యావందనమున మామూలుగ ఇచ్చునట్టి మూడర్ఘ్యము లను ఇచ్చినపిమ్మట, ప్రదక్షిణాచమనములను కూడ,పూర్తిచేయగా, నిత్యార్ఘ్యము పూర్తి యగును. అప్పుడు అర్ఘ్యరూపప్రాయశ్చిత్త మును ఆచరింపవలెను. అప్పుడు ఈ క్రింది విధముగ సంకల్పము చేయవలెను.

"మమ సంధ్యోపాసనగౌణకాలాతిక్రమణజనితదోషపరిహా రార్థం అర్ఘ్యరూపం ప్రాయశ్చిత్తం కరిష్యే" అని సంకల్పించి, పూర్వము ప్రాణాయామమునకు చెప్పబడిన అరువదియొక్క అక్షర ములుగల తొలిప్రాణాయామమంత్రముతో,దోసిలి యందలి జలమును అభిమంత్రించి అర్ఘ్యమునిచ్చునది. తర్వాత యథావిధిగ సంధ్యో

పాసనమును చేయవలెను. లేక, గాయత్రీజపరూపప్రాయశ్చిత్తమును చేయదలచిన యెడల దానిని సంధ్యావందనమును ఆరంభించుటకు ముందే చేయవలెను. ఎట్లనగా—పురాణాచమన - భస్మధారణ - స్మార్తాచమన-ప్రాణాయామములను చేసి "మమ సంధ్యోపాసన గౌణ కాలాతిక్రమణజనితదోషపరిహారార్థం అష్టోత్తరశతసంఖ్యాక గాయత్రీ జపరూపం ప్రాయశ్చిత్తం కరిష్యే" అని సంకల్పించి, జపమును ముగించి, తర్వాతనే సంధ్యావందనమును ఆరంభింపవలెను.

ప్రాయశ్చిత్తవిషయమున మధ్యాహ్నమున కొంచెము విశేషము గలదు. ఎట్లనగా—మధ్యాహ్నసంధ్యోపాసనకు సాయం ముఖ్యకాలమువరకును గౌణకాలముండుటచేత అపరాహ్ణమునందు చేయు మధ్యాహ్నసంధ్యోపాసనకు ప్రాయశ్చిత్తమును చేయనక్కర లేదు, సాయంసంధ్యానంతరము మధ్యాహ్నసంధ్య చేయవలసి వచ్చినయెడల మాత్రమే, ప్రాయశ్చిత్తమును చేయవలెను.

సాయంకాలమున పడమరముఖముగా కూర్చొని భూమిమీద జలము చల్లి శుద్ధము చేసి భూమిమీదనే అర్ఘ్యజలములు పడునట్లు అర్ఘ్యములను చిమ్మవలెను. సాయంకాలమున గూడ గౌణకాలము (సూర్యుడస్తమించిన తర్వాత రెండుగంటల ఇరువదినాలుగు నిమిషములు) దాటిన తర్వాతనే ప్రాయశ్చిత్తమును చేయవలెను. మిగిలినది ప్రొద్దునకు సమానమే.

## సంధ్యోపాసనము

అర్ఘ్యప్రక్షేప—ప్రదక్షిణాచమనములు ముగిసిన తర్వాత సంధ్యోపాసనమును చేయవలెను.

ఎట్లనగా—ప్రొద్దున మధ్యాహ్నముననుగూడ తూర్పుముఖముగ నిలబడియును, సాయంకాలమున పడమరముఖముగ కూర్చొనియును, ముందు మూడేసి ప్రాణాయామములను చేసి, వారి వారి అధికారా (యోగ్యతా)ను సారముగసంధ్యోపాసనమును చేయవలెను.

1. ఉత్తమాధికారులు రెండు విధములైన నిర్గుణోపాసనములను చేయుదురు. ముందు 1. నిర్గుణసంధ్యోపాసనమును తర్వాత 2, నిరుపాధిక నిర్గుణబ్రహ్మోపాసనమును చేయుదురు. అందు నిర్గుణసంధ్యోపాసనమును ఈ క్రింది విధముగ చేయుదురు.

## నిర్గుణసంధ్యోపాసనము

''అసావాదిత్యో బ్రహ్మ, సాఽహమస్మి. 3, 4 సారులు అర్థభావనముతో అనుకొనవలెను. తర్వాత దానిని వివరముగ భావింపవలెను.

ఇట్లు—ఆదిత్యమండలాంతర్యామి ఆదిత్యజీవప్రేరకం సంధ్యాభిదం బ్రహ్మచైతన్యం, (సత్యం, జ్ఞానం, అనంతం, త్రిపాత్, పరం) బ్రహ్మ, అని రెండుచైతన్యములకును ఐక్యమును భావింపవలెను. తర్వాత ''సాఽహమస్మి, (తాదృశ-త్రిపాత్పరబ్రహ్మాఽభిన్న-బ్రహ్మచైతన్యరూప) సంధ్యాఽహమస్మి,'' అని, అదిత్యావచ్ఛిన్న-సంధ్యాభిధ-బ్రహ్మచైతన్యమునకును స్వబుద్ధ్యవచ్ఛిన్న-ప్రత్యక్చైతన్యమునకును, ఐక్యమును కొంతసేపు ధ్యానింపవలెను.

ఆ ధ్యానమునందు అహంపదమును తలంచునప్పుడు ''అన్నమయ-ప్రాణమయ - మనోమయ - విజ్ఞానమయ - ఆనందమయాఖ్య-పంచకోశవ్యతిరిక్తము, పంచకోశప్రకాశకము, ఏతత్సర్వసాక్షిభూతము స్వీయాఽంతఃకరణావచ్ఛిన్నము, ఐన ప్రత్యక్చైతన్యము తోచ (స్ఫురించ)వలెను. ఇది నిర్గుణ సంధ్యోపాసనము,

ఇటుపైని ఓంకారసాధనముతో నిరుపాధిక-నిర్గుణ-బ్రహ్మతత్త్వోపాసనమును చేయవలెను. ఎట్లనగా—

''ఓమిత్యేకాక్షరం బ్రహ్మ''—అను అనువాకమును అర్థభావనతో పఠించి, సంధ్యాతత్త్వసుబోధినియందు ఉపాసనప్రకరణమున చెప్పిన ప్రకారము చేయవలెను. (శ్రీ) విద్యారణ్యకృతవార్తిక

సారమను గ్రంథమున ఓంకారముతో నిర్గుణోపాసనవిధానము కర తలామలకముగ చెప్పబడినది. ఆవిధముగ చేయునది. గురుముఖతః తెలిసికొని చేయవలెను. ఈ యుపాసన కుపయోగించు అను వాకము.

"ఓమిత్యేకాక్షరం బ్రహ్మః, అగ్నిర్దేవతా బ్రహ్మ ఇత్యార్షమ్, గాయత్రం ఛందం పరమాత్మం సరూపమ్, సాయుజ్యం వినియోగమ్."

ఓంకారముతో నిర్గుణబ్రహ్మోపాసనము చేయుటకు తెలియని యెడల "ఓంకారో బ్రహ్మ" అని ప్రతీకోపాసనమును చేయవలెను.

## 2. మధ్యమాధికారుల ఉపాసనవిధానము

మధ్యమాధికారులు ముందు, సగుణసంధ్యాఽహంగ్రహోపాసనమును చేసి, తర్వాత ఓంకారప్రతీకోపాసనమును చేయుదురు.

అందు=ప్రొద్దున ముందుగ—"అసావాదిత్యో బ్రహ్మ సోఽహమస్మి" అని 3, 4 సారులు అర్థానుసంధానపూర్వకముగ అనుకొనవలెను.

తర్వాత "ఆదిత్యమండలాంతర్యామియు,ఆదిత్యజీవప్రేరకము, ఐన బ్రహ్మచైతన్యము, ప్రాతస్సంధ్యాదేవతారూపమును ధరించును అని అనుకొనవలెను. తర్వాత ఉపాసనవాక్యార్థమును వివరముగ అనుసంధానము చేసికొనవలెను.

ఇప్పుడు ఎఱ్ఱని సూర్యమండలము యొక్క లోపల తెల్లని హంసను, ఆహంసమీద ఈ క్రింద వర్ణించినరీతిగా బ్రహ్మరూపముతో సంధ్యాదేవత తనకెదురుగా కూర్చొని యున్నట్లు చక్కగ ధ్యానింపవలెను.

ఎట్లనగా— "ఆదిత్యమండలాంతర్యామి – ఆదిత్యజీవప్రేరక – హంసవాహన – (రక్తవర్ణ – రక్తవస్త్ర – రక్తమాల్యవిభూషణ –

ప్రాతస్సంధ్యా దేవత



"అసావాదిత్యో బ్రహ్మ. సాఽహమస్మి.
ఆదిత్యమండలాంతర్యామి-ఆదిత్యజీవప్రేరక-హంసవాహన
బ్రహ్మరూప-గాయత్రీనామక, సంధ్యా, (సత్యజ్ఞానానంతం త్రిపాత్పరం)
బ్రహ్మ. సాఽహమస్మి (తాదృశత్రిపాత్పరబ్రహ్మభిన్న) సంధ్యాఽహమస్మి."

## మధ్యాహ్నసంధ్యా దేవత



"అసావాదిత్యో బ్రహ్మ. సోఽహమస్మి.
ఆదిత్యమండలాంతర్యామి-ఆదిత్యజీవప్రేరక-వృషభవాహన
రుద్రరూప-సావిత్రీనామక-సంధ్యా, (సత్యజ్ఞానానంతం త్రిపాత్పరం)
బ్రహ్మ. సోఽహమస్మి (తాదృశత్రిపాత్పరబ్రహ్మభిన్న) సంధ్యాఽహమస్మి."

సకిరీటచతుర్ముఖ - అక్షమాలా - పుస్తక - దండకమండలు ధర - చతుర్భుజ) బ్రహ్మరూప - గాయత్రీనామక - సంధ్యా = (సత్యం జ్ఞానం అనంతం త్రిపాత్ పరం) బ్రహ్మ. అని సంధ్యాదేవతను త్రిపాత్పరబ్రహ్మముతో అభిన్నముగ ధ్యానింపవలెను. తర్వాత "సాఽహమస్మి, (తాదృశ- త్రిపాత్పరబ్రహ్మాఽభిన్న) సంధ్యాఽహమస్మి" అని త్రిపాత్పరబ్రహ్మాఽభిన్నమగు సంధ్యాదేవతకును తనకును అభేదమును (సగుణసంధ్యాఽహంగ్రహోపాసనమును) పది నిమిషములైనను చేయవలెను.

## మధ్యాహ్నమున

"అసావాదిత్యో బ్రహ్మ. సాఽహమస్మి. 3, 4 సారులు చెప్పుకొనవలెను. ఆదిత్యమండలాంతర్యామియు, ఆదిత్యజీవప్రేరకము ఐన బ్రహ్మచైతన్యము, మధ్యాహ్నసంధ్యా దేవతారూపమును ధరించును. అని తలంచవలెను. తర్వాత ఉపాసనవాక్యార్థమును వివరముగ అనుసంధానింపవలెను:

ఇప్పుడు ఆకాశమున తెల్లని సూర్యమండలమునందు లోపల, తెల్లని ఎద్దుమీద ఈక్రిందవర్ణించిన రీతిగ రుద్రరూపముతో సంధ్యాదేవత తనకెదురుగ కూర్చొని యున్నట్లు చక్కగ నెమ్మదిగ చూచుచూ ధ్యానింపవలెను.

ఎట్లనగా—"ఆదిత్యమండలాంతర్యామి - ఆదిత్యజీవప్రేరక - వృషభవాహన (శుక్లవర్ణ - శుక్లవస్త్ర - శుక్లమాల్య విభూషణ - త్రినేత్రపంచముఖ - అర్ధేందుశేఖర - జటాజూటధర- త్రిశూల-డమరుక-దానముద్రా-అక్షమాలాధర- చతుర్భుజ-వ్యాఘ్రాజినధర- గజచర్మవిభూషిత) రుద్రరూప-సావిత్రీనామక-సంధ్యా=(సత్యం జ్ఞానం అనంతం త్రిపాత్ పరం) బ్రహ్మ. సాఽహమస్మి, (తాదృశ - త్రిపాత్పరబ్రహ్మాఽభిన్న) సంధ్యాఽహమస్మి. అని సగుణ-సంధ్యాఽహంగ్రహోపాసనము 10 నిమిషములు చేయునది.

మును పఠించి ''ఓంకారో బ్రహ్మ, అనుచు కొంత సేపు, ప్రతీకోపాసన మును చేయవలెను.

## 4. బాలురు

''అసావాదిత్యో బ్రహ్మ. సోఽహమస్మి'' అనుచు అర్థము తెలిసిన యెడల, అర్థభావనతో 20 సారులు పఠింపవలెను. అట్లే ''ఓంకారో బ్రహ్మ'' యనుచు అర్థమును తలంచుచు 20 సారులు జపింపవలెను. దేనికిని అర్థము తెలియని యెడల ఆ వాక్యములను మాత్రము పఠింపవలెను

## గాయత్రీ జపము

ఉపాసనానంతరము కూర్చొని, గాయత్రీహృదయమును అర్థ భావనాపురస్సరముగ పఠింపవలెను. ఎట్లనిన—

## ఆహ్వానము

ఆయాతు వరదా దేవీ అక్షరం బ్రహ్మసంమితం. గాయత్రీం ఛందసాం మాతేదం బ్రహ్మ జుషస్వ మే.

యదహ్నాత్కురుతే పాపం, తదహ్నాత్ప్రతిముచ్యతే, యద్రా త్రియాత్కురుతే పాపం, తద్రాత్రియాత్ప్రతిముచ్యతే॥

## 2. స్తుతి

సర్వవర్ణే! మహాదేవి! సంధ్యావిద్యే! సరస్వతి! ఓజోఽసి సహోఽసి, బలమసి, భ్రాజోఽసి। దేవానాం ధామ నామాఽసి విశ్వమసి విశ్వాయుః సర్వమసి సర్వాయురభిభూరోమ్.

## 3. ఆవాహనము

గాయత్రీమావాహయామి సావిత్రీమావాహయామి సర
స్వతీమావాహయామి ఛందర్షీనావాహయామి శ్రియమావాహ
యామి।

## 4. ఛందర్షిదేవతలు

గాయత్ర్యా గాయత్రీ ఛందో, విశ్వామిత్రఋషిః సవితా
దేవతా

## 5. ధ్యానము

అగ్నిర్ముఖం, బ్రహ్మ శిరో, విష్ణుర్హృదయగ్ం రుద్రః శిఖా,
పృథివీ యోనిః ప్రాణాపానవ్యానోదానసమానా సప్రాణా, శ్వేత
వర్ణా, సాంఖ్యాయనసగోత్రా గాయత్రీ చతుర్విగ్ంశత్యక్షరా
త్రిపదా షట్కుక్షిః పంచశీర్షోపనయనే వినియోగః॥

### ప్రాణాయామమంత్రము

ఓం భూః ఓం భువః ఓగ్ం సువః ఓం మహః ఓం జనః ఓం
తపః ఓగ్ం, సత్యం, ఓం తత్సవితుర్వరేణ్యం, భర్గో దేవస్య ధీమహి,
ధియో యో నః ప్రచోదయాత్ ఓమాపో జ్యోతీ రసోఽ
మృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్.

అరువదియొక్క అక్షరములున్నవి.

శక్యమైన యెడల, ఇంత పెద్ద ప్రాణాయామమంత్రముచేత
సంధ్యా తత్త్వసుబోధినిలో చెప్పిన ప్రకారము మూడుప్రాణాయామ
ములను చేయవలెను. శక్యము కానియెడల, చిన్న మంత్రములలో
ఒకదానితో చేయవచ్చును. తర్వాత సంకల్పమును చేయవక్క-ఱ

# శ్రీ గాయత్రిదేవి



## ధ్యానశ్లోకము

ముక్తా-విద్రుమ-హేమ-నీల-ధవళ-చ్ఛాయై ర్ముఖై స్త్రీక్షణై
ర్యుక్తామిందు-నిబద్ధ-రత్నమకుటాం తత్త్వార్థవర్ణాత్మికామ్।
గాయత్రీం వరదాఽభయాఽంకుశ-కశాః శుభ్రం కపాలం గదాం
శంఖం చక్రమథారవిందయుగళం హస్తైర్వహంతీం భజే॥

లేదు. ప్రథమమార్జనము మొదలగు పూర్వాంగములను సంకల్పము లేకుండ చేసినట్లే, గాయత్రీజపమును కూడ సంకల్పమక్కఱ లేకుండ గనే చేయవలెను. కాని జపమును మాత్రము లెక్కించవలెను. ఆరంభములో ఈ పద్ధతి ఏమో క్రొత్తగనుండును. కాలక్రమమున ప్రాతది యైపోవును. తర్వాత గాయత్రీమూర్తిని అర్థభావనాపురస్సరముగ ధ్యానింపవలెను.

## ధ్యానశ్లోకము

''ముక్తావిద్రుమహేమనీలధవళచ్ఛాయైర్ముఖై స్త్రీక్షణైః
యుక్తామిందునిబద్ధరత్నమకుటాం తత్త్వార్థవర్ణాత్మికాం।
గాయత్రీం వరదాభయాంకుశకశాః శుభ్రం కపాలం గదాం
శంఖం చక్రమథారవిందయుగళం హస్తైర్వహంతీం భజే॥

ఇట్లు ప్రొద్దున ఎఱ్ఱని సూర్యమండలమునందును, మధ్యాహ్నమున తెల్లని సూర్యమండలమునందును, సాయంకాలమున ఎఱ్ఱని సూర్యమండలమునందును, కోటిసూర్యప్రకాశమానమగు గాయత్రీ మూర్తిని స్పష్టముగ ఎదురుగ ఉన్నట్లు భక్తితో చూచుచు ధ్యానింపవలెను.

తర్వాత విశ్వామిత్రకృతమైన గాయత్రీమంత్రార్థశ్లోకమును,

శ్లో॥ యో దేవః సవితాఽస్మాకం ధియో ధర్మాదిగోచరాః।
ప్రేరయేత్తస్య యద్భర్గస్తద్వరేణ్యముపాస్మహే॥

అని పఠించి, ప్రొద్దున తూర్పుముఖముగ నిలబడి దోసిలిని నాభివద్దర ఉంచి, కుడిచేతి వ్రేళ్ళగనుపులందే జపమును లెక్కించుచు గాయత్రీమంత్రార్థమును అనుసంధానించుచు ఉపాంశుగనో, లేక మానసికముగనో వారి వారి శక్త్యవకాశములను అనుసరించి, నూట యెనిమిది గాని, యేబదినాలుగు గాని, ఇరువదెనిమిది గాని, పది గాని కనీసము ఎనిమిదిగాని, శక్తివంచన లేకుండ గాయత్రీమంత్ర

జపమును చేయవలెను. వాచకజపము ఆభిచారికమునందే చేయుదురు.

## మధ్యాహ్నమునందు

శక్తిననుసరించి నిలువబడి గాని, లేక కూర్చొని గాని తూర్పు ముఖముగ, చేతులను హృదయముదగ్గర నిలువుగనుంచి, ప్రాతః కాలమునందువలెనే జపించునది.

## సాయంకాలమున

వాయవ్యాభిముఖముగ, ఒక మోకాలినిగాని, రెండు మోకాళ్ళనుగాని ఎత్తుకొని కూర్చొని, గోసిలిని బొరగిల ముక్కునకు దగ్గరగ నుంచి, (మోజేతులను మోకాళ్ళమీద నుంచుకొనిన కొంత సౌకర్యముగ నుండునేమో) ప్రాతఃకాలమునందువలె జపింపవలెను. జపము పూర్తియైన తర్వాత "మయా కృతః అముకసంఖ్యాకః గాయత్రీమంత్రజపః తత్సద్బ్రహ్మార్పణమస్తు." అని పరబ్రహ్మమునకు అర్పించునది.

## గాయత్ర్యుద్వాసనము

గాయత్రీజపానంతరము "ఉత్తమే శిఖరే"యను ననువాకపు రెండు మంత్రములచేతను గాయత్రీదేవికి ఉద్వాసనము చెప్పవలెను.

## మంత్రము

1. ఉత్తమే శిఖరే జాతే భూమ్యాం పర్వతమూర్ధని, బ్రాహ్మణేభ్యోఽభ్యనుజ్ఞాతా గచ్ఛ దేవి! యథాసుఖమ్.

2. స్తుతో మయా వరదా వేదమాతా, ప్రచోదయంతీ పవనే ద్విజాతా, ఆయుః పృథివ్యాం ద్రవిణం బ్రహ్మవర్చసం, మహ్యాం దత్వా ప్రయాతుం బ్రహ్మలోకమ్॥ అని

## సూర్యోపస్థానము

'ప్రొద్దున సూర్యోపస్థానమును చేయుట కొఱకు, చేతులెత్తి నమస్కరించుచు ప్రాతర్మధ్యాహ్నములందు తూర్పుముఖముగను, సాయంకాలమున పడమరముఖముగను, నిలబడి, ఈ క్రింది యుపస్థానమంత్రములను అర్థభావనాపురస్సరముగ మూడు సంధ్యలందును క్రమముగ పఠింపవలెను.

## ప్రొద్దున సూర్యోపస్థానమంత్రము

ఓంమిత్రస్య చర్షణీధృతః శ్రవో దేవస్య సానసిం, సత్యం చిత్రశ్రవస్తమమ్, మిత్రో జనాన్ యాతయతి ప్రజానన్ మిత్రో దాధార పృథివీముత ద్యామ్. మిత్రః కృష్టీరనిమిషాభిచష్టే, సత్యాయ హవ్యం ఘృతవద్విధేమ. ప్ర స మిత్ర! మర్తో అస్తు ప్రయస్వాన్, యస్త ఆదిత్య! శిక్షతి వ్రతేన। న హన్యతే న జీయతే త్వోతో నైనమగ్ం హో అశ్నోత్యంతితో న దూరాత్॥

## మధ్యాహ్నసూర్యోపస్థాన మంత్రము

ఆ సత్యేన రజసా వర్తమానో నివేశయన్నమృతం మర్త్యం చ। హిరణ్యయేన సవితా రథేనా దేవో యాతి భువనా విపశ్యన్॥ ఉద్వయం తమసస్పరి పశ్యంతో జ్యోతిరుత్తమమ్. దేవం దేవత్రా సూర్యమగన్మజ్యోతిరుత్తమమ్. ఉదుత్యం జాతవేదసం, దేవం వహంతి కేతవః దృశే విశ్వాయ సూర్యం, చిత్రం దేవానాముదగాదనీకం చక్షు

ర్మిత్రస్య వరుణస్యాగ్నేః। ఆప్రా ద్యావాపృథివీ అంతరిక్షగ్ం,సూర్య ఆత్మా జగత స్తస్థుషశ్చ.తచ్చక్షుర్దేవహితం పురస్తాచ్ఛుక్రముచ్చరత్। పశ్యేమ శరదశ్శతమ్ జీవేమ శరదశ్శతమ్। నందామ శరదశ్శతమ్ మోదామ శరదశ్శతమ్। భవామ శరదశ్శతగ్ం శ్రుణవామ శరదశ్శతమ్। ప్రబ్రవామ శరదశ్శత మజీతాస్స్యామ శరదశ్శతమ్॥ జ్యోక్చ సూర్యం దృశే। య ఉదగాన్మహతోఽర్ణవాద్విభ్రాజమానస్సరిరస్య మధ్యాత్। స మా వృషభో లోహితాక్షస్సూర్యో విపశ్చిన్మన సా పునాతు॥

## సాయంకాలసూర్యోపస్థానమంత్రము

ఇమం మే వరుణ! శ్రుధీహవమద్యా చ మృడయ। త్వామవస్యురాచకే. తత్త్వా యామి బ్రహ్మణా వందమాన స్తదాశాస్తే యజమానో హవిర్భిః। అహేడమానో వరుణేహ బోధ్యురుశగ్ంస! మా న ఆయుః ప్రమోషీః। యచ్చిద్ధి తే విశో యథా, ప్ర దేవ! వరుణ! వ్రతమ్। మినీమసి ద్యవి ద్యవి। యత్కించేదం వరుణ! దైవ్యే జనేఽభిద్రోహం మనుష్యాశ్చరామసి। అచిత్తీ యత్తవ ధర్మా యుయోపిమ, మా న స్తస్మాదేనసో దేవ! రీరిషః। కితవాసో యద్రిరిపుర్న దీవి యద్వాఘా సత్యముతయన్న విద్మ, సర్వాతా విష్య శిధిరేవ దేవాథా తే స్యామ వరుణ ప్రియాసః॥

## దిఙ్నమస్కారము

ఇచ్చట దిఙ్నమస్కారమున వాక్యములన్నియును సంధులు విడదీసి వ్రాయబడినవి.

తూర్పు. ఓం నమః ప్రాచ్యై దిశే, యాశ్చ దేవతా, ఏతస్యాం ప్రతివసంతి। ఏతాభ్యశ్చ నమః।

దక్షిణము. ఓం నమో దక్షిణాయై దిశే, యాశ్చ దేవతా, ఏతస్యాం ప్రతివసంతి। ఏతాభ్యశ్చ నమః।

పడమర. ఓం నమః ప్రతీచ్యై దిశే, యాశ్చ దేవతా, ఏతస్యాం ప్రతివసంతి। ఏతాభ్యశ్చ నమః.

ఉత్తరము. ఓం నమ ఉదీచ్యై దిశే, యాశ్చ దేవతా, ఏతస్యాం ప్రతివసంతి। ఏతాభ్యశ్చ నమః.

పైదిక్కు. ఓం నమ ఊర్ధ్వాయై దిశే, యాశ్చ దేవతా, ఏతస్యాం ప్రతివసంతి। ఏతాభ్యశ్చ నమః.

క్రింది దిక్కు. ఓం నమోఽధరాయై దిశే, యాశ్చ దేవతా, ఏతస్యాం ప్రతివసంతి। ఏతాభ్యశ్చ నమః.

భూమ్యాకాశముల, నలుదిక్కుల మధ్య దిక్కు. ఓం నమోఽవాంతరాయై దిశే, యాశ్చ దేవతా ఏతస్యాం ప్రతివసంతి, ఏతాభ్యశ్చ నమః.

## మంత్రము

ఇదం ద్యావాపృథివీ సత్యమస్తు। పితర్మాతర్యదిహోప బ్రువే వామ్। భూతం దేవానామవమే అవోభిః। విద్యామేషం వృజనం జీరదానుమ్॥

## విష్ణుస్తుతి

1. ఆకాశాత్పతితం తోయం
   యథా గచ్ఛతి సాగరం।
   సర్వదేవనమస్కారః
   కేశవం ప్రతిగచ్ఛతి॥

2. సర్వవేదేషు యత్పుణ్యం
   సర్వతీర్థేషు యత్ఫలం।
   తత్ఫలం పురుష ఆప్నోతి
   స్తుత్వా దేవం జనార్దనమ్॥

3. వాసనాద్వాసుదేవస్య
   వాసితం తే జగత్త్రయం।
   సర్వభూతనివాసోఽసి
   వాసుదేవ! నమోఽస్తు తే॥

శ్రీవాసుదేవ! నమోఽస్తు తే॥

## అభివాదనమ్

ఆపస్తంబసూత్రులైన ద్విజులు తమ కుడిచేతిని కుడిచెవికి దగ్గరగా వంచి, ఎడమచేతితో కుడిచేతిముడుకును తాకుచు, ప్రవరను చెప్పి, ఆసమయమున అచ్చటనున్న గురువులు పండితులు, పెద్దలు మొదలగువారిని నమస్కరింపవలెను.

ఎట్లనగా—

"చతుస్సాగరపర్యంతం, గోబ్రాహ్మణేభ్యః శుభం భవతు। ఆంగీరస- బార్హస్పత్య-భారద్వాజ- త్ర్యార్షేయ-ప్రవరాన్విత, భారద్వాజసగోత్రః, యజుర్వేదీ తైత్తరీయశాఖాధ్యాయీ, ఆపస్తంబ సూత్రో వేంకటాచలశర్మా అహం భో అభివాదయే. అని,

ఇచ్చట వారి వారి ప్రవరఋషులను గోత్రమును, వారి వారి వేదమును, వేదశాఖను, సూత్రమును తమ పేరును మార్చి, చెప్పుకొనవలెను.

తర్వాత ఆచారము ననుసరించి కర్మాంతమున ఒక పురాణాచమనమును చేయవలెను.

తర్వాత—

## సర్వదేవబ్రాహ్మణ నమస్కారము

శ్లో॥ ఆబ్రహ్మలోకాదాశేషాత్
ఆలోకాలోకపర్వతాత్ ।
యే సంతి బ్రాహ్మణా దేవాః
తేభ్యో నిత్యం నమో నమః॥

# పరమేశ్వరార్పణము

శ్లో॥ కాయేన వాచా మనసేంద్రియైర్వా
బుద్ధ్యాత్మనా వా ప్రకృతేః స్వభావాత్ ।
కరోమి యద్యత్సకలం పరస్మై
నారాయణాయేతి సమర్పయామి॥

ఓమ్ తత్ సత్
బ్రహ్మార్పణమస్తు.
యజుర్వేదీయ
త్రికాలసంధ్యావందనప్రయోగము
సమాప్తము.

---

ఓమ్

శ్రీమహాగణపతయే నమః

# ఋగ్వేదసంధ్యావందనప్రయోగము

ఋగ్వేదసంధ్యావందనానుష్ఠానము, యజుర్వేదసంధ్యావందనానుష్ఠానము వలెనే యుండును. కాని యచ్చటచ్చట కొన్ని మంత్రములు మారును. ఇంకను, ప్రతికర్మకును ఋషిచ్ఛందోదేవతావినియోగములుండును. ఇట్లు కొన్ని పోలికలును, కొన్ని వ్యత్యాసములును ఉండును.

శ్లో॥ అపవిత్రః పవిత్రో వా సర్వావస్థాం గతోఽపి వా।
యస్స్మరేత్ పుండరీకాక్షం స బాహ్యాభ్యంతరే శుచిః॥

పుండరీకాక్ష! పుండరీకాక్ష! పుండరీకాక్ష! నమస్కారము చేయవలెను.

ఒక పురాణాచమనమును చేయవలెను. భస్మధారణ, రెండు స్మార్తాచమనములను చేయవలెను.

## ఆసనస్వీకారము

పృథివ్యా మేరుపృష్ఠఋషిః, కూర్మో దేవతా, సుతలం ఛందః, ఆసనే వినియోగః.

శ్లో॥ పృథ్వి త్వయా ధృతా లోకాః, దేవి త్వం విష్ణునా ధృతా।
త్వం చ ధారయ మాం దేవి! పవిత్రం కురు చాసనమ్॥

అనంతాసనాయ నమః. కుడిచేతి యనామికతో తాను కూర్చొనిన భూమిని తాకవలెను.

## ప్రాణాయామము

1. ప్రణవస్య పరబ్రహ్మ ఋషిః, పరమాత్మా దేవతా, దైవీ గాయత్రీ ఛందః.

2. శ్రీగాయత్రీ పూర్వాంగ- సప్తవ్యాహృతి - మంత్రాణాం- విశ్వామిత్ర- జమదగ్ని-భరద్వాజ - గౌతమాఽత్రి-వసిష్ఠ - కశ్యపాః ఋషయః। అగ్నివాయుసూర్యవాగీశవరుణేంద్రవిశ్వేదేవాః దేవతాః। గాయత్ర్యుష్ణి - గనుష్టుప్ - బృహతీ - పంక్తి - త్రిష్టుప్ - జగత్యః ఛందాంసి.

3. గాయత్ర్యాః విశ్వామిత్ర ఋషిః. సవితా దేవతా, గాయత్రీ ఛందః.

4. గాయత్రీశిరోమంత్రస్య ప్రజాపతిః ఋషిః, బ్రహ్మాగ్ని వాయ్వాదిత్యాః దేవతాః, యజుశ్ఛందః, ప్రాణాయామే విని యోగః.

మంత్రము. (1) ఓం భూః. ఓం భువః, ఓం స్వః. ఓం మహః, ఓం జనః, ఓం తపః, ఓం సత్యం, (2) ఓం తత్సవితుర్వరేణ్యం, భర్గో దేవస్య ధీమహి, ధియో యో నః ప్రచోదయాత్, (3) ఓ మాపో జ్యోతీ రసోఽమృతం బ్రహ్మ భూర్భువస్స్వరోమ్.

ఈ ప్రాణాయామ మంత్రముతో ప్రాణాయామమును చేయవలెను. లేక తైత్తరీయమునందు వలె చేయవలెను.

## సంకల్పము

మమోపాత్తదురితక్షయద్వారా శ్రీ పరమేశ్వరప్రీత్యర్థం, ప్రాతః (మధ్యాహ్న, సాయం) సంధ్యాముపాసిష్యే.

## ప్రథమమార్జనము

ఆపోహిష్ఠేతి తిసృణాం మంత్రాణాం అంబరీషస్సింధుద్వీప ఋషిః, ఆపో దేవతాః, గాయత్రీ ఛందః, మార్జనే వినియోగః.

మంత్రము. (1) ఓం ఆపో హి ష్ఠా మయో భువః, (2) ఓం తా న ఊర్జే దధాతన, (3) ఓం మహే రణాయ చక్షసే, (4) ఓం యో వశ్శివతమో రసః, (5) ఓం తస్య భాజయతే హ నః, (6) ఓం ఉశతీరివ మాతరః, (7) ఓం తస్మా అరం గమామ వః, (8) ఓం యస్య క్షయాయ జిన్వథ, (9) ఓం ఆపో జనయథా చ నః.

ఇచ్చట ఎనిమిదవ మంత్రము తప్ప, మిగిలిన ఎనిమిది మంత్రముల చివరను, తలమీద జలమును చల్లుకొనవలెను. ఎనిమిదవ మంత్రముతో మాత్రము పాదములమీద చల్లుకొనవలెను.

## మంత్రాచమనము

### ప్రొద్దున

సూర్యస్యేత్యస్య మంత్రస్య. యాజ్ఞవల్క్యోపనిషద ఋషిః, సూర్య-మన్యు-మన్యుపతి - రాత్రయో దేవతాః, ప్రకృతిశ్ఛందః, మంత్రాచమనే వినియోగః.

మంత్రము. సూర్యశ్చ మా మన్యుశ్చ మన్యుపతయశ్చ మన్యుకృతేభ్యః, పాపేభ్యో రక్షంతామ్. యద్రాత్ర్యా పాపమకార్షం, మనసా వాచా హస్తాభ్యామ్. పద్భ్యాముదరేణ శిశ్నా, రాత్రి స్తదవలుంపతు, యత్కించ దురితం మయి, ఇదమహం మామమృతయోనౌ, సూర్యే జ్యోతిషి జుహోమి స్వాహా.

అనుచు చేతిలోని జలమును త్రాగవలెను.

## మధ్యాహ్నమున

ఆపఃపునంత్విత్యస్య మంత్రస్య, పూతఋషిః, ఆపో దేవతాః, అష్టిశ్ఛందః, మంత్రాచమనే వినియోగః.

మంత్రము. ఆపః పునంతు పృథివీం, పృథివీ పూతా పునాతు మాం. పునంతు బ్రహ్మణస్పతిర్బ్రహ్మ పూతా పునాతు మాం. యదుచ్ఛిష్టమభోజ్యం యద్వా దుశ్చరితం మమ, సర్వం పునంతు మామాపోఽసతాం చ ప్రతిగ్రహం స్వాహా॥

జలమును త్రాగవలెను.

## సాయంకాలమున

అగ్నిశ్చేత్యస్య మంత్రస్య, యాజ్ఞవల్క్యోపనిషద ఋషిః, అగ్ని-మన్యు - మన్యుపత్యహర్దేవతాః, ప్రకృతిశ్ఛందః, మంత్రాచమనే వినియోగః.

మంత్రము. అగ్నిశ్చ మా మన్యుశ్చ మన్యుపతయశ్చ మన్యుకృతేభ్యః, పాపేభ్యో రక్షంతామ్, యదహ్నా పాపమకార్షమ్॥ మనసా వాచా హస్తాభ్యామ్, పద్భ్యాముదరేణ శిశ్నా, అహస్తదవలుంపతు, యత్కించ దురితం మయి, ఇదమహం మామమృతయోనౌ, సత్యే జ్యోతిషి జుహోమి స్వాహా జలమును త్రాగవలెను.

రెండు స్మార్తాచమనములను చేయవలెను.

# పునర్మార్జనము

ఆపోహిష్ఠేతి నవర్చస్య సూక్తస్య (ఖైలికా సహ దశర్చస్య సూక్తస్య।) అంబరీషపుత్రః సింధుద్వీప ఋషిః। పంచమీ వర్ధమానా, సప్తమీ ప్రతిష్ఠా, అంత్యే ద్వే అనుష్టుభౌ, శిష్టా గాయత్రీఛందః, ఆపో దేవతాః, మార్జనే వినియోగః. ఆపోహిష్ఠా-మొదలగు తొమ్మిది పాదములతో మార్జన మొదటివలెనే. అటుపైని క్రొత్త మంత్రములు చెప్పబడును.

1. ‘‘శం నో దేవీరభిష్టయ ఆపో భవంతు పీతయే। శంయో రభిస్రవంతు నః॥

2. ఈశానా వార్యాణాం క్షయంతీ శ్చర్షణీనామ్, అపో యాచామి భేషజమ్॥

3. అప్సు మే సోమో అబ్రవీదంతర్విశ్వాని భేషజా। అగ్నిం చ విశ్వశంభువమ్॥

4. ఆపః పృణీత భేషజం వరూథం తన్వే3మమ। జ్యోక్చ సూర్యం దృశే॥

5. ఇదమాపః ప్రవహత యత్కించ దురితం మయి, యద్వా హమభిదుద్రోహ యద్వా శేప ఉతానృతమ్॥

6. అపో అద్యాన్వచారిషం రసేన సమగస్మహి (సృక్ష్మహి) పయస్వానగ్న ఆగహి తం మా సంసృజ వర్చసా॥

మంత్రము చివర మార్జనము చేయవలెను.

Q

## పాపపురుషదహనము

ఋతం సత్యం చేత్యస్య సూక్తస్య, అఘమర్షణ ఋషిః, భావవృత్తో దేవతా, అనుష్టుప్ ఛందః, పాపపురుష జలవిసర్జనే వినియోగః॥

1. ఋతం చ సత్యం చాభీద్ధాత్తపసోఽధ్యజాయత, తతో రాత్ర్యజాయత తతస్సముద్రో అర్ణవః॥

2. సముద్రాదర్ణవాదధి సంవత్సరో అజాయత। అహోరాత్రాణి విదధద్విశ్వస్య మిషతో వశీ॥

3. సూర్యాచంద్రమసౌ ధాతా, యథాపూర్వమకల్పయత్॥ దివం చ పృథివీం చాంతరిక్షమథో స్వః॥

ఈ పాపపురుషదహనప్రకారము తైత్తరీయసంధ్యావందనమందువలెనే చేయునది.

## అర్ఘ్య ప్రదానము

### ప్రాతస్సాయములందు

తత్సవితురిత్యస్య మంత్రస్య గాధిపుత్రో విశ్వామిత్ర ఋషిః। సవితా దేవతా, గాయత్రీ ఛందః, ప్రాతరర్ఘ్య ప్రదానే వినియోగః॥

తైత్తరీయసంధ్యావందనమునందు వలెనే ఇచ్చునది. ప్రదక్షిణాచమనములను మూడు సంధ్యలందును తైత్తరీయమునందు వలెనే, ఒకేవిధముగ చేయవలెను. కాలాతిక్రమణ ప్రాయశ్చిత్తము కూడ తైత్తరీయమునందు వలెనే.

## మధ్యాహ్నసంధ్యాంగ - అర్ఘ్యప్రదానము

తొలుత "హంస మంత్రము"తో నొకయర్ఘ్యమును, తర్వాత

"ఆకృష్ణేన" మంత్రముతో నొక యర్ఘ్యమును, మూడవ దానిని గాయత్రితో నీయవలెను. ప్రయోగ మిాక్రింది విధముగ.

1. హంసశ్శుచిషదిత్యస్య మంత్రస్య గౌతమపుత్రో వామ దేవ ఋషిః। సూర్యో దేవతా। జగతీ చ్ఛందః। మధ్యాహ్న సంధ్యాంగార్ఘ్యప్రదానే వినియోగః॥

మంత్రము. "హంసశ్శుచిషద్వసురంతరిక్షసద్ధోతా వేదిషద తిథిర్దురోణసత్ । నృషద్వరసదృతసద్వ్యోమసదబ్జా గోజా ఋతజా అద్రిజాఋతమ్॥ అర్ఘ్యము నిచ్చునది.

2. ఆ కృష్ణేనేత్యస్య మంత్రస్య। హిరణ్యస్తూప ఋషిః। సవితా దేవతా। త్రిష్టుప్ ఛందః। మధ్యాహ్నసంధ్యాంగార్ఘ్యప్రదానే విని యోగః॥

మంత్రము. "ఆ కృష్ణేన రజసా వర్తమానో నివేశయన్న మృతం మర్త్యం చ। హిరణ్యయేన సవితా రథేనాదేవో యాతి భువనా విపశ్యన్ ॥

3. తత్సవితురిత్యస్య మంత్రస్య, గాధిపుత్రో విశ్వామిత్ర ఋషిః। సూర్యో దేవతా। గాయత్రీ ఛందః। మాధ్యాహ్నికసం ధ్యాంగార్ఘ్యప్రదానే వినియోగః॥

మంత్రము. ఓం భూర్భువస్వః, తత్సవితుర్వరేణ్యం—ఇత్యాది గాయత్రీ మంత్రముతో మూడవ యర్ఘ్యము నిచ్చునది.

గాయత్రీమంత్రమున "భర్గో" యని స్వరితమును చెప్ప వలెను. సాయంకాలార్ఘ్యప్రదానము పాతఃకాలార్ఘ్యప్రదానము వలెనే చేయవలెను.

ప్రదక్షిణాచమనములు చేయవలెను.

## సంధ్యోపాసనము

తైత్తరీయప్రయోగమునందు వలెనే మూడు ప్రాణాయామములు చేసి, ప్రాతః మాధ్యాహ్నిక సాయంసంధ్యోపాసనములను చేయువలెను. అధికారము ననుసరించి ఉపాసనమును చేయవలెను.

## నిరుపాధికబ్రహ్మోపాసనము

ఓమిత్యేకాక్షరం బ్రహ్మ। అగ్నిర్దేవతా బ్రహ్మ ఇత్యార్షమ్॥ గాయత్రం ఛందం పరమాత్మం సరూపమ్। సాయుజ్యం వినియోగమ్॥

అధికారము ననుసరించి, ప్రతీకోపాసనమును గాని, నిరుపాధికనిర్గుణబ్రహ్మోపాసనమును గాని, కేవలవాక్యపఠనమునుగాని చేయునది.

## గాయత్రీజపము

తొలుత, గాయత్రీహృదయపఠనము అర్థభావనాపురస్సరముగ చేయవలెను.

మంత్రము. ఆయాతు వరదా దేవీ అక్షరం బ్రహ్మసమ్మితమ్। గాయత్రీం ఛందసాం మాతేదం బ్రహ్మ జుషస్వ మే। యదహ్నాత్కురుతే పాపం తదహ్నాత్ప్రతిముచ్యతే। యద్రాత్రియాత్కురుతే పాపం తద్రాత్రియాత్ప్రతిముచ్యతే। సర్వవర్ణే మహాదేవి! సంధ్యావిద్యే! సరస్వతి! ఓజోఽసి సహోఽసి బలమసి భ్రాజోఽసి, దేవానాం ధామ నామాఽసి। విశ్వమసి విశ్వాయుః సర్వమసి సర్వాయు రభిభూరోమ్, గాయత్రీమావాహయామి సావిత్రీమావా

హాయామి, సరస్వతీమావాహయామి, ఛందర్షీ నావాహయామి, శ్రియమావాహయామి,। గాయత్ర్యా గాయత్రీ చ్ఛందో విశ్వామిత్ర ఋషిస్సవితా దేవతాఽగ్నిర్ముఖం బ్రహ్మా శిరో విష్ణుర్హృదయం రుద్రశ్శిఖా పృథివీ యోనిః ప్రాణాపానవ్యానోదానసమానా సప్రాణా శ్వేతవర్ణా సాంఖ్యాయనసగోత్రా గాయత్రీ చతుర్వింశత్యక్షరా త్రిపదా షట్కుక్షిః, పంచశీర్షోపనయనే వినియోగః॥

మూడు ప్రాణాయామములను చేసి, మమోపాత్తదురితక్షయ ద్వారా శ్రీ గాయత్రీదేవీప్రసాదసిద్ధ్యర్థం అష్టోత్తరశత—(చతుః పంచాశత్; అష్టావింశతి; దశ)—సంఖ్యాక - గాయత్రీమంత్రజపం కరిష్యే॥ అని సంకల్పముచేసి "ముక్తావిద్రుమ=శ్లోకముతో గాయత్రీ ధ్యానము చేయవలెను. ధ్యాన శ్లోకము.

"ముక్తావిద్రుమహేమనీలధవళచ్ఛాయైర్ముఖైస్త్రీక్షణై
ర్యుక్తామిందునిబద్ధరత్నమకుటాం తత్త్వార్థవర్ణాత్మికామ్।
గాయత్రీం వరదాభయాంకుశకశాః శుభ్రం కపాలం గదాం
శంఖం చక్రమథారవిందయుగళం హస్తైర్వహంతీం భజే॥

తర్వాత జపము చేయవలెను. తర్వాత 'మయా కృతః=== సంఖ్యాకః గాయత్రీజపః తత్సద్బ్రహ్మార్పణమస్తు. అని, నీళ్ళు విడిచి పెట్టవలెను.

## గాయత్రీ - ఉద్వాసనము

మంత్రము. (1) ఉత్తమే శిఖరే జాతే, భూమ్యాం పర్వత మూర్ధని। బ్రాహ్మణేభ్యోఽభ్యనుజ్ఞాతా, గచ్ఛ దేవి! యథాసుఖమ్॥

(2) స్తుతో మయా వరదా వేదమాతా, ప్రచోదయంతీ

పవనే ద్విజాతా। ఆయుః పృథివ్యాం ద్రవిణం బ్రహ్మవర్చసం, మహ్యాం దత్వా ప్రయాతుం బ్రహ్మలోకమ్॥ గాయత్రీహృదయము మొదలు ఇంతవరకు మంత్రార్థము తైత్తరీయసంధ్యవలె.

## సూర్యోపస్థానము

### ప్రొద్దున

1. మిత్రస్య చర్షణీధృత ఇతి చతసృణాం మంత్రాణాం విశ్వామిత్ర ఋషిః। మిత్రో దేవతా। గాయత్రీ ఛందః। మిత్రోపస్థానే వినియోగః।

మంత్రము. 1. మిత్రస్య చర్షణీధృతోఽవో దేవస్య సానసిం। ద్యుమ్నం చిత్రశ్రవస్తమమ్।

2. అభి యో మహినా దివం మిత్రో బభూవ సప్రథాః అభిశ్రవోభిః పృథివీమ్॥

3. మిత్రాయ పంచ యేమిరే జనా అభిష్టిశవసే। స దేవాన్విశ్వాన్బిభర్తి॥

4. మిత్రో దేవేష్వాయుషు జనాయ వృక్తబర్హిషే। ఇష ఇష్టవ్రతా అకః॥

## ప్రాతస్సాయంసంధ్యాంగ సంధ్యోపస్థానమ్

జాతవేదస ఇత్యస్య మంత్రస్య, మరీచిపుత్రః కశ్యప ఋషిః, జాతవేదా అగ్నిర్దేవతా। త్రిష్టుప్ఛందః॥ సంధ్యోపస్థానే వినియోగః.

మంత్రము. జాతవేదసే సునవామ సోమమరాతీయతో నిదహాతి వేదః । స నః పర్షదతి దుర్గాణి విశ్వా నావేవ సింధుం దురితాత్యగ్నిః॥

## ప్రాతస్సాయం శాంతిమంత్రము

తచ్ఛంయోరిత్యస్య మంత్రస్య । శంయుర్ ఋషిః । విశ్వేదేవా దేవతాః।శక్వరీచ్ఛందః।శాంత్యర్థే జపే వినియోగః॥

మంత్రము. ఓం తచ్ఛంయోరావృణీమహే। గాతుం యజ్ఞాయ। గాతుం యజ్ఞపతయే। దైవీ స్వస్తిరస్తు నః । స్వస్తిర్మానుషేభ్యః । ఊర్ధ్వం జిగాతు భేషజమ్। శం నో అస్తు ద్విపదే। శం చతుష్పదే॥ ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః.

## ప్రాతస్సాయంసంధ్యాంగ దిఙ్మన్యాద్యభివందనమ్

ఓం నమః ప్రాచ్యై దిశే। యాశ్చ దేవతా ఏతస్యాం ప్రతివసంత్యేతాభ్యశ్చ నమః। ఓం నమోదక్షిణాయై దిశే యాశ్చ దేవతా ఏతస్యాం ప్రతివసంత్యేతాభ్యశ్చ నమః। ఓం నమః ప్రతీచ్యై దిశే యాశ్చ దేవతా ఏతస్యాం ప్రతివసంత్యేతాభ్యశ్చ నమః। ఓం నమ ఉదీచ్యై దిశే యాశ్చ దేవతా ఏతస్యాం ప్రతివసంత్యేతాభ్యశ్చ నమః। ఓం నమ ఊర్ధ్వాయై దిశే, యాశ్చ దేవతా ఏతస్యాం ప్రతివసంత్యేతాభ్యశ్చ నమః। ఓం నమోఽధరాయై దిశే, యాశ్చ దేవతా ఏతస్యాం ప్రతివసంత్యేతాభ్యశ్చ నమః। ఓం నమోఽవాంత

రాష్యై దిశే యాశ్చ దేవతా ఏతస్యాంప్రతివసంత్యేతాభ్యశ్చనమః।
నమో గంగాయమునయోర్మధ్యే యే వసంతి, తే మే ప్రసన్నాత్మా
నశ్చిరం జీవితం వర్ధయంతి। నమో గంగాయమునయోర్మునిభ్యశ్చ
నమో నమో గంగాయమునయోర్మునిభ్యశ్చ నమః సంధ్యాయై
నమః, సావిత్ర్యై నమః, గాయత్ర్యై నమః। సరస్వత్యైనమః.
సర్వాభ్యో దేవతాభ్యోనమః. దేవేభ్యోనమః. ఋషిభ్యోనమః॥
మునిభ్యో నమః. గురుభ్యో నమః. పితృభ్యో నమః. కామో
ఽకార్షీ న్మన్యురకార్షీ న్నమో నమః. పృథివ్యాప స్తేజో వాయు
రాకాశాత్ ఓం నమో భగవతే వాసుదేవాయ యాం సదా
సర్వభూతాని చరాణి స్థావరాణి చ। సాయం ప్రాతర్నమస్యంతి, సా
మా సంధ్యాఽభిరక్షతు. శివాయ విష్ణురూపాయ, శివరూపాయ
విష్ణవే। శివస్య హృదయం విష్ణుర్విష్ణోశ్చ హృదయం శివః॥

యథా శివమయో విష్ణు రేవం విష్ణుమయశ్శివః।
యథాంతరం న పశ్యామి తథా మే స్వస్తిరాయుషి॥
నమో బ్రహ్మణ్యదేవాయ గోబ్రాహ్మణహితాయ చ।
జగద్ధితాయ కృష్ణాయ గోవిందాయ నమో నమః॥

## విరాట్పురుషవందనమ్

శ్లో॥ నమోఽస్త్వనంతాయ సహస్రమూర్తయే, సహస్ర
పాదాక్షిశిరోరుబాహవే। సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే,
సహస్రకోటీయుగధారిణే నమః॥

ఆకాశాత్పతితం తోయం, యథా గచ్ఛతి సాగరం।
సర్వ దేవనమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి॥
వాసనాద్వాసుదేవస్య వాసితం తే జగత్త్రయం।
సర్వభూతనివాసోఽసి వాసుదేవ! నమోఽస్తు తే॥

## భూమ్యాకాశవందనమ్

మంత్రము. ఇదం ద్యావాపృథివీ సత్యమస్తు పితర్మాతర్యది హోపబ్రువే వామ్। భూతం దేవానామవమే అవోభిర్విద్యామేషం వృజనం జీరదానుమ్॥

శ్లో॥ సర్వవేదేషు యత్పుణ్యం సర్వతీర్థేషు యత్ఫలం।
తత్ఫలం పురుష ఆప్నోతి స్తుత్వా దేవం జనార్దనమ్॥

దిఙ్నమస్కారమునుండి ఇంతవరకు గల మంత్రముల యర్థమును తైత్తరీయసంధ్యామంత్రార్థబోధినియందు చూడవలెను.

## మాధ్యాహ్నికసూర్యోపస్థానము

ఉదుత్యం జాతవేదసమితి, త్రయోదశర్చస్య సూక్తస్య। కణ్వపుత్రః ప్రస్కణ్వ ఋషిః। సూర్యో దేవతా। నవాద్యా గాయత్రీ ఛందః। అంత్యాశ్చతస్రో అనుష్టుభః సూర్యోపస్థానే వినియోగః।

1. ఉదుత్యం జాతవేదసం దేవం వహంతి కేతవః। దృశే విశ్వాయ సూర్యమ్॥ 2. అప త్యే తాయవో యథా నక్షత్రా యంత్యక్తుభిః। సూరాయ విశ్వచక్షసే॥ 3. అదృశ్రమస్య కేతవో విరశ్మయో జనా అను। భ్రాజంతో అగ్నయో యథా॥ 4. తరణి

ర్విశ్వదర్శతో జ్యోతిష్కృదసి సూర్య! విశ్వమాభాసి రోచనమ్॥
5. ప్రత్యఙ్ దేవానాం। విశః ప్రత్యఙ్ఙు దేషి మానుషాన్। ప్రత్యఙ్ విశ్వం స్వర్దృశే॥ 6. యేనా పావక। చక్షసా భురణ్యాం తం జనా అను। త్వం వరుణ పశ్యసి। 7. విద్యామేషి రజస్పృథ్వహా మిమానో అక్తుభిః। పశ్యఞ్జన్మాని సూర్య॥ 8. సప్త త్వా హరితో రథే వహంతి దేవ సూర్య! శోచిష్కేశం విచక్షణ॥ 9. అయుక్త సప్త శుంధ్యువః సూరో రథస్య నప్త్యః। తాభిర్యాతి స్వయుక్తిభిః॥ 10. ఉద్వయం తమసస్పరి జ్యోతిష్పశ్యంత ఉత్తరమ్। దేవం దేవత్రా సూర్యమగన్మ జ్యోతిరుత్తమమ్॥ 11. ఉద్యన్నద్య మిత్రమహః ఆరోహన్నుత్తరాం దివమ్। హృద్రోగం మమ సూర్య హరిమాణం చ నాశయ॥ 12. శుకేషు మే హరిమాణం రోపణాకాసు దధ్మసి। అథో హారిద్రవేషు మే హరిమాణం ని దధ్మసి॥ 13. ఉదగాదయమాదిత్యో విశ్వేన సహసా సహ। ద్విషంతం మహ్యం రంధయన్మో అహం ద్విషతే రథమ్॥

కొంతమంది ఈక్రిందియారు మంత్రములతోను ఉపస్థానమును చెప్పుదురు.

చిత్రం దేవానామితి షడర్చస్య సూక్తస్య। ఆంగిరసః కుత్స ఋషిః। సూర్యో దేవతా। త్రిష్టుప్ఛందః। సూర్యోపస్థానే వినియోగః॥

మంత్రము–1. చిత్రం దేవానాముదగాదనీకం చక్షుర్మిత్రస్య వరుణస్యాగ్నేః। ఆ ప్రా ద్యావాపృథివీ అంతరిక్షం సూర్య ఆత్మా జగత స్తస్థుషశ్చ॥ 2. సూర్యో దేవీముషసం రోచమానాం మర్యో న యోషామభ్యేతి పశ్చాత్। యత్రానరో దేవయంతో యుగాని వితన్వతే ప్రతి భద్రాయ భద్రమ్॥ 3. భద్రా అశ్వా హరితః సూర్యస్య చిత్రా ఏతగ్వా అను మాద్యాసః। నమస్యంతో దివ ఆపృష్ఠమస్థుః పరి ద్యావా పృథివీ యంతి సద్యః॥ 4. తత్సూర్యస్య దేవత్వం తన్మహిత్వం మధ్యా కర్తోర్వితతం సంజభార। యదేదయుక్త హరితః సధస్థాదాద్రాత్రీ వాస స్తనుతే సిమస్మై॥ 5. తన్మిత్రస్య వరుణస్యాభిచక్షే సూర్యో రూపం కృణుతే ద్యోరుపస్థే। అనంత మన్యద్రుశదస్య పాజః కృష్ణమన్యద్ధరితః భరంతి॥ 6. అద్యా దేవా ఉదితా సూర్యస్య నిరంహసః పిపృతా నిరవద్యాత్। తన్నో మిత్రో వరుణో మామహంతామదితిః సింధుః పృథివీ ఉత ద్యౌః॥

మధ్యాహ్నసంధ్యయందు దిఙ్నమస్కారము మొదలు సంధ్యోపస్థానమువరకును లేవు.

## మాధ్యాహ్నికశాంతిమంత్రము

ఓం నమో బ్రహ్మణే ఇత్యస్య మంత్రస్య, ప్రజాపతి ఋషిః। విశ్వేదేవాః దేవతాః। జగతీ చ్ఛందః। ఉపస్థానే వినియోగః॥

మంత్రము. నమో బ్రహ్మణే। నమో అస్త్వగ్నయే। నమః పృథివ్యై నమ ఓషధీభ్యః నమో వాచే నమో వాచస్పతయే। నమో విష్ణవే బృహతే కరోమి॥

ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః.

## అభివాదనము

తైత్తరీయమునందు వలెనే.

## సాయం సూర్యోపస్థానము

యచ్చిద్ధిత ఇతి పంచర్చస్య సూక్తస్య, శునశ్శేఫ ఋషిః। వరుణో దేవతా, గాయత్రీ చ్ఛందః.

సూర్యోపస్థానే వినియోగః।

మంత్రము–1. యచ్చిద్ధితే విశో యథా ప్ర దేవ వరుణ వ్రతమ్ । మినీమసి ద్యవి ద్యవి॥ 2. మా నో వధాయ హత్నవే జిహీళానస్య రీరధః। మా హృణానస్య మన్యవే॥ 3. విమృళీకాయ తే మనో రథీరశ్వం న సందితమ్। గీర్భిర్వరుణ సీమహి॥ 4. పరా హి మే విమన్యవః పతంతి వస్య ఇష్టయే । వయో న వసతీరుప॥ 5. కదా క్షత్రశ్రియం నరమా వరుణం కరామహే మృళీకాయోరు చక్షసమ్॥

సంధ్యోపస్థానము, శాంతిమంత్రము, అభివాదనము ఈ మూడును ప్రాతస్సంధ్యయందు వలెనే చేయవలెను.

చివరయందు ఒక పురాణాచమనము చేయవలెను.

## సర్వబ్రాహ్మణదేవ నమస్కారము

శ్లో॥ ఆబ్రహ్మలోకాదాశేషాదాలోకాలోకపర్వతాత్ ।
యే సంతి బ్రాహ్మణా దేవా, స్తేభ్యో నిత్యం నమో నమః॥

ఓం తత్సద్బ్రహ్మార్పణమస్తు.

ఓమ్ తత్ సత్

శివమ్.

ఋగ్వేదసంధ్యావందనప్రయోగము సమాప్తము.

---

## ఒకటవ అనుబంధము

### 142 వ పుటయందలి "యజ్ఞోపవీతనిర్మాణవిషయము"

ఇచ్చట విస్తరింపబడును.

జందెమును తయారుచేయు విధము,

గౌతమస్మృతి—

"స్త్రియా కారితేన తంతునా యజ్ఞోపవీతం కుర్యాత్."

ముందు స్త్రీచేత తయారుచేయింపబడిన దారముతో, తర్వాత పురుషుడు జందెమును తయారుచేయవలెను. అని యర్థము.

ఇందుచే తెలియుచున్నదేమనగా అనాదికాలమునుండియు స్త్రీలు దారమును తయారుచేయుట కలదు. అని.

కాని ఆ దారమును ఏవిధముగ తయారుచేయుచుండెడివారో? అనగా రాట్నముచేతనా? లేక చేతితో కదురు వడుకుచు తయారుచేయు చుండెడివారో తెలియకున్నది. సంస్కృతభాషయందు- "రహాటః= దారమును తయారుచేయు యంత్రము అని, "భాషార్ణవము" అను నిఘంటువునందు నేను చదివితిని. ఇందువలన "స్త్రీలు ఈ రహాటము (రాట్నము) ద్వారా దారమును తయారుచేసెడివారేమో? రాట్నము మీద తయారుచేసినయెడలనే చాలమంది ద్విజులకు శీఘ్రకాలములో స్త్రీలు దారము తీయుటకు వీలుండును. రాట్నము లేనియెడల గృహకృత్యములందు మునిగియుండు స్త్రీలకు కదురుతో దారము తయారుచేయ సమయమెక్కడుండును?

మనుస్మృతి=

"కార్పాసముపవీతం స్యాద్విప్రస్యోర్ధ్వవృతం త్రివృత్"

ప్రత్తినూలుతో తయారైన జందెమునే బ్రాహ్మణుడు ధరింపవలెను అని. ఇట్లనుటచేత పట్టు ఊలు నైలాను దారములు జందెమునకు పనికిరావు.

దేవలమహర్షి =

"శుచౌ దేశే శుచిః సూత్రం సంహతాంగులిమూలకే। ఆవర్త్య షణ్ణవత్యా తత్త్రిగుణీకృత్య యత్నతః॥ అబ్లింగకైః త్రిభిః సమ్యక్ ప్రక్షాళ్యోర్ధ్వవృతం త్రివృత్। అప్రదక్షిణమావర్త్య సావిత్ర్యా త్రిగుణీకృతం॥ తతః ప్రదక్షిణావర్తం సమం స్యాన్నవసూత్రకం। త్రిరావేష్ట్య దృఢం బధ్వా బ్రహ్మవిష్ణ్వీశ్వరాన్నమేత్ ॥

స్త్రీలు వడికిన నూలును, శుద్ధమగుచోటున పవిత్రమైనవాడై కూర్చొని, బొటనవ్రేలు తప్ప, మిగిలిన నాలుగు ఎడమచేతివ్రేళ్ళను దగ్గరగచేర్చి, వాటిమొదట తొంబదియారు సారులు మరల మరల చుట్టవలెను. అట్లు నూటతొంబదిరెండు బెత్తలుగ చుట్టిన దారపు కొనను, కుడిచేతికి తగిలించి, రెండుపేటలుగా చాలా జాగ్రత్తగా మధ్య మధ్య తెగకుండ చుట్టవలెను. అది పూర్తికాగనే ఆరెండుపేటల కొనను ఎడమచేతికి తగిలించి, ముప్పేటలుగ (త్రిగుణముగ)చేసి చుట్ట వలెను. అట్లు తయారైన దానిని తెనుగున "వత్తి"యందురు. ఆవత్తులను ఆపోహిష్ఠాదినవవాక్యములు చెప్పుచు బాగుగ తడప వలెను.

ఎట్లు? ఇట్లు. ఎడమచేతిలో వత్తులను ఉంచి, పై మంత్రములు చెప్పుచు వానిమీద నీళ్ళను చల్లుచు కుడిచేతివ్రేళ్లతో చాలమెల్లగ కొట్టుచు బాగుగా తడియునట్లు చేయవలెను. అట్లు తడిసినదానిని ఎడమచేతి నాలుగువ్రేళ్లకు తగిలించుకొని "తాళ్లబిళ్ల" సాధనముతో ఎగపురిని వేయవలెను. ఇది అప్రదక్షిణావృత్తమగును. ఆంధ్రప్రదేశమున తాళ్లబిళ్లకు ఆదారమునుతగిలించి కాలిపిక్కమీదనుండియో,

లేక తొడమీదనుండియో క్రిందనుండి పైకి ఎగద్రోయుదురు. అట్లుగ పురివేసిన వత్తులను బాగుగనెండనిచ్చి, వానిని మరల మరియొకరి సాయముతో, గాయత్రీమంత్రమునుచ్చరించుచు ముప్పేటగా చేసి, దానికి దిగపురి వేయవలెను. అనగా—ఆదారమును తాళ్లబిళ్లకు తగిలించి, ఆ తాళ్లబిళ్లను తొడమీదనుండి క్రిందకు దిగద్రోయవలెను. లేదా ఒకకొసను తాను పట్టుకొని మరియొకకొసను తాళ్లబిళ్లకు తగిలించి, ఇంకొకనిచేత దిగపురి యగునట్లు రెండుచేతులతో త్రిప్పింపవలెను. ఇది ప్రదక్షిణావృత్తమగును. ఇట్లు దిగపురి వేయబడిన దారమునందు, తొమ్మిది దారము (పోగు) లుండును. దారమునకు ఆపురి బాగుగ పట్టుటకొరకు కొంతసేపుంచి, తర్వాత దానిపురిని కొంచెము తగ్గించి, ఆదారమును, కూర్చున్న తనకాలి రెండుముడుకులను పైకియెత్తి, కొంచెము దూరము చేసి వాటికి వెలుపల, మూడుసారులు చుట్టవలెను. లేక— ఇంకొకరియొక్క, ఎడముగ చాపిన చేతులకు వెలుపల మూడుసారులు చుట్టి, రెండు కొనలను చేర్చి లంకెవేసి ఆ మూడుపేటలమీదనుండి ఒకటి రెండు సారులు త్రిప్పి పెనవేసి ఓంకారమునుచ్చరించుచు సంప్రదాయానుసారముగ బ్రహ్మముడి వేసి బ్రహ్మవిష్ణ్వీశ్వరులను నమస్కరింపవలెను. ఇది జందెము తయారుచేయు పద్ధతి.

## రెండవ అనుబంధము

### 159వ పుటయందలి పవిత్రవిషయము

స్మృతిముక్తాఫలమున—

> "తర్జన్యా బిభృయాద్రౌప్యం స్వర్ణం చోపకనిష్ఠయా।
> దక్షానామికయా విప్రో బిభృయాద్గ్రంథిసంయుతం॥
> యజ్ఞోపవీతే మౌంజ్యాం చ, తథా కుశపవిత్రకే।
> బ్రహ్మగ్రంథిం విజానీయాదన్యత్ర తు యథారుచి॥

చూపుడువ్రేలియందు వెండిపవిత్రమును అనామికయందు బంగారపుటుంగరమును ధరింపవలెను. బంగారపుపవిత్రపుటుంగరమును కుడిచేతియనామికయందే ధరింపవలెను. జందెమునందును మౌంజిత్రాటియందును కుశపవిత్రమునందును బ్రహ్మగ్రంథి(ముడి) నే వేయవలెను అని. కుశపవిత్రశబ్దము బంగారుపవిత్రమునకు సూచకము.

బంగారుపవిత్రపుటుంగరమును చేయించుటకు ఎంత యెత్తు బంగారము కావలెనో శంఖమహర్షి చెప్పుచున్నారు.

"సువర్ణస్య సువర్ణస్య సువర్ణస్యాంగుళీయకం।
పవిత్రమితి విజ్ఞేయం సర్వకర్మసు పూజితమ్॥

అనగా-ఐదు గురివిందగింజల యెత్తు=ఒక మాషము. పదునారు మాషముల యెత్తు సువర్ణమనబడును. ఈశ్లోకమున శంఖమహర్షి శబ్దచమత్కారముకొరకు మూడు సువర్ణశబ్దములను వాడెను. మహర్షికి గూడ ధర్మప్రవచనమున సాహితీవృష్టి! అందు తొలి సువర్ణశబ్దము, పదునారుమాషముల యెత్తును చెప్పును. రెండవది మంచి వర్ణము (వన్నె) గలది, యని చెప్పును. అనగా పదునారవ వన్నె గలిగి శుద్ధమైనది, యని యర్థము. అందువలన 24 కారట్లబంగారము పనికిరాదు. ఇక మూడవది=బంగారమును చెప్పును. కాగ — పదునారు మాషముల యెత్తు గల, (ఇప్పటి $1\frac{1}{8}$ సవరను బరువు) పదునారవ వన్నెగల శుద్ధమైన బంగారముతో పవిత్రాకారముగ చేయబడిన ఉంగరము పవిత్రపుటుంగరమగును. ఇది యెల్ల వైదికకర్మల యందును శ్రేష్ఠమని భావము.

ఇప్పటి బంగారము వెలను మనసున నుంచుకొని, ఆకాలమున అడవులలో నుండెడు మునులు, ఇంతధనముతో బంగారమును కొని,

యెట్లు పవిత్రపుటుంగరమును చేయించుకొనెడివారో కదా! [illegible] సందేహపడనక్కరలేదు. 1930వ సంవత్సరమునందు సవరను వెల పదుమూడు రూపాయలుండెను. మరి ఆ మునులకాలమున ఎంత కారుచవుకగ నుండెడిదో యూహించుకొనుడు. అంతియేగాక, రాజులు ఆశ్రమములకు వెళ్లి మునులకు బంగారు పవిత్రపుటుంగరములను ప్రదానము చేసెడివారని పురాణములు చెప్పుచున్నవి.

వైదికకర్మలు చేయుటకు ఏదియేని యొక బంగారపుటుంగరమును కుడిచేతి యనామికకు పెట్టుకొనిన చాలునని ధర్మశాస్త్రము చెప్పుచుండుటవలన $1\frac{1}{8}$ సవరను బంగారముతోనే పవిత్రపుటుంగరమును చేయించుకొనవలెనని భయపడనక్కరలేదు. కేవలము లేనిదానికంటె, యథాశక్తిగ చేయించుకొనవచ్చునని చెప్పుచున్నవి. ధనమున్నవారు $1\frac{1}{8}$ సవరనుతో చేయించుకొనుడు.